సర్వోదయ ప్రచురణ-13
ప్రథమ ముద్రణ :
అక్టోబరు 1964

సాదాప్రతి రు. 5-00

సంపాదకులు :
'మిష్టర్ రావ్'

ముద్రణ :
విక్టరీ ప్రెస్,
విజయవాడ-1.

# మాసిన తలపులు

స్వాప్నిక జగత్తుకూ, వాస్తవపు జీవితానికీ పొత్తు కలగడం యుగాంతంలోని మాటే. భవిష్యత్తునుగురించి చేసుకొన్న నిర్ణయాలకూ, ఆశయాలకూ, కోరికలకూ మారురూపం స్వప్నం. అందుకే స్వప్నాలు ఫలించవు అన్నారు. అయితే కలలుగనని జీవులు ఎవరైనా ఉన్నారా? వారికలలు ఎప్పటికీ వాస్తవికజీవితంలో ఫలించవా?

మానవుని మనస్సు పిడికిలివంటిదైనా కడలినిమించిన కోరికలకు నిలయం. తనజీవితం సుఖంగా జరిగిపోవాలని కోరికలు కోరకుండా వుండడం మానవుని వ్యక్తిత్వంకాదు. ఫలితాలు ఎలావున్నా అంతులేని కోరికలతో తమ భవిష్యత్తు సౌఖ్యప్రదంగా వుండాలని విధీవిరామం లేక తమ ప్రయత్నాన్ని కొనసాగిస్తారు. అదే మంచి చెడ్డలు విస్మరించబడే సమయం. ఆ దౌర్బల్యానికి లొంగకతప్పదు.

అదృష్టం ఒకరిసొత్తు కాదన్నట్లు దురదృష్టానికిగూడా నిబంధనలు ఉండవు. అందరినీ వరిస్తుంది. అదృష్టానికి నోచుకోని దురదృష్టవంతులు; దాన్ని తెలుసుకోలేని దౌర్భాగ్యవంతులు; చాలా తెగలుగలది మానవజాతి. ఏదైనా సరైనసమయంలో చేసిననాడే దానికివిలువ. కలువ సూర్యుణ్ణీ, పద్మం చంద్రుణ్ణీ చూసి వికసించవు.

అదృష్టం తెలుసుకొనీ, అందుకొనే లోపలే అంతరించిపోవచ్చు. అప్పటి మానవహృదయ పరిస్థితి వర్ణించాలని ప్రయత్నించడం వ్యర్థమే. అదృష్టవంతులకూ లభించేది దుఃఖమే; దురదృష్టవంతులకూ మిగిలేది తీరని బాధే! దీనికి విముక్తి ఎప్పుడు? అది లేనినాడు ఎందుకీ బ్రతుకు అనిపిస్తుంది.

అందరాని, అందుకోలేని ఆశలకులోనై తలపుకురాని తలపులను తెచ్చుకోవాలనే వెర్రి ఆందోళనపడుతూ అందరినీ బాధించడంకన్నా ఆ ప్రయత్నం విరమించుకోవడమే మేలు. అందిన ఆనందంపై అంతులేని ఆశలు కల్పించుకొని గాలిబుడగలా ప్రేలిపోయిననాడు భరించలేక, నిల ద్రొక్కుకోగలిగే శక్తిలేక కృశించి, నశించిపోవడంకన్నా ఆశలను చంపుకొన్ననాడే ఈ కృత్రిమలోకంలో కృత్రిమానందాన్ని అనుభవించ గలరు. ఈ కృత్రిమ పాపపు లోకంలో అతీతమైన, నిజమైన ఆనందం అనుభవించాలనుకొన్నప్పుడు అంతకన్నా ఎక్కువ కష్టాలను ఎదుర్కొన వలసివుంటుంది.

* * *

"నమస్కారమండీ."

తలెత్తి చూశారు ఆనందరావుగారు. "ఓ! నువ్వటోయ్, రాజ శేఖరం! రా కూర్చో" అన్నారాయన ఆదరంగా. ఆ యువకుడు విన యంగా అక్కడవున్న సోఫాలో కూర్చున్నాడు. అతనికి పందొమ్మిది సంవత్సరాలు ఉంటాయి. సాధారణమైన దుస్తులలో ఉన్నాడు. అతని మొహంలో ఎదుటివారి నాకర్షించే కళ ఉట్టిపడుతూంది. చూపులలో వినయము, గౌరవభావము కనిపిస్తున్నాయి. వాటివెనుక దాగివున్న గాంభీ ర్యము, నిశ్చలత్వము అతని అందమైన మొహానికి మరింత శోభ నిస్తున్నాయి.

"ఏమోయ్! బి. ఎ. యూనివర్సిటీ ఫస్టున పాసయ్యావు! ఇక మీదట ఏం చేయదలచుకున్నావు?" అడిగారు ఆనందరావుగారు కళ్ళ ద్దాలు తీసి తుడుచుకుంటూ.

"ఏదైనా ఉద్యోగం చూచుకోవాలని అనుకొంటున్నానండీ." జవా బిచ్చాడు తలవంచుకొని ఆ యువకుడు.

"ఛ, ఛ! బి. ఎ. యూనివర్సిటీ ఫస్టున పాసయి ఉద్యోగం చేసు కొంటానంటున్నావు. నీకు ఏ ఉద్యోగం దొరికినా ఈ రోజుల్లో ఏ గుమాస్తా ఉద్యోగంకన్నా మంచిది దొరకదు. అటువంటి పిచ్చిపనులు చేయకుండా హాయిగా పై చదువులు చదువుకో!"

"మీ దయవల్ల ఇంతవరకైనా చదువుకోగలిగాను. అనాధనైన నన్ను చిన్నప్పటినుండి ఆప్యాయతతో, ఆదరంతో ఏలోటూ కలుగనీయకుండా పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించారు. జీవితంలో నన్నూ ఒక మనిషిగా చేయగలిగారు. ఇకమీదట ఇంకా మీకు శ్రమ కలిగించదలుచుకోలేదు."

"శ్రమాలేదు, గిమాలేదు. నీ మొండివాదన మాని నా మాట విను. నీ కెలాగూ స్కాలర్‌షిప్ వస్తుంది. ఆ మీదట నేను ఎలాగూ వున్నాను. ఎమ్. ఎ. కానీ, నీకు ఏది మంచిదనితోస్తే ఆ కోర్సు చదువుకో."

ఆయన అధికారపూరితమైన కంఠస్వరం విని రాజశేఖరం మాఱుమాట్లాడలేకపోయాడు.

ఇంతలో అక్కడికి ఓ యువతివచ్చి రాజశేఖరాన్ని చూసి, "హల్లో, మిష్టర్ రాజశేఖరం! కంగ్రాచ్యులేషన్స్" అంటూ చేయి ముందుకు చాపింది.

"థాంక్స్" అని రాజశేఖరం నమస్కారం చేశాడు. అదిచూచి ఆమెకు కోపంతోపాటు విసుగుకూడ కలిగింది.

రాజశేఖరం ఆనందరావుగారివద్ద సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు.

"మ్యానర్‌లెస్ బ్రూట్" అంటూ ఆ అమ్మాయి ఆనందరావుగారి ప్రక్కనే కూర్చుంది.

ఆనందరావుగారు ఒకసారి తీక్షణంగా ఆమెను చూసి "మర్యాద తెలియనివాడు అతనుకాదు. సభ్యత, సంస్కారాలు తెలిసిన యువకుడు" అన్నాడు కాస్త కోపంగానే.

"అది కాదు, నాన్నా! అతగాడికి యూనివర్సిటీ ఫస్టుననే అహంభావం ఎక్కువగా ఉంది" అంది తండ్రికోపాన్నిచూసి.

"పొరపడ్డావమ్మా. ఇప్పుడేకాదు! ఈ ప్రపంచానికి అంతటికీ అధికారి అయిననాడుకూడ అతనిలో అహంభావమనేమాటకు తావులేదు."

"లేకపోతే ఏమిటి, నాన్నా! నేను ఎప్పుడైనా కాలేజీలో పలుకరిస్తే ముక్తసరిగా మాట్లాడతాడు. తాను తెలివైనవాడిననే గర్వం, పొగరు కాకపోతే మరేమిటి?"

"షోనీ, నీ తోటి ఆడవారితో ఎవరితోనైనా అతడు సంతోషంగా మాట్లాడడం చూశావా?"

"ఉహూఁ. అసలు ఆడవారంటేనే ఆమడదూరంలో వుంటాడు. చాలమంది అతన్ని ఆకర్షించ ప్రయత్నించి విఫలులయ్యారు. అసలు అదొక జడపదార్థమని మా నిశ్చయం."

"అందరితో ఎలా ప్రవర్తిస్తున్నాడో నీతో అలాగే వున్నాడు. అందుకు నువ్వతణ్ణి ద్వేషించడంలో అర్థమేమిటి?"

"నా ఉద్దేశ్యం అదికాదు, నాన్నా ...."

"చూడు, వసంతా! నువ్వేంచేసినా సహించగలను కాని, అతడిని గురించి ఏమైనా అంటే నాకు బాధ కలుగుతుంది" అని అక్కడినుండి లేచి లోపలికి వెళ్ళిపోయారు.

వసంత నివ్వెరపోయింది. తండ్రికి అతడిపైగల ఆదరాభిమానాలకు కారణం అర్థంచేసుకోలేకపోయింది. లేచి తన గదిలోకిపోయి నిలువుటద్దంముందు నిలబడి తన అందాన్ని, అలంకరణలను చూసుకోసాగింది.

క్రేప్సిల్కు చీరె, జార్జెట్ జాకెట్టు తన అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. తన అవయవసౌష్ఠవం, తన ఆకర్షణీయమైన మొహం, తన సౌందర్యం ఒక్కొక్కసారి తనకే పిచ్చి ఎత్తిస్తాయి. ఇక మగవారి విషయం చెప్పనక్కరలేదు.

అందుకే కాలేజీలోని యువకులనందరినీ ఆకర్షించుకొని తన చుట్టూ త్రిప్పుకొని ఆనందిస్తూంటుంది. తనకువచ్చే ప్రేమలేఖలను ఒక బీరువాలో భద్రంగా ఉంచుతుంది. త్వరలో ఆ బీరువా నిండిపోతుంది. అదే ఆమె కానందం. కాలేజీకి వేళకావడంతో కారెక్కి కాలేజీకి వెళ్ళిపోయింది.

కారు కదిలిపోయిన శబ్దం వినగానే ఆనందరావుగారు తిరిగి హాల్లోకివచ్చి కూర్చున్నారు. అక్కడే గోడకు వ్రేలాడదీయబడిన ఒక ఫోటోపై తనదృష్టిని నిలిపారు. ఒకసారి ఆయన కన్నులు ఆర్ద్రములైనాయి. కారణమేమిటో?

ఆ ఫోటోలోని వ్యక్తి ఆనందరావుగారి గుమాస్తా. పేరు రామమూర్తి. నమ్మినబంటు అంటే రామమూర్తిని మించినవారు ఉండరన్న సత్యాన్ని ఆనందరావుగారు తెలుసుకొన్నారు. రామమూర్తి, అతనిభార్య వారి యింట్లోనే తోటలో ఒక చిన్నగదిలో ఉంటూండేవారు. కాని కొద్ది రోజులకే అతనిభార్య చనిపోతూ అతనికొక పసివాడిని భారంగా విడిచి మరీపోయింది. అప్పటినుండి వారియింట్లోనే భోజనంచేస్తూ కాలం గడప సాగాడు. ఏనాడుకూడ తను చేసినపనికి తనకింత డబ్బురావాలని అడిగి ఉండలేదు. ఆనందరావుగారు లక్షాధికారి. అతనిని నమ్మినాడు. ఒకోసారి ఆయన ప్రక్కపల్లెలకో,లేక ఏదైనా పనిమీద ఊరికి వెళ్ళాలని ప్రయాణమైనా తన సర్వస్వాన్నీ అతని చేతులలో ఉంచి మరీపోయేవాడు. కానీ, నమ్మకద్రోహాన్ని కలలోగూడ తలంచలేని రామమూర్తి ఒక్క నయాపైసాకూడ తీసుకొనేవాడు కాదు. ఒకవేళ ఆతడే వారికి ద్రోహం తలపెట్టివుంటే ఇనప్పెట్టెలో ఎంత డబ్బుందోకూడ తెలియని ఆనందరావుగారిని భిక్షాధికారిగా చేసి ఉండేవాడే. కానీ, నమ్మకానికి కట్టుబడిన రామమూర్తిని ఆ ధనాశ లొంగదీయలేదు.

ఒకసారి ఆనందరావుగారికి తన ఇనప్పెట్టెలో ఎంతనగదువుందో చూసుకోవాలనిపించింది. రామమూర్తిని పిలిచి లెక్కలు చూశాడు. ఇనప్పెట్టెలోని డబ్బు లెక్కపెట్టాడు. అయిదువేలు తక్కువగా ఉంది. ఆశ్చర్యపోయాడు ఆనందరావుగారు. కంగారుపడ్డాడు రామమూర్తి. తను నమ్మినందుకు తననే మోసంచేశాడేయని తలంచాడాయన. డబ్బు ఏమైనదీ అర్థంకాక తికమక పడ్డాడు రామమూర్తి.

"నువ్వు అడిగివుంటే అయిదువేలేకాదు, యాభైవేలిచ్చేవాడిని. కానీ డబ్బు దొంగిలించి నా మనసునే గాయపరిచావు. మనుష్యులు ఇంతగా ఎలా మారిపోతారో" అన్నాడు ఆనందరావుగారు బాధగా.

"లేదు. బాబుగారూ! నాకేమీ తెలియదు. నేనా డబ్బు దొంగిలించలేదు." అని ఏడిచాడు రామమూర్తి.

"చాలు. నా నమ్మకాన్ని నాశనంచేశావు. ఇక యిక్కడ నీకు స్థానంలేదు. వెళ్ళిపో."

ఎంతగానో ప్రాధేయపడ్డాడు రామమూర్తి. ఫలితం శూన్యం. ఆరేడు సంవత్సరాల పసివాడితో వెళ్ళిపోయాడు.

అతడు పోయినతరువాత ఆనందరావుగారు సిగరెట్టుకోసం జేబులోకి చెయ్యిపెట్టాడు. సిగరెట్టు పాకెట్టుతోపాటుగా ఒక కాగితం పైకి వచ్చి క్రిందపడింది. అదేమిటా అని చూశాడు. ప్రోనోటు. ఒకమిత్రుడికి అర్జెంటుగా అవసరంవస్తే తనే స్వయంగా అతనికి అయిదువేలిచ్చాడు. ఆ విషయం రామమూర్తికి తెలియదు.

అప్పుడు ఏడవాలనిపించింది ఆయనకు. ఆప్తుడిని కోల్పోయినట్లు గిలగిలలాడిపోయాడు. చింతిస్తూ రామమూర్తికోసం వెదికాడు. కానీ కనిపించలేదు.

ఒకసంవత్సరం తర్వాత ఒకనాడు హఠాత్తుగా ఊడిపడ్డాడు రామమూర్తి. అతన్నిచూచి ఆనందించాడాయన. కానీ ఆ ఆనందం ఎంతో సేపు నిలువలేదు. రామమూర్తి గుండెజబ్బుతో బాధపడుతున్నాడు. డాక్టరుకోసం కబురెట్టాడు. సరైన మందులులేక అతనిప్రాణాలు తీయడానికి సిద్ధంగా ఉందా జబ్బు!

అతను కొడుకును ఆనందరావుగారి పాదాలవద్ద ఉంచి "బాబుగారూ! జీవితంలో మిమ్మల్ని ఏ కోరికా కోరలేదు. నేనుపోతే వీడు దిక్కులేనివాడై పోతాడు. తల్లీ తండ్రీలేని నా బిడ్డ గతిలేక, దరికానక వీధులవెంట బిచ్చమెత్తుకొంటూంటే నా ఆత్మ శాంతించదు. వీడిని మీ కప్పగిస్తున్నాను. వీడు జీవితంలో ఓ గొప్పవాడు కావాలనే ఆశ నాకు లేదు. వాడు తనబ్రతుకు తాను బ్రతికేటట్లుగా ఉంచేచాలు. ఈ ఒక్క కోరిక తీరిస్తే మీకు జన్మజన్మాలకు ఋణపడేవుంటాను" అని కళ్ళు మూశాడు. డాకరుకు చేతకానిపని ఆ కళ్ళు తెరిపించడం.

ఆ పసివాడిని ఒక ప్రయోజకుడుగా తయారు చెయ్యాలని నిశ్చయించుకొన్నాడు ఆనందరావుగారు. అతనికి విద్యాబుద్ధులు చెప్పించాడు. నాటి ఆ పసివాడే నేటి రాజశేఖరం. అతన్ని తండ్రికోరిన విధంగాకాక ఒక గొప్పవ్యక్తిగా సంఘంలో చూడాలని ఆనందరావుగారు నిశ్చయించుకొన్నారు.

రాజశేఖరం ఎమ్.ఎ.లో చేరాడు. అతనికి తెలిసివచ్చినప్పటినుండి ఆనందరావుగారు వారింట్లోనే వుండి చదువుకొమ్మని చెప్పినా వినయంగా నిరాకరించి వేరేగా వుంటున్నాడు. ఊరిచివర ఒక పెద్దఇంట్లో ఓ చిన్న గది అద్దెకు తీసుకొని అందులో ఉంటున్నాడు. హోటలు భోజనం. అతనికి డబ్బు కావలసినప్పుడు ఆనందరావుగారిని అడుగుతాడు. జీవితంలో ఎలాంటి సుఖాలకు, సౌకర్యాలకు అందుబాటులో లేకుండా గుట్టుగా

అతడు ఉన్న వీధిలో అందరికీ అతడంటే అభిమానమూ, మంచివాడనే అభిప్రాయమూ ఉన్నాయి. అందుకు తగ్గటుగానే నడుచుకొంటున్నాడు రాజ్. ఏనాడూ అతడు ఆ వీధిలోని ఇళ్ళవైపు తలెత్తి చూసి ఎరగడు. తనపనేమో తనేమో! తలవంచుకుపోవడం, తలవంచుకుని రావడం అలవాటు చేసుకొన్నాడు. ఎవరైనా కొత్తవాళ్ళు అది చూస్తే ఇదొక అవతారమేమో అనుకుంటారు. కాలేజీలో అతనంటే అందరికీ భయం, సదభిప్రాయమూ ఉన్నాయి.

ఒకనాడు రాజ్ కాలేజీకి వెళ్ళుతూండగా ప్రక్కబంగళాలోనుండి ఒక సైకిలువచ్చి అతన్ని ఢీకొంది. అనుకోని ఆ ఊపుకు క్రిందపడ్డాడు రాజ్. బట్టలకు దుమ్మయింది. ఉన్న ఆ ఒక్కజత గుడ్డలు మరో వారం ధరించాలి. అవికూడా మట్టికావడంతో కోపం వచ్చింది. లేచి మట్టి దులుపుకొని కోపంగా అటువైపు చూశాడు. సైకిలు బాలన్సు పట్టలేక క్రిందపడి లేచి భయంగా తననే చూస్తున్న ఒక అమ్మాయిని చూసి ఏమీ అనలేకపోయాడు. తెల్లటి పైజమా, ఎర్రరంగు గౌను ధరించి, మెడచుట్టూ పైటచెంగును వేసుకొన్న ఆమెనుచూసి ముస్లిములని నిశ్చయించుకొన్నాడు.

"క్షమించండి. పొరపాటయింది" అంది మెల్లగా.

"ఫరవాలేదులెండి" అని ముందుకు సాగిపోయాడు రాజ్. ఠీవిగా అడుగులు వేసుకుంటూపోతున్న అతన్నిచూస్తూ కాస్సేపు అలాగే ఉంది

పోయిందామె. ఆ తర్వాత క్రిందపడ్డ సైకిలు లేవదీసి హాండిల్ సరిచేసుకొని సైకి లెక్కింది.

ఆ సాయంకాలం అదే బంగళాలో తన తండ్రితోపాటు టీ త్రాగుతూంది ఆ అమ్మాయి. అదేసమయంలో రాజ్ అటుగా తనగదికి వెళ్ళుతుండగా చూసిందామె.

"బాబా! అత నెవరు?" అంది.

ఆమె తండ్రి ఆమెను అనుమానంగా చూసి "ఎందుకు?" అన్నాడు.

ఉదయం జరిగిన విషయం చెప్పింది.

నవ్వి "అతడు రాజశేఖరమని ఎమ్. ఎ. చదువుతున్నాడమ్మా. చాలా మంచివాడు. ఒకరి విషయంలో జోక్యం కలిగించుకోడు" అన్నాడు.

"ఈ వీధిలో వాళ్ళ యిల్లెక్కడ, బాబా?"

"ఈ వరుసలో ఆరోయిల్లు. అక్కడ ఓగది అద్దెకు తీసుకుని ఉంటున్నాడు. అంతకుమించి వివరాలు తెలియవు" అని టీ కప్పు బల్ల మీద పెట్టి పైప్ వెలిగించాడు.

ఆయన రిటైర్డు కలెక్టర్. పేరు అమీర్‌ఖాన్. ఆ అమ్మాయి అతని ఒక్కగానొక్క ముద్దులకూతురు రజియా. ముస్లిములైనా ఎప్పుడూ తెలుగుభాషకే అలవాటుపడి దాన్నే ఉపయోగిస్తుంటారు. కుమారైను వైద్యం చదివిస్తున్నా డాయనగారు. ఎమ్. బి. మూడవసంవత్సరం చదువుతున్న రజియాకు ఎందుకో రాజ్‌తో పరిచయం చేసుకోవలెనన్న కోరిక కలిగింది.

ఆ మరునాడు రజియా సైకిలుపై ఇంటికి వస్తుండగా గదికి పోతున్న రాజ్ కనిపించాడు. "హల్లో! గుడ్‌మార్నింగ్, మిస్టర్ రాజశేఖరం" అంది అతని ప్రక్కనే సైకిలు దిగి.

రాజ్ తిరిగి 'విష్' చేసి ఈవిడ తన పేరెలా తెలిసికొందా అనుకొన్నాడు. రజియా అతని ప్రక్కనే నడవసాగింది. అదిచూచి భయపడి ఇదేమిట్రాబాబూ అనుకొని చుట్టూ చూశాడు ఎవరైనా చూస్తారేమోనని.

కానీ అప్పటికి అక్కడ ఎవ్వరూ కనిపించకపోవడంతో బ్రతికాననుకొన్నాడు.

"చూడండీ. నాపై కోపమా?" అడిగింది రజియా, అతని మొహంలోని భావాలను కనిపెట్టాలని ప్రయత్నిస్తూ. కానీ సముద్రపు లోతునైనా కనిపెట్టవచ్చు కానీ అది అసాధ్యమని తెలుసుకొంది.

"మీ పైన కోపం నా కెందుకు?" తిరిగి ప్రశ్నించాడు రాజ్.

"అదే, నిన్న జరిగిన సంఘటనకు." మెల్లిగా గొణిగింది.

"దానికి కోపమెందుకు? జీవితంలో మనం ఎన్నో పొరపాట్లు చేస్తుంటాము. మీరు మామూలైన చిన్న పొరపాటు చేశారు. అంతే."

"మరి పలుకరించినా మాట్లాడరే?"

"ఏం మాట్లాడమంటారో మీరే చెప్పండి."

ఆ మాటతో తికమకపడింది రజియా. "అవును, ఏం మాట్లాడాలి" అంది ఆమె హృదయం.

ఇంతలో వాళ్ళయిల్లు సమీపించడంతో "రండి, కాస్సేపుండి వెళుదురుగానీ" అని ఆహ్వానించింది రజియా.

"నాకు కాస్త పనుంది వెళ్ళాలి." తప్పించుకోజూచాడు రాజ్.

అప్పుడే బయటికివస్తున్న ఖాన్‌గారు "ఫరవాలేదు, రా అబ్బాయ్" అన్నారు.

రాజ్ ఆయన్ను చూశాడు. అతని పిలుపులో శిపి, ఆజ్ఞ, అధికారాలతోకూడిన అర్థింపు ఉంది. దాన్ని త్రోసిపుచ్చలేక లోపలికి నడిచాడు. రజియా అతన్ని అక్కడ కూర్చోబెట్టి లోపలికి వెళ్ళింది. దుస్తులు మార్చుకొని టీ తీసుకువచ్చింది రజియా. ముస్లిందుస్తులు విప్పి హిందూ సంప్రదాయం ప్రకారం చీరె ధరించి ఉంది ఆమె. ఆ దుస్తులో ఆమె మూర్తీభవించిన వసంతకాలపు వనదేవతలా ఉంది. ఆమెను రెప్పార్పకుండా పరీక్షించి పులకితుడయ్యాడు రాజ్. పరాయి స్త్రీలను అలా చూడటం తప్పన్నమాట జ్ఞాపకం చేసుకొని సిగుతో తలవంచుకొన్నాడు.

"చూడబ్బాయ్! మా రజియా ఒంటరితనంతో బాధ పడుతోంది. కాస్త నువ్వు తోడుగా ఉండకూడదూ" అన్నారు ఖాన్‌గారు టీ త్రాగడం పూర్తిచేసి.

ఆ మాటలు విని ఇరుకునపడ్డాడు రాజ్. "నా కెక్కడవుతుందండీ" అనగలిగాడు.

"వీలుకాదనా? ఫరవాలేదు. వీలుచేసుకొనే కలుస్తూండు. అయినా మీ రిద్దరు కాలేజీకి కలిసి ఎందుకు వెళ్ళకూడదూ?"

"చచ్చాంరా దేవుడా" అనుకొని బదులు చెప్పలేకపోయాడు.

"కాలేజీనుండి తిరిగొస్తూనే కలిసి అలా షికారుకెళ్ళిరండి. ఎలాగూ నువ్వు పోతుంటావు. మా రజియాను వెంటపెట్టుకొని పో. అదీకాకుంటే ఇక్కడే కూర్చొని మాట్లాడుకోండి. ఏమంటావు?"

"హే భగవాన్! ఈ దినం ప్రొద్దునేలేచి ఎవరిమొహం చూశానో, ఇలాంటి విషమపరిస్థితి తెచ్చిపెడుతున్నావు" అనుకొని "క్షమించండి. నాకు వీలుకాదు."అని చెప్పబోయి చేతకాక "ప్రయత్నిస్తానులెండి" అనగలిగాడు!

"అలాగే. ఏదో పెద్దవాణ్ణి. నామాట తీసివెయ్యకు ఉభయులకూ కాస్త 'రిలీఫ్' ఉంటుంది" అని పైప్ నోట్లో పెట్టుకుని బయటికి వెళ్ళిపోయారు ఖాన్‌గారు.

రాజ్ మాట్లాడుతున్నంతసేపూ అతన్నే గమనిస్తూంది రజియా. తనతో పరిచయం అతని కిష్టంలేదని గ్రహించింది.

"నాతో పరిచయం మీ కిష్టంలేదా?" సూటిగా అడిగింది.

"అది కాదండీ. మీరు సైకిలుమీద వెళతారు. నేను నడిచివెళ్తాను. ఎలాగా అని నా సందేహం."

"నేనుకూడా మీతో నడిచేవస్తే ఆ బాధ తీరిపోతుందిగా."

ఇదో కొత్తబాధ కలిగించావే అనుకొని "మీరు నాతో రావడం ఎవరైనా చూస్తే బాగుండదని నా అభిప్రాయం" అన్నాడు.

"ఒకరి అభిప్రాయాలతో మనకేంపని. నేను మీతో స్నేహం

చేయడం ఎందుకో తెలుసా? చదువుకున్నవారు. దగ్గరోఉండి తోడుగా ఉంటారని. అంతే. మీ కిష్టంలేకపోతే పోనీలెండి."

"నా ఇష్టానికి కాదండీ! సరే మీ యిష్టప్రకారమే చేద్దాంలెండి." ఓడిపోయినట్లు అంగీకరించాడు. ఆమెకు కష్టం కలుగకుండా ఉండడానికి అలాచేయక తప్పిందికాదు.

రజియా అతని అంగీకారంతో ఉప్పొంగిపోయింది. ఆమె హృదయం సముద్రుడు వెన్నెలరాత్రిలో పొంగినట్లు ఆనందతరంగాలతో నింగిని తాకి ఎన్నడూలేని ఉత్సాహంతో వెల్లివిరిసింది. ఆ పారవశ్యంలో రాజ్ వెళ్ళిపోగానే పూలతోటలోకి పరుగెత్తింది. పూలన్నీ కొత్త అందాలతో ఆమె ఆనందాన్ని ఎగతాళిచేస్తూ నీ ఆనందానికి కారణం మాకు తెలుసులే అని వెక్కిరించి భయంతో అటూ ఇటూ ఊగాయి. ఆ గాలివల్ల వచ్చిన సువాసనలు ఆమెను ఆవరించి ఉక్కిరిబిక్కిరిచేసి ప్రతి పుష్పాన్నీ ఆస్వాదించమని ప్రేరేపించాయి. ప్రతి పువ్వునూ వాసనచూసి మైమరిచింది. చేతికందిన కొమ్మను పట్టుకొని మితిమీరిన సంతోషంతో ఊగులాడించింది. పూలస్నానంచేసి మురిసిపోయి చేతికందిన పుష్పాలను తలలో పెట్టుకొని దోసిలినిండా పూలు కోసుకొని పెకెగురవేసి గంతులువేసింది. ఫక్కుమని నవ్విన పూలను చూసి సిగ్గుతో గదిలోకురికి ప్రక్కపైపడి ఏవో కలలను కనాలని ప్రయత్నించి చేతకాక బాధగా మూలిగింది.

"అమ్మాయ్, వసంతా! ఎక్కడికెళ్ళావు ఇంతవరకు?" రాత్రి ప్రొద్దుపోయినాక వచ్చిన వసంత తండ్రి గద్దింపు విని ఉలిక్కిపడింది. నోట మాటరాక అలాగే నిలబడిపోయింది.

"నిన్నే! ఏమిటి నీ రాత్రిపూట షికార్లు?" కోపంగా రెట్టించారు ఆనందరావుగారు.

వణికిపోయింది వసంత. ఇంతవరకు తండ్రి తనను పల్లెత్తుమాట అనలేదు. నేడింత కోపానికి కారణం? అని ఆలోచించింది.

"పలుకవేం?" గర్జించారు ఆనందరావుగారు.

ఏడుపొచ్చింది వసంతకు. ఆమె ఏడుపుచూచి ఆనందరావుగారి కోపం తుస్సుమంది. అమ్మాయిని బాధపెట్టానే అని తల విదిలించి "ఊఁ. వెళ్ళు" అన్నారు. ఆశ్చర్యంగా పైకి [illegible] వసంత తుడుచుకొంటూ.

ఉస్సురంటూ సోఫాలో కూలబడ్డారు ఆనందరావుగారు.

వసంత చిన్నప్పుడే తల్లిని కోల్పోయింది. కానీ, తల్లీ తండ్రీ తానే అయి పెంచి ఆ లోటును తీర్చాడు. అతి గారాబంగా పెంచినందుకే ఇష్టంవచ్చిన రీతిగా పెరిగింది వసంత. ఆమె స్వేచ్ఛకు ఎవరూ అడ్డు రాకూడదు. కష్టమంటే ఏమిటో తెలియకుండా పెరిగింది. తన కోరిక తీర్చుకోకుండా ఉండడమంటూ ఆమె కింతవరకూలేదు. తనకిష్టమైనపని చేసి తీరుతుంది. అందుకే పిల్లలు పెరిగి పెద్దవారై సత్ప్రవర్తనులు కావాలంటే తల్లిశిక్షణ అవసరమన్నారు. కాని, తల్లీ తండ్రీ ఇరువురి శిక్షణ లేకనే బుద్ధిమంతుడుగా పెరిగిన రాజ్‌ను తలచుకొని గర్వపడ్డారు ఆనందరావుగారు.

వసంతకు కావలసినంత ధనం ఉంది. అసాధారణమైన అందమూ, ఆకర్షణా ఉన్నాయి. అందుకుతోడు కట్టుదిట్టాలులేని మనసు, అరికట్టలేని వయసు చేదోడు వాదోడు అయ్యాయి. విచ్చలవిడిగా సిగ్గు విడిచి తిరుగుతుంది కాలేజీలో. అంతులేని అందానికి అలంకరణతోడైతే ప్రకృతికి వసంతశోభ అమరినట్లుంటుంది. అటువంటప్పుడు ఆమె కాలేజీ లోని యువకుల నాకర్షించడం గొప్పవిషయం కాదు. ఆ ఆకర్షణతో వారితో ఆటలాడుకొంటుంది, ఆమె ప్రేరేపణలో పిచ్చివారై ఆమెచుట్టూ తిరుగుతారు. వారిని ఏడిపిస్తూ ఆనందిస్తూంటుంది వసంత.

ఆడదాని అందం ఆమెకు శత్రువంటారు. ఆడవారి అందం మగ వారిని పిచ్చివారిగా చేస్తుంది. వారిని ప్రేరేపిస్తుంది. వారిచేత చేయరాని కృత్యాలను చేయిస్తుంది. యుక్తాయుక్త విచక్షణలను నశింపచేస్తుంది. ఎందుకు? ఆ అందాన్ని ఆస్వాదించడానికేగా! అందుకై పోటీలుపడ తారు, కలతలు పెంచుకుంటారు. నలుగురిలో నగుబాట్లుఅయి చింతిస్తారు. అంతా ఆ అందాన్ని నాశనంచేయడానికి ప్రయత్నించేవారే!

ఆడదాని అందం ప్రకృతి సౌందర్యం కాదు, ప్రతిఒక్కరినీ సంతోషపరచడానికి. అది ఏ ఒక్కరికో అంకితం కాకతప్పదు. తామాశించిన అందం తమకు దక్కదని తెలిసిననాడు. దాన్ని అందుకొని ఆస్వాదించలేనినాడు, దాన్ని నాశనంచేయ ప్రయత్నించేవారుకూడ ఉంటారు. చేతకాకపోతే ఏడుస్తారు. బలహీనులైతే ఆత్మహత్యలకో. బలవంతులైతే అఘాయిత్యాలకో పూనుకుంటారు. ఆఖరుకు తమ పగ విజయం సాధించినా మిగిలేది ఒక్కబాధ, పశ్చాత్తాపమూ మాత్రమే.

అలనాడు ఆడదానికొరకు అన్నదమ్ములు కలహించారు. రాజ్యాలు పోగొట్టుకున్నారు. రక్తం కాలువలై ప్రవహించింది. ఇలా అందరికీ బాధలుకలిగించి, పాపాలుచేయించి, తలవంపులుతెచ్చి, సుఖశాంతులను దూరంచేసి, ప్రాణాలను బలిగాకొని, మానవత్వాన్నే మరపింపజేసే ఈ ఆడదాని అందం లేకుంటేనేమో ! సృష్టి మునిగిపోతుందా? ప్రపంచం అంతరిస్తుందా? అసలు ఆడ మగ విభేదాలు ఎందుకు? మానవసృష్టికి తోడ్పడడానికి! అది లేనినాడు మనమే ఉండం. ఏది ఏమైనా ఆడదాని ప్రభావం మగవారిపై చాలవరకు పనిచేస్తుందన్నది సత్యదూరం కానేరాదు. ఆ ప్రభావాని కెంతటి శక్తి ఉందో ఊహించలేము. అది కనుక్కోగలిగిననాడు ఈ సమస్యకే తావుండదు.

వసంత అందరినీ కవ్విస్తుంది. వెంట త్రిప్పుకొంటుంది. వారిని ఆటబొమ్మలుగా తలుచుకొని వారితో ఆటలాడుకొంటుంది. బహుశా చిన్నప్పుడు బొమ్మలతో ఆడుకొని ఆనందించవలసినది మరిచిపోయి ఇప్పుడు నెరవేర్చుకొంటూంది అనిపిస్తుంది. అయితే యువకులు ఆటబొమ్మలలాగే ఉండలేరు కదా! సజీవమూర్తులై సమయం వచ్చినపుడు తమ పనిని నిర్వర్తించుకొనిపోవడానికి ఉద్యుక్తులవుతారు. కానీ, వసంత ఎవ్వరికీ అందకుండా దూరంగా తప్పించుకొంటుంది. అలా అందీ అందకుండా ఉండడంలోనే అంతులేని ఆనందం కలుగుతుందంటారు. కానీ, ఆ ఆటే దురదృష్టవశాత్తూ ప్రమాదాలకు దారితీస్తుందనికూడ గ్రహించగలిగితే బావుంటుంది. అందుకే ఆమెను అబల అన్నారు.

ఆనందరావుగారికి ఆ విషయాలన్నీ తెలిసినప్పటికీ కూతురిని దండించలేక లోలోనే కుమిలిపోతూ ఏనాటికైనా ఆమె తన ప్రవర్తన

మార్చుకొనకపోతుందా అని ఆ శుభక్షణంకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు.

రాజ్ కాలేజీలో ఆమె ప్రవర్తన చూస్తుంటాడు. అతని మదిలో ఆమెపట్ల అసహ్యం పెరుకుంది. అంతకంటే ఆమెపై జాలి ఎక్కువగా కలుగుతుంది. తన శ్రేయోభిలాషి కుమార్తె అలా అయిపోతున్నందుకు బాధపడతాడు. కానీ, ఆమెకుచెప్పే ధైర్యం అతనిలో లేదు. అతనికి తెలుసు, ఆమెచుట్టూ తిరిగేవాళ్ళ బుద్ధు లెలాంటివో! వారంతా సమయం కోసం ఎదురుచూస్తున్నారు. సమయంవచ్చినప్పుడు ఆమెను, ఆమె అందాన్ని పీల్చి పిప్పిచేస్తారు. అటువంటి పరిస్థితులలో ఉన్న వసంతను చూసి అప్పుడప్పుడు భయం కలుగుతుంటుంది. కానీ, ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో ఉన్నాడు. ఆనందరావుగారితోనైనా చెప్పి ఆమెకు భయం పెట్టించాలనుకుంటాడు. కాని వారితో చెప్పగలిగే ధైర్యం, స్తోమతు తనకులేవని ఆఉద్దేశ్యం మార్చుకున్నాడు. ఒకవేళ చెప్పినా అది ఎటువంటి పరిస్థితులకు దారితీస్తుందో ఊహించడం కష్టమని భావించాడు.

"వసంతా! నా హృదయం నీ కర్పించాను, స్వీకరించి నన్ను కృతార్థుడినిచెయ్యి" అంటూ తనపాదాలపై సంపెంగపూలను గుమ్మరించిన అతడినిచూసి కిలకిల నవ్వింది వసంత. ఆ నవ్వు అతని గుండెలలో మృదంగం వాయించినట్లయి "ధన్యోస్మి" అన్నాడు.

"మూర్తీ, ఏమిటి నీ కీ పిచ్చి?" అడిగింది వసంత.

"నిజమే వసంతా. నీ అందం నన్ను పిచ్చివాడిని చేసింది. నువ్వు నిరాకరిస్తే పిచ్చాసుపత్రే గతి."

"చాలబావుంటుంది. నువ్వు అందులో చేరితే నేను ప్రతిదినమూ వచ్చి నిన్ను పలుకరించిపోతుంటాను."

"అంతటి అదృష్టానికి నోచుకుంటే ఈ జీవితానికి అంతకంటే కావలసినదేముంది?"

"నీ వాగుడు కట్టిపెట్టి నేనొక ప్రశ్న అడుగుతాను చెప్తావా?"

"నాకు ప్రేమపరీక్ష పెడుతున్నావా! ఒకటికాదు, లక్షప్రశ్న

లడుగు. జవాబులుచెప్పి కథల్లో రాజకుమారుడు సప్తసముద్రాలు దాటి రాజకుమారిని చేజిక్కించుకొన్నట్లుగా నేను నిన్ను దక్కించుకొంటాను."

"నీమొహానికి అదొక్కటే తక్కువ" అనుకొని "కాలేజీలో మీ మగవారికి నాపై గల అభిప్రాయమేమిటి?" అంది.

"చెప్పనా? నువ్వు మాకు ఒకదేవతవు. వెయ్యేండ్లు తపస్సుచేసినా ప్రసన్నం కాని వరదేవతవు. నువ్వు లేనినాడు అసలు కాలేజీకే విలువ లేదు. అంతకంటే నేనేం చెప్పలేను. చూడు, నీ చెక్కిలి కవ్విస్తుంది. నీ నవ్వు పిచ్చివాళ్ళనుచేసి మమ్మల్ని రమ్మని ఆహ్వానిస్తుంది. నీ పెదవులు కదులుతుంటే అందుకొమ్మని పిలిచినట్లుంటాయి, అసలు నీ అందాన్నిచూసి ఆనందించలేని కళ్ళు కళ్ళుకావు. హృదయం హృదయమే కాదు" అని ఆమెభుజంపై చేయివేసి ఆమె మొహంపైకి వంగాడు.

వసంత కోపంతో అతన్ని నెట్టివేస్తూ "మూర్తీ. ఇలాంటి తిక్క పనులు చేశావంటే మర్యాద దక్కదు. నాకు కోపమొస్తుంది. జాగ్రత్త" అంది.

"నో, నో, మిస్ వసంతా! నువ్వు కోపగించుకోవలసిన అవసరం లేదు. నిండు చూపులతో ఒక్క తీక్షణమైన బాణంలాంటి చూపువిసిరితే చాలు! అదే మమ్మల్ని చంపేస్తుంది" అంటూ మరో యువకుడు అప్పుడే వచ్చి ఆమెప్రక్కనే కూర్చున్నాడు.

వసంత కాస్తదూరంగా జరిగి "ఓ! నువ్వా, రంగా" అని చిరునవ్వు విసిరింది. తరించిందీ జన్మ అనుకొన్నా డాతడు.

"మా ఏకాంతానికి నువ్వెక్కడ దాపురించావురా, దుర్మార్గుడా!" అనుకొని నోటికివచ్చిన తిట్లు బయటికి వినపడకుండా తిట్టుకొన్నాడు మూర్తి. అక్కడనుండి లేచి వెళ్ళిపోవాలనుకొన్నాడు. కాని, తాను లేనప్పుడు ఆ నీచుడు ఏమైనాచేస్తే? అందుకని ఆ ప్రయత్నం విరమించుకొని అక్కడే కూర్చున్నాడు. ఒకరివైపొకరు కొరకొరా చూసుకొన్నారు. అదిచూసి నవ్వుకొంది వసంత. అతనిరాకతో మనసు దిటవు పరచుకొంది. తానొక్కతే ఉన్నపుడు మూర్తి ఏంచేస్తాడో అని భయ

పడింది. కాని వారిద్దరు కావడంతో ధైర్యంగా కూర్చోగలిగింది. అలా చాలమంది ఉండడమే ఆమెకు కావలసింది. అప్పుడే నిక్షేపంగా ఉండ వచ్చు. అదే ఆమెకు కావలసింది.

మరికొద్దిసేపట్లో మరికొందరుసభ్యులు అక్కడికి హాజరయ్యారు. వారందరి చిలిపిమాటలతో, జోక్స్‌తో ఒకరికన్నా మరొకరు ఆమెచేత ఆకర్షింపబడాలని వారుపడే బాధచూసి తృప్తిగా నవ్వుకొంది. అదీ ఆమె దైనందిన కార్యక్రమం.

వారలా నవ్వుకుంటుండగా రాజ్ అటుగా వచ్చాడు. వారినిచూసి ఒక్క క్షణం అతనిమనసు చివుక్కుమంది. కిలకిల నవ్వుతున్న వసంత తలెత్తి ముందుకుచూసి చేతిలో పుస్తకంతో ముందుపోతున్న రాజ్‌ను చూసి నవ్వు ఆపేసి "శేఖర్!" అంటూ లేచి అతనికోసం పరుగెత్తింది. "ఏంచూసి ఆ పుట్టుదరిద్రుడి వెంటపడుతోందిరా భాయీ" అన్నా డొకడు, అది వినీ విననట్లు ముందుకుపోయింది వసంత.

ఆమె పిలుపు విని అక్కడే నిలబడిపోయ్యాడు రాజ్.

"నాన్నగారు రాత్రికి నిన్నోసారి వచ్చిపొమ్మన్నారు" అంది అతనిదగ్గరచేరి.

"అలాగే వస్తాను" అని ముందుకడుగేశాడు రాజ్. అతన్ని అనుసరించింది.

"నువ్వు ప్రతిదినమూ ఇక్కడికొస్తావా? అయితే నీ వెంట నేనూ వస్తాను. ఆ రోగ్స్‌తో విసుగుపుడుతోంది" అంది అతని మొహంలోకి చూస్తూ.

రాజ్ ఆ మాటలు విని "నీ దృష్టి నామీదకూడా పడిందా" అను కొని "ఈ దినం ఊరికే వచ్చాను. అంతే" అన్నాడు.

"ఏం పుస్తకమది?" అని అతని చేతిలోని పుస్తకాన్ని తీసుకొని చూసి తిరిగి ఇచ్చివేస్తూ "ఇంగ్లీషు లిటరేచర్ చాల కష్టంకదూ?" అంది.

"ప్రయత్నిస్తే అన్నీ సులభమే అవుతాయి. ఆఁ, మరిచాను. నాకు వేరే పనుంది" అని ఆమె సమాధానానికి ఎదురుచూడకుండా గబగబా అడుగులు వేసుకుంటూ ముందుకు సాగిపోయాడు.

వసంత నిట్టూర్చి సముద్రంవైపు చూసింది. అలలు నాట్యం చేస్తున్నాయి. "అక్కడ నాతో మాట్లాడుతూ కాలం గడపడానికి అంతమంది చస్తుంటే ఇతగాడికి నాతో ఎక్కువగా మాట్లాడడానికిగూడ ఇష్టంలేదు. ఆనందమంటే ఏమిటో తెలియని మొద్దు" అనుకొని అక్కడే కూలబడింది.

రాత్రి ఎనిమిదవుతుండగా రాజ్, ఆనందరావుగారింటికి బయలుదేరాడు. హోటలులో భోజనంచేసి తిన్నగా అక్కడికి చేరుకొన్నాడు. హాల్లో ఎవరూ కనిపించలేదు.

"అయ్యగారు లోపలున్నారా వెంకన్నా?" అని నౌకరును అడిగాడు.

"లేరు బాబూ! అమ్మాయిగారు మీరొస్తే పైకి పంపించమన్నారు" అన్నాడు వాడు.

రాజ్ వసంతగదిలోకి అడుగుపెడుతూ, ఆమె ఏదో ఆలోచనలలో మునిగివుండడం గమనించి పొడిగా దగ్గాడు. అది విని "రా శేఖర్, కూర్చో" అని ఆహ్వానించింది వసంత.

"నాన్నగారు బయటికెళ్ళారా?"

"అసలు ఊళ్ళోనే లేరు. రైతులతో మాట్లాడేందుకు ప్రక్కపల్లెకెళ్ళారు. రేపటికిగాని రారు. నేనే నీతో మాట్లాడాలని అలాచెప్పాను."

"నాతో మాట్లాడవలసిన విషయాలేమున్నాయి?"

"చాలా ఉన్నాయి. ముందలా కూర్చో" అని అతనిచేతిని పట్టుకొని అతన్ని కుర్చీలో కూర్చోబెట్టింది.

రాజ్ మౌనంగా ఆమె ఏం మాట్లాడుతుందోనని ఎదురుచూస్తున్నాడు. వసంత ఆ కుర్చీ చేతిపైని కూర్చొని రెండుచేతులు అతని భుజంమీద వేసి వాటిపై తన గడ్డం ఆనించి "శేఖర్, నేనంటే నీ కిష్టం లేదా?" అంది.

రాజ్ తీక్ష్ణంగా ఆమెను చూసి ఆమె చేతులను తీసివేస్తూ "నా ఇష్టాయిష్టాలతో నీకేం పని?" అన్నాడు.

"అంత కటువుగా మాట్లాడకు, శేఖర్! నాలో ఏం లోపం చూసి అంతగా అసహ్యించుకొంటున్నావు?"

"నిన్ను అసహ్యించుకొంటున్నానని ఎవరు చెప్పారు?"

"చెప్పనక్కరలేకుండానే తెలుసుకోగలిగే విషయాలు చాలా ఉంటాయి."

"అన్నింటిలోనూ అంత తెలివిగా ప్రవర్తిస్తే బాగుంటుందేమో!"

"అంటే?"

"ఒకరు చెప్పకుండా తెలుసుకోగలిగేవారికి ఇది వివరించి చెప్ప వలసిన అవసరం లేదనుకుంటాను."

"ఈ డొంకతిరుగుడు మాటలెందుకు మాట్లాడతావ్?"

"కొందరి జీవితాలే వంకరగా ఉంటాయిలే."

"నీ మాటలకేంగానీ, నే చెప్పేది విను. నువ్వు ఇక్కడేవుండి చదువుకో. ఇద్దరం తోడుగా ఉందాం, కలిసి కాలేజీకి కార్లో పోదాం. నాకర్థంకాని పాఠాలు నువ్వు చెప్తూవుండు, ఇక్కడే హాయిగా ఉండచ్చు."

"నీకు డబ్బుంది. కాబట్టి బాగా చెప్పగలిగే లెక్చరర్లు చాలమంది ఉన్నారు. వారి దగ్గరికి ట్యూషన్‌కు పోతే నాకు శ్రమ తగ్గించినట్లుం టుంది, నీ ఉద్దేశ్యం నెరవేరినట్లుంటుంది. నా పాఠాలే చదువుకోలేని నేను నీకేం చెప్పగలను?"

"పోనీ, ఇక్కడే ఉండిపో. తోడుగా ఉందాం."

"ఇన్నాళ్ళనుండి లేనిది ఈనాడు ఎందుకు కలిగిందో ఈ అపేక్ష!"

"చెప్పమంటావా?"

"నిరభ్యంతరంగా."

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను."

ఆమాట విని లేచి నిలబడ్డాడు రాజ్. కిటికీదగ్గరికివెళ్ళి క్రింద నున్న తోటలోకి చూసి నవ్వుకొన్నాడు.

"అసలు ప్రేమంటే ఏమిటో చెప్పగలవా వసంతా?"

"ఈ అర్థంలేని ప్రశ్నలే వద్దన్నది."

"హుఁ, ప్రేమంటే వెకిలి నవ్వులతో అందరినీ వెంటేసుకుని తిర

గడమని నీ ఉద్దేశ్యంకదూ! అందరినీ ఆకర్షించుకొని వారి నేడిపిస్తూ వారు పడే అవస్థ చూసి ఆనందించడమే కాబోలు ప్రేమంటే దృష్టిలో. నన్నూ వారిలో ఒకరిగా ఎంచుకొన్నావా?"

"శేఖర్!"

"ఎందుకలా గర్జిస్తావ్! ప్రేమ అనే పదానికి, నీబోటివారికి భూమ్యాకాశాలకు మధ్యనున్న దూరంలాంటిది. నీలాంటి వ్యక్తులు దాన్ని ఉచ్చరించడానికిగూడా అర్హులుగారు. ఎందుకు పవిత్రమైన ఆ పదాన్ని అపవిత్రం చేస్తావు?"

"శేఖర్, ఈ నిందావాక్యాలు భరించలేను."

ఇటుతిరిగి "ఎందుకు భరించలేవు? నేనేమైనా నీపైన అన్యాయపు నిందలు వేస్తున్నానా? నే చెప్పేది అబద్ధమా? కేవలం నీ అందంతో కాలేజీలోని యువకులను కవ్వించి, ఆశలు రేకెత్తించి వారి నేడిపించడం అసత్యమా? ఎప్పుడూ నీ వినోదంకోసం షికార్లు, సినిమాలు తిరుగుతూ వారిని పాడుచేయడం నిజంకాదా? నీకు లొంగనివారిని చిలిపిమాటలతో, చేష్టలతో లొంగదీసుకొని నీ పాదాక్రాంతులుగా చేసుకో ప్రయత్నించడం సత్యం కాదా? చెప్పు. ఇందులో ఏది అబద్ధమో చెప్పు. వసంతా! నీకేం తెలుసు? ఆ అమాయకుల హృదయాలు నీ కపటప్రేమతో ఎంతగా ఉప్పొంగినా, నిన్ను అందుకోలేక ఎంతగా తల్లడిల్లిపోతున్నాయో నీకు తెలుసా? రాత్రులందు నిద్రకు నోచుకోరు; తిండి సరిగా తినలేరు; కాలేజీలో పాఠాలు సరిగా వినరు; ఎల్లప్పుడూ నీ ధ్యాసే; ఎప్పుడూ నిన్ను చూస్తుండాలని, ఎప్పుడూ నీ తియ్యని మాటలు వినాలని, నీతో ఆనందంగా కాలం గడపాలని తహతహలాడుతుంటారు. నిన్ను ఎలా ఆకర్షించుకోవాలా అని, ఏంచేస్తే నువ్వు వారికి వశమవుతావా అని, ఎంత అందంగా ప్రేమలేఖలు వ్రాస్తే నువ్వు వారిని ప్రేమిస్తావా అనే ఆలోచనలతో బుర్రలు పగులకొట్టుకుంటారు. అందులో నూరోవంతు తెలివిని, ఆలోచనను చదువు కుపయోగిస్తే ఫస్టుక్లాసులో పాసవుతారు. నీకు తెలియదు వసంతా! నిద్రలో వారి గుండెలలో నాట్యం చేస్తుంటావు. వారి కళ్ళలో ఎప్పుడూ మెదులుతుంటావు. వారి జీవితాలను నాశనం

చేస్తున్నావు. మనిషిని ఒకేసారిగా చంపడంలేదు కానీ హింసించి మరీ చంపుతున్నావు. ఇదేనా నువ్వు చెయ్యవలసిన పని? సెకండ్ బి. ఎ. చదువుతున్నావు. ఎందుకు? నీ చదువు తగలెయ్యనా! నీ అందమనే లోయలో దాన్ని పారేశావా! వారి ఆవేదనను అర్థంచేసుకోలేక పైగా ఆనందించే నీకు హృదయమెందుకు? హుఁ, ప్రేమంటే తెలుసుకోలేని నువ్వూ ప్రేమిస్తున్నావంటే నవ్వాలో, నీపై జాలిపడాలో తెలియడంలేదు" అన్నాడు ఆవేశంగా రాజ్.

"శేఖర్!" అంది వసంత ఏడుస్తూ చేతులతో మొహంకప్పుకొని.

"వసంతా, నీ చుట్టూ తిరిగేవారిలో ఒక్కరినైనా నువ్వు అర్థం చేసుకోగలిగావా! ఒక్కరినైనా ప్రేమించగలిగావా? అవి చేతకానప్పుడు వారి నేడిపించడ మెందుకు? వారిలో నువ్వు నిజంగా ప్రేమిస్తున్నావని పొంగిపోయేవారు ఉంటారు. నిన్ను భవిష్యత్తులో తమ జీవిత భాగస్వామినిగా ఎంచుకుని కలలు కంటారు. ఆ కలలు ఫలించవని తెలుసుకొన్ననాడు వారి హృదయా లెంతగా తల్లడిల్లిపోతాయో తెలుసా? వారిలోనే నీలాగే నటిస్తూ నీవెంట తిరుగుతూ నీ అందాన్ని ఆస్వాదించి ఆనందించాలనేవాళ్ళు ఉన్నారు. వీలుకాకపోతే నిన్నూ, నీ అందాన్నీ నాశనం చేస్తారు. అది వారి తప్పు కాదు. అందుకు ఆస్కారమిచ్చిన నీదే తప్పు. ఇప్పటికైనా నువ్వు నీ ప్రవర్తన మార్చుకుంటే సంతోషం" అని తిరిగి కిటికీవైపు మొహాన్ని త్రిప్పేసుకొన్నాడు.

ఒక్కొక్కమాటా ఒక్కొక్కశూలమై గ్రుచ్చుకొంది వసంతకు. ఆ బాధతో గిలగిలలాడింది ఆమె హృదయం. మెల్లిగా అతని దగ్గరకు చేరి అతని భుజంమీద వాలిపోయి, "నీకు తెలియదు శేఖర్. నేను నిన్ను ఈ లోకంలో అందరికన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నాను. నువ్వు నా కోరిక నంగీకరిస్తే రేపటినుండి దానికి స్వస్తి చెపుతాను. నా మాట నమ్ము" అంది.

వింత షరతు. క్రొత్త ప్రేమప్రమాణం.

భుజానికి చల్లగా తగలడంతో ఇటుతిరిగి ఆమెను లేవనెత్తాడు. ఆమె ఏడుస్తూంది. కాని, అతనికి జాలి కలుగలేదు.

"వసంతా, అది అసంభవం. నువ్వు నీ ప్రవర్తన మార్చుకోలేవు. మార్చుకోవాలన్నా అదంత సులభంకాదు ఒక్కరోజులో. నేను నిన్ను ప్రేమించడమనేది అసాధ్యం. కలలోని మాట. కలలు నిజమయ్యే పరిస్థితి వస్తుందంటారు. కాని అదెన్నటికీ సంభవించదు. నువ్వు నీ ప్రవర్తన మార్చుకొన్నప్పుడు అతి భయంకరమైన సంఘటనలు జరుగుతాయి. వాటిలో చిక్కుకోవడం నా కిష్టంలేదు. కొండ చివరినుండి పడబోతున్న రాయిని, విపరీతమైన గాలికి ఊగిసలాడే దీపశిఖను పట్టుకోలేము; ఆరిపోకుండా రక్షించలేము. అసంభవమైన విషయాలు జరిగినప్పుడు ఎన్నో నష్టాలు సంభవిస్తాయి. నేను నీకు ఇవ్వగలిగిన ఒక్క సలహా విను. నీ ప్రవర్తనతో మీ నాన్నగారు ఎంతగానో కుమిలిపోతున్నారు. నీ మిత్రులే నిన్ను అసహ్యించుకొంటున్నారు. నువ్వు ఇలాగే ఉంటే నీ జీవితమే పతనమైపోతుంది. అటువంటి పరిస్థితి రాకుండా మేలుకొన్ననాడు నేను నిన్ను గౌరవిస్తాను. అంతకన్నా నేనేం చేయలేను."

"శేఖర్, నా హృదయాన్ని గాయపరచవద్దు. నిన్ను ప్రార్థిస్తున్నాను. నీ హృదయంలో స్థానమిచ్చి నన్ను రక్షించు. లేకపోతే నేనేమైపోతానోనని భయంగా ఉంది. నా ప్రార్థన మన్నించు" అని అతని కాళ్ళపైపడి ప్రాధేయపడింది.

"వసంతా! ఏమిటిది?" అంటూ ఆమెను లేవనెత్తి ఆమె కన్నీరు తుడిచి, "నేను నిస్సహాయుణ్ణి. మొదట నీయందు ఏర్పరచుకొన్న నా అభిప్రాయాన్ని మార్చుకోలేను, నీ మనసు కష్టపెట్టినందుకు క్షమించు" అని అక్కడినుండి త్వరత్వరగా బయటికొచ్చేశాడు.

వసంత అలాగే ఏడుస్తూ గాయపడిన, దెబ్బతిన్న మనసుతో ప్రక్కపై వాలిపోయింది. ఆమె అహం దెబ్బతిన్నది. అంతగా ప్రార్థించినా మన్నించని రాజ్‌పైన విపరీతమైన కోపం వచ్చింది. 'నన్ను ఇంతగా ఏడిపించావు. ఏనాటికైనా ప్రతీకారం తీర్చుకొంటాను చూడు' అంది ఆమె హృదయం. మగజాతిపైనే కక్షబూనమంది అవమానానికి గురైన మనసు.

రాజ్ కలతపడిన మనసుతో గది చేరుకొన్నాడు.

"ఇంతవరకూ ఎక్కడికి వెళ్లావన్నయ్యా?" అని అడిగింది అంత వరకు అతనికోసం కాచుకొని ఉన్న సుగుణ;

"ఆనందరావుగారు పిలిపిస్తే వెళ్లానమ్మా" అని గదిలోకి పోయి పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నాడు. కానీ చదువు సాగలేదు. పుస్తకంలో ఆమె ఏడుస్తూ ప్రార్థిస్తున్న రూపు కనిపించి కలవరపరుస్తూంది. తాను చాలా మూర్ఖంగా ప్రవర్తించానేమో ననుకొన్నాడు. 'తన తిరస్కరణతో ఎంతగా విలపించివుంటుందో! ఎంతగా బాధపడిందో ! ఎంతో ఆశతో తన కోరిక తెలిపింది. కాని అదెలా సాధ్యం ? అసహ్యించుకొన్న ఆమెను తిరిగి ప్రేమించగలడా? అది సాధ్యమా ! ఆమె గత చరిత్ర తనను బాధించదూ!'

"ఈ పాఠం అర్థంకాలేదు. కాస్త చెప్పన్నయ్యా!" అంటూ వచ్చింది సుగుణ.

రాజ్ ఆ పరిస్థితులలో పాఠం చెపుదామని చేతికి తీసుకొన్నా మనసు ఎదురు తిరిగింది.

"రేపు చెప్తాలే. వెళ్ళమ్మా" అన్నాడు. అతని పరిస్థితి కొద్దిగా ఊహించుకోగలిగిన సుగుణ మౌనంగా అక్కడినుండి వెళ్ళిపోయింది.

రాజ్ దీపం ఆర్పి పడుకొన్నాడు. వసంత దీనవాక్కులు అతని చెవిలో గింగురుమంటున్నాయి. తాను అంగీకరిస్తే ఆమె బ్రతుకు బాగుపడగలదు. తనవలన ఒకరి జీవితం బాగుపడినప్పుడు తనకు అంతకన్నా కావలసిందేముంది? ఏ ఘనకార్యాలూ చేయలేకున్నా కనీసం ఈ పనైనా చేస్తే చాలు. ఏమైనాసరే, మరునాడు వసంతను కలుసుకొని రాత్రి తన ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకొని ఆమె కోరిక నెరవేర్చాలి అని నిశ్చయించుకొన్నాడు.

క్రొత్త ఉత్సాహంతో కాలేజీకి బయలుదేరాడు. రజియా అతన్ని చూసి అతనితోకూడ నడిచింది. అది రాజ్‌కు కాస్త కష్టంగానే ఉంది. ఆమెను పరిశీలించాడు. ముస్లిమ్ దుస్తులతో ఒక క్రొత్త అందంతో అలరారుతూంది. ఆమె సాధారణంగా ముస్లిమ్‌ల శరీరఛాయ గులాబీ

రంగుతో పోటీ చేస్తుంటుంది. అందుకుతోడు ఏ మహాశిల్పి కష్టపడి శిల్పాన్ని చెక్కినట్లున్న అవయవముల పొందిక కలిగి, ఏ అజంతా శిల్పసుందరో జీవంపోయబడి వచ్చినట్లుంది. ఆమె నడకను చూచి హంసలు సిగ్గుపడి దాక్కొంటాయి, రాయంచనుండి నడక నేర్చుకొన్నట్లుంది. అయస్కాంతశక్తిని మించిన ఆకర్షణశక్తి ఆమె చూపులకు ఉన్నది. అమాయకత్వం ఉట్టిపడే ఆమె మొహం మనోరంజకంగా ఉంది. ఆమె తన ప్రక్కన నడుస్తుంటే ఏదో తెలియని ఆనందం అతన్ని ఆవరించి గిలిగింతలు పెట్టింది. అదొక గర్వంగాకూడా తలంచాడు రాజ్. ఇతరులు చూసి అసూయపడేలా ఉంది వారి జంట.

కాలేజీలో వసంతకోసం వెతికాడు. ఒక విద్యార్థితో ఏదో కిలకిల నవ్వుతూ మాట్లాడుతున్న వసంత అతన్ని చూసి ఆ విద్యార్థి చేతిలో చేయి కలిపి ముందుకు తీసుకుపోయింది. అది చూచి రాజ్ మదిలో ఎవరో సుత్తితో కొట్టినట్లయింది. చేసేదిలేక బాధతో వెనుదిరిగాడు. వెనుదిరిగిపోతున్న అతన్ని చూసి ఏదో సాధించానని సంతృప్తిపడినా అవ్యక్తంగా బాధపడకపోలేదు వసంత.

కాలేజీనుండి తిరిగి వస్తుండగా "అదోలా ఉన్నా రెందుకు?" అని అడిగింది రజియా.

"ఏంలేదు."

"అబద్ధం. ఏదో దాస్తున్నారు. నాతో చెప్పకూడదా?"

"నాకో సమస్య ఎదురైంది. చక్కటి సలహా యివ్వగలరా? చక్కని సలహా లిచ్చేవారే స్నేహితులన్నారు."

"మీకు సలహాలిచ్చే శక్తిలేదు. కానీ, నాకు తోచింది చెప్తాను. అదేమిటో చెప్పండి."

"నా స్నేహితు డొకడున్నాడు. అతణ్ణి ఒక అమ్మాయి అతనికి తెలియకుండా ప్రేమించింది. ఆ అమ్మాయి నడత మంచిదికాదు. గుణమూ అనుమానాస్పదమే. ఒకనాడు ఆమె అతనికి తన ప్రేమ వ్యక్తపరిచి అంగీకరించమని దీనాతిదీనంగా ప్రార్థించింది. ఆమె అంటే అతనికి అసహ్యం. ఒప్పుకోలేదు. అత డంగీకరిస్తే తన నడత సరి

దిద్దుకుంటానని ప్రాధేయపడింది. కానీ అతడు కఠినంగా ఆమె కోరిక తిరస్కరించి ఆ తర్వాత ఆమె బేలతనాన్ని తలుచుకొని జాలిపడ్డాడు. అతదేంచేయాలి?"

"అతనివల్ల ఒక అబల జీవితం బాగుపడుతుంటే అతడు నిస్వార్థ పరుడైతే ఆమె కోరిక మన్నించాలి."

ఆ జవాబు విని తృప్తిపడ్డాడు రాజ్.

"సాటి ఆడదని పక్షపాతబుద్ధి చూపిస్తున్నారా?"

"లేదు, సంస్కారంగల వ్యక్తిగా అతడు నిరూపించబడతాడనే ఆశతో చెపుతున్నాను."

ఆమె విశాలహృదయానికి సంతోషించాడు రాజ్.

"అతడలాగే నిర్ణయించుకొని ఈ రోజు తన మనసులోని మాట చెప్పాలనిపోయాడు. కానీ అక్కడ అనుకోని సంఘటనవల్ల తిరిగి వచ్చేశాడు. ప్రశాంతంగా ఉన్న నదిలో రాయి వేస్తే కలకలం బయలు దేరినట్లు సాఫీగా ఉన్న అతని జీవితంలో ఆ సంఘటన అశాంతి రేకెత్తించింది. అతనికి ఒక స్నేహితుడిగా ఏం సలహా యివ్వమంటారు?"

"ఆమె తన తెలివితక్కువవలన తన అదృష్టాన్ని కాలదన్ని, దురదృష్టాన్ని కౌగలించుకొంది. అతడి కది మేలో, కీడో చెప్పలేం, మొత్తంమీద అతడది మరిచిపోవడం మినహా మరేంచెయ్యలేడు. అదొక్కటే దారి. అంతకుమించి మంచిసలహా లివ్వగలిగే శక్తి నాలోలేదు."

"కృతజ్ఞుణ్ణి. ప్రయత్నిస్తాను" అని నిట్టూర్చాడు రాజ్.

ఇంతలో రజియా యిల్లు సమీపించడంతో "త్వరగా వస్తారు కదూ?" అంది.

అలాగేనని తలఊపి ముందుకు సాగిపోయాడు.

మరో అరగంటకల్లా రాజ్ అక్కడికి వచ్చాడు, లోపలికివస్తూ బయటనున్న బోర్డు చూశాడు. "ఏంజిల్ నివాస్" అని ఉంది. చిరునవ్వు నవ్వుకొని ముందుకు అడుగేశాడు. ఎదురుగా దేవత నిలబడి ఉంది. ఆ చిరునవ్వు కొక అర్థాన్ని ఆపాదించుకున్నాడు రాజ్. ఆ చిరునవ్వే ఎదురుగావున్న రజియాకు ఉత్సాహాన్నిచ్చింది.

అక్కడ టీ త్రాగడం ముగించుకొని బయలుదేరారు.

"మీరు ఈ దుస్తుల్లో ఉంటే ఎవరూ మిమ్మల్ని ముస్లిము లనుకో లేరు. ఏ బ్రాహ్మణులమ్మాయోనని భ్రమపడతారు", అన్నాడు రాజ్, ఆమెను చూసి.

"నిజంగానా, లేక ఎత్తిపొడుస్తున్నారా?" సిగ్గుపడింది రజియా.

"నిజం! దివినుండి దిగివచ్చిన దేవకన్యలా ఉన్నారంటే నమ్మండి" అని నాలుక కొరుక్కున్నాడు.

ఉప్పొంగిపోయిందా లేతహృదయం. ఆ మాటలు ఆమె మనసులో ఆనందవాహినిని పరుగులెత్తించాయి. ఏ క్షణంలోనైనా అది ఆమె మనో దౌర్బల్యాన్ని లొంగదీసుకొని మతివిహీనురాలిగా చేయవచ్చును. అదే జరిగితే పరిస్థితులు ఎలా దారితీస్తాయో తెలుసుకోలేం. కానీ వయసులో అందంతోవున్న ఆడది తన అందాన్నిగురించి పొగిడినపుడు అంత కన్నా ఆనందం లేదు. కావలసినదీ లేదు. ఆ క్షణంలో ఆమె అర్పించ లేనిది లేదు. చెయ్యకూడని పనిఉండదు. సర్వస్వాన్నీ అర్పించగలదు. నచ్చినవారు తనకిష్టమైన పొగడ్తలు చెపితే ఆమె కన్నిసుఖాలు, ఆనం దాలు లభించినట్లే అవుతుంది.

వారు అక్కడ కూర్చున్నారు. ఎవరినోటా మాటలు రావడంలేదు. మూగగా ఏవో మాట్లాడాలని అపేక్షిస్తున్నా అరికట్టగలిగే శక్తిగలవారు కాబట్టి మౌనం వహించారు. వారి చుట్టూ నిర్మానుష్యమే. నిశ్శబ్దం తాండవిస్తూంది. అప్పుడప్పుడు అలలు వారి కాళ్ళను తాకుతున్నాయి. నీటితుంపరులు మొహాలమీదపడి పులకింపజేస్తున్నాయి. అదో వింత అను భూతి. వింతలో క్రొత్తవుంది. ఆ వింత క్రొత్త అనుభూతిలో అంతు లేని ఆనందం పెనవేసుకొని వుంది. అది విడిపోని అనుబంధంగా మారవచ్చు.

ఇద్దరి మనసులూ ఒకవిధమైన అవ్యక్తానందానికి లోనయ్యాయి. రాజ్ హృదయం రజియా సాన్నిహిత్యంలో ఎన్నడూ ఎరుగని పరి

పూర్ణమైన సంతోషాన్ని చవిచూస్తూంది. రజియా తానాశించిన కలలు గన్న ఆనందాన్ని చూరగొంటూంది.

తానాశించిన విజయాన్ని సాధిస్తూంది వసంత. అందరిచేతా దాసోహం అనిపించుకొని తృప్తిపడుతూంది. ఆ తృప్తి వెనుకనే దాగి వున్న గర్వం ఆమెకు మరింత ప్రోత్సాహాన్నిస్తూంది. ఆమెను ఒక్క విషయం బాధిస్తూంది. క్లాసులో ఒక్క ప్రకాశంమాత్రం తనను లెక్క పెట్టడంలేదు. తన వడిగాపు ప్రియులందరూ తన కటాక్షానికి ఎదురు చూస్తుంటే ఆతడు కనీసం కన్నెత్తయినా చూడడు. ఎన్నోమార్లు అతని దృష్టిని ఆకర్షించాలని ప్రయత్నం చేసింది. కానీ అది బూడిదలోపోసిన పన్నీరయింది. ఎందుకో తనను ధిక్కరించే మగవాడిపై ఆడదాని కంత ఇష్టమూ, ఆత్రుతా, అశా? కొరకరాని కొయ్యలా తయారయిన అతడు ఎప్పుడూ వసంత మదిలో మెదలుతుంటాడు.

ఆనాడు క్లాసుకు కొత్త లెక్చరర్‌గారు వస్తున్నారన్నసంగతి తెలుసుకొని విద్యార్థులంతా ఆ వచ్చే లెక్చరర్‌గారిని ఏడిపించాలని, భయ పెట్టాలని తమతమ ప్రయత్నాలలో మునిగి తేలుతున్నారు. వసంతకూడా ఆ తమాషాలో పాల్గొనాలని నిశ్చయించుకొంది.

లెక్చరర్‌గారు వచ్చారు. చాల చిన్నవయస్సులోనే ఉన్నాడాయన. మనిషి చూడడానికి ముచ్చటగా ఉన్నాడు. అందగాడు కాడని చెప్పటానికి వీలులేదు. అటెండెన్సు తీసుకునేముందు అందరినీ పరిచయం చేసుకోవాలని ఒక్కొక్కరినీ లేపి వారిపేరు, ఊరు మొదలగు విషయాలు తెలుసుకొన్నాడు. అప్పటికే అర్థపీరియడు అయిపోయింది. ఆ తర్వాత అటెండెన్సు తీసుకొంటూ అందరినీ గమనించాడు. తన నంబరు వచ్చినప్పుడు వసంత కావాలని పలుకలేదు. ఆయన తలెత్తి క్లాసంతా కలియచూసి తిరిగి పిలిచాడు. అప్పుడు లేచి మెల్లిగా పలికింది.

ఆ లెక్చరర్‌గారు ఆమెను పరికించి చూసి ఏదో ఊహించుకొని "మీకు చెవుడా?" అన్నాడు.

"కా....కా....కాదు సార్! కా....కా....కా....కాస్త నత్తి, మ....మ....మ....మతి మ....మ....మరుపుకూడ ఉంది_ ది" అంది. గొల్లుమన్నారు క్లాసంతా.

''అసాధ్యురాలివిగానే ఉన్నావు'' అనుకొని "అ....అ అయితే కూ....కూ....కూర్చోండి" అన్నాడు.

నివ్వెరపోయారు క్లాసులోనివారు. మొండిఘటమేనే అనుకొన్నారు.

అటెండెన్సు తీసుకోవడం అయిపోగానే "సార్, ఒక రిక్వెస్టు" అంటూ లేచింది వసంత.

"ఏమిటో చెప్పండి."

"మరి మా అందరినీ పరిచయం చేసుకొన్నారు. మీ పరిచయం మాకు కాలేదు."

"తెలివైన ప్రశ్నే వేశారు. నా పరిచయం అంత అవసరమా?"

"అవుననే అనుకొంటున్నాం."

"అవశ్యం" అన్నాడొక విద్యార్థి.

"అయితే వినండి. నా పేరు ఎన్. భానుమూర్తి. మా........"

"ఎన్_అంటే?" అంది ఒక కంఠం.

"అడిగే ధైర్యమున్నవారు నిర్భయంగా లేచి అడగవచ్చు."

"అది మా కలవాటు లేదు."

"సరే. ఎన్ అంటే నందమూరి అని. మాది రాయలసీమలోని కడపపురము. పోయినఏడే ఎమ్. ఎ. ఫస్ట్‌క్లాసులో పాసయ్యాను. ఇది నా మొదటి ఉద్యోగం. ఇదే మొదటిసారి క్లాసు తీసుకొంటున్నాను."

"అయితే కష్టపడతారు" అన్నాడొక విద్యార్థి.

"ఎన్నో కష్టాలకోర్చే ఇక్కడికొచ్చాను. ఇక ఇక్కడి కష్టాలెంత? అయినా కష్టాలతో కొట్లాడడం మా ప్రక్కవారి కలవాటేలెండి. మీ కా చింత అక్కరలేదు" అని ఆ మాటఅన్న విద్యార్థిని గుర్తు పెట్టుకున్నాడు. అప్పుడే అతణ్ణి లేపి బయటికి పంపిద్దామనుకొన్నాడు. కానీ, మొదటిక్లాసులోనే అల్లరెందుకని ఊరుకున్నాడు.

"అంటే మీ సాహసకృత్యాలు ఏమైనావుంటే చెప్తారా, సార్!" అంది వసంత కొంటెగా.

"చెప్తే మీలాంటివారికి అర్థంకావు. వ్రాసి పుస్తకంగా అచ్చు వేయించి ఇస్తాను. చదువుకొందురుగాని."

"అయితే ఉపాధ్యాయులేకాక కవులుకూడ నన్నమాట" అన్నాడొక కొంటె విద్యార్థి.

"ఇక అనవసర అధికప్రసంగం చాలిస్తే మంచిది."

'మ్యావ్' అందొక గొంతు. 'భౌ భౌ' అంది మరొక గొంతు. అంతవరకూ దాచిపెట్టుకొనున్న బుడగ ఠప్ మనిపించాడు ఒక ప్రబుద్ధుడు. కాగితంచుట్టి 'తూ తూ' అన్నాడొకడు. బెంచిపైన గుర్రాలు పరుగులిడే శబ్దం చేశాడొకడు. దాన్నే కిర్రుమనిపించాడు ఇంకొకడు.

"ఇంతేనా, ఇంకేమైనా ఉన్నాయా?" ప్రశ్నించాడు భానుమూర్తి.

"ఆచ్" అన్నాడొక విద్యార్థి.

"ఈ క్లాసులో మనుష్యులకే పాఠం చెప్పాలనుకొన్నాను. కానీ ఇక్కడచూస్తే పిల్లులకు, కుక్కలకు, చిన్నచిన్న పిల్లలకుకూడా చెప్పవలసి వస్తుందనుకోలేదు."

"ఆచ్" అంది తిరిగి అదే కంఠం.

"మిస్టర్ గోపీ, గెటప్" అన్నాడు భానుమూర్తి గంభీరంగా.

గోపీ అనే విద్యార్థి లేచి నిలబడ్డాడు.

"జలుబు అంత ఎక్కువగా ఉందా?"

"అవును సార్"అన్నాడతడు బాధపడుతున్నట్లు నటిస్తూ.

"మరి ఒక తలనొప్పిమాత్ర ఏమైనా వేసుకొని కాఫీ తాగి రాకూడదూ?"

"డబ్బులు లేవుసార్!" గొల్లుమంది క్లాసంతా.

"పోనీ, నే నిస్తాను. వెళ్ళిరా" అని పర్సులోనుండి ఒకరూపాయి నోటు తీశాడు.

దాన్ని అందుకొని "థాంక్యూ సార్" అని గోపీ బయటికి వెళ్ళిపోయాడు.

అంత అల్లరిచేసినా తొణుకూ బెణుకూలేకుండా కూర్చొని ఉన్నాడే అని తెల్లమొహాలు వేశారంతా. ఓడిపోయినట్లు తమలో తామే ఒప్పేసుకొన్నారు. వసంత అతని గాంభీర్యాన్ని మెచ్చుకొంది. ఇంతలో గంట కొట్టేశారు.

"ఒరేయ్! మన నందమూరివారు మొండిఘటమే కాదు ధర్మాత్ములు, తెగింపుగలవారు. ఇలా అయితే జీతండబ్బులు మిగలవు" అని వ్యాఖ్యానించాడు తిరిగివచ్చిన గోపి. అందరూ తలొకవిధంగా విమర్శించారు.

"హల్లో, మిస్టర్ మూర్తీ! ఎలా వుంది మీ క్లాసు?" అడిగాడు వామనరావు అప్పుడే తిరిగివచ్చిన భానుమూర్తితో.

"విద్యార్థులంతా మంచివారే. కానీ, కాస్త అల్లరిగాఉంటున్నారు."

"కాస్త అంటారేమిటండీ! అసలా క్లాసు తీసుకోవాలంటే మాకందరికీ భయంగా ఉంటుంది."

"మరీ అంత గడుసువారు కాదులేండి."

"మీరు పొరబడ్డారు. మగవారివరకూ ఎందుకు? ఆ అమ్మాయి వుంది చూశారా, వసంత? వట్టి రౌడీపిల్ల అంటే నమ్మండి. అందం తప్ప ఆమెలో మెచ్చుకోదగ్గ గుణం ఒకటికూడా లేదు."

భానుమూర్తి మదిలో వసంత రూపం మెదిలింది. చిరునవ్వు నవ్వుకొన్నాడు. క్రమంగా అతడి మనసును ఆక్రమించుకొంది వసంత రూపం.

"చూడండి. మీరు యూనివర్సిటీ స్టూడెంట్లు. మీరు ఇక్కడ పాసయ్యేది ఎక్కువగా మీ ప్రవర్తనబట్టి ఉంటుంది. అంతేకానీ, మీ చదువుకు అంత ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వరు. ఒకవేళ మీరు చదువులో ఫస్టు కావచ్చు. కానీ మీ నడవడిలో లోపముంటే అది మీ భవిష్యత్తును నాశనం చేస్తుంది. ఈ విషయం మరిచిపోకండి. ఇక్కడ క్లాసు సంపాదించుకుంటేతప్ప మీకు మంచి భవిష్యత్తు ఉండదనే విషయం సత్యం.

ఆ క్లాసు రావాలంటే సత్ప్రవర్తన, క్రమశిక్షణ పాటించాలి. అదికాక ఇలా ప్రేమలేఖలు వ్రాసి ఆడపిల్లలను అల్లరిపట్టించడం బాగుండదు. ఆ రోజులు దాటిపోయినాయి. నేడొక విద్యార్థి హేమలత అనే అమ్మాయికి ప్రేమలేఖ వ్రాశాడు. మీలో ఎవరు ఈ తప్పుడు పని చేశారో వారు వెంటనే లేచి క్షమాపణ కోరుకోండి. ఇది మీ మొదటి తప్పిదంగా ఎంచి క్షమిస్తాను."

ప్రొఫెసరుగారి మాటలు విని ఫస్ట్ ఎమ్. ఎ. విద్యార్థులంతా ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. రాజ్ ఒకసారి కోపంగా హేమలత వైపు చూశాడు. అటువంటి క్లిష్టపరిస్థితి తెచ్చిపెట్టిందికదా అనుకొన్నాడు. అప్పుడే అతనివైపు చూసిన హేమలత అతని భావాన్ని అర్థం చేసుకోలేకపోయింది.

"ఎవరూ ఒప్పుకోరా?" కోపంగా అడిగారు ప్రొఫెసరుగారు.

ఎవరూ లేవలేదు.

"మీకు ఇంకో అవకాశాన్నిస్తున్నాను. అనవసరంగా నా ఆగ్రహానికి గురికాకండి. పట్టుబడక తప్పదు. అప్పుడు డిస్మిస్ కావలసి వస్తుందని మరిచిపోకండి."

అప్పటికీ ప్రయోజనం లేకపోయింది.

"ఆల్‌రైట్! అందరి చేతివ్రాతా చూస్తాను." కోపంగా ఆ మడిచిన ఉత్తరాన్ని తీసి, "దీని క్రింద సంతకం రాజు అని ఉంది. ఈ క్లాసులో రాజశేఖరమని, రాజగోపాల్ అని, రాజారావని, క్రిష్ణంరాజు అని నలుగురున్నారు. ముందు వారిని పరీక్షించి, ఆ తర్వాత అందరివీ చూస్తాను" అని క్లాసంతా కలయజూశాడు.

ఎవరికివారు చెయ్యని నేరానికి పట్టుబడిపోతామేమోనని భయపడుతున్నారు. ఆ చేసిన వ్యక్తి ఏ నిశ్చయానికీ రాలేక బాధపడుతున్నాడు.

"ఎస్. మిస్టర్ రాజశేఖరం" అన్నాడు ప్రొఫెసరు.

రాజ్ నెమ్మదిగా లేచాడు.

అతన్ని చూసి ప్రొఫెసరుగారు ఓ చిరునవ్వు నవ్వి "మిస్టర్ రాజశేఖరం, నువ్వు ఈ పని చేశావంటే నేనేకాదు, ఎవ్వరూ నమ్మరు.

కానీ మనుష్యుల తత్వాలు అతి త్వరగా మారుతుంటాయి. మాకోసం కాకపోయినా ఆ అమ్మాయి తృప్తికొరకు దీన్ని కాపీ చెయ్యి" అని ఆ ఉత్తరాన్ని అందించాడు.

రాజ్ ఆయన చెప్పినట్లు చేయసాగాడు.

హేమలత అదిచూసి మతి పోగొట్టుకున్నట్లయింది. ఒకవేళ రాజశేఖరమే ఆ పని చేసివుంటే తనే అతనికి క్షమాపణ చెప్పుకొని తన హృదయాన్ని అర్పించడానికి తాను సిద్ధమే. అనవసరంగా లేనిపోని కష్టాన్ని తెచ్చిపెట్టానే అని బాధపడింది.

"నీకేమైనా అనుమానముందా అమ్మాయ్?" అడిగాడు ప్రొఫెసరు గారు ఆ కాపీని హేమలత ముందు వుంచి.

"వారు అలాంటిపని చెయ్యరని నాకు తెలుసుసార్" అంది తల వంచుకొని హేమలత.

"ఇక మిగిలినవారు" అంటుండగా ఒక విద్యార్థి లేచి నిలబడ్డాడు.

అందరికళ్ళూ అతనిమీద పడ్డాయి.

"ఓ! మిస్టర్ రాజగోపాల్! ఇది నీపనేనా? నిన్ను ఇలాంటి పరిస్థితులలో చూడడానికి విచారిస్తున్నాను. ఇది నమ్మశక్యంకాని పని. నా గదికి రండి. మిస్ హేమలతా! యూ టూ!" అని అక్కడినుండి వెళ్ళిపోయాడు. ఎంతపని చేశావురా గోపీ అనుకున్నాడు రాజ్.

"మిస్టర్ రాజగోపాల్! ఇటువంటి పనులు చేయడం నీకు తగదు. ఏదో బుద్ధితక్కువపని చేశావు. క్షమాపణ వ్రాసిచ్చి యింకెప్పుడూ ఇలాంటి పనులు చేయనని ఆమె కాళ్ళు పట్టుకొని క్షమాపణ చెప్పుకో."

ఆ మాటలు విని హేమలత కంగారుగా "సార్"అంది. మాట్లాడ వద్దు అని సైగచేశా డాయన.

"క్షమించండి. తప్పు చేశాను. ఒప్పుకొంటున్నాను. క్షమాపణ వ్రాసివ్వగలను. కానీ మీరు చెప్పినపని ఆత్మాభిమానంగల ఏ పురుషుడూ చెయ్యడు."

"అంత ఆత్మాభిమానం గలవాడివి ఇంత బుద్ధితక్కువపని ఎందుకు చేశావు?"

"క్షమించాలి. అది మీ దృష్టిలో బుద్ధితక్కువపనీ, తప్పుడుపనీ కావచ్చు. కానీ నా మనస్సాక్షికి, నా అదృష్టాన్ని, భావిజీవితాన్ని పరీక్షించుకొనడానికి చేసిన చిన్న సాహసం మాత్రమే."

"అనవసరపు మాటలతో కాలయాపన చెయ్యడం నా కిష్టంలేదు. నీ నిర్ణయమేమిటో వివరంగా చెప్పు."

"చెప్పవలసిందేమిటో ఇంతకుముందే చెప్పేశాను."

"అంతేనా?"

"అంతకుమించి ఏమీ చెప్పలేని పరిస్థితులలో ఉన్నాను."

"అయితే నిన్ను కాలేజినుండి, హాస్టల్‌నుండి డిస్మిస్ చేస్తున్నాను."

"థాంక్యూ" అనడంకన్నా ఎక్కువగా ఏమీ చెప్పలేకపోయాడు.

"మిస్ హేమలతా! ఈనాడు నా మనసు కలతపడుతోంది. ఎన్నడూ చేయగూడదనుకొన్న పని చేశాను. అది అతని తప్పో, లేక నీ తప్పో? కాక నాదేకూడ కావచ్చు. జరిగిందేదో జరిగిపోయింది. పరిస్థితులను చక్కబెట్టుకోవడం నేర్చుకోండి. ఇక మీరు వెళ్ళవచ్చు" అని ఏదో వ్రాసుకోవడంలో నిమగ్నుడయ్యాడు.

హేమలత భయపడుతూ బయటికి వచ్చి నిలబడింది. రాజగోపాల్, ప్రొఫెసరుగారు టేబుల్‌పై పడేసిన ఉత్తరాన్ని అందుకొని "తండ్రిలాంటివారు. మీరు చేసిన మేలు మరిచిపోలేను" అని గబగబా బయటికొచ్చి అక్కడేవున్న హేమలత నొకసారి చూసి ముందుకు సాగిపోయాడు.

"ఏమండీ!" అనుసరించింది లత.

నిలిచిపోయాడు గోపీ.

"అనుకోని పొరపాటు జరిగిపోయింది. నన్ను క్షమించండి" అంది బాధను వ్యక్తపరుస్తూ.

ఆమెవైపు తిరిగి "అయిపోయినదానికి విచారించి ప్రయోజనం లేదు. ఇది మీరు నా కిచ్చిన బహుమానంగా స్వీకరిస్తాను. అక్కడ చెప్పవలసిన మాటలు ఇక్కడ చెప్తాను. జీవితంలో మీరు తలంచే తప్పు అనే నా చిన్న సాహసాన్ని ఎన్నడూ చేయను. ఒకసారి చేసినందుకు బాగా బుద్ధి చెప్పారు. సంతృప్తిగా ఉండండి."

"నన్ను క్షమించలేరా?" దుఃఖాన్ని ఆపుకుంటూ అడిగింది హేమలత.

"మిమ్మల్ని క్షమించడానికి నే నెంతటివాణ్ణి! దీన్ని మీ విజయానికి చిహ్నంగా ఉంచుకోండి" అని ఆ ఉత్తరాన్ని ఆమె చేతిలో పెట్టి తిరిగిచూడకుండా వెళ్ళిపోయాడు. హేమలత బాధతో చేసేదిలేక వెయిటింగ్ రూమ్ కేసి నడిచింది.

క్లాసంతా నిశ్శబ్దంగా ఉంది. అందరిమనసులూ ఆందోళనకరంగా ఉన్నాయి. జరగరానివిషయం జరగనున్నట్లు అందరికీ హేమలత అంటే అసహ్యం పేరుకొంది. మంచివాడని పేరు తెచ్చుకున్న రాజగోపాల్ కు కీడు తలపెట్టినందుకు లతను ఆమె స్నేహితురాండ్రుకూడ క్షమించలేక పోయారు.

మౌనంగా తన పుస్తకాలు తీసుకొని బయటికి వెళ్ళిపోతున్న గోపీని చూసి "గోపీ"అంటూ రాజ్, ఆనంద్ అన్న మరొక విద్యార్థి అతన్ని వెంబడించారు.

"ఏం జరిగిందిరా, గోపీ?" అడిగాడు రాజ్. ఏం వినవలసివస్తుందోనని భయపడుతూం దతనిమనసు.

"ఏం జరుగుతుంది? నేను ఆవిడకాళ్ళు పట్టుకొని క్షమాపణ వేడుకోవాలట. నిరాకరించాను. డిస్మిస్ చేశారు. అంతకన్నా ఏం చెయ్యగలరు?"

"ఛీ! ఈ పాడు ఆడువారిబుద్ధి పోనిచ్చారుకాదు. అసలు వీళ్ళను మనతో చదువుకోనివ్వడమే పొరపాటు" అన్నాడు కోపంగా ఆనంద్. అతనిలో ఆడవారిపై జుగుప్స, అసహ్యం నిండిపోయాయి. రాజ్ బాధగా మూలిగాడు.

"సార్! ఈ ఒక్క తప్పూ క్షమించండి. ఇంకెప్పుడు అతనలాంటి పని చేయడని నేను హామీ యిస్తాను. అనవసరంగా అతని జీవితాన్ని నాశనం చేయకండి. నడిసముద్రంలో నావికుడులేని నావలా అతని జీవితాన్ని మార్చకండి." చేతులు జోడించి ప్రాధేయపడ్డాడు రాజ్.

"మించిపోయింది, మిస్టర్ రాజశేఖర్! అతను కాస్త పొగరు బోతుగా ప్రవర్తించాడు. నే చేయగలిగిందేమీ లేదు."

"అలా అనకండి, మీరు తలుచుకుంటే ఏమైనా చేయగలరు. ఇప్పుడు మీరు అతనిజీవితాన్ని తప్పుడు మార్గంలోనే ప్రయాణించమని శపించారు. ఆ శాపాన్ని ఉపసంహరించుకొని అతణ్ణి రక్షించండి."

త్రోసిపుచ్చలేని అభ్యర్థనా, కలతపెట్టే దీనత్వమూ, కనికరించాలనే కోరికా మసలుతుండగా ఉద్యోగధర్మం, అభిమానం అడ్డువచ్చి నిరాకరించక తప్పలేదు.

"ప్రయోజనంలేదు. నీ కెలాంటి సహాయమూ చెయ్యలేను. నీ మిత్రుడికి అన్యాయం జరిగిందని నువ్వు బాధపడుతున్నావు. నా శిష్యుడికి అపకారం చేశానని నేనుకూడా చింతిస్తున్నాను. లాభంలేదు. నువ్వు వెళ్ళవచ్చు."

నిస్సహాయుడై మాననిగాయంతో బయటపడ్డాడు రాజ్. సహాయం చేసే శక్తివున్నా చెయ్యలేని మానవతత్వం.ఇతరులు లొంగలేదనే ఆత్మాభిమానం అనర్థాలకు దారితీసినా అడ్డుకోలేని విచిత్రపు స్వభావం.

* * *

"నిన్న రాలేదేం?"

"ఏమిటీ దౌర్జన్యం!" ఆశ్చర్యపోయాడు రాజ్. ఇంతలోనే ఇంత చనువూ, అధికారం ఇవ్వడం ప్రమాదమే.

"అత్యవసరమైన పనివుండి రాలేకపోయాను."

"మేం తెలుసుకోకూడని పనా?"

ఈ చొరవను ఖండించాలనుకొన్నాడు. కానీ అప్పటికే ఆ శక్తి తననుండి దాటిపోయిందని గ్రహించాడు. ఆ విషయం చెప్పవలసిన అవసరం ఏమిటి? కానీ చెప్పకుండా ఉండలేకపోయాడు.

"అతడితో మాటాడుతూ- వాళ్ళవూరికి పంపించడంలో ఆలస్యమయింది." అంతా చెప్పేశాడు, నిరుత్సాహంకూడిన గొంతుతో.

బాధను కలిగించేవిషయం. బాధపడి చేయగలిగిందీ ఏమీలేదు.

కానీ అలా బాధపడకుండా ఉండలేడు. అదే మానవతత్వం. దాన్ని అధిగమించే శక్తి అతనిలో లేదు. అలా సృష్టించబడ్డాడు.

చాలా బాధపడుతున్నాడని గ్రహించింది రజియా. అత ఎవరో తెలియకపోయినా అసహ్యించుకొన్నా, ఆమె చేసినపనికి జాలిపడ గలిగింది.

"మీ మిత్రుడు మంచివాడేనా?"

అర్థంలేని ప్రశ్న. మంచికీ, చెడుకూ సంబంధముంది. మంచిని కానీ, చెడునుకానీ శిక్షించవలసిన విధం అదికాదు. అందుకే ఈ బాధ.

"మీకెందు కొచ్చిందా సందేహం?"

"ఏంలేదులెండి. ఊరికేనే అడిగాను."

"అసలు వాడికిది స్వతహాగా పుట్టిన బుద్ధికాదు. ఎవరి ప్రేరేపణ వల్లనో ఆపని చేశాడు."

"అయితే తప్పంతా అతదేనంటారా?"

"తప్పు ఒకరిదని చెప్పడానికి వీల్లేదు."

"పోనీలెండి. జరిగిపోయినదానికి విచారించి ప్రయోజన మేమిటి?"

"జరిగినదానికి కాదు విచారం. జరుగబోయేదాన్నిగురించే నా బాధ. ఈ విషయం ఆ తల్లితండ్రులు తెలుసుకొని ఎంతగా బాధపడ తారో! కొడుకు పెద్దచదువులు చదివి తమను ఉద్ధరిస్తాడని ఎన్నోఆశలు పెట్టుకొని జీవించేవారి మనస్సులు ఎంతగా క్షోభిస్తాయో! జీవితంలో ఏదో చెయ్యాలని, దేన్నో సాధించాలని కలలుగన్నవాడి భవిష్యత్తు అంధ కారబంధురమై పోయిందే అని చింతిస్తున్నాను."

"అతడు ముఖాముఖి ఆమెతో మాట్లాడేసివుంటే ఇంత చిక్కు వచ్చేదికాదు."

"వాడికంత ధైర్యం ఎన్నటికీ రాదు."

"అసలు మీ మగవారికి ఏపని చెయ్యడానికీ ధైర్యం చాలదు. అన్నీ దాక్కొనే చేస్తుంటారు."

"అంటే?" ఆమె మొహంలోని భావాన్ని చదవడానికి ప్రయ

త్నించాడు. ఏదో రహస్యం దాగిఉంది. ఏదో ఎత్తిపొడుపుగాకూడా తోచింది.

"ఏమీ లేదు. మా క్లాసులో ఒక అబ్బాయి మంచివాడని గౌర వించాను. చనువుగానే మాటాడుతున్నాను. నిన్న ఒక పుస్తకం తీసుకొని దానితోబాటు ఈ దినం ఒక ప్రేమలేఖనుకూడ బహూకరించాడు" అని తాను యింట్లో చదివిన ఉత్తరాన్ని తీసి క్రిందపడేసింది. గర్వం ఉట్టిపడు తూందా చూపులో.

చిన్నగా నవ్వుకొన్నాడు రాజ్.

"చదవండి" అంది రజియా.

"పరాయివాళ్ళ ఉత్తరాలు చదువకూడదంటారు."

"నేను పరాయిదాన్నా!" అంది చిరుకోపంతో రజియా. అధికారం కొట్టవచ్చినట్లయింది.

"అబ్బే! ఊరికే అన్నాను" అని ఆ ఉత్తరం తీసుకొని చదివాడు.

"రజియాగారికి,

వివరంగా వ్రాయలేను. ఎందుకు వ్రాస్తున్నదీ చెప్పనక్కరలేదను కుంటాను. నా హృదయాన్ని మీ ముందు పరిచాను. కనికరిస్తారో, తిరస్కరిస్తారో మీ యిష్టం. సాహసం చేసివుంటే క్షమించండి.

ఇట్లు
ముకుందం."

"ఏం చేద్దామనుకున్నారు?"

"మామూలే. చించివేసి గాలికి వదిలేద్దామనుకుంటున్నాను."

"మీ ప్రిన్సిపాల్‌గారికిచ్చి డిస్మిస్ చేయించరా?"

"నేనేం హేమలతనుకాదు. మేమంతా అలా చేస్తే ఇప్పటికి మాతో చదువుకునే విద్యార్థులు సగంమంది ఇళ్ళకుపోయేవారు."

"అయితే ఒక్కరినైనా ప్రేమించలేకపోయారా?" కొంటెగా చూస్తూ అడిగాడు రాజ్.

అది చూసి చిరునవ్వు ఒలకబోస్తూ "ఈ ముకుందాన్ని ప్రేమించి ఉండేదాన్నే. కానీ...." అన్నది.

"ఊఁ. అతడలా వుత్తరం వ్రాశాడని విరమించుకొన్నారా?"

"అదేంకాదు. కొద్దిరోజులక్రిందటే మరొకరికి నా హృదయాన్ని అర్పించాను."

"స్వీకరించాడా?"

"అది తెలియకనే ఈ బాధ."

"పోనీ, ఆడవారు చాల ధైర్యవంతులుగదా, అతన్ని కలుసుకొని అడగలేకపొయ్యారా?"

"అలాచేస్తే అనర్థాలు దాపురిస్తాయని భయం."

"ఎందుకో అంత భయం?"

"అతడు సామాన్యంగా అందరికీ అందేవాడుకాదు. తొందరపడితే తర్వాత విచారించవలసి ఉంటుంది."

"మీ ఆడవారిలో రకరకాల మనస్తత్వాలు గలవారున్నారు."

"మీ మగవారిలో లేరా? ఆడదంటే ఆటబొమ్మలా భావించే సువిశాలహృదయులు, సమయమొస్తే ఆడవారిని కబళించి ఆనందించే చమత్కారులు, బలవంతంగా ఆడదాన్ని అనుభవించే ఆపత్పరాయణులు; వీరుగాక ఆడదంటే అసహ్యించుకొనేవారు, వారిని లెక్కలోకి తీసుకోకుండా వారూ మనుష్యులేనన్న విషయం విస్మరించే మహానుభావులు హృదయమర్పించినా తెలుసుకోలేని అమాయకులు, పొరపాటునైనా ఆడవారిని కన్నెత్తిచూడని సద్గుణవంతులు,అస్ఖలిత బ్రహ్మచారులు—వీరందరినీ ఏమంటారు?"

"ఏమంటాను?లోకో భిన్నరుచి: అన్నట్లు వారివారి మనస్తత్వాలు వివిధాలుగా ఉంటాయి. అయినా మీకు చాల అనుభవమున్నట్లుందే."

"ఇప్పుడిప్పుడే మీవద్దనుండి నేర్చుకొంటున్నాను."

"ఊ" అన్నాడు రాజ్ ఆశ్చర్యంగా.

"ఆ" అంది నవ్వుతూ రజియా.

తృప్తిగా నవ్వుకొన్నారు వారు. అది చూసి ప్రకృతికూడా నవ్వింది. చెట్లు ఆనందంతో ఊగిసలాడాయి. దూరంగా కోయిల ఆనందంగా పాడింది. సముద్రుడు సంతోషంతో పొంగిపోయాడు.

# 5

జీవితంలో ఒకోసారి మానవులకు పరిచయం కొన్ని విచిత్ర పరిస్థితులలో ఏర్పడుతుంది. అలా ఏర్పడిన ఆ పరిచయం చాలా గట్టి బంధంగా తయారుకావచ్చు. లేదా మధ్యలోనే కొన్ని అవాంతరాలవల్ల రాలిపోనూవచ్చు. కాని, చదువుకొని విజ్ఞాన మలవరచుకొన్నవారి మధ్యకానీ, చదువు లేకపోయినా సంస్కారవంతులైనవారి మధ్యకానీ ఈ స్నేహబంధం సాధ్యమైనంతవరకూ జీవితాంతం ఉంటుంది. అప్పుడే ఆ స్నేహానికి ఒక సార్థక్యం అంటూ ఉంటుంది. అలాకాక మధ్యలోనే మానవసహజమైన క్రోధ, లోభ, మాత్సర్యాలకు లోనై పవిత్రమైన బంధాన్ని వదులుకొని, పగ ప్రతీకారాలకు లోబడి ఏదో సాధించాలనే మూర్ఖులు ఉంటారు. స్నేహంకోసం తమ సర్వస్వాన్నీ త్యాగంచేసి, నిస్వార్థపరులై కేవలం పరుల సౌఖ్యంకొరకు తమ జీవితాలనే నాశనం చేసుకొని, లోకంలో మానవాతీతులై దేవతామూర్తులుగా నిలిచిపోయే మహాత్ములూ ఉంటారు. మొదటిరకంవారిని చూసి గర్హించాలా? జాలి పడాలా? రెండవరకంవారిని హర్షిస్తుందా? ఆరాధిస్తుందా? లోకనిర్ణయం ఎలా ఉందో?

'లాస్టు అవరు క్లాసు' లేకపోవడంతో లైబ్రరీలో కూర్చుని చదువుకుంటున్నాడు రాజ్. లైబ్రరీహాలు చాల పెద్దది. ఇరువైపుల పెద్దపెద్ద అద్దాలబీరువాలు, అందులో అమర్చబడిన పెద్దపెద్ద వివిధములైన పుస్తకాలు. చూడటానికి చాలా ముచ్చటగా ఉంది లైబ్రరీ. మధ్యలో బల్లలు, వాటికి యిరువైపుల కుర్చీలు, ఆ బల్లలపై వార, పక్ష పత్రికలు ఎన్నో ఉన్నాయి. విద్యార్థులంతా తమకు నచ్చినవాటిని వెతుక్కుని చదువుకుంటున్నారు. అంతమంది విద్యార్థులున్నా ఎవ్వరూ లేనట్లే నిశ్శబ్దంగా ఉంది.

లత మెల్లిగా లైబ్రరీహాల్లోకి ప్రవేశించింది. దూరంగా ఒంటరిగా కూర్చొనున్న రాజ్‌ను చూసింది. విద్యార్థులందరి దృష్టి ఆమెపైపడింది. కొందరు అసహ్యంగా తలలు వంచుకున్నారు. మరికొందరు క్రూరంగా కొరకొరా చూశారు. ఒక విద్యార్థి కోపంపట్టలేక "ఈ మహాతల్లి చదువు

కోవడానికి వచ్చిందో లేక విద్యార్థుల భవిష్యత్తు పాడుచేయటాని కొచ్చిందో!" అన్నాడు.

"ఒరేయ్! ఊరుకోరా. లేకుంటే నీపైనకూడ రిపోర్టిస్తుంది" అన్నాడు ఇంకొక విద్యార్థి.

"అతడు కాబట్టి ఊరుకున్నాడు. నేనే అయివుంటేనా...." అని లత తనవైపు చూడడంతో ఆ వాక్యాన్ని అక్కడికి ఆపాడు.

లత వారిమాటలు విని బాధగా నిట్టూర్చి అందరూ తన నొక వింత జంతువును చూసినట్లు చూస్తుండగా ముందుకు పోయింది.

ఎదురుగా వచ్చి కూర్చొన్న లతను చూసి రాజ్ లేచి బయటికి వచ్చాడు. అతన్ని అనుసరించింది లత. అందరూ వారిద్దరివైపూ ఆశ్చర్యంగా చూడసాగారు.

ఫిజిక్స్‌లాబ్‌దగ్గర అతన్ని కలుసుకొంది లత. ఆమె అడ్డు రావడంతో చేసేదిలేక నిలబడి తలవంచుకున్నాడు రాజ్.

"మీరు నా మొహం చూడటానికి ఇష్టపడకపోతే పోనీ, ఒక్క విషయం అడుగుతాను. చెప్పండి."

రాజ్ తలెత్తి ఆమె మొహంలోకి ఏమిటన్నట్లు చూశాడు. మొహంలోని దీనత్వాన్ని చూసి జాలిపడ్డాడు. జరిగినదానికి పశ్చాత్తాప పడిందని గ్రహించాడు. అనవసరంగా తాము ఆమెను కష్టపెట్టకూడదని తన కాఠిన్యాన్ని ఉపసంహరించుకొన్నాడు.

"మీ మిత్రుడికి నే చేసిన అన్యాయానికి మీరంతా నన్ను అసహ్యంచుకొంటున్నారు. కనీసం మీరైనా నన్ను క్షమించలేరా? నాపైన జాలి చూపలేరా?"

"క్షమించవలసింది మేము కాదు. వాడే నిన్ను క్షమించాలి. ఇక ఏం చూసి జాలిపడమంటావు? నీలో బలహీనతను, నిస్సహాయతను చూసి జాలిపడమంటావు. అంతేనా? నువ్వు చేసిన పని నీ బలహీనతను చాటుతుందా? నీ నిస్సహాయత్వాన్ని చాటుతుందా? నీలోని అహంభావాన్ని వెల్లడి చేస్తోంది. ఇతరుల అహంభావాన్నీ, అధికారాన్నీ చూసి జాలిపడేస్థితిలో లేడు మానవుడు. నువ్వు జీవితాలతో చెలగాటమాడుతున్నా

నన్న విషయం గ్రహించి ఉంటే ఇంత విషమపరిస్థితి సంభవించేదికాదు. మీరంతా మా జీవితాలతో ఆడుకోవడానికి వచ్చారు. వాడు చేసింది తప్పనకుండా ఉండలేను. అతనికన్నా పెద్ద తప్పునే నువ్వు చేశావు. అతనేం పెద్ద చెయ్యరాని తప్పు చెయ్యలేదు. అందరిలా ప్రేమించాడు. ఆ ప్రేమను హృదయంలో దాచుకొన ప్రయత్నించి చేతకాక ఎదురుగా అడిగే ధైర్యంలేక ఉత్తరంద్వారా తెలియచేసి నీ ప్రేమను అర్థించాడు. నీ కిష్టంలేకపోతే తిరస్కరించవచ్చు. చేతనైతే బుద్ధి చెప్పవచ్చు. ఇదేం స్కూలనుకున్నావా ఉపాధ్యాయునికి చెప్పే నాలుగు చీవాట్లో లేక నాలుగు తన్నులో తగిలించి మార్చుకోవడానికి? ఇది మన జీవితాలను ఒక సుస్థిర ప్రదేశానికి చేర్చే ఇరుసులాంటిది. అదే విరిగితే అతని జీవితమే దారి మారి దూరంగా విసిరివేయబడుతుంది."

"ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?"

"నువ్వు చేయగలిగిందీ, చేయవలసినదీ ఒక్కటే. ఎన్నడైనా, ఎక్కడైనా వాడు కనిపిస్తే క్షమాభిక్ష నర్థించి వీలైతే దేనికోసం వాడు ఆ పరిస్థితికి వచ్చాడో ఆ ప్రేమను అతనికి ప్రసాదించి, అతనికి అంకితమై పోయి, అతని సేవలో నీ జీవితాన్ని గడుపు. అప్పటికి నీ పాపానికి ప్రాయశ్చిత్తం అవుతుంది. అలా చేయగలిగే మనస్థైర్యం, ఆత్మార్పణ చేయగలిగే ధైర్యం నీలో ఉందో లేదో నాకు తెలియదు. కానీ అలా చేయకపోతే నీ జీవితాంతం కుమిలి ఏడ్చినా నీకు శాంతి దొరకదు" అని అక్కడినుండి తిరిగిచూడకుండా వెళ్ళిపోయాడు.

* * *

"ఏమే రజియా! ఈ మధ్య మా యింటివైపే రావడంలేదు" అడిగింది అరుణ.

"పోనీ నేను రాలేదనుకో. నువ్వు మా యింటికి రావచ్చుగా?" జవాబు చెప్పింది రజియా.

"అదికాదే, మా అన్నయ్యకు ఎప్పుడూ నీ కలవరింతలేననుకో. మీరేమైనా పోట్లాడుకున్నారా అని ఒకే పోరు."

"నువ్వేం చెప్పావు?"

"ఇప్పుడావిడగారు మనల్ని మరిచిపోయిందిలేరా అన్నయ్యా! అని చెప్పాను."

"మరిచిపోవడమంటే అంత తేలికేమే! ఇంకోసారి అలాంటి మాటలన్నావంటే తంతాను."

"అహఁ, మరిచిపోలేదనుకో. మీవారితో తిరుగుతూంటే మే మెక్కడ జ్ఞాపకానికొస్తామా అని."

"ఏయ్, ప్రతీసారీ ఇలాటి మాటలు మాట్లాడావంటే అసలు నీతో మాట్లాడను" సిగ్గుతో చెప్పింది రజియా.

"నాతో మాట్లాడకుంటే పోనీలే. ఒకసారి మా యింటికొచ్చి మా అన్నయ్యకు కనపడి పోదువుగానీ రా. లేకుంటే నా ప్రాణాలు తీస్తాడు."

"అలాగే పద" అంది రజియా వల్లెవాటు సరిచేసుకుంటూ.

"ఏమిటో దారి తప్పి వచ్చినట్లున్నావే రజియా?" అడిగాడు ఆనంద్.

"లేదు, దారి తెలుసుకునే వచ్చాను."

"అయితే మమ్మల్ని మరిచిపోయావా?"

"అదేంకాదు. మా యింటిదగ్గరే ఒక స్నేహితుడు దొరికాడు."

"క్రొత్తస్నేహితులు తోడైతే పాతవారిని వదిలెయ్యడమేనా మీ ఆడవారి పని?"

"ఛ ఛ! రోజూ ఇంతదూరం రావాలంటే కష్టంగా ఉంది. పోనీ, మీరే మా యింటికి రాకూడదూ?"

"తప్పకుండా."

ఇంతలో అరుణ కాఫీ తీసుకు వచ్చింది. ఆనంద్ కాఫీ త్రాగుతూ కళ్ళతో రజియా అందాన్ని త్రాగేస్తున్నాడు. అదేమీ గమనించలేదు రజియా.

ఆకర్షణ ప్రతిప్రాణికీ ఉంటుంది. మనిషికీ, మనిషికీ ఆకర్షణ ఎక్కువ. కొందరి హృదయాలు కొందరిని చూచి ఆకర్షించుకొంటాయి. దానినుండి తప్పించుకోలేరు వారు. ఎదుటివారికున్న శక్తి అటువంటి దేమో? మరీ వారికి పరిచయం ఏర్పడితే అది విడిపడరాని బంధంగా తయారవుతుంది. ఆ పరిచయం ఎంతటి పరిణామాలకు దారి తీస్తుందో చెప్పలేము. ఆ పరిచయమే జీవితానికి సౌఖ్యాన్ని ఆపాదించవచ్చు లేక నిరంతర దుఃఖాన్ని ఇవ్వవచ్చు. కానీ ఆ ఆకర్షణకు లొంగి వారు దగ్గరవుతున్నకొద్దీ, వారు అంతులేని ఆనందాన్ని అనుభవిస్తారు. ఊహాలోకాల్లో తేలిపోతారు. క్రొత్తశక్తులను, క్రొత్తఉత్సాహాన్నీ పొంది ఇతరులు చూసి ఈర్ష్యపడే సుఖసౌఖ్యాలను, భోగభాగ్యాలను తమవిగా చేసుకొంటారు. స్వర్గానికి పోకుండానే భూలోకంలోనే స్వర్గసౌఖ్యాన్ని చవి చూడగలుగుతారు. తమచుట్టూ ఒక దివ్యతేజస్సును నిర్మించుకొని, చూచేవారు ఆరాధించేలాగా ప్రకాశిస్తారు. తమ జీవితాలను అతి సౌఖ్యవంతంగా మార్చుకోగలిగే శక్తి వారికి ఉంది. నిజమా, కాదా తెలుసుకోవాలి.

రజియా, రాజ్‌ల స్నేహం దినదినాభివృద్ధి చెందుతూంది. రాజ్ తనకు తెలియకుండానే ఆమెతో కాలం గడుపుతున్నాడు. ఒకరిని చూడకుండా మరొకరు ఉండలేకపోతున్నారు. ఎవరికివారు నిత్యనూతన సంతోషంతో మెలగుతున్నారు. తమ ఆనందాన్ని మరొకరికి పంచిపెట్టి తృప్తి పడుతున్నారు. స్నేహం స్నేహంగానే ఉంది.

అందరికీ అటువంటి జీవితం లభ్యమవుతుందా? కాదు. అదే లభించిననాడు ఈ చింతా చీకులూ, కష్టమూ, దుఃఖమూ, బాధా వీటికి తావుండదు. అలాంటి నిర్మల స్నేహం, స్వాతంత్ర్యం, ఆనందం పొందిననాడు మానవుడికి స్వర్గంతో పని ఏముంది?

రజియా అప్పుడప్పుడూ ఏదోకోరిక తెలియచెయ్యాలని ప్రయత్నిస్తుంది. కాని, దాని పర్యవసానం ఏమవుతుందోనని భయపడేది. రాజ్‌మాత్రం ఏ ఆలోచనలకూ, కోరికలకూ అవకాశమివ్వకుండా ఆమె సాంగత్యంలో క్రొత్త క్రొత్త ఆనందాల్ని అనుభవిస్తున్నాడు. ఎన్నడూ ఎరుగని హుషారు, జీవితమంటే ప్రేమ కలుగుతున్నాయి. ఇన్నాళ్ళూ

సౌఖ్యం, ఆనందంఅంటే ఏమిటో ఎరుగని ఆతనిమనసు ఇప్పుడిప్పుడే వాటిని అందుకొంటూంది.

ఒకనాడు "రాజ్, నీతో ఒకవిషయం చెప్పాలనివుంది" అంది రజియా.

"ఏమిటో చెప్పు, రజియా" అన్నాడు రాజ్ చుట్టూ చూస్తూ.

"దీని పర్యవసానం ఏమైనా సరే మన ఈ స్నేహం విడిపో గూడదని నా ప్రార్థన."

"అలాగేలే, రజియా. ఏమిటో చెప్పు."

"బహుశా నీకు జ్ఞాపకముంటుందనుకొంటాను. ఆనాడు నేను నా హృదయాన్ని ఒకరి కర్పించానని చెప్పాను. ఇప్పుడు అతనెవరో చూపిస్తాను. నువ్వు సహాయం చెయ్యాలి."

"తప్పకుండా చేస్తాను"అని రాజ్ ఎవరైనా ఉన్నారా అని చుట్టూ చూశాడు.

నవ్వింది రజియా.

"నువ్వు కళ్ళుమూసుకో. అతన్ని నీ ముందుకు తెస్తాను."

అలాగే చేశాడు రాజ్.

"ఇక కళ్ళు తెరు" అనగానే రాజ్ కళ్లు తెరిచాడు. తనగడ్డంక్రింద రజియా దోసిలిలోఉన్న నీటిలో తనమొహం కనిపించింది. అర్థం చేసుకొన్నాడు.

"రజియా!" అన్నాడు మెల్లిగా.

"అర్థమైందా, నా ఆరాధ్యదేవత ఎవరో" అంది రజియా తన ఆనందాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ.

ఏమీ మాటాడకుండా తల వాల్చేశాడు.

"ఏం, రాజ్, నేను నీకు తగనా?" నీళ్ళవతల పారేసి అడిగింది రజియా ఆశ్చర్యంగా.

"ఇటువంటి విషమపరిస్థితి వస్తుందని ఊహించలేకపోయాను, రజియా! అనుకోని విషమసమస్య తెచ్చిపెట్టావు."

బాధతో బొంగురుపోయింది దతనికంఠం.

"ఇందులో సమస్య ఏముంది, రాజ్? నేను కలలు కంటున్న శుభదినం వచ్చింది. అది నిన్ను బాధిస్తే నా తప్పే అవుతుంది."

గుండె దడదడలాడుతుండగా చెప్పింది రజియా. అతని వాలకం చూస్తుంటే ఇష్టంలేనట్లే ఉంది. "కరుణించు, భగవాన్!" అనుకొంది మనసులో.

"ఇది బాధో లేక ఆందోళనో అర్థంకావడంలేదు. నా మనసెప్పుడూ ఈ విషయంగురించి ఊహించి వుండలేదు. అసలు మన పరిచయం ప్రేమకు దారితీస్తుందని ఊహించి ఉంటే దాన్ని మధ్యలోనే త్రుంచేసే వాడిని."

"రాజ్!" ఆత్రుతగా అంది రజియా.

"క్షమించు, రజియా. నా చనువును నువ్వు అపార్థంచేసుకొని వుంటే నేను అందుకు బాధ్యుణ్ణి కాలేను."

"ఇన్నాళ్ళూ నాతో వుండి నన్ను అర్థంచేసుకొన్నదిదేనా రాజ్! నా ఆరాధన నిరాకరిస్తావా?" వస్తున్న దుఃఖాన్ని ఆపుకొంటూ అడిగింది రజియా.

"నిన్ను నిరాకరించాలనిగానీ, స్వీకరించాలనిగానీ నేను ఎన్నడూ అనుకోలేదు, రజియా! కానీ నే భయపడుతున్నది ఒకేవిషయం. నా జీవితం విచిత్రమైన గతుకులతో నిండివుంది. నాకు తెలిసివున్నంతవరకు తల్లిప్రేమకానీ, తండ్రిప్రేమకానీ ఎరుగను. పరాయివారి ఆధారంతో బతుకును ఈడ్చుకొస్తున్నాను. నాదంటూ, నావారంటూ లేరు ఈ విశాల ప్రపంచంలో. అటువంటి ఈ బికారిని నీలాంటివారు నమ్ముకొని ప్రయోజనం లేదు. నన్ను ఆరాధించి ఏం పొందగలవు?"

"నాకు నీ అనురాగముంటే చాలు, రాజ్! ఈ జీవితంలో నాకింకేమీ వద్దు."

"రజియా! ఆ ప్రేమ జీవితాన్ని తలుచుకొంటే భయమేస్తుంది. జీవితంలో నా కాళ్ళపై నేను నిలబడేవరకు ఈ ప్రేమ, పెళ్ళి, వీటి దరి దాపులకు పోకూడదనుకొన్నాను. ఈనాడు నీ కోరికతో నా నిశ్చయం హఠాత్తుగా మారిపోతోంది. అది ఎటువంటి అనర్థాలకు దారితీస్తుందోనని భయపడుతున్నాను. నీ మనసు నొప్పించలేను."

"నేను నీ పిలుపుకొరకు వేచి వుంటాను, రాజ్! అంతవరకు నిన్ను నా హృదయంలో దాచుకొని ఆరాధిస్తుంటాను. అనుమతివ్వు."

"రజియా! నన్ను ఇలా బాధించడం న్యాయంకాదు."

"కాదు, రాజ్! నా ప్రార్థన అంగీకరించు. లేకుంటే ఈ బ్రతుకే నిరర్థకం" అంటూ చేతులు జోడించింది.

అదే దీనత్వం; అదే ప్రార్థన. ఎందుకీ ఆవేదన ఆడవారిలో? ఆ ప్రార్థనలో వసంతరూపం క్షీణంగా కనబడింది.ఆనాడు నీలో హృదయం లేదు, ఈనాడైనా ఈ దీనురాలికోరిక మన్నించు అని ఎవరో ఆజ్ఞాపించినట్లయి ఉలిక్కిపడ్డాడు రాజ్.

"రజీ, అటువంటి మాటలనకు. నీ యిష్టప్రకారమే కానివ్వు" అని ఆమెచేతులను తనచేతులలోకి తీసుకొన్నాడు.

"రాజ్" అంటూ అతని భుజంమీద వాలిపోయింది రజియా.

తేలికపడ్డాయి ఆ రెండు హృదయాలూ. అంతకుమునుపుకన్నా రెట్టింపయిన ఉత్సాహం వారిలో వుంది. వారి ఆనందం రంగులుమార్చుకొంది. ప్రేమ వారిని మరింత గట్టిగా బంధించింది. అందరికీ లభ్యం కాని, దూరమైన పవిత్రప్రేమ. ఏమిటో అందులోని ఆనందం, అందులోని సౌఖ్యం, అందులోని తృప్తి అనుభవించినవారికే తెలియాలి.

ప్రారంచెపుతూ జేబురుమాలుతో చెమట తుడుచుకొంటున్న భానుమూర్తిని రెప్పవేయకుండా చూస్తూంది వసంత. అనర్గళంగా సాగిపోతున్న అతని ఉపన్యాసాన్ని విద్యార్థులంతా అతిశ్రద్ధగా వింటున్నారు. అందరికీ అతడంటే గౌరవమూ, భక్తీ, భయమూ అలవడ్డాయి. ఆ క్లాసుకు అందరూ హాజరయి చక్కగా చదువుకొని వస్తుంటారు.లేకుంటే ప్రశ్నలువేసి మెత్తగా చీవాట్లు పెడతాడని భయం.

చెప్పడం ముగించి "అందరికీ అర్థమయిందనుకొంటాను" అన్నాడు క్లాసంతా కలయజూచి.

ఎవ్వరూ పలుకలేదు కానీ కొన్నితలలు అయిందన్నట్లు అటూ యిటూ ఊగాయి.

"ఏమైనా సందేహముంటే లేచి అడుగవచ్చు."

వసంత మెల్లిగా లేచింది.

"యస్. వాట్ ఈజ్ యువర్ డౌట్ ప్లీజ్?" అడిగాడు భానుమూర్తి ఉత్సాహంగా.

"ఈ పోయమ్ అర్థంకాలేదు సార్" అని ఒకపద్యం చెప్పింది.

భానుమూర్తి ఆ పద్యాన్ని మరోసారి చెప్పి "ఇప్పుడు మీ సందేహం తీరిపోయిందనుకుంటాను" అన్నాడు.

"పూర్తిగా కాలేదు" అంది వసంత.

"మీ ఒక్కరికోసం టైమ్‌వేస్ట్ చెయ్యలేను. ఆ తర్వాత వచ్చి స్టాఫ్‌రూమ్‌లో కలుసుకోండి. చెప్తాను."

అలాగేనంటూ చిన్నగా నవ్వుకొంటూ కూర్చుంది వసంత. టైమ్ చూసుకొన్నాడు భానుమూర్తి. ఇంకా పది నిమిషాలు వుంది. అంతకు ముందురోజు జరిగిన పాఠంలో కొన్ని ప్రశ్నలు వేశాడు.

మొదటిసారిగా వసంతను అడిగాడు. ఏమీ చెప్పలేకపోయింది. "కాలేజీకివచ్చింది చదువుకోవడానికిగాని లెక్చరర్లను ఎగతాళి చెయ్యడానికి,వారి కాలాన్ని వృథా చెయ్యడానికి కాదని తెలుసుకొంటే మంచిది. కూర్చోండి" అని "నెక్ట్స్" అన్నాడు.

వసంత అవమానంతో తల ఎత్తలేకపోయింది. నీ పని పడతాలే అనుకొంది మనసులో.

సాయంకాలం లాస్టు పీరియడు క్లాసు ఎగురగొట్టి స్టాఫ్‌రూమ్‌కు పోయింది వసంత. భానుమూర్తి ఒక్కడే కూర్చొని ఏదో పత్రిక చదువుకొంటున్నాడు. ఆమెను చూసి అది ప్రక్కనపెట్టి కుర్చీ చూపించాడు. ఆ సమయంలో అక్కడ మిగతా లెక్చరర్లు ఎవ్వరూలేరు.

"మీ కే పాఠం అర్థంకాలేదో చెప్పండి."

వసంత పుస్తకం తీసింది.

ఇంతలో ప్యూన్‌వచ్చి "సార్, మిమ్మల్ని ఇంగ్లీషు హెడ్ అఫ్ ది డిపార్టుమెంటువారు పిలుస్తున్నారు" అన్నాడు.

భానుమూర్తి ఏంచేస్తామన్నట్లు చూశాడు.

"సరే, మీరు వెళ్ళిరండి. నేను రాత్రికి మీ గదికి వస్తాను. అప్పుడు చెపుదురుగానీ" అని లేచింది.

భోజనం చేసుకుని వసంత భానుమూర్తిగదికి పోయింది. భానుమూర్తి అవివాహితుడు. గది అద్దెకు తీసుకొని ఉంటున్నాడు. వసంత గదిలో అడుగుపెట్టేప్పటికి భానుమూర్తి వాలుకుర్చీలో పడుకొని కళ్ళు మూసుకొని ఉన్నాడు. వసంత తన రాక సూచిస్తూ పొడిగా దగ్గింది.

"ఓ వసంతా! రావేమో ననుకున్నాను. అలా కుర్చీ తెచ్చేసుకుని కూర్చో" అన్నాడు.

వసంత చిరునవ్వులు ఒలకబోస్తూ అతనికెదురుగా కుర్చీలో కూర్చుంది.

వసంత అతనిచేత అర్థంకాలేదంటూ చాలపాఠాలు చెప్పించుకొంది. అతడు చెపుతున్నంతసేపూ అతనిమొహాన్ని చూస్తూకూర్చొంది. పాఠాలు విందో లేదో ఆ దేవుడికే తెలియాలి.

ఒకగంట అయినతర్వాత "ఇక వెళ్తాను" అని లేచి మరికొంచెం సేపు కూర్చొమ్మంటాడేమోనని నిలబడింది. ఆ వెలుగులో భానుమూర్తి ఆమె అందాన్ని పరీక్షించాడు. జిగేలుమనిపించే ఆ సౌందర్యాన్ని తాకాలనిపించింది.

అంతే. మరుక్షణంలోనే ఆమె అతనికౌగిట్లో ఇమిడిపోయి పెనుగులాడసాగింది. తనివితీరా ఆమె అధరాలను ముద్దుపెట్టుకొని ఆమెను వదిలేసిన అతనిచెంప ఛెళ్ళుమంది.

ఆ దెబ్బ అతనిలో అణిగిఉన్న పౌరుషాన్ని, మగతనాన్ని పురికొల్పింది. ఫలితం అతని బలమైన చేతులనుండి తప్పించుకోలేక మెలికలు తిరిగింది వసంత. కొంతసేపటివరకు వారికి కాలగమనం తెలియలేదు.

తమాషా అనుకొన్న అవకాశం ఆవేశాన్ని కలుగజేసింది. ఆ ఆవేశం అనర్థాన్ని తెచ్చింది. ఆ అనర్థంవల్ల వచ్చిన నష్టమేమీ వుండదు. కానీ మనసు అద్దంవంటిది. ఆఅనర్థం మాయని మచ్చలా మిగిలిపోతుంది.

అనుకోకుంటే ఏమీ జరుగనట్లే ఉంటుంది. అదే తమాషా అయిన ఆ అనుభవం. ఆ అనుభవంకోసమే లేనిపోని అనర్థాలు, మనస్పర్థలు, కలతలు. ఎవరికీ ఏ నష్టం కలుగచేయదంటూనే గొప్ప నష్టాన్ని,విఘాతాన్ని సృష్టించే ఆ అనుభవ మాహాత్మ్యం చాల గొప్పది.

భానుమూర్తి పువ్వునుండి బయటపడ్డ తుమ్మెదవలె లేచి నిలబడ్డాడు. వసంత మితిమీరిన కోపంతో దుఃఖంతో అక్కడినుండి లేవలేకపోయింది. ఆమె ఏడుస్తుండడం చూసి భానుమూర్తి సిగ్గుపడ్డాడు.

"క్షమించు, వసంతా! ఆవేశంలో నే నేం చేశానో నాకే తెలియదు" అన్నాడు తల వంచుకొని.

ఖస్సుమంటూ లేచింది వసంత. "సిగ్గులేక చేసినదానికి మళ్ళీ నిన్ను క్షమించాలా? నువ్వు మనిషివికాదు. పశువుకన్నా హీనంగా ప్రవర్తించావు. నా జీవితం ఏమౌతుందని ఈ అత్యాచారానికి ఒడిగట్టారు?"

"ఆవేశపడకు, వసంతా! నీ జీవితానికి ఎలాంటిఆపదా రానీను. నిన్ను పెళ్ళిచేసుకొంటాను. నన్ను నమ్ము."

"నీ మొహానికి అదొక్కటి తక్కువ. నీలాంటివారిని పెళ్ళి చేసుకోవడంకన్నా చచ్చేదిమేలు. ఇంకెప్పుడూ నాకు మీ మొహాన్ని చూపించకండి. అలా జరిగితే ఏం జరుగుతుందో చెప్పలేను. జాగ్రత్త అని కోపం వచ్చినా ఏం చేయలేక అక్కడినుండి వెళ్ళిపోయింది.

"పిక్చర్‌కు పోదాం పద, రాజ్" అంటూ రజియా అతనికి చేయి అందించింది.

రాజ్ తటపటాయించాడు. ఆమెతో పిక్చర్‌కు వెళ్ళడానికి తన దగ్గర డబ్బులు లేవు. తను సినిమాలు చూడడం ఏ సంక్రాంతికో లేక దీపావళికో. తన పరిస్థితి అలాంటిది. జల్సాగా ఖర్చుపెట్టడానికి తన దగ్గర డబ్బులు వుండవు.

"ఏమిటి, రాజ్, ఆలోచిస్తున్నావు?"

"రేపు వెళదాంలే, రజీ." తప్పించుకోజూచాడు.

"ఛో అన్నయ్యా! నీ కెప్పుడూ తమాషాలే! అయినా నీ దగ్గర ఫీజు తీసుకొంటే నాకు పాపం చుట్టుకోదూ?"

"ఎందుకమ్మా? స్వంత అన్నయ్యలదగ్గర, స్వంత చెల్లెళ్ళదగ్గర ఖండితంగా ఫీజు పుచ్చుకుంటున్నారు. ఇక నేను నీకుపరాయివాడినేగదా!"

"వాళ్ళకు బుద్ధిలేదు. నువ్వు అలాంటిమాటలు మాట్లాడితే నాకు కోపమొస్తుంది."

"నీకు కోపమొస్తేనేగా నాకు ఉత్సాహ మొచ్చేది?"

"నిజం చెప్తున్నానన్నయ్యా! నాకు స్వంతఅన్నయ్యవున్నా నీ దగ్గరనుండి పొందే ఆప్యాయత, ఆదరాభిమానాలు, ప్రేమ అతనివద్ద నుండి లభించేవి కావేమో!"

"నువ్వూ నాకు చెల్లెలు లేనిలోటు తీరుస్తున్నావు, సుగుణా! నీ మేలు మరిచిపోలేను."

సుగుణ అతని ఒడిలో తలపెట్టి, "చిన్నప్పుడు ఎవ్వరూ తోబుట్టువులు లేరని నాలేతహృదయం ఎంతగానో బాధపడేది. అందరిలా నాకూ ఒక అన్నయ్యగానీ, తమ్ముడుగానీ ఉండివుంటే వాడితో ఆడు కొంటూ భ్రాతృప్రేమ అంటే ఏమిటో తెలుసుకొనేదాన్ని. మా తర గతిలో ఎప్పుడైనా అక్కా, తమ్ముడూ గిల్లికజ్జాలు పెట్టుకొని ఆడుకొని ఆనందిస్తూంటే ఆ అదృష్టాన్ని నాకు ప్రసాదించలేదని ఏడిచేదాన్ని. ఆ అమాయకపు ఆనందాన్ని తిరిగి ఈనాడు నీనుండి పొంది ఆ బాధను మరిచిపోగలుగుతున్నాను."

"సుగుణా! నావారంటూ లేని ఈ ప్రపంచంలో ఒక సహోదరీ ప్రేమను నీనుండి పొందగలిగి ఎంతగా ఉప్పొంగిపోయానో తెలుసా? ఏ జన్మలో మనిద్దరికీ ఉన్న బంధాన్ని తిరిగి ఇలా కలిపాడో భగ వంతుడు!"

"అన్నయ్యా, నా కివ్వేళ అంతులేని ఆనందం కలుగుతూంది. ఇలా నీతో మనసువిప్పి మాటాడుతుంటే నా చిన్నారిమనసు ఏదో ఆనందలోకాలలో విహరిస్తోంది. సంతోషం కట్టలు తెంచుకొని ప్రవ హిస్తోంది. ఈ ఆనందాన్ని నా కెప్పుడూ ప్రసాదించన్నయ్యా?"

"అలాగేనమ్మా!" అంటూ రాజ్ ఆమె తల నిమిరాడు.

"మరి నువ్వు ఒక్కడివే కాదు. నీ స్నేహితురాలు రజియాను కూడ తీసుకురావాలి."

"ఆవిడ వస్తుందో రాదో నేనెలా చెప్పగలను?"

"ఉత్త అమాయకుడులా మాట్లాడకన్నయ్యా! నీతో అంత స్నేహంగా ఉన్నవాళ్ళెవరూ నీ కోరిక నిరాకరించరని నాకు తెలుసు."

"ఊఁ. అయితే నన్ను గురించి బాగా తెలుసుకున్నావన్నమాట!"

"ఆహా. కంఠోపాఠం చేసినట్లుగా తెలుసుకొన్నాను."

"కంఠోపాఠం చెయ్యవలసింది నన్ను కాదు. నీ పాఠాలను."

"అలాగే" అని లోపలికి తుర్రుమంది సుగుణ.

సంతృప్తిగా నవ్వుకొని రాజ్ పెట్టెలోనుండి ఒక చొక్కా తీశాడు. అది చిరుగుపడింది. అదిచూసి తన జీవితంపైనే నవ్వొచ్చింది రాజ్‌కు. సూదీ దారం తీసుకొని దాన్ని కుట్టబోయేంతలో సుగుణ వస్తున్న చప్పుడు వినిపించగా ఆ చొక్కాను దూరంగావున్న దండెం పైకి విసిరేశాడు. అది క్రిందపడిపోయింది.

సుగుణ చేతిలో ఉన్న టిఫిన్, కాఫీ క్రిందపెట్టి. "ఊఁ, త్వరగా టిఫిన్ ముగించన్నయ్యా! కాఫీ చల్లారిపోతుంది" అంది.

"సుగుణా, నీ కెందుకీ శ్రమంతా చెప్పు?"

"శ్రమాలేదు, గిమాలేదు. ముందు తినమంటుంటే?" ఆజ్ఞాపించింది.

"ఇదంతా నే తినలేను. కొస్త సాయం చెయ్యి."

"ఆ పప్పులేం ఉడకవు. అంతా తినెయ్యవలసిందే!"

"నువ్వు తినకుంటే పోనీ నాకు తినిపించవూ?"

"ఎందుకనీ? నువ్వేం బుజ్జిపాపవా?"

"అవును, సుగుణా. ఇవ్వేళ నువ్వు తినిపించాలి, నే తినాలి. అంతే."

"అబ్బ! నీతో పెద్ద చిక్కొచ్చింది. సరే, కూర్చో" అంటూ వస్తున్న నవ్వు నాపుకొంటూ అతనిప్రక్కనే కూర్చొంది.

ఇడ్లీముక్క అతనినోట్లో పెట్టింది. రాజ్ మెల్లిగా ఆ వేలు కొరికాడు.

"అబ్బ!" అని "ఇలా చేశావంటే నే నసలు మాట్లాడను పో" అని అలిగింది.

"ఛీ, ఛీ! ఇడ్లీ ఏంబాగులేదు. ఉప్పగా ఉంది" అన్నాడు విసుగు మొహంపెట్టి.

అలుగంతా ఎగిరిపోయి ఆశ్చర్యపోయింది సుగుణ. "అదేమిటన్నయ్యా, అమ్మచేతివంటకు పేరు పెడతావు?"

"కావలిస్తే తిని చూడు."

"బాగుందే" అంది సుగుణ రుచిచూసి.

"అలాకాదు. ఆ పచ్చడితో తిను."

అలాగే చేసింది సుగుణ. "విశేషంగా ఉందే! దీనికేం?" అంది అర్థంకాక.

"అదీవరస! అలాగే ఈ కాస్తకూడా నోట్లో పెట్టుకో" అని రాజ్, సుగుణనోట్లో ఇడ్లీ కుక్కాడు.

జరిగినమోసం గ్రహించి ఏదో అనబోయిన సుగుణ ఇడ్లీ నోటి కడ్డుపడగా ఊరుకొంది.

రాజ్ ఏమీ జరగనట్లు పైకిచూస్తూ తినసాగాడు. అతనితోపాటు సుగుణా తినసాగింది.

అదిచూచి "ఏయ్, దొంగపిల్లా! అప్పుడు వద్దన్నావే, ఇప్పుడు భాగానికి ఎందుకొచ్చావు?" అన్నాడు.

"నా యిష్టం" అంది పైకప్పుకేసిచూస్తూ. "కాఫీకూడా చిన్నపిల్లలకు పట్టినట్లు పట్టనా?" కొంటెగా అడిగింది.

"అంత అదృష్టమా! ఆ పనిచేస్తే నాకు శ్రమ తగ్గినట్లుంటుంది."

"అబ్బ! ఎంత ఆశ" అంటూ కాఫీగ్లాసు అతని కందించింది.

"ఊహూఁ!" అన్నాడు.

"ఏమిటి?"

"మామూలే. ఫిఫీ, ఫిఫీ!"

నవ్వుకొని అలాగే చేసింది.

"సుగుణా, వచ్చేజన్మలో నీ కడుపున పుట్టి ఆ కోరిక తీర్చుకోవాల నుందమ్మా" అన్నాడు రాజ్.

"ఛీ, పో! అన్నయ్యా" అని లేచి క్రిందపడివున్న చొక్కాను చేతికి తీసికొని చూసింది.

"ఏమిటన్నయ్యా ఇది?" అడిగింది కోపంగా.

"ఏమీలేదు, సుగుణా! షర్టు చినిగిపోయివుంటే........"

"నేనేం చచ్చిపోయాననుకున్నావా?"

"సుగుణా!" నోరుమూశాడు బాధగా రాజ్.

"మరి ఏమిటన్నయ్యా? నీ కెన్నిసార్లు చెప్పాను, ఇలా ఆడవారు చేయవలసిన పనులు చేయద్దని?"

రాజ్ మౌనం వహించాడు.

సుగుణ ఆ పని పూర్తి చేసింది.

ఆ చొక్కా తొడుక్కొని బయటపడ్డాడు రాజ్. తిన్నగా రజియా వాళ్లిల్లు చేరుకొన్నాడు.

"ఇంకాసేపట్లో నువ్వు రాకుంటే నేనే నీ గదికి వచ్చేద్దామను కున్నాను" అంది అతని కోసమే ఎదురుచూస్తున్న రజియా.

"అంతపనిమాత్రం చేయకు" అనుకొన్నాడు మనసులో రాజ్.

రజియా కాఫీ తీసుకువచ్చింది. దాన్ని త్రాగుతూ, "అరగంటలో రెండుకాఫీలు త్రాగితే అయిన విషమంతా కడుపులోనే పేరుకొంటుంది" అన్నాడు.

"ఏం? మీ చెల్లాయిగారు తన ముద్దుచేతులతో త్రాగించిందా?"

"అఁ మా చెల్లాయి తన ముద్దుచేతులతో అభిమానంతో త్రాగిస్తుంది. నువ్వు నీప్రియమైనచేతులతో ప్రేమగాత్రాగిస్తావు" అన్నాడు కోపం, నవ్వు మిశితమైనభావాలను వ్యక్తపరుస్తూ.

నవ్వును ఆపడానికి ప్రయత్నిస్తూ పైపెదవిని క్రిందిపళ్ళతో నొక్కిపట్టింది.

"ఎందుకు, రజీ, నవ్వుతున్నావు?"

"రాజ్, మనలో దాపరికాలెందుకు? నేను వెంటనుండగా నువ్వు ఏమీ ఖర్చుపెట్టడానికి వీల్లేదు. ఇంకా నీ దృష్టిలో నేను పరాయి దాన్నయితే నీ యిష్టం." అతని పరిస్థితి అర్థంచేసుకొని బాధగా అంది రజియా.

"అదికాదు, రజీ. పద పోదాం" అని ఆమెకు కష్టం కలిగించడం ఇష్టంలేక ఆమె చెయ్యిపట్టుకొని లేచాడు.

"మేనేజరు" అని బోర్డుఉన్నగదిలోనుండి సిగరెట్టు త్రాగుతూ గోపీ బయటికి వచ్చి బాల్కనీలోకి నడిచాడు. గేటువద్ద నిలబడి సినిమాకువచ్చిన వ్యక్తులనందరినీ చూశాడు. రంగురంగుల చీరెలు ధరించిన అందమైన ఆడవారితోను, పాలిష్ చేయబడిన తెల్లటి దుస్తులు ధరించిన పురుషులతోను చూడ ముచ్చటగాఉన్న ఆ దృశ్యాన్ని చూసి ఏదో తెలియని ఆనందం అతనిమనసు ఆవరించింది. వారిలో హోదాతో గంభీరంగా ఉండేవారు, ఆడంబరంగాను, నిరాడంబరంగాను ఉండేవారు ఉన్నారు. కాంతిలో తళుక్కుమని మెరిసే నెక్లేసులతోను, బంగారు వుంగరాలతోను క్రొత్త అందం అలరారుతూంది.

ఇంతలో ముగ్గురు స్త్రీలు వచ్చారు. గేటు కీపర్ వారి టికెట్లు చింపుతుండగా మరొకడు వారికి సీట్లు చూపుతున్నాడు. వారిలో ఒక అమ్మాయి అక్కడే నిలబడివున్న గోపీనిచూసి అక్కడే నిలబడి పోయింది. అప్రయత్నంగా ఆమెనుచూసిన గోపీ గతుక్కుమన్నాడు. అతనిగుండె దడదడలాడింది. ఆమెను చూసిచూడనట్లు తల మళ్ళించేశాడు.

ఇంతలో "లతా, ఏమిటలా నిలబడ్డావు?" అన్న మరొక గొంతు విని లత ముందుకు కదిలిపోయింది.

గోపీ అక్కడ ఎక్కువసేపు నిలబడలేకపోయాడు. వెనుదిరిగి పోబోయి ఎదురుగా వస్తున్న ఇద్దరువ్యక్తులను చూసి ఆశ్చర్యంగా కళ్లు నులుముకొని "రాజా" అన్నాడు మెల్లిగా.

అప్పుడే రజియాతో మాట్లాడుతూ నవ్వుతూ వస్తున్న రాజ్,

గోపీనిచూసి నివ్వెరపోయాడు. రాజ్‌నుచూసి సంతోషం వెల్లుబకగా కౌగలించుకొందామని ముందు కడుగేసి ప్రక్కనున్న రజియాను చూసి ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు. అదిచూసి మెల్లిగా నవ్వుకొంది మనసులోనే రజియా.

"ఒరే గోపీ, నువ్వు వూళ్లోనే ఉండి ఇన్నాళ్ళకట్రా కనబడ్డం?" కోపం తెచ్చుకుంటూ అడిగాడు రాజ్.

గోపీ సంతోషంతో ఏమీ మాట్లాడలేకపోయాడు. ఇంతలో రజియా ఇచ్చిన టికెట్లను గేటుకీపరు అలాగే చేతిలో పట్టుకొని గోపీ వైపు చూశాడు. గోపీ ఏదో సైగచేయగానే "అలాగే, సార్" అని అతడు క్రిందికి వెళ్ళిపోయాడు. అర్థంకాక రజియా అక్కడే నిలబడి పోయింది.

"ఏమిట్రా?" అన్నాడు రాజ్ అయోమయంగా.

"నోరు మూసుకొని నువ్వు పదరా" అని అతడిని లోపలికి తీసుకు పోతూ రజియాను చూసి "రండి" అన్నాడు.

అతన్ని అనుసరించారు వారు.

"నువ్విక్కడేం చేస్తున్నావురా? ఆనాడు మాయమై ఇప్పుడు కని పిస్తున్నావు? ఈ ఊళ్ళోనే ఉండే నన్ను మరిచావన్నమాట." సంతో షంగా గబగబా మాట్లాడేశాడు రాజ్.

ఇంతలో గేట్‌కీపర్ డబ్బులు తీసుకొచ్చి "సార్" అని గోపీ చేతికి యిచ్చాడు.

"అదేమిట్రా, డబ్బులు వాపస్ తెప్పించావు?" అయోమయంగా అడిగాడు రాజ్.

"ఒరేయ్, నీకు డబ్బులెక్కువగా ఉంటే ఆ తర్వాత నే తీసు కొంటానులే. మా థియేటర్‌కు నీ దగ్గర టికెట్టు తీసుకొనే అర్హతలేదు" అని రాజ్ చేతిలో ఆ డబ్బులు ఉంచాడు.

"సరే, నీ కథేమిటో చెప్పు ముందు."

"ఏముంది! డిస్మిస్ కాగానే యింటికివెళ్ళాను. మనసులో ఏమను కొన్నా పైకి ఏమీ అనలేదు మా నాన్న. ఏం జరిగిందో తెలియదు. ఆ

మరునాడే మా మామయ్య నన్ను ఇక్కడికి తీసుకొచ్చాడు. ప్రస్తుతం ఇక్కడ మేనేజరుగిరీ వెలగబెడుతున్నాను. ఈ థియేటరు మా మామయ్య దేలే. అంటే మనదే అనుకో. ఇంకెప్పుడైనా టికెట్ కొనుక్కొచ్చావా, అది లాక్కొని నిన్ను మెడబట్టి బయటికి గెంటిస్తాను. జాగ్రత్త!" క్లుప్తంగా ముగించాడు గోపీ.

ఆ కథ విని తేలికగా నిట్టూర్చాడు రాజ్.

ఆ తర్వాత గోపీని రజియాకు పరస్పరం పరిచయం చేశాడు.

తమముందే కూర్చొని అప్పుడప్పుడు తమవైపు చూస్తున్న లతను గుర్తుపట్టాడు రాజ్.

గోపీని మోచేత్తో పొడుస్తూ "ఏరా, నీ హేమకూడ వచ్చినట్లుందే!" అన్నాడు.

అవునని తలూపాడు గోపీ.

"ఆ తర్వాత ఎప్పుడైన ఆమెను కలుసుకొన్నావా?"

"ఇంతవరకు లేదు. అయినా నేను ఆమెను కానీ, ఆమె నన్ను గానీ కలుసుకోవలసిన అవసరమెందుకుంటుంది?"

"ఉంటుందిలే" అని పిక్చర్ చూడడంలో నిమగ్నుడయ్యాడు రాజ్.

"సార్, ఫోన్‌కాల్ వచ్చింది." గేటు కీపర్ గోపీతో చెప్పాడు.

"లేదనిచెప్పు పోవయ్యా" అనగానే అతడు వెళ్ళిపోయాడు. "ఎప్పుడూ ఏదో ఒక క్షణమన్నా విశ్రాంతిలేకుండా. ఈ బాధ్యతతో చస్తున్నాను." విసుక్కున్నాడు గోపీ.

"బాధ్యతను మరిచిపోగూడదురా. వెళ్ళి రా" అన్నాడు రాజ్ అతని విసుగుకు నవ్వుకొంటూ.

"నీతో ఇదొకగొడవ. అదెప్పుడూ ఉండేదేలే" అన్నాడు కోపంగా గోపీ.

కానీ అతనిచూపు చూసి విధిలేక అక్కడినుండి లేచి వెళ్ళిపోయాడు.

చిన్నగా నవ్వుకొని "రజీ" అన్నాడు.

"ఏమిటి, రాజ్" అడిగింది రజియా.

"మా గోపీని చూశావుకదూ? ఇక ఆ హేమలతను చూడు" అని లతను చూపించాడు.

"ఆమెలో ఏదో తీరనిబాధ గూడుకట్టుకొని ఉంది చూశావా, రాజ్!"

"చూశాను. కానీ పీడి విషయమే కాస్త చక్కగాఉంది. గంభీరంగా ఉన్నట్లుండే ఒక్కసారిగా బుడగలా ప్రేలిపోతాడు."

"ఇలా ప్రతిసినిమా హాల్లోనూ మేనేజరు మనవాడయితే ఖర్చు తగ్గుతుందికదూ, రాజ్!"

"అప్పుడే కూడబెట్టుకోవాలనే బుద్ధిపుట్టిందా? నువ్వు డాక్టరువై ప్రాక్టీసు పెట్టేంతవరకైనా ఓపికపట్టు."

తృప్తిగా నవ్వుకొన్నారు యిద్దరూ.

"అన్నయ్యా, రేపు మా స్కూల్ డే. నేను డ్యాన్స్ చేస్తాను. వస్తావుకదూ?" అడిగింది సుగుణ ముద్దుగా.

"అలాగేనమ్మా. తప్పకుండా వస్తాను. నువ్వు పిలిస్తే రాకుంటే మరెవ్వరు పిలిస్తే వస్తానమ్మా!" అన్నాడు రాజ్ ఆప్యాయంగా.

"సుగుణా!"

"ఏమిటన్నయ్యా?"

"మీ పరీక్ష లెప్పుడు?"

"ఇంకా రెండునెలలుపైగా ఉన్నాయన్నయ్యా."

"బాగా చదువుతున్నావుకదూ?"

"బాగానే చదువుతున్నానన్నయ్యా!"

"నువ్వు మంచిమార్కులు తెచ్చుకోవాలి. వైద్యం చదివి లేడీ డాక్టరువైనప్పుడు నేను నీ దగ్గరకే వస్తాను. అప్పుడు ఎంత ఫీజు తీసుకొంటావో చూడాలి."

"నీ కోపం చూసి."

"ఎందుకో జీవితంపై విసుగుపుడుతోంది రజీ" అని తన దుస్తుల వైపు చూసుకొన్నాడు.

"అప్పుడే విరాగివైపోతే ఎలా? జీవితమంటే ఎంత మధుర మైనదో చూపించే ఒక ఇంగ్లీషుపిక్చరు ఆడుతోంది. చూద్దాంపద."

అయిష్టం వ్యక్తపరిచాడు రాజ్.

"పోనీలే. నీకు కష్టం కలిగించేపని నా కిష్టంలేదు. పోనీ ఇక్కడే కేరమ్స్ ఆడదామా?"

"అలాగే."

"రాజన్నా!" కేకవేసింది రజియా.

"అమ్మా!" అంటూ నౌకరు వచ్చాడు.

"టేబుల్ వేసి కేరమ్‌బోర్డు పెట్టు."

ఆ పని చేయడానికి వెళ్ళిపోయాడు రాజన్న.

"మరి నాకు చేతకాదే, రజీ!"

"మనం పందెం వేయడం లేదుగా? చేతనైనంతవరకు ఆడు."

"పందెం లేకుంటే ఆట రక్తికట్టదే అని నా బాధ."

"అయితే నువ్వేచెప్పు. ఏం పందెం వేద్దాం?"

"నీ యిష్టం."

"నా సర్వస్వం నీ కర్పించాను. ఇంకా పణంగా ఏం పెట్ట మంటావు?"

"అబద్ధాలాడటం నేర్చుకున్నావు."

"అంటే?"

"ఏం లేదులే. ఆటాడదాంరా" అన్నాడు రాజ్.

అతని అభిప్రాయాన్ని అర్థంచేసుకొని సిగ్గుపడింది రజియా. 'అందుకు నీదే అభ్యంతరం" అంది ఆమె మనస్సు.

మొదట బొత్తిగా చేతకానివాడులా ఆడి ఆటగెలిచిన రాజ్‌ను ఆశ్చర్యంగా చూసి అతని నేర్పు, గురి మెచ్చుకోలేకుండా ఉండలేక పోయింది.

[9]

"ఓడిపోయాను. రాజ్. ఏం కావాలి?"

"నువ్వే" అన్నాడు రాజ్ చిలిపిగా.

"నే నేనాడో నీ కంకితమై పోయానుగా!"

"నిజమా" అన్నట్లు చూశాడు రాజ్. 'నా మాట నమ్మలేవా' అన్నట్లు బదులు చెప్పింది. అదే తృప్తి, ఆనందం, సౌఖ్యం నిలిచిపోతే బాగుంటుంది.

ఇంతలో ఖాన్‌గారు లోపలికి వచ్చారు. ఆయనగారివెంట మరో ఆవిడ ఉంది. ఆమె వయసులో నలభై మించినా అలంకరణలో, శరీర సౌష్ఠవంలో ముప్పైఏళ్ళ లోపుగానే ఉన్నట్లు కనిపిస్తుంది.

ఖాన్ ఆమెతో "సరూ, ఈ అమ్మాయి నా కూతురు రజియా. ఇతడు ఆమె ఫ్రెండ్ రాజశేఖరరావు" అని వారిని పరిచయం చేశాడు.

"నమస్తే" అన్నారిద్దరు ఆమెను పరికించి చూస్తూ.

"ఈవిడ నా బాల్యస్నేహితురాలు. సరోజినీదేవి. ఇక్కడ మహిళామండలి కార్యదర్శి" అని ఆమెను వారికి పరిచయం చేశాడు.

సరోజినీదేవి చిరునవ్వుతో "మిమ్మల్ని యింత ఆలస్యంగా కలుసుకుంటున్నందుకు చాల విచారిస్తున్నాను. ఎంచేతంటే ఈ ఊళ్లోనే ఉండి, ఖాన్, మిమ్మల్ని నాకు ఈదినం పరిచయం చేస్తున్నాడు. మరి మీరొకవైపు, మేము మరొకవైపు కేరమ్స్ ఆడదామా?" అంది.

తలలాడించారు రాజ్, రజియాలు.

ఖాన్‌లో ఉత్సాహం ఎక్కువగా ఉంది. అతనికళ్ళు దేన్నో వెతికి కనుగొన్నట్లు వెలుగుతున్నాయి. గంభీరత్వం మాయమై ఆనందం అలుముకొంది. అది గమనించింది రజియా. బహుశా బాల్యస్నేహితురాలిని కలుసుకొనగలిగినందుకు సంతోషిస్తున్నారనుకొని సరిపెట్టుకొంది.

ఆటలో ఖాన్ జట్టు ఓడిపోయారు.

"నువ్వు చాల బాగా ఆడతావబ్బాయ్" అంది సరోజినీదేవి.

సిగ్గుపడ్డాడు రాజ్.

"మరి బాబా! గేమ్ గెలిచినందుకు మాకేమిటి బహుమానం?" అంది రజియా.

ఖాన్‌గారు అయోమయంగా సరోజినివైపు చూశారు.

"ఏంకావాలో నువ్వే చెప్పమ్మా!" ఆప్యాయంగా అడిగిందామె.

ఆ అప్యాయతకు పులకరించిపోయింది రజియా. "మీ రిద్దరూ స్వయంగా కాఫీ కాచి తీసుకురావాలి."

నివ్వెరపోయారు ఖాన్‌గారు. తీక్షణంగా రజియాను చూశాడు రాజ్.

"సరే. పద సరూ. ఓడిపోయాంగా? చెప్పినట్లు చెయ్యాలి" అని ఖాన్‌గారు, సరోజినీదేవితో వంటగదికి పోయారు.

"రజీ, నీ ధోరణి నాకేం నచ్చలేదు" అన్నాడు రాజ్ కాస్త కోపంగానే.

"అదేమిటి, రాజ్, నేనేంచేశాను?" ఆశ్చర్యపోయింది రజియా.

"వాళ్ళిద్దరినీ అలా ఆజ్ఞాపించడంలో అర్థముందా? పెద్దవాళ్ళన్న మాట మరిచిపోయావా?"

"అదికాదు, రాజ్. నేనేదో తమాషాకన్నాను. అంతే."

"రజీ, మనదృష్టిలో అది తమాషాకావచ్చు. కానీ ఎన్నాళ్ళ తర్వాతనో మీ నాన్నగారికి అతిథిగా వచ్చిందావిడ. ఇంటికొచ్చిన అతిథిచేత పనులు చేయించడం నీకు తమాషా కాబోలు!"

"క్షమించు, రాజ్!"

"ఊఁ." అంటూ బాధగా మూలిగాడు రాజ్.

"ఖాన్, అమ్మాయి అసాధ్యురాలుగా వుందే! ఇంటికొచ్చిన అతిథికే పనులు పురమాయించింది" అంది సరోజిని నవ్వుతూ.

"రజియా ఏమీ తెలియనిపిల్ల. సరూ! తగినవయసూలేదు, అనుభవమూ లేదు. ఇంకా చాలా నేర్చుకోవాలి."

"కానీ, ఆ అబ్బాయిమాత్రం అందుకు బాధపడ్డాడు."

"అతడు చాల తెలివైనవాడు. కొన్ని విషయాల్లో మనకే బుద్ధి నేర్పగలిగే శక్తిగలవాడు. అందుకే అతని సాహచర్యంలో మారజియాను వదిలాను."

"సరేగాని, చక్కెర ఇలా అందుకో."

"ఏమిటీ ఆజ్ఞ?"

ఆ రెండుమాటలూ వారిలో ఏవో వారి పాత స్మృతులను జ్ఞాపకం తెప్పించి వారిమధ్య మౌనాన్ని తాండవింపజేశాయి.

కాఫీ తీసుకువచ్చి చెరొక కప్పూ ఇచ్చింది. రాజ్ ముళ్ళమీద కూర్చొనున్నట్లు బాధపడ్డాడు.

రజియా తల ఎత్తలేక "క్షమించండి. మీకు కష్టం కలిగించాను" అంది.

సరోజినీదేవి, రాజ్‌ని చూసింది. అంతవరకు రజియాను చూస్తున్న రాజ్ చటుక్కున తలవంచేసుకున్నాడు. జరిగినవిషయం అర్థంచేసుకొన్న సరోజినీదేవి నవ్వుకొంది. అది గ్రహించాడు రాజ్.

"ఫర్వాలేదమ్మా! నీకు తల్లిలాంటిదాన్ని. ఏంచేసినా తప్పులేదు."

రజియా ఉలిక్కిపడి ఆమె కళ్ళలోకి చూసింది. ప్రశాంత గంభీర వదనంతో మూర్తీభవించిన మాతృమూర్తిలా ఉన్న ఆమెనుచూసి రజియా మనస్సు అస్పష్టంగా స్పందించింది. ఆమె దర్శనమే తనకు ఏదో తెలియని, ఎరుగని తృప్తినిస్తూంది. వెదికివెదికి వేసారి పొందలేక పోయిన సుఖాన్ని తిరిగి పొందబోతున్నట్లు సూచిస్తూంది. సరోజినీదేవి తీరని ఆశతో అలమటించిపోతున్నదానిలా రజియాను తిలకిస్తూంది. క్రొత్త ఆశతో గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఖాన్‌గారు ఏదో అవాంతరం జరగనున్నట్లు భయపడిపోయారు.

కాఫీ త్రాగుతూ సరోజినీదేవి మాటలువిన్న రాజ్ ఆ మాటల వెనుకనున్న అర్థాన్ని బయటికి లాగాలని ప్రయత్నించి చూశాడు. ఆమె చూపులు, ఆత్రుత, తహతహ అతనికేదో సందేశాన్నిచ్చాయి.

"మీరు మాట్లాడుతూండండి" అని ఖాన్‌గారు, సరోజినీదేవిని పిలుచుకొని బయటికి వెళ్ళిపోయాడు. ఆమెను సాగనంపుతూ "సరూ, ప్రశాంతంగావున్న ఆ లేత హృదయాలను అనవసరంగా కలవరపెట్టడం బాగుండదు" అన్నాడు.

"అంతమాత్రం నాకు తెలియదా, ఖాన్?"

"అప్పుడప్పుడు వస్తూంటావు కదూ!"

"తప్పకుండా. అమ్మాయికోసమైనా వస్తుంటాను."

కారులో కూర్చొని అతని కళ్ళలోకి చూసింది సరోజినీదేవి. ఏ భావాలనూ కనుగొనలేకపోయింది. ఇప్పుడేకాదు, ఇంతకుముందు కూడా ఎప్పుడూ అదిచేతకాలేదు తనకు. నిట్టూర్చి ముందుకు సాగి పోయింది. ఏదో ఆలోచిస్తూ హాల్లో సోఫాలో చతికిలపడ్డాడు ఖాన్.

గదిలో రాజ్ రజియాల మనసులు ఆందోళనగా ఉన్నాయి. సరోజినీదేవి, వారికి కలలో కనిపించి అర్ధంకాని సందేశాన్నిచ్చి మాయమైన దేవతవలె ఉంది. ఒకరిలో కలవరాన్ని, మరొకరిలో అంతంలేని ఆలోచనలను లేపి సముద్రతరంగంలా మాయమైపోయింది.

కేవలం ఒకసారి చూడడంతోనే ఒకరు మనకు పూజితులవుతారు. వారికి, మనకు ఏదో తీరని సంబంధంవున్నట్లు అనుకొంటాం. ఆ ఆత్మీయత లేక అర్ధంకాని ఆవేదన ఎందుకో? మనదృష్టిలో కొందరు కారణం లేకుండానే గొప్పవారుగా కనబడతారు. ఆ గొప్పతనానికి అర్థం, ఆంతర్యం కనుగొన్నప్పుడు వారిమీద మనకు గౌరవం ఎక్కువవుతుంది.

"ఆమెను చూస్తుంటే విధికి బలికాబడ్డ దురదృష్టవంతురాలులా ఉంది, రజీ" అన్నాడు ఆలోచనలనుండి తేరుకొని రాజ్.

"ఆమెను చూసినప్పటినుండి నాలో ఏదో కలవరం బయలుదేరింది, రాజ్! నా హృదయం ఆవేదనాభరితమైపోయింది. ఆమె పలుకులు నాలో దాగివున్న ఏదో ప్రేమను మేలుకొలుపుతున్నాయి. ఆమె తల్లిలాంటిదాన్ని అన్నప్పుడు నా మనసు క్షణికానందానికి గురైంది. ఆమే మా అమ్మ అయివుంటే బాగుండునేమేననిపిస్తూంది."

"ఎంత ప్రయత్నించినా ఆమెనుకాని, మీ నాన్ననుగాని అర్థం చేసుకోలేకున్నాను. వారిహృదయపు లోతులను కనుగొనలేకున్నాను. కానీ మీ నాన్న గాంభీర్యంవెనుక దాగివున్న నిరాశా నిస్పృహలను పూర్తిగా పోగొట్టగలిగేశక్తి ఆమె కుందని గట్టిగా చెప్పగలను."

"అవును, రాజ్, నాకు తెలిసినప్పటినుండి మా నాన్నలో అధికారం, హుందా, గంభీరత్వము వీటినిమాత్రమే చూడగలిగాను. కానీ, నేడు ఆయనలో చలాకీతనము, ఉత్సాహం వెల్లివిరుస్తున్నాయి."

"ఆమెకు నీపట్ల దాచుకోలేని ప్రేమాభిమానాలున్నాయి. వాటిని ఎందుచేతనో బయటపెట్టలేకపోతోంది. కన్నతల్లి తనబిడ్డకు దూరమై పడే ఆవేదన, ఎన్నోసంవత్సరాల తర్వాత అనుకోని ఆనందాన్ని పొందబోతున్నట్లు సూచించే ఆ కన్నులలో ప్రేమ, కాంక్ష మెదులుతున్నాయి. నాఊహ పొరపాటుకూడా కావచ్చు. ఆమెకు నీ వయసులోని కూతురుండి ఆమెకు దూరమైపోయి కాని, లేక చనిపోయిఉండుంటేనో, ఆమెను నీలో చూచుకొని బాధపడుతూ తృప్తిపడుతోంది. బాధలో తృప్తినిపొందడం విచిత్రం కదూ!"

"ఏమో! ఆమెను ఇంకోసారి చూడాలనిపిస్తోంది. కనిపిస్తుందో లేదోనని భయంగావుంది."

"ఆమె అప్పుడప్పుడు మీ యింటికి తప్పక వస్తుంటుందని చెప్పగలను."

"అలా జరిగితే అది నిజంగా నా అదృష్టమే."

# 8

ఆది భానుమూర్తి క్లాసు. ఇంకా ఆయన రాలేదు. అతను క్లాసులోకి రాగానే తాను క్లాసునుండి వెళ్ళిపోవాలని నిశ్చయించుకొంది వసంత. ఒకవైపు ఆమెగుండె వేగంగా కొట్టుకుంటూంది. ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలోఉన్నా ఏదో చెయ్యాలని పంతం పట్టింది ఆమె మనస్సు.

రెండువిధాలా నష్టం ఆడువారికేనేమో? అందుకే వారిని అబలలు అన్నారు. మగవారి దౌర్జన్యాలకు లొంగిపోలేరు. వారిని ఎదిరించి అవమానాలపాలు కాలేరు. అఘాయిత్యానికి లోబడినా, లోబడక ఎదిరించినా, నలుగురిలో అనుమానాలు, నగుబాట్లు కాకతప్పదు. అనాదిగా సాగుతూ వస్తున్న ఈ రకపు జీవితానికి విముక్తి ఎప్పుడు? బహుశా లేదేమో! రెండువైపులా అతిపదునుగా ఉన్న కత్తిమీద సాముచేసే స్త్రీ జీవితంలో ఏ కొంచెం పొరపాటు జరిగినా అపాయాలకు గురికావలసివస్తుంది.

తప్పదు. ఆ అపాయాలను ఎదురుకొన్ననాడే అంతిమవిజయం లభిస్తుంది. అంత ధైర్యం, ఆత్మస్థయిర్యం అందరికీ అలవడవు. అసలు అనర్థాలుజరిగేందుకు అవకాశాన్నివ్వడమే ఒక పొరపాటు. ఆ అవకాశానికి లొంగిపోవడం మరొక పొరపాటు. లొంగినా సమాజాన్ని ఎదురించలేకపోవడం అంతకన్నా పెద్ద పొరపాటు.

క్లాసువిద్యార్థులంతా లేవడంతో పరధ్యానంగావున్న వసంత గాభరాగా లేచివచ్చిన లెక్చరర్‌ను చూసి ఆశ్చర్యపోయింది. విద్యార్థులంతా క్రొత్తలెక్చరర్‌గారిని చూసి తిరిగి కూర్చోవడం మరిచిపోయారు.

"సిట్ డౌన్" అన్నా డాయన.

కానీ ఎవ్వరూ కూర్చోలేదు.

ఇంకోసారి గట్టిగా అన్నా రాయన ఆశ్చర్యపోతూ.

అందరూ నిర్లిప్తంగా కూర్చున్నారు.

భానుమూర్తివస్తే ఎలా అని బాధపడుతున్న వసంత అతను రాకపోవడంతో చింతించింది.

"సార్, ఇది యింగ్లీషు పొయిట్రీ క్లాసు. మీది కాదు." లేచాడు ఒక విద్యార్థి.

"ఆ విషయం నాకు తెలుసు. పొయిట్రీకికూడ నన్నే వేశారు."

"భానుమూర్తిగా రెందుకు రారో చెప్పగలరా?"

"ఆ విషయం ఆయన్నే అడిగి తెలుసుకుంటే మంచిది."

"అలాగే. మీరు బయటికెళ్ళండి." అరిచిం దొక కంఠం.

"షటప్!" గద్దించాడు ఆ లెక్చరర్.

"అంటే?" రెట్టించిం దొక గొంతు.

ఆ విద్యార్థిని చూసినా ఏమనలేకపొయ్యా డాయన.

ఆయన పాఠం చెపుతుండగా ఎవ్వరూ సరిగ్గా వినలేకపోయారు. ఆసక్తిఉన్న కొందరు విద్యార్థులు ఆయనఉపన్యాసం విని తమ ఆసక్తి చంపుకొన్నారు. ఆఖరి బెంచీలలోనివారు చిన్న కునుకు తీయసాగారు. మరికొందరు డిటెక్టివ్ పుస్తకాలు చదువుకొంటుండగా, మరికొందరు బాతాఖానీ వేశారు. వసంతమెదడు ఆలోచనలతో వేడెక్కింది. కేవలం

తనన్న మాటకోసం ఇందరిని అన్యాయంచేస్తాడా అనిపించి ఆశ్చర్య పోయింది. తనే అతనిబదిలీకి కారకురాలని తెలిస్తే విద్యార్థులు ఊరు కుంటారా ?

"ఏయ్ మిస్టర్, బోత్ ఆఫ్ యు గెట్ అప్ !" అరిచాడు లెక్చ రర్ సహించలేక.

మూర్తి, రావు ఇద్దరూ లేచి నిలబడ్డారు. వారిద్దరూ వసంత సౌందర్యంగురించి మాట్లాడుకుంటున్నారు.

"పాఠం చెప్పేటప్పుడు మాట్లాడకూడదని తెలియదూ ?" కంఠ స్వరాన్ని హెచ్చిస్తూ అడిగాడు.

"ఇప్పుడు మీరు చెప్తున్నారు కాబట్టి ఇకమీదట తెలుసుకొం టాం." నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు రావు.

ఆ మాటతో లెక్చరర్‌గారికోపం తారస్థాయి నందుకుంది. కానీ ఏం చెయ్యగలడు పాపం ? చేయగలిగిందల్లా క్లాసునుండి తాను బయటికి వెళ్ళిపోవడమే. కానీ అంత చేతకానివాడు కాదు.

"యూ యూస్‌లెస్ ఫెల్లోస్. సిట్ డౌన్" అన్నాడు.

"సార్. మాటలు కాస్త మర్యాదగా రానిస్తే ఉభయులకూ మంచిది" అందించాడు మూర్తి.

"వాట్ ! నన్నే ఎదిరిస్తారా ? గెటవుట్। ఇంకెప్పుడూ నా క్లాసు లోకి రావద్దండి."

"థేంక్యూ సార్ !" అని వారిద్దరు పుస్తకాలు చంకనపెట్టి బయ టికి నడిచారు.

"ఇంకా ఎవరికైనా నా క్లాసులో ఉండటం ఇష్టంలేకుంటే నిర భ్యంతరంగా వెళ్ళిపోవచ్చు."

"ఇక్కడుంటే శః వాగుడు అడ్డంగా ఉంది. బయటికెళ్ళి మన పనులు చూచుకుందాం పదరా" అని డిటెక్టివులు చదివేవాళ్ళూ, బాతా ఖానీ వేసేవాళ్ళూకాక, ఆయన లెక్చరర్‌తో విసుగెత్తిన మరికొందరు విద్యార్థులూ లేచారు. వారినిచూసి నిద్రపోతున్నవారు గంట అయిందను కొని వారిని అనుసరించారు. మిగిలిన కొందరు అది చూచి గట్టిగా

నవ్వారు. ఆ దెబ్బతో ఆ లెక్చరర్‌గారు తిరిగి చూడకుండా వెళ్ళిపోయారు.

ఆ సాయంకాలం విద్యార్థులు కొందరు భానుమూర్తిదగ్గరకు వెళ్ళారు. కాలేజీనుండి గదికి వెళ్ళడానికి సిద్ధమవుతున్న భానుమూర్తి వారినిచూసి "ఏమిటీ, అంతా కట్టకట్టుకొని వచ్చారు ?" అన్నాడు చిరునవ్వుతో.

"సార్, మీరు మా క్లాసు తీసుకోకపోవడం కష్టంగా ఉంది."

"ఏంచెయ్యమంటావు, మిష్టర్ ప్రకాశం? నాకూ మీక్లాసు తీసుకోవాలంటే కష్టంగా ఉంది."

"మాలో ఏంతప్పుందో చెప్పండి సార్, దిద్దుకుంటాం."

"మీలో ఏం తప్పులేదు, మిస్టర్ భాస్కర్. మొదటిసారిగా నేను మీ క్లాసు తీసుకోవడం నాదే తప్పు."

"సార్, మీరలాగంటే మేం చాల బాధపడవలసివస్తుంది. ఇన్నాళ్ల తర్వాత మాకు గట్టెక్కగలమనే ధైర్యం చిక్కింది. ఇందరికి అన్యాయం చెయ్యడం మీకు న్యాయంకాదు."

"మిస్టర్ గోపాల్, నన్ను బలవంతం చేయకండి. ఇక మీ క్లాసు తీసుకోలేను. అంతే" అని అక్కడినుండి క్రిందికి వచ్చేశాడు భానుమూర్తి.

"సార్" అన్న శబ్దం వినిపించి గతుక్కుమని వెనుతిరగకుండా అక్కడే నిలబడ్డాడు.

"నామీదకోపంతో విద్యార్థులందరినీ కష్టపెట్టడం భావ్యంకాదు."

"నా కెవరిపైనా కోపంలేదు, మిస్ వసంతా!"

"అయితే కోరి ఎందుకు మార్పుచేయించుకొన్నారు?" అతని వెనుకగా కొద్దిదూరంలో నిలబడివున్న వసంత బాధగా ప్రశ్నించింది.

"అది నా స్వవిషయం." తిరిగి చూడలేక అలాగే చెప్పాడు.

" మీరలా మొండిగా వాదిస్తే మేం ఏమీ అనలేము. కానీ వారి బాధను కాస్త గుర్తిస్తే మంచిది."

"వారిబాధనే గుర్తించావు. మరి నా హృదయంలో రగులుతున్న ఈ చిచ్చును రగిలిస్తూ ఇలాగే ఉండమంటావా? దాన్ని ఆర్పేదెవరు?"

వసంత జవాబు చెప్పలేకపోయింది.

"వసంతా! మానవులు చాలమటుకు స్వార్థపరులు. ఈ నా బాధ నలాగే రగులనిచ్చి వారిబాధ తీర్చే శక్తి నాలో లేదు. అది నేర్చుకో లేదు. ఒకవేళ అలా చేసినా నేను నాహృదయాన్ని చంపుకొని పతనమై పోక తప్పదు. పిచ్చివాడుగా మారిపోతాను. నా గురించి ఏం ఫర్వాలేదు కానీ, మరొకరి జీవితం అనవసరంగా నవ్వులపాలు కావలసివస్తుంది. క్షమించు, నేను నా ఉద్దేశ్యాన్ని మార్చుకోలేను" అని వెళ్ళిపోయాడు.

క్లాసుకు వస్తున్న లత అప్పుడే ప్రొఫెసరుగారి గదిలోకిపోతున్న గోపీని చూసింది. ఆమెగుండె దడదడలాడింది. కుడికన్ను అదిరింది. అక్కడవున్న ప్యూన్‌ను పిలిచి అతడెక్కడికి వెడతాడో కనుక్కొని వెంటనే తనకుచెప్పమని వెయిటింగ్ రూమ్‌కు వెనుతిరిగింది.

లోపలికివచ్చిన గోపీనిచూసి ప్రొఫెసరుగారు ఎవరా అని తిక మకపడ్డాడు. ఆఫీసర్‌లా ఉన్న గోపీని పోల్చుకొని "ఓ రాజగోపాల్! రా" అని కుర్చీ చూపించి, "బాగున్నావా" అన్నాడు సంతోషంతో. ఎన్నాళ్ళకో తన శిష్యుడిని చూసినందుకు, పెద్దహోదాలో కనపడ్డందుకు ఉప్పొంగిపోయిం దాతనిమనసు.

"ఏదో మీ దయవల్ల ఇలాగున్నాను." చిరునవ్వుతో సూటిగా విసిరాడు గోపీ.

ఆ మాటవిని ప్రొఫెసర్‌గారి ముఖం రంగులుమారింది. చివుక్కు మంది అతని హృదయం.

"నువ్వు వచ్చినపనేమిటో చెప్పు."

గోపీ ఒకకాగితం అతనిముందు ఉంచి "అతనితో కాస్త మాట్లా డాలి, అనుమతివ్వగలరా? " అన్నాడు.

"ఓ అలాగే. నిరభ్యంతరంగా" అని కాలింగ్‌బెల్ నొక్కాడాయన.

'వెళ్ళొస్తాను సార్. థేంక్యూ వెరీమచ్" అని బయటపడ్డాడు గోపీ.

రెండు మూడు రోజులనుండి ఆనంద్ తనతో మాట్లాడడంలేదు. కారణమేమిటాఅని ఆలోచిస్తున్న రాజ్, "మిస్టర్ రాజశేఖరం వాంటెడ్ బై మిస్టర్ రాజగోపాల్! మీరు వెళ్ళవచ్చు" అన్న లెక్చరర్‌గారి ఆజ్ఞ విని గోపీని కలుసుకోవడానికి ఉత్సాహంగా బయటపడ్డాడు.

చిరునవ్వుతో ఎదురుగానిలబడివున్న గోపీనిచూసి, "ఏరా వెధవా! ఆ మర్నాడే కనిపిస్తానని ఇప్పుడట్రావస్తావు?" అన్నాడు రాజ్.

"ఏం చెయ్యనురా? పనులెక్కువగాఉండి రాలేకపోయాను. అలా తోటలోకి వెళ్దాం పద. మాట్లాడాలి."

వారెక్కడికి వెళ్ళింది తెలుసుకువచ్చి చెప్పిన ప్యూన్ చేతిలో ఓ పావలా పడేసి "నువ్వెళ్ళు" అని వెయిటింగ్ రూమ్‌వున్న అద్దంలో ఓ సారి మొహంచూసుకొని తృప్తిగా బయటికి నడిచింది లత.

"ఏమిటిరా విశేషం? ఒకేసారి కాలేజీకే వచ్చావు?"

"మొదట గదిదగ్గరకే వద్దామనుకున్నాను. వీల్లేకపోయింది. అసలు జరిగిన కార్యక్రమం చెప్తాను విను. రాత్రే నీతో ఉదయం మాట్లాడాలని కార్యక్రమం వేసుకొని పడుకొన్నాను. ఈ మధ్య మనం ఏం చెయ్యాలనుకొన్నా కార్యక్రమం వేసుకోవాలిలే. ఉదయం పదిగంటలవుతుండగా కాలేజీకి పోతూ పోతూ మా మరదలు శారద, "బావా! రాత్రి మీ రాజ్‌తో మాట్లాడాలన్నావుకదా! ఇంకా లేవలేదేం" అంది. అది విని త్వరత్వరగా పనులు ముగించుకొని వచ్చేటప్పటికి ఆలస్యమయింది. సాయంకాలం ఎలాగూ తీరికవుండదు; ప్రతిరోజూ ఇలాగయితే బాగుండదని సరాసరి ఇక్కడికేవచ్చి మొదట మా గురువుల ఆశీర్వాదం పొందాను. తర్వాత వారి అనుమతితో తమ దర్శనమయింది."

"ఘనకార్యం చేశావుగానీ నీకు మేనరికం వుందన్న విషయం ఎప్పుడూ చెప్పలేదేం?"

"ఉండటానికి ఉంది. కానీ దాన్ని తప్పించడానికే నీ సహాయం కావలసివచ్చింది."

"అంతగా నేనుచేసే సహాయమేముంది. ఆ అమ్మాయంటే నీకిష్టంలేదా?"

"లేకేం? బోలెడంత ఇష్టముంది, అసలు చిన్నప్పటినుండీ ఆ అమ్మాయిని నా భార్యే అన్నారంతా. కానీ వచ్చిన చిక్కల్లా ఏమిటంటే ఇప్పుడా అమ్మాయి మరొక అబ్బాయిని ప్రేమించింది. ఎలాగైనా ఈ గండం తప్పించమని నన్ను వేడుకొంది. నిన్ను నేను ప్రార్థిస్తున్నాను. మా యిద్దరినీ నీటముంచినా పాలముంచినా నీదే భారం."

"యిందులో నే చెయ్యగలిగిన సహాయ మేమిటో నాకర్థం కాలేదు."

"ఆ మాటన్నావూ! వెధవా, ఏమీ తెలియనట్లు అడుగుతావేంరా! మా యిద్దరికీ పెళ్ళిచెయ్యాలని గట్టిగా పట్టుపట్టాడు మా మామయ్య. ఆ పట్టు సడలించాలి."

"స్వంతవారైన మీ మాటే విననప్పుడు ముక్కూ మొహం తెలియని నామాట వింటాడని నమ్మకమేమిటి?"

"ఏడిశావు! నీకు నీపైన నమ్మకం లేకుంటే మాకుంది. ముందు నీకు మా మామయ్యను పరిచయంచేస్తాను. ఆ తర్వాత తతంగం ప్రారంభించు."

"ప్రయత్నిస్తాను. ఒక విషయంరా. ఆనంద్ నాపై కోపంగా వుంటున్నాడు. కారణం తెలియడంలేదు. అసలు పలుకరించినా మాట్లాడటంలేదు. ఏం జరిగిందో అర్థంకావడంలేదు.

"ఏడిశాడు వాడూ వాడి కోపమూనూ. నాలుగుతంతే సరి; రోగం కుదురుతుంది! వాడి కథ నే చూస్తాలే."

తలెత్తి ముందుకు చూసిన రాజ్ ఒక చెట్టుచాటున నిలబడి తమనే చూస్తూ చాటుకు తప్పుకున్న లతను చూశాడు.

"ఒరేయ్, నువ్విక్కడే వుండు. అయిదునిమిషాల్లో వస్తాను" అని తిరిగిచూడకుండా ముందు కదుగులువేశాడు.

తన దగ్గరికివచ్చిన రాజ్‌నుచూసి కంగారుపడింది లత.

"కంగారుపడవలసిన అవసరం లేదులే అమ్మా! నువ్వు అతనితో మాట్లాడాలనుకుంటున్నావా?"

అవునన్నట్లు తలవూపింది లత.

"ఆనాడు నేచెప్పిన విషయాలు జ్ఞాపకమున్నాయా?"

ఉన్నాయన్నట్లు తల ఆడించింది.

"సరే, నువ్వెళ్ళు. నేనిక్కడే ఉంటాను, అవసరమైతే నే వస్తాను".

లత గుండె చిక్కబట్టుకొని రాజ్‌ను తిరిగి తిరిగి చూస్తూ గోపీ ఉన్నవైపుకు నడిచింది, ఆమెకాళ్ళు వణికిపోతున్నాయి, గుండె వేగంగా కొట్టుకొంటూంది.

తోట సౌందర్యాన్ని పరిశీలిస్తున్న గోపి హఠాత్తుగా లతనుచూసి ఆశ్చర్యపోయాడు. ఒక్కక్షణం ఆమెను పరిశీలిస్తూ ఉండిపోయాడు.

"బాగున్నారా"అని పలుకరించి బలవంతంగా చిరునవ్వు పెదవుల పైకి తెచ్చుకొని ఆమె జవాబుకు ఎదురుచూడకుండా ముందుకు పోబో యాడు.

లత చేయి అడ్డంపెట్టింది.

దారికడ్డంగా నిలబడ్డ లతనుచూసి "ఏమిటీ నిర్బంధం" అని వెను తిరిగాడు.

"నిర్బంధం కాదు. ఒక దీనురాలి ప్రార్థన."

గోపీ మాట్లాడలేదు.

"మీరు ఈ పాడుమొహంచూడడాని కిష్టపడకపోతేపోనీ, క్షమించా నని ఒక్కమాట చెప్పండి."

గోపీ మౌనమే వహించాడు.

"నా ఆవేదన అర్థం చేసుకోలేరా?"

"అంత అవసరం నాకులేదు."

"కానీ నాకు మీ క్షమాభిక్ష అత్యవసరం. అంతవరకు కుమిలి పోతున్న ఈ మనసుకు శాంతిలేదు. చేసినతప్పుకు క్షమాపణపొందే అర్హత లేదా? తెలియక అజ్ఞానంతో, గర్వంతోచేసిన పాపానికి ప్రాయ శ్చిత్తమే లేదా?"

"ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు లతా!"

"అలమటించిపోతున్న నా హృదయాన్ని ఒకదరికి చేర్చండి. పశ్చాత్తాపంతో బ్రద్దలైపోతున్న ఈ మనస్సుకు రక్షణనివ్వండి. దానికి దరి, విశ్రాంతి, రక్షణ, పాపపరిహారం యిచ్చేది మీ హృదయమే."

"నమ్మమంటావా, లతా!"

"మీరు నమ్మలేకపోవడం నా దురదృష్టం. చేసిన పాపానికి పరితపిస్తున్నాను. ప్రాయశ్చిత్తంగా మీ పాదసేవ చేసుకొంటాను. అంతకు మించి మిమ్మల్నేం కోరను. ఆ భాగ్యం ప్రసాదించండి."

ఆమె కళ్ళల్లో నీరుచూసి చలించిపోయాడు గోపీ. లత చేతులను తనచేతులలోకి తీసుకొని ఆమె కన్నీరు తుడిచి చిరునవ్వు నవ్వాడు.

హృదయభారం తీరిపోగా అతని వక్షంపై తలవాల్చి కళ్ళు మూసికొంది లత.

తృప్తిగా నవ్వుకొన్నాడు రాజ్ అదిచూసి.

"సారీ ఫర్ డిస్టర్బింగ్ యూ ప్లీజ్" అన్న రాజ్‌నుచూసి లత సిగ్గుతో ప్రక్కకు జరిగింది.

"ఒరేయ్ దుర్మార్గుడా! నాటకసూత్రధారివై అంతా చేసేసి ఏమీ తెలియనట్లు అమాయకుడిలా వచ్చావా?"

"నేనేం చేశాను?"

"నాకంతా లత చెప్పేసింది."

"ఏమిటీ, చెప్పేసిందా! ఏమమ్మా అలా చెప్పచ్చా?"

"నేనేం చెప్పలేదండీ!"

"ఆ! చెప్పలేదా! ఒరేయ్ గోపీ, నన్నే మోసగించావుకదురా!"

"దొంగవు దొరికిపోయావుగా" అన్నాడు గోపీ నవ్వుతూ. లత కూడ నవ్వకుండా ఉండలేకపోయింది.

"నవ్వండి, నవ్వండి. ఇప్పుడు యిద్దరూ ఒకటయ్యారుగా! అయినా మీ యిద్దరిమధ్యా నేనెందుకు ? వస్తా" అని తిరిగిచూడకుండా వెళ్ళిపోయాడు.

"మరి నేకూడా వెళ్ళిరానా, లతా!"

"మళ్ళీ తమ దర్శనమెప్పుడో?"

"ఈ గోపాలుడు ఏపనీ చెప్పిచెయ్యడు. ఒకేసారి చేసేస్తాడు. మళ్ళీ కలిసినప్పుడే చెప్తా" అని ఆమె బుగ్గపైన ఓ చిటికెవేసి అక్కడి నుండి వచ్చేశాడు.

మానవుడికి తానుకోరిన కోరిక తీరితే మరి దేని అవసరం ఉండదు. ఆకలికాదు. అన్నివస్తువులూ అందంగా కనబడతాయి. ప్రతి దృశ్యం సుందరంగా కనబడుతుంది. ప్రతివ్యక్తీ ఇష్టమైనవాడుగా, అత్యంత ప్రీతికరంగా అగుపడతాడు. అందులోనూ వయసులోని ప్రేమ పండితే ఆ తొలినాటి ముచ్చట, ఆనందం, ప్రపంచాన్నే జయించ గలవు. మనసులో విజయపతాకం ఎగురుతుంటుంది.

లత కాలేజీ క్లాసులు ఎగ్గొట్టి ఇంటికి దారితీసింది. చేతిలోని పుస్తకాలను విసిరేసింది. నిలువుటద్దంముందు నిలబడి తనను చూసుకొని తానే సిగ్గుపడిపోయింది. చుట్టూ చూసింది. ఏదో చెయ్యాలనిపించింది. కానీ ఏంచెయ్యాలో తోచక బల్లపైనున్న పూలనుతీసి క్రొత్తపూలను పెట్టింది. పూలకుండీ ఆమెను ఎగతాళిచేసింది.

రేడియో ఆన్‌చేసి కూర్చుంది. కానీ వినాలనిపించలేదు. ఆఫ్‌చేసి లేచింది. అప్పుడే "లతా" అంటూ లోపలికి వస్తున్న అక్కయ్యను చూసి సంతోషంతో "అక్కయ్యా" అని ఆమె మెడను కావలించు కొంది.

ఆశ్చర్యపోయింది వాళ్ళక్కయ్య ఇందిర. కాలేజీనుండి యింత త్వరగా తిరిగి వచ్చేసింది. పైగా యింత ఉత్సాహంగా ఉందేమిటా అను కొంది.

"లతా! ఏమిటిది?"

"చెప్పనా! నాకు సిగ్గేస్తుంది పో" అని తిరిగిపోయి అక్కడ వున్న వాలుకుర్చీలో పడుకొని కళ్ళను చేతులతో కప్పేసింది.

నవ్వుకొంది ఇందిర.

"ఏమిటే పిచ్చిదానా! అంతగా సంబరపడిపోతున్నావు! కారణ మడిగితే సిగ్గుపడుతున్నావు" అని ఆమె చేతులను విడదీసింది.

"ఈ దినం వారితో మాట్లాడాను."

"ఎవరితో?"

వివరంగా చెప్పింది లత.

"యిది నిజమయితే నువ్వు అదృష్టవంతురాలివే!"

"అవునక్కయ్యా! ఈనాడు నేను ఈ ప్రపంచాన్నే జయించినట్లని పిస్తూంది. ఎన్నడూ పొందని అనుభూతులను చూరగొంటున్నాను. ఈ పరితాపహృదయానికి అన్నీ లభించాయి. ఇంకేమీ వద్దనే అనిపిస్తోంది. ఈ ఆనందం ఎప్పటికీ నిలిచిపోతే బాగుంటుంది. నాలో వెయ్యి గులాబీలు ఒక్కసారిగా వికసించినట్లున్నాయి."

"గులాబీలకు ముళ్లుంటాయి సుమా!"

"అవి ముళ్ళుకాదక్కయ్యా, మా ప్రేమజ్యోతులు."

"అవి ఉత్తపూలే సుమా! వాడిపోయినతర్వాత చాల బాధపడ వలసివుంటుంది జాగ్రత్త!"

"లేదక్కయ్యా! అవి నిత్యనూతన శోభాయమానంగా పరిమళా లను వెదజల్లుతుంటాయి."

"బాగుంది, లతా! నువ్వు నీ జీవితానికి ఒక చక్కటి పూలబాటను నిర్మించుకొంటున్నానన్న ధైర్యం నీలోవుంటే సంతోషం. కానీ ఒక్క విషయం జ్ఞాపకముంచుకో. ఈ ప్రేమిక జీవితంలో మీ మనసులు ప్రవాహానికి కట్టబడిన మట్టి ఆనకట్టలలాంటివి. ఆ విధి వైపరీత్యమనే ప్రవాహం సాఫీగా సాగిపోతుంటే అంత అందమూ, ఆనందదాయకమూ మరొకటి ఉండదనిపిస్తుంది. కానీ దానిలో ఏమాత్రం కొంచెం ఉరవడి హెచ్చినా ఆనకట్ట తెగిపోతుంది. ఫలితంగా ప్రవాహం ఇచ్ఛవచ్చినరీతిగా మీ హృదయమనే ఆనకట్టలను చీల్చుకొని పలుదారులనుబట్టి పోతుంది. అలాగే మీ హృదయాలలో ఏమాత్రం ఆవేశం, అనవసర అనుమానాలు గాని పొడసూపాయంటే ఎన్నో అనర్థాలు వాటిల్లుతాయి, జీవితం కృశించి పోవటానికి ఆస్కారముంది. వాటికి లోనైననాడు మీ మనస్సులు యుక్తాయుక్త విచక్షణలను మరిచిపోయి క్షణికానందానికో, క్షణిక కోపానికో గురై గాయపడి, గాయం మానినా మచ్చమానక ఎప్పుడూ జ్ఞాపకంచేస్తూ బాధపెట్టుతుంది. కాబట్టి జాగ్రత్తగా మసలుకో, లతా! నీకు అటువంటి ఒడిదుడుకులు రాకుండా, వచ్చినా చక్కదిద్దుకు పోగలిగే శక్తినివ్వమని భగవంతుని సదా ప్రార్థిస్తుంటాను."

ఇందిర మాటలలోని భావాన్ని అర్థంచేసుకొంది లత. సూక్ష్మంగా చెప్పినా కొన్ని జీవితాల సత్యాన్ని చక్కగా చెప్పగలిగిందని గ్రహించింది.

"నీ సలహాను అక్షరాలా పాటిస్తానక్కా! కానీ ఒక్కసందేహం. పెళ్ళయినతర్వాత భార్యాభర్తల మధ్యనుండే అనురాగస్రవంతి చీలిపోవడానికి వీలులేదా? వారిలో ఆవేశానుమానాలు అనర్థాల్ని కలిగించలేవా?"

"మంచిప్రశ్నే వేశావు. భార్యాభర్తలన్నతర్వాత సహజంగా వారిలో ఒకరిపైఒకరికి ప్రేమానురాగాలు గాఢంగా పెనవేసుకొనుంటాయి. అందరిలోనూ ఉంటాయా అని అడగద్దు. భార్యను ప్రేమించలేని భర్త, భర్త నారాధించలేని భార్య ఉన్నారంటే వారెలాంటివారో చెప్పలేము. కొన్ని కారణాలవల్ల పరస్పరం ప్రేమించుకోలేకపోయినా కాలానుగుణంగా వారిద్దరిమధ్యా అనురాగం అల్లుకపోక తప్పదు. ఆ వివాహ బంధానికున్న శక్తి అటువంటిది. అలా దాన్ని ఉల్లంఘించి తమజీవిత భాగస్వామిని ప్రేమించలేనివారికి ఈ సమాజంలోనే కాదు, ఈ లోకంలోనే తావుండదు. నువ్వు చెప్పినట్లు వైవాహిక జీవితంలో భార్యాభర్తల మధ్య కల్లోలాలు పుట్టి వారి అనురాగస్రవంతి చీలిపోవడానికి అవకాశముంది. కానీ అది తిరిగి కలుసుకోక తప్పదు. ఆవేశానుమానాలు వారిలో కలగడం సహజమే. వాటికి అతీతులైనవారు దేవతలుగా పూజింపబడతారు. కానీ వచ్చిన అనర్థాలను సరిదిద్దుకుపోగలిగేవారు ధన్యులు.

"కానీ ఆ అనురాగస్రవంతి అంత సులభంగా చీలిపోదన్న విషయం జ్ఞాపకముంచుకో. ఎందుకంటావా? ఆ వైవాహిక బంధాన్ని సులభంగా త్రెంపివెయ్యగలిగే శక్తి ఎవ్వరికీలేదు. తమంతతామై కోరి విడిపోవడానికి ప్రయత్నించినా చాలకష్టపడవలసివస్తుంది. ఈ ఆధునిక జీవితంలో అది సులభంచెయ్యబడిందనుకో. అయినా దానికోసం కోర్టు లెక్కవలసి వుంటుంది. అయినా విడాకులిచ్చిన భర్తనుగానీ, భార్యనుగానీ హర్షించలేదు లోకం. మొదటినుండి కలహాలకూ, మనస్పర్థలకూ అలవాటుపడి తమ జీవితాన్ని నరకంచేసుకునేవా రుంటారు. సవరించుకొని తమ సంసారాన్ని చక్కదిద్దుకునే శక్తి వారిలో ఏ ఒక్కరికీ

లేనప్పుడు వారిమధ్య అనురాగప్రవంతి చీలిపోవడమే కాదు; ఒకరిపై మరొకరికి ద్వేషాగ్ని రగులుకొంటూ ఎక్కువవుతుంది. నిగ్రహాన్ని కోల్పోయి కష్టాలను కోరితెచ్చుకొనేవారిని వివాహబంధంకూడ అరికట్ట లేదు కొన్నిరోజులతర్వాత. తత్ఫలితంగానే విడిపోవడం జరుగుతుం టుంది. అటువంటివారికి ఉదాహరణంగా నా జీవితాన్ని జ్ఞాపకముంచుకో, లతా" అని ఇందిర తలత్రిప్పేసుకొని అక్కడనుండి వెళ్ళిపోయింది.

లత అక్కయ్య బాధను గుర్తించింది. తను తప్పుచేశానని తెలిసి కొంది. ఇందిర గదిలోకి పోయింది. ఇందిర ఏడుస్తూ కూర్చొని ఉంది.

"అక్కయ్యా, నన్ను క్షమించు. అనవసరంగా నీ మనసుకు కష్టం కలిగించాను."

"అదేంలేదు కానీ ఇలా కూర్చో" అని కళ్ళు తుడుచుకొని లతను తనప్రక్కనే కూర్చోబెట్టింది నవ్వు తెచ్చుకుంటూ. కానీ లత మామూలు స్థితికి రాలేకపోయింది.

"మరి మీవారిని నాకు పరిచయం చెయ్యవా, లతా!"

"ఫో అక్కా! నీతో అసలు మాట్లాడకూడదు" అని సిగ్గుపడింది లత.

"పోనీలే. ఎప్పటికైనా యిక్కడికి వస్తాడుగా? అప్పుడు నేనే పరిచయం చేసుకుంటాను."

"వారికన్నా ముందు నీకు మరొకరిని పరిచయం చేయాలి."

"ఎవరు వారు?"

"ఆనాడు సినిమాలో చూపించలేదూ రాజశేఖరమని? అతడివల్లనే నాకీ అదృష్టం లభించింది."

"అతడంతటి గొప్పవాడా?"

"చూడడానికి సామాన్యుడే కానీ అర్థం చేసుకోగలిగితే ఆకాశ మంతటి హృదయంగలవాడు."

"మరి నువ్వర్థం చేసుకోగలిగావా?"

"అంతటి అదృష్టం మనకులేదు. ఆకాశాన్నంతటినీ మనం ఒక్కసారి చూడలేంగా! ఎన్నోకొండలు అడ్డుపడతాయి. అతన్ని అర్థం చేసుకోవడానికి ఒకజీవితం కావాలి. ఉసలతనిక ముఖ్యమైన ఇద్దరు

మిత్రులు వున్నారు. వారికే చేతకాలేదాపని. ఇకపోతే అతనికి నీడలా ఈ మధ్యన ఒక అమ్మాయి తిరుగుతోంది. పేరు తెలియదు కానీ మెడిసిన్ చదువుతోందని విన్నాను. ముస్లిముల అమ్మాయిలాగుంది. ఆప్తుల కోసం అన్నీ చేయగల సమర్థుడు. పరులకు జీవితపు విలువల్ని నేర్పిస్తాడు. అతనంటే నాకు చాలయిష్టం."

"ఊఁ" అంది ఇందిర ఏదో ఆలోచిస్తూ.

"అక్కయ్యా, ఈ దినం స్కూలు కెళ్ళలేదేం?"

"ఈ దినం మా స్కూల్ డే. సాయంకాలం వెళదాం. సిద్ధంగా ఉండు."

'అలాగే!"

# 10

'మన షికారు స్టాప్!'

"కారణం?"

"మా చెల్లాయీవాళ్ళ స్కూల్ డేట. నిన్నుకూడా తప్పక తీసుకు రమ్మంది."

"నువ్వెక్కడుంటే నేనూ అక్కడే. ఒక్కనిమిషం. బట్టలు మార్చుకొస్తాను" అని లోపలికిపోయి పదినిమిషాల్లో తిరిగి వచ్చింది.

కవుల కవనానికి అందని అందం, చిత్రకారుల ఊహకు దొరకని రూపం, సౌందర్యమంటే ఏమిటో చూపడానికి నిలిచిన మూర్తిలా ఉన్న రజియాను పరీక్షించసాగాడు రాజ్.

సృష్టిలో వున్నవి తొమ్మిది రంగులేనా లేక పదవరంగుకూడా వుందా అన్న భ్రమకలిగిస్తుంది ఆమె శరీరఛాయ. కేశాలా,మనోపాశాలా అని భయం పుట్టించేలా వుంటాయి ఆమె శిరోజాలు. ఈ లోకంలో ఎక్కడాలేదుసుమా ఈ లావణ్యం అని సవాలు చేస్తున్నట్లుంది. ఆమె అందానికి ముచ్చటపడి కన్నులు బదులు చిన్నపద్మాలను కూర్చాడా అనిపిస్తుంది. చిరునవ్వుతో అందేదాన్ని కాదుసుమా అనే మెరుపులా మెరిసి మాయమవుతుంది. ఆమె నొకసారి స్పర్శిస్తే చాలు ధన్యమా జీవితం అనిపించే అందంతో అలరారిపోతూంది.

"ఏమిటి, రాజ్, అలా చూస్తున్నావు?"

"దేవుడు నీకింత అందాన్ని ఎందుకిచ్చాడా అని."

ఆ మాట విని సిగ్గుతో పొంగిపోయింది రజియా. ఒకప్రక్క సిగ్గు, మరోప్రక్క ఆనందం, వుత్సాహం మిళితంకాగా పొంగిపోని వారెవరు వుంటారు? అంతకన్నా ఎక్కువ కోరుకునేదెవరు?

"నువ్వు ఇంత ఆకర్షణీయంగా తయారై వస్తుంటే చూడటం తప్పా?"

"ఇదంతా నీ సొమ్మే అయినప్పుడు నువ్వుచూస్తే తప్పని ఎవ రంటారు?"

"నీ మాటమీద నమ్మకం లేదుగానీ మీ నాన్నగారెక్కడ?"

"ఎక్కడికో బయటికెళ్లారు. ఎందుకు?"

"ఏమీలేదు. నిన్ను పెళ్ళిచేసుకోవడానికి నా అర్హతలు తెలుపు కొంటూ ఓ దరఖాస్తు పడేద్దామని అనుకుంటున్నాను."

ఒక్కసారిగా హృదయంలో వేయి వీణాతంత్రులు ఝుమ్మని మ్రోగాయి. వీనులకు విందొనగే ఆ మాటలువిని పులకరించిందామెశరీరం. ఆ పులకింతతో 'అంత అదృష్టమా, రాజ్' అని అతనిపై వాలిపోవాలను కుంది. కానీ అది సమయం కాదనుకొని సంబాళించుకొంది.

"నీకెప్పుడూ నన్ను ఏడిపించడం సరదాగా వుంటుందిలే. పదా" అని అతని చెయ్యిపట్టుకొని లాక్కెళ్ళింది. ఆమెలో మెదిలిన భావాలను గ్రహించగలిగాడు. అతను తెలుసుకుంటాడని ఆమెకు తెలుసు. అదే వింత.

అందుకే ప్రేమించిన హృదయాలు పరస్పరం అర్థం చేసు కొంటాయి అంటారు. వారిలో ఏ విధమైన జ్యోతిష్యశాస్త్రమూ వుండదు. కేవలం, ఎదుటివారిని ఆరాధించడంవల్లనే వారి మనసులో మెదిలేభావాలను అర్థంచేసుకోగలరు. దేవుడిని భక్తుడు ఆరాధిస్తాడు. దేవుడి గుణగణాలను, దయాత్మక హృదయాన్ని వర్ణిస్తాడు భక్తుడు. ఎలా? దేవుడేమైనా అతనికి కనిపించి అలా చెప్పమంటాడా? ఏదో వినూ తనశక్తి అతనిచేత ఆ మాటలు చెప్పిస్తుంది. పరస్పరానురాగంవల్ల

ఒకరిభావాలు, ఒకరి వుద్దేశ్యాలు మరొకరు సులభంగా అర్థం చేసుకో గలరు. దానికంతటి మహత్తరశక్తివుంది.

స్నేహానికిగూడా అంతటి శక్తివుంది. సాంగత్యంలో అభి మానమూ, ఆప్యాయతా కనిపిస్తాయి. ఆరాధనలో కనిపించేది అనురాగం; స్నేహంలో వుండేది అభిమానం. అందులోని ఆనందం వేరు; ఇందులోని సంతోషం వేరు. రెండింటిలోనూ ఊహించరాని గొప్ప శక్తులు వున్నాయి. స్నేహంలో నిస్వార్థం, త్యాగం వాటంతటవే పుట్టుకువస్తాయి. ప్రేమ వీటితోనే పుట్టుతుంది. అసూయా, అనుమా నాలకు నిలయం ప్రేమ. స్నేహంలో అవి లేవని చెప్పలేకపోయినా అంత ఎక్కువగా వీటికి విలువ వుండవని చెప్పవచ్చు. ఆరాధనలో వీటికి తావే వుండకూడదు. వుండవుకూడా.

స్కూల్లో వీళ్ళకోసం కాచుకొనున్న సుగుణ చిరునవ్వుతో ఆహ్వానించి వారిని కూర్చోబెట్టి గ్రీన్‌రూమ్‌లోకి పోయింది. రాజ్ స్టేజి అలంకరణ చూశాడు. చాలా శ్రద్ధతో అలంకరించారు స్టేజీని. స్టేజినుండి రంగురంగుల కాగితాలు చుట్టూఉన్న అరటి స్తంభాలకు కట్టారు. రంగుల కాగితాలతో వివిధములైన బొమ్మలు, పరికరాలు తయారుచేసి అక్క డక్కడ వ్రేలాడదీశారు. చాలా ఘనంగానే జరుపుతున్నారే అను కొన్నాడు రాజ్.

"రాజ్!"

"ఊఁ?"

"ఆ తెరచూడు, ఎంతబావుందో!"

"బాగున్నది తెరా లేక ఆ తెరపైని ఆర్టా?"

"ఆ ఆర్టు ఉండబట్టే ఆ తెర బావుంది అన్నాను."

వారు చూసిన తెర స్టేజికి వెనుకభాగంలో కట్టివున్నారు. ఆ తెర అంతా పసుపురంగు పూయబడివుంది. అందులో ఏవో కొండలు, ఎన్నో చెట్లు,ఆ కొండల మధ్యనున్న దారి, ఆ దారి వెంబడి ఒక బాటసారి. రక రకాల రంగులతో కన్నులపండువైన దృశ్యం. చిత్రకారుడి కళా కౌశల్యం ఎవరినైనా మైమరపిస్తుంది. అతడిఊహ అందరి మన్ననకు పాత్రమైంది. ఆ కొండలమధ్యన దారి కనిపించదు. అంతవరకూ

వచ్చిన ఆ బాటసారి బిక్కమొగం వేశాడు. ఆ కొండల్లో దారి కానక ప్రయాణించేందుకు మార్గం తెలుసుకోలేక ధైర్యంచాలక దీనంగా చూస్తున్నాడు.

అతనిచూపులు ఎవరిని చూస్తున్నాయి? కొండమీద ఒక ఆకారంపై నిలిచివున్నాయి. ఏమిటో ఆకారం? జంతువా? దెయ్యమా? సన్యాసా? ఏదీ కాదు. అదీ ఒక మానవరూపమే. చిరునవ్వులు చిందిస్తూ క్రిందనున్న బాటసారికి ధైర్యాన్నిస్తూ కదలిరమ్మని సైగచేస్తున్నాడు. ఎందుకో అతని కా శ్రమ? తోటి మానవుడనే అభిమానం, ఆత్రుత. అన్నిటికిమించి అతన్నికూడా తనలాగా కొండ నధిగమించే ధైర్యాన్నివ్వాలనే ఆశ. కొండచుట్టూనున్న చెట్లు భయంకరమైనవీ, మోడు పోయినవీ, పచ్చగా నున్నవీ అయి అతనికి భయాన్నీ, నిరాశనేగాక ఆశనుగూడ పుట్టిస్తున్నాయి.

"రాజ్!"

"ఏమిటి, రజీ?"

"మీ లతకూడ వచ్చింది చూడు."

రాజ్ లతను, ఇందిరను చూశాడు.

"మా లత అంటున్నావు. ఆమె ఏమైనా నాకు బంధువనుకున్నావా?"

"అంటే మీ మిత్రుడికి...." అని ఆగిపోయింది రజియా.

"నా మిత్రుడికి అయినప్పుడు నీకుగూడా వారితో సంబంధం ఉంటుందన్న విషయం మరిచిపోవద్దు."

"తప్పయింది బాబూ! ఒప్పుకొంటున్నాను. ఇంకెప్పుడూ అలా అనునులే."

"నీ ఉద్దేశ్యం యిక్కడికి వచ్చేది నువ్వు నేను తప్ప మరెవ్వరూ ఉండరనా?"

"నీతో మాట్లాడలేనని ఒప్పుకున్నానుగా? ఇంకా ఎందుకేడిపిస్తావు?"

నవ్వాడు రాజ్. తలవంచుకొంది రజియా.

చుట్టూ కలయజూశాడు రాజ్. ఆ స్కూలుకు కాంపౌండు చాల పెద్దది. అక్కడక్కడ పెద్దచెట్లున్నాయి. ఒకవైపు తోటవుంది. చెట్ల నుండి గాలి చల్లగా వీస్తూంది. ఆ గాలి అక్కడికి వచ్చిన అతిథుల రక రకాల సెంట్ల వాసనను అందరికీ అందిస్తూంది. మల్లెపూల గుబాళింపు, సంపెంగపూల సువాసన అందరినీ మైమరపిస్తూన్నాయి. వివిధరకాల మనస్తత్వాలు కలిగిన వ్యక్తులూ, జంటలు కబుర్లు చెప్పుకొంటు న్నారు. అన్నిరంగుల దుస్తులూ అక్కడ కనబడుతున్నాయి. భార్యా భర్తలు గుసగుసల్లో మాట్లాడుకొని నవ్వుకుంటున్నారు. పెద్దలు రాజ కీయాలు మాట్లాడుకొంటున్నారు. పిల్లలు అక్కడికీ ఇక్కడికీ పరు గెత్తుతూ కేరింతలు కొడుతున్నారు. తెలిసినవారు చిరునవ్వులతో పలుక రించుకొంటున్నారు. కొందరు రోమియోలు కష్టపడి పోజులు పెడు తున్నారు. స్కూలు ఆడపిల్లలు కూర్చున్నచోట చేరి ఏదో వాగుతూ వారి నేడిపిస్తున్నామనుకొని తృప్తిపడుతున్నారు. బ్రహ్మచారులు—భార్యా భర్తల ఆనందాన్నీ, ఒంటరివారు—తోడుగా నవ్వుకొంటూ మాట్లాడు తున్నవారినీ, కొన్ని చక్కని జంటలను చూసి మరికొందరు ఈర్ష్య పడుతుండగా ముచ్చటపడేవారుకూడ కనిపించారు. ఈ జరిగే తతంగ మంతా చూసి నవ్వుకొంటున్న మహానుభావులు కొందరు కనిపించారు.

ఇంతలో ఆ సభాధ్యక్షులు వచ్చారని మైక్‌లో వినిపించింది. అప్పుడే లత వచ్చి తన వెనుకవరుసలో కూర్చోవడం రాజ్ గమనిం చాడు. రజియా, లతను చూసింది. లత, రాజ్‌ను పలుకరిద్దామనుకొంది. కానీ అంతమందిలో సిగ్గుపడి ఆ పని చేయలేకపోయింది.

జడ్జిగారి శ్రీమతిగారి ఆధ్వర్యాన ఉపన్యాసం ముగిసిందనిపించగా బహుమతి ప్రధానకార్యక్రమం మొదలైంది. ఇందిర మైక్ ముందు నిలబడి పేర్లు చదువుతుండగా మరొక టీచరు వారికి రావలసిన బహుమతులను అధ్యక్షురాలి చేతికుండా ఇస్తూంది.

"తెలుగు వక్తృత్వపు పోటీలో మొదటిబహుమతి సుకుమారి ఆరవఫారం"—

అనగానే ఒక లావుపాటి అమ్మాయి స్టేజి ఎక్కలేక ఎక్కుతూ వచ్చింది.

"ఆహా! ఎంత సుకుమారివి మహాతల్లీ!" అన్నాడొక కొంటెవాడు వెనుకనుంచి.

కొన్నితలలు తిరిగాయి. అక్కడోగుంపు కనబడ్డది. ఎవరైంది ఎవరికీ తెలియలేదు.

ఆ అమ్మాయి బహుమతి నందుకొని గబగబా పరుగెత్తినంతపని చేసి స్టేజి దిగి వెళ్ళిపోయింది.

ఒక అమ్మాయి ఆటలపోటీలలో చాల బహుమతులు తీసుకొంది. తిరిగి త్రోబాల్ కెప్టెన్‌గా వచ్చింది.

"అయితే మనకు చదువులో సున్నాయేనన్నమాట!"

ఆ అమ్మాయి సిగ్గుతో తలవంచుకుని వెళ్ళిపోయింది.

మరొక అమ్మాయి భరతనాట్యం డ్రెస్సులో అలాగే వచ్చింది.

"నాట్యంచెయ్యడానికి అంత తొందరా! ఇంకా టైముంది వెనక్కిపో!" అరిచా డొకడు.

తిరిగి ఆమె జాడ కనిపించలేదు.

"ఎన్. సి. సి. డిసిప్లిన్ ఫస్టుప్రైజ్, కుమారి సరళ. ఆరవ ఫారం."

పాపమా అమ్మాయి చాల ముచ్చటపడుతూందేమో, ఎన్. సి. సి. డ్రెస్సులో అలాగే స్టేజిపైకి వచ్చింది. ఆ టీచరు ఆమెకురావలసిన బహుమతి ఇచ్చింది.

"ఎన్. సి. సి. వారెప్పటికీ అటెన్షన్ పొజిషన్‌లో నిలబడాలి, ప్లీజ్! ఇదేదో పక్షపాతపు బహుమతిలాగుంది."

ఉలిక్కిపడిందా అమ్మాయి. అటెన్షన్ పొజిషన్‌లోకి వచ్చి బహుమతి నందుకొని వెనక్కు రెండడుగులువేసి సెల్యూట్‌చేసి తిరగబోతున్నంతలో "రైట్‌-టర్న్,క్విక్ మార్చ్" అన్నా డొకడు. "నో. నో. డబులప్" అన్నా డింకొకడు. పగలబడి నవ్వారా గుంపంతా.

ప్రేక్షకులకు కొందరికది వినోదకరంగావున్నా మరికొందరు తిట్టుకొంటున్నారు.

"ఛీ-ఛీ-రౌడీవెధవలు. మెడబట్టి బయటికి గెంటితే సరి." కోపంతో అంది రజియా రాజ్‌తో.

అది విని నవ్వాడు రాజ్.

"ఆపని వాళ్ళు చేతనైవుంటే ఎప్పుడో చేసేవారు. చేతకాకే మౌనంగా ఉన్నారు" అన్నాడు.

"ఇది ఆడపిల్లల స్కూలు. జరిగే కార్యక్రమాన్ని చూడను వచ్చిన సోదరులు మర్యాదగాఉంటే మంచిదని కోరుతున్నాము. మీరు ఎగతాళిచేసేది అమ్మాయిలను కాదు. మీ సభ్యతనూ, సంస్కారాన్నీ ఎంత అందంగాఉందో చూడండంటూ చూపిస్తున్నారు. అది మీకు మంచి దైతే అలాగే చెయ్యచ్చు. కానీ ఇలా చేస్తుంటే మేం కష్టపడటమే గాకుండా మీ కందరికీ కష్టాన్ని కలిగించవలసివస్తుందని చెప్పడానికి చింతిస్తున్నాను. కావున ఇకనైనా మాతో సహకరిస్తే ఏర్పాటు చేయ బడ్డ ఈ కార్యక్రమం జయప్రదం కావింపబడుతుంది." కాస్త ఆవేశంగా వెలువడ్డాయి మైక్‌లోనుండి ఇందిర మాటలు.

ఏ పిల్లో, కుక్కో అరుస్తుందని భావించా రంతా. కాని అలాంటి దేమీ జరుగలేదు.

"థాంక్స్" అని ఇందిర వేదికదిగి వెళ్ళిపోయింది.

రాజ్ కళ్ళతోనే ఏదో చెప్పాడు రజియాకు. రజియా చిరునవ్వు నవ్వింది.

కార్యక్రమం ముగింపులో జనగణమన పాట పాడా రంతా, ఏ కార్యక్రమానికిగానీ, ఏ సభకుగానీ ఈ జాతీయ ప్రార్థనగీతం మన భారతీయులలో నిలిచి ఉంటుంది. ఈ ప్రార్థనగీతం లేనిదే మన మీనాడు, ఏ కార్యక్రమాన్నీ జరుపము. ఇది ఎప్పటినుండో వచ్చే ఆచారం. దీనికి తిరుగులేదు, ఇకమీదటకూడా దిగ్విజయంగా ఉంటూనే ఉంటుంది. మన భారతచరిత్రను, గొప్పతనాన్ని చాటి చెప్పే గీతం. భారతీయులందరికీ పూజనీయమైన గీతం. ఆ గీతాన్ని ఆలాపించే భారతీయులమైన మనం ధన్యులం.

దారిలో సుగుణను పరిచయం చేశాడు రజియాకు. అప్పుడే వికసించబోయే పుష్పంలావున్న సుగుణసౌందర్యం రజియాను ఆకర్షించింది. సుగుణ మొహంలో ఉన్నది గంభీరత్వమో, అమాయకత్వమో

తెలుసుకోలేకపోయి అన్నకు తగిన చెల్లెలే అనుకొంది. అన్నయ్యకు తగిన వదినే అనుకొంది సుగుణ.

"సుగుణా. బహుమతిప్రధాన సమయంలో పేర్లు చదివింది— ఆవిడెవరు ?" అడిగాడు రాజ్.

"ఇందిరని మా సైన్సు టీచరన్నయ్యా! అదిగో వెళ్తోంది చూడు, ఆమెప్రక్కనే ఉన్నావిడ ఆమె చెల్లెలు" అని ముందు పోతున్న లత, ఇందిరలను చూపించింది.

"ఓహో" అనుకున్నాడు రాజ్.

"మీరు వస్తుండండి. ఆమెతో ఒక్కవిషయం మాట్లాడి వస్తాను" అని సుగుణ ముందుకుపోయింది.

"రజీ, గోపీ, లతలు కలుసుకొన్న విషయం నీకు చెప్పలేదు కదూ ?"

"ఏమిటో అంత విశేషం ?"

జరిగినదంతా చెప్పాడు రాజ్.

"అయితే వారిజీవితాలలో ప్రేమబీజాలను నాటి నీరు పోశావన్న మాట."

"కానీ అవి మొలకలెత్తుతాయో లేదోనని భయంగా ఉంది."

"మొలకలెత్తడమే కాదు. పెద్దవై పెనవేసుకు చిగురిస్తాయి."

"నాపై అంత నమ్మకముందా ?"

"నీపై నమ్మకం లేనినాడు అసలీ ప్రపంచంలో నమ్మకం అన్న పదానికే విలువుండదు."

"ఈమధ్య తమ వాక్చాతుర్యధోరణి మారినట్లుందే !"

"తమ సాహచర్యంలో అన్నీ వాటంతటవే వస్తాయి."

అదేసమయంలో రాజ్‌ను తనకు అన్నయ్యగా చెప్పుకొంటూంది సుగుణ, ఇందిరతో. అర్థంకాక అయోమయంగా వెనక్కుతిరిగి నవ్వు కొంటున్న వీరిద్దరినీ చూసింది లత. ఏమిటీ సంబంధ బాంధవ్యాలు అని ఆలోచించి అర్థం చేసుకోలేక విడిచిపెట్టింది లత.

"రాజ్, దారంబడి యిలా నవ్విస్తూ వస్తుంటే చూచేవాళ్ళు ఏమను కుంటారు చెప్పు ?"

"ఏమనుకుంటారు ? ఎవరో క్రొత్తదంపతుల లాగుంది; మోజు తీరలేదేమో అని ఈర్ష్య పడతారు."

"ఛ. పో, నీతో మాట్లాడడమే బుద్ధితక్కువ" అని తల వంచుకుంది. తన అదృష్టానికి, ఆనందానికి గంతులేయాలనిపించింది.

"జాగ్రత్త. ఇది రోడ్డు. గంతులేస్తే పిచ్చివాళ్ళనుకుంటారు."

ఉలిక్కిపడి రాజ్‌ను చూసింది. ఏమీ తెలియనట్లు గంభీరంగా అడుగులు వేస్తున్నాడు రాజ్.

# 11

"రాజ్ !"

"ఏం, రజీ ?"

"ఈ ప్రకృతి ఎలా ఉంది ?"

"వర్ణించలేనంత అందంగా ఉంది."

"ఈ పరిసరాలు ?"

"ప్రశాంతంగా ఉన్నాయి."

"మన మనస్సులు ?"

"వాటితో పోటీ పడుతున్నాయి."

"సముద్రు దేమంటున్నాడు, రాజ్ ?"

"నిన్న రాలేదేం అని అలిగి కూర్చున్నాడు, రజీ."

"కారణం చెప్పలేదూ ?"

"చెప్పాను."

"ఏమన్నాడు ?"

"క్షమించాను పొండి అన్నాడు గంభీరంగా."

"రాజ్ !"

"ఊఁ."

"అతని కంత అధికారాన్ని ఎవరిచ్చారు ?"

"మనమే."

"అదెలా ?"

"ప్రతిదినమూ మనము అతనితో ఆడుకుంటున్నాం. ఎన్నో మాట్లాడుకుంటున్నాము. అతనికి కన్నులపండువుగా ఉంటున్నాము. మన రహస్యాలన్నీ తనగుప్పెట్లో పెట్టుకున్నాడు. తల్లితండ్రుల్లా దగ్గర తీస్తాడు. ఊరట కలిగిస్తాడు. స్నేహితులపై అధికారాన్ని చలా యిస్తున్నాడు. తప్పు కాదుగా."

"ఉహూ."

రజియా తెల్లని ఇసుకలో తలను రాజ్ ఒళ్ళో పెట్టి పడుకొంది. రాజ్ సముద్రపు అలలవైపు చూస్తున్నాడు. రజియా చుట్టూవున్న ప్రకృతిని పరిశీలిస్తూంది. వారిచుట్టూ ఏకాంతం, ప్రశాంతం వారిలో తాండ విస్తూంది. ఒకరికొకరు స్వంతమైపోతున్నారు. వారికి లోకంతో పని లేదు.

దూరంగావున్న తాటిచెట్లు, వాటిపైని వివిధరకాల పక్షుల కిల కిలారావములు, అప్పుడప్పుడు వాటిమధ్య తాండవించే నిశ్శబ్దత ఆనం దాన్ని చేకూరుస్తున్నాయి. చుట్టూ కొండలు. ఆ కొండలలోని ప్రతి ధ్వనులు, నేనూ ఉన్నానంటూ హోరుపెట్టే సముద్రుడు ఎటువంటివారి కైనా ఊరట కలిగిస్తాయి.

"రాజ్."

"ఊఁ."

"సముద్రపు లోతెంత?"

"సామాన్యులకు కనుక్కోవడం కష్టం."

"పోనీ వైశాల్యం?"

"అదీ అంతే. కనుచూపుమేరవరకూ ఉంటుంది. చుట్టూ చిలిపిగా గంతులువేసే అలలతో మధ్యలో చాల గంభీరంగా వుంటుంది."

"నువ్వూ అంతే, రాజ్!"

"అంటే?"

"నీ హృదయపు లోతులను సులభంగా కనుగొనలేరు. నీ హృదయం ఎంత విశాలమైనదో ఊహించలేరు. సముద్రానికి కాస్త దగ్గర చేరితే చుట్టూవున్న అలలు భయాన్ని పుట్టించినా తరువాత ఆనందాన్ని స్తాయి. పోనుపోను లోతుగా గంభీరంగా ఉండేదాన్ని చూస్తుంటే ఆనం

దంతోపాటు ఆశ్చర్యంకూడా కలుగుతుంది. ఆ ఆనందానికి అంతు వుండదు. కానీఅ యోమయంగా వుంటుందంతా. మొదట నీతో స్నేహం చేసుకొనేందుకు భయపడ్డాను. కానీ నీతో సహచర్యం లభించినతర్వాత నిన్ను అర్థం చేసుకోవాలని ప్రయత్నించి విఫలురాలనయ్యాను. నీలో కలిసిపొయ్యాను. నా కోరిక ఫలించింది. కానీ అప్పుడప్పుడు నిన్ను అర్థం చేసుకోవడంలో తప్పటడుగు వేస్తానేమోనని భయంగా వుంది."

"ఉపన్యాసం అయిపోయిందా, ఇంకా ఏమైనా వుందా ?"

"నువ్వలా చిరుకోపం తెచ్చుకొంటే నా హృదయంలో పూల వర్షం కురిసినట్లుంటుంది."

"అయితే నిజంగానే కోపం తెచ్చుకుంటాను."

"అంత పనిమాత్రం చేయకు. నాలో అగ్నిజ్వాలలే ఆవిర్భవించి దహించివేస్తాయి."

ఇంతలో ఒక అల వారిదగ్గరగా వచ్చి పోయింది.

"రజీ, సముద్రు డొక సందేశాన్ని పంపించాడు."

"ఏమిటో ఆ సందేశం!"

"మన మాటలన్నీ తనలో దాచుకొన్నాడట."

"అతడికి అంతకన్నా మరేం పని లేదా?"

'ఏం చెప్పమంటావు' అన్నట్లు సముద్రంవైపు చూశాడు రాజ్. సముద్రుడు హోరుమన్నాడు.

"వుందట. కానీ అన్నిపనులూ విడిచి మనదగ్గరకే వచ్చాడట."

"ఎందుకో అతని కంత ఆత్రుత ?"

ఒక అల వచ్చి వారికాళ్ళను తాకింది.

"ఈ అందాలరాణిని ఈ ఏకాంతంలో నేనేం చేస్తానో అని భయపడి చూడటానికి, కావలా కాయడానికి వచ్చాడట." నవ్వాడు రాజ్.

ఆ నవ్వులోని అర్థమేమిటో! అదే అర్థంకాదు. "నీ కొంటెమాటలతో నా నిగ్రహాన్ని కోల్పోతున్నాను, రాజ్" అని రజియా లేచి అతన్ని ఆనుకొని కూర్చున్నది.

ఆ మాటలువిని రాజ్ సంభాషణ ఆపివేసి ఇసుకతో ఆడుకో సాగాడు. అదిచూసి నవ్వింది రజియా. ఆమె గ్రహించిందని అతనికి తెలుసు.

"నువ్వు సముద్రంతో మాట్లాడడం ఎప్పుడు నేర్చుకున్నావు, రాజ్?"

"నీతో స్నేహమైనప్పటినుండి."

"అంతకు మునుపు?"

"అప్పుడు ఈ ఆనందం దరిదాపులకే వచ్చేవాడిని కాదు. జీవితంలో పుట్టినందుకుగాను బ్రతుకుతున్నాను అనుకొనేవాడిని. నే పెరిగిన పరిస్థితు లటువంటివి. కడుపునిండా తిండిలేక గడిపిన రోజులున్నాయి. అసలు జీవితానికి సుఖం, సౌఖ్యం, భోగం, భాగ్యం ఇవన్నీ అవసరమని నాకు తెలియదు. ఒక యంత్రంలా బ్రతుకును ఈడ్చుకొని పోతుండగా, ఏ దేవుడో దయతలచి పంపిన దేవతలా నా దారిలో నిలిచి నన్ను ఆహ్వానించావు. ఎందుకో నిరాకరించలేక నీవాడినయిపోయాను. ఆ అంధకారాన్ని నీ వెలుగుతో రూపుమాపి నాకు ఆనందాన్ని చవి చూపించావు. మోడుపోయి ఉన్న నా హృదయాన్ని చిగురింపజేసి ఒక దారి చూపించావు. ఆనాడు సంతోషము, సంతృప్తి అంటే ఎరుగని నేను ఈనాడు ఎనలేని ఆనందాన్నీ, సౌఖ్యాన్నీ అనుభవిస్తున్నాను. ఈ జీవితానికీ భాగ్యం చాలు."

"ఆనంద్ ఉన్నాడా, అరుణా!" లోపలికిపోతూ అక్కడ ఉన్న అరుణ నడిగాడు రాజ్.

"లోపలున్నా డన్నయ్యా!" అంది అరుణ.

"ఆనంద్" అంటూ ఆనంద్ గదిలోకి వెళ్లాడు రాజ్.

ప్రక్కపై పడుకొని ఏదో ఆలోచనలలో మునిగి తేలుతున్న ఆనంద్ లేచి కోపంగా చూశాడు.

"నిన్ను ఇక్కడి కెవరు రమ్మన్నారు ?"

"అదేమిట్రా అనవసరంగా అంత కోపం తెచ్చుకొంటావు ? ఈమధ్యేమైన అమ్మ ఉప్పూ కారం ఎక్కువ పెడుతోందా ?" అంటూ చిరునవ్వుతో అతని ప్రక్కనే కూర్చున్నాడు రాజ్.

"మిస్టర్ రాజశేఖరం ! మర్యాదగా ఇక్కడినుండి వెళ్ళిపో. లేకుంటే అనవసరంగా నా కోపాన్ని రెచ్చగొట్టినట్లవుతుంది" అని లేచి ప్రక్కకుపోయి నిలబడ్డాడు ఆనంద్.

"అసలు నీ కోపానికి కారణ మేమిట్రా ? రెండు రోజులనుండి కాలేజీకి రాలేదు. ఒంట్లో బాగులేదా ?" అని అతడి నుదుటిపై చెయ్యి వెయ్యబోయాడు రాజ్.

"మహా బయలుదేరావులేవోయ్! మిత్రుడిసౌఖ్యాన్ని కోరేవాడివి?" అని ఆ చేతిని విసిరికొట్టాడు ఆనంద్.

నిష్కారణమైన ఆ కోపాన్ని చూసి ఆశ్చర్యపోయాడు రాజ్. అతడిభుజాలు పట్టుకొని తనవైపుకు త్రిప్పుకుని "ఆనంద్ ! నా మొహం లోకి చూసి నేను నీకు ఏం అపకారం చేశానో చెప్పు" అన్నాడు.

రాజ్‌కళ్ళలోకి ఒక్కక్షణం చూసిన ఆనంద్ తల త్రిప్పేసుకుని బాధగా "రాజ్ ! నాముందునుండి వెళ్ళిపో. నాకెవరూ ఏ అపకారమూ చేయలేదు. విధే నాపై వక్రించింది. ఎన్నో కలలుకన్న నా భవిష్యత్తు అంధకారబంధురమై పోయింది" అన్నాడు.

"ఆనంద్ ! నామాట విను. నీ బాధేమిటో నాతో చెప్పు. ఎందుకు నీలో నువ్వే కుమిలిపోతావు ? అదేదో నాతో చెప్పరా."

"రాజా ! నేనేం చెప్పే పరిస్థితులలో లేను. దయచేసి నన్ను ఒంటరిగా ఉండనివ్వండి."

"ఒంటరితనం నీలోని బాధను ద్విగుణీకృతం చేస్తుంది కానీ తగ్గించదు."

"నీతో చెప్తే ఆర్చగలవా, తీర్చగలవా ?"

"ఎంతమాట అన్నావురా ! నాకున్న మిత్రులు మీరిద్దరే. ఒకవేళ నేను పేదవాడినే కావచ్చు. కానీ మీరు కోరితే ఆకాశంపైనున్న నక్షత్రాలనే కాదు కౌస్తుభాన్నిగూడా సాధించి తేగలను."

"నాదనుకొన్న వస్తువు నీదైంది. దాన్ని నాకివ్వగలవా?"

"ఇంతమాత్రానికే ఇంత రాద్ధాంతం చెయ్యాలా! స్నేహితుడు కోరిన కోరికను తీర్చలేనివాడు ఆ స్నేహానికే అర్థం లేదు."

"పూర్తిగా విను. నాదనుకొన్న రజియాను నువ్వు ఎగరేసుకు పోతున్నావు."

"ఆనంద్!" ఆశ్చర్యపోయాడు రాజ్.

"ఏం? భయపడుతున్నావు కదూ! కోరరాని కోరిక కోరుతున్నానంటావు కదూ! రజియాను వదులుకోలేనంటావు కదూ!"

"కాదురా! నువ్వింత మూర్ఖంగా ప్రవర్తిస్తున్నావే అని బాధపడుతున్నాను."

"అంటే?"

"నువ్వు నీ కోరికను ఇన్నాళ్ళుగా నీలోనే ఉంచుకొని నాతో వైరుధ్యం పెట్టుకున్నావు. నీ తెలివితక్కువవల్ల ఎంత అనర్థం జరిగిందో నీకు తెలియదు. నువ్వు రజియాను ప్రేమిస్తున్నావా?"

"ఔను."

"మరి ఆమె నిన్ను ప్రేమించిందా?"

"అనే భావించాను. నువ్వు ఆమెజీవితంలో ప్రవేశించక మునుపు ఆమె ఇక్కడికొస్తుండేది. నాతో చనువుగా మాట్లాడుతూ ఆనందాన్ని చేకూర్చేది. నన్ను ప్రేమిస్తున్నానని ఏనాడూ చెప్పలేదు. కానీ నా భవిష్యత్తుకు పునాదులు వేసుకొనేందుకు ఆస్కారాన్నిచ్చింది. ఎన్నో కలలు కన్నాను. కానీ ఈనాడు ఆమెదర్శనమే కరువైంది. నా కలలన్నీ కరిగిపోతున్నాయి. నా ఆశలు గాలిమేడలై కూలిపోతున్నాయి. ఆమె ఇక ఎప్పుడూ ఈ వైపుకు రాదు."

"ఎందుకు రాదు?"

"హుఁ. ఎందుకని అడుగుతున్నావా? నీ సాహచర్యం లభించిననాడు, నీ హృదయంలో స్థానం సంపాదించుకొన్న ఏ స్త్రీ కానీ స్వర్గసౌఖ్యాలను సైతము కాలితో తన్నివేస్తుందన్న సత్యం నీకు తెలియదేమో!"

"నువ్వు అది నా తప్పేనంటే అంగీకరిస్తాను. కానీ నువ్వు రజియాను ప్రేమించినవిషయం నాకు ఒక్కసారి చెప్పలేకపోయావా? నాకు తెలియచేసివుంటే ఈనాడు నేను నీముందు ఒక మిత్రద్రోహిగా నిలబడి ఉండను."

"నేనేమైనా కలగన్నానా నువ్వు ఆమెను స్వంతంచేసుకుంటావని?"

"నేనూ అదేప్రశ్న నిన్ను అడుగగలను. విచిత్రమైన పరిస్థితులలో ఆమె జీవితంలోకి ప్రవేశించాను. నువ్వీవిషయం చెప్పడానికి చాల ఆలస్యం చేశావు. కనీసం రెండు మూడు రోజుల క్రిందట ఈ విషయం చెప్పివుంటే పరిస్థితులింత విషమించి ఉండేవి కావు. ఇప్పుడు నన్నేం చేయమంటావు? రజియా ప్రేమను నిరాకరించి ఆమెను త్యజిస్తాను. సంతోషిస్తావా?"

"నువ్వు నా దారికి అడ్డుతొలగితే అంతే చాలు."

"సరే, నీ ఇష్టప్రకారమే చేస్తాను. అంతేకాదు. నీ ప్రయత్నానికి సహాయపడేందుకు ప్రయత్నిస్తాను. ఇప్పుడైనా నామీద కోపంపోయింది గదా? ఇక ఆ విషయం మరిచిపోయి సంతోషంగా మాట్లాడు."

కానీ ఆనంద్ తిరిగికూడ చూడలేదు. ఒక నిట్టూర్పు విడిచి బయటికి వచ్చాడు. గదిప్రక్కనే నిలబడివున్న అరుణను చూశాడు.

తనగది చేరుకొన్నాడు. ఆలోచనలు గజిబిజిగా వున్నాయి. రజియా రూపం కళ్ళలో మెదిలింది. ఆ దీనపుచూపులు తనగుండెల్ని పిండిచేస్తున్నాయి. మరోవైపు ఆనంద్ క్రూరంగా చూస్తున్నాడు. ఆ చూపుల్లో మాటకు కట్టుబడలేనివాడవనే అసహ్యం కనబడుతున్నాడు. తల తిరిగిపోతూంది. "హే భగవాన్! నువ్వెక్కడున్నావు? ప్రశాంతంగా సాగిపోతున్న నా యీ జీవితంలో యీ కలకలాన్ని ఎందుకు కలిగించావు? నా జీవితానికి ఎనలేని ఆనందాన్ని ప్రసాదించావని సంతోషించానే! ఇంతలోనే అంతకుమించిన దుఃఖాన్ని ఎదుర్కోమ్మని అంటున్నావు. ఇది నీకు న్యాయమా? అది నాకు సాధ్యమా? ఇది నీకు న్యాయమైనప్పుడు నాకంత శక్తినిగూడా ప్రసాదించడం నీకు ధర్మం" అని ప్రార్థించాడు.

మరునాడు రాజ్‌కోసం ఎదురుచూసిన రజియాకు ఆశాభంగ మైంది. ఆ సాయంకాలంకూడా రాజ్ కనిపించలేదామెకు. అతనిగదికి వెళ్ళింది. గదికి తాళంవేసి ఉంది.

"సుగుణా, మీ అన్నయ్య ఇంకా కాలేజీనుండి రాలేదా?"

"తెలియదండీ! పుదయంనుండి కనిపించలేదు." అక్కడే కూర్చుంది రజియా.

"అదికాదురా! వాడేదో మూర్ఖంగా మాట్లాడితే నువ్విలా ప్రవర్తిం చడం ఏం బాగులేదు. ఆ అమ్మాయి నీ కోసం ఎంతగా బాధపడుతుందో ఆలోచించావా?" అంటున్నాడు అదేసమయంలో ఎదురుగా దిగులుపడి కూర్చొనున్న రాజ్‌తో గోపి.

"మరేం చెయ్యమంటావు, గోపీ! రజియాతో కలిస్తే ఆనంద్ బాధపడడూ? మాట నిలబెట్టుకోలేనివాడినని నిందించడూ?"

"ఏడిశాడు. వాడేదో పిచ్చిపిచ్చిగా వాగితే స్నేహధర్మం అంటూ నువ్విలా ప్రవర్తిస్తావా?వాడిచేతకానితనానికి నువ్వాబాధ్యుడివి? పోనీ,నీతో ఏనాడైనా ఆ విషయం చెప్పాడా? ఈనాడు లతలా పెనవేసుకొన్న ఆమె ప్రేమను విడదీయడానికి నీకేం అధికారముంది? వాడికేం హక్కుంది? మీ ఇద్దరిమధ్యనా ఆమెజీవితం నలిగిపోవాలా?"

"ఏం చెయ్యడానికీ పాలుపోవడం లేదురా! ముందుచూస్తే నుయ్యి, వెనుకచూస్తే గొయ్యిలావుంది నా పరిస్థితి. ఎవరినీ బాధించలేను."

"వారికన్నా నీ బాధ ఎక్కువైంది. నువ్వు తలుచుకుంటే ఇవేమీ ఉండవు. వాడేమైనా ఏడిచి చావనీ, ఆ అమ్మాయి మనసుమాత్రం కష్ట పెట్టకు.

"అది నాచేతకాదురా! ఇప్పుడిప్పుడే ఈ సమస్య తెగేది కాదు. రెండురోజులు ఆ గదికికూడ వెళ్ళకూడదనుకొన్నాను."

"పోనీలే. ఇక్కడే ఉండిపో. పద. మా మామయ్యతో పరిచయం చేస్తాను. ఆ విషయాలు మరిచిపో."

రాజ్‌ను తమ యింటికి పిలుచుకుపోయాడు గోపి.

రాజ్‌ను చూసిన గోపీవాళ్ళమామయ్య. "నువ్వా అబ్బాయ్! రా కూర్చో" అన్నాడు.

రాజ్ ఆయన్ను ఆనందరావుగారి బాల్యస్నేహితుడుగా గుర్తించాడు. ఆనందరావుగారింట్లోనే ఆయనతో పరిచయమైంది.

"అదేమిటి, మామయ్యా! అతడు నీకు తెలుసా?" ఆశ్చర్యంతో అడిగాడు గోపి.

"నా సంగతి సరే. ఇతడు నీకెలా తెలుసోయ్?" తిరిగి ప్రశ్నించాడు ముకుందయ్య.

"వీడు నా ప్రాణమిత్రుడు, మామయ్యా!"

"ఇతడు నా బాల్యమిత్రుడికి ఆప్తుడు."

"ఆఁ" అన్నాడు గోపి.

ఇంతలో అక్కడికి ముకుందయ్య కూతురు శారద వచ్చింది.

"మా అమ్మాయి శారద" అంటూ పరిచయం చేశాడు ముకుందయ్య.

శారద బావ చెప్పుతుండగా రాజ్‌నుగురించి విన్నది. ఇప్పుడు ప్రత్యక్షంగా చూసింది. బావచెప్పినదానిలో అసత్యమేమీ లేదనిపించింది. అటువంటి స్నేహితుడిని సంపాదించుకొన్న బావను అభినందించకుండా ఉండలేకపోయింది.

# 12

క్లాలేజీ ఆవరణలోకి అడుగుపెడుతున్న రాజ్‌కు ఎదురుగా ఒక కారు సడన్‌బ్రేక్‌తో నిలిచింది. ఎవరా అని చూశాడు. ఆనందరావుగారి కారది. కారులోనుండి దిగిన రంగన్న "బాబూ, అయ్యగారికి చాల ప్రమాదంగా ఉంది. అమ్మాయిగారు సెలవుచీటి యిచ్చి రమ్మంటే ఇచ్చి పోతున్నాను."

కలవరపడ్డాడు రాజ్ ఆ వార్తవిని.

"ఎప్పటినుండి, రంగన్నా?" అని అతని జవాబుకు ఎదురుచూడకుండా "పద" అని కారులో కూర్చున్నాడు,

"రాత్రి జబ్బు తిరగబెట్టింది, బాబూ! రాత్రంతా డాక్టరుగారు ఆయనదగ్గరే ఉన్నారు."

"అంతగా ప్రమాదం సంభవించటానికి కారణం?"

"ఏముంది, బాబూ? అమ్మాయిగారి ప్రవర్తనే. ఆమెపై ఎవరో ఏదో చెప్పారట. రాత్రి ప్రొద్దుపోయి ఇంటికొచ్చిన అమెగారిని నోటి కొచ్చినట్లు తిట్టి రక్తపుపోటు తిరగబెట్టగా పడిపోయారు."

ఆందోళన పడ్డాడు రాజ్. ఛః తండ్రికి శాంతినివ్వలేని ఈ బిడ్డల్ని దేవుడెందుకు ప్రసాదిస్తాడో? ధనం, గుణం, పరోపకారబుద్ధి కలిగిన అటువంటివారికి లోటును ఎందుకు కలిగించావు దేవుడా అనుకొంటుం డగా కారు బంగళాలోకి ప్రవేశించింది.

ఒక్క ఊపులో లోపలికిపోయాడు రాజ్. ఆనందరావుగారు పడు కొన్నారు. వారి ప్రక్కన నౌకరు, వసంత, డాక్టరు నిలబడి ఉన్నారు.

వారిఫామిలీ డాక్టరు కేశవరావుగారు రాజ్‌నుచూసి చిరునవ్వుతో "మీరిక్కడుండడం చాల అవసరం" అన్నాడు.

"అలాగేనండీ. తప్పకుండా ఉంటాను" అన్నాడు రాజ్.

మందులు, మాత్రలు ఎలా ఇవ్వాలో వివరంగా చెప్పి డాక్టరు వెళ్ళిపోయాడు. డాక్టరును బయటివరకూ సాగనంపాడు రాజ్.

"చూడండీ, వాళ్ళమ్మాయిని సాధ్యమైనంతవరకూ వారికి దూరంగా ఉంచండి" అని చెప్పిపోయాడు డాక్టరు.

"డాక్టరుగారేమన్నారండీ" అంది వసంత తిరిగివచ్చిన రాజ్‌తో.

"మరేం ఫరవాలేదన్నారులే" అని అక్కడే కూర్చున్నాడు.

ఆనందరావుగారు అటూఇటూ కదిలారు. కళ్ళుతెరిచి ప్రక్కనేవున్న వసంతను చూసి తిరిగి బాధగా కళ్ళు మూసుకున్నారు.

"ఇక నువ్వెళ్ళు, వసంతా. అంతా నే చూసుకుంటాను" అన్నాడు రాజ్. అర్థంచేసుకొని వెళ్ళిపోయింది వసంత.

కళ్ళు తెరిచి "నువ్వు వచ్చావా, శేఖరం" అన్నారు ఆనందరావు గారు మెల్లగా.

"మీరు మాట్లాడకుండా పడుకొని విశ్రాంతి తీసుకోండి."

"ఏం విశ్రాంతో! చచ్చిపోయిన తర్వాతనే ఈ జీవికి 'విశ్రాంతి" అని కళ్ళు మూసుకొని ఒకప్రక్కకు తిరిగి పడుకొన్నాడు ఆనందరావు గారు.

*  *  *

రాజ్ రాత్రి గదికే రాలేదని తెలుసుకొన్న రజియా కాలేజీలో విచారించింది. అతను కాలేజీకిగూడా రాలేదని విని ఆశ్చర్యపోయింది. ఆ సాయంకాలం విచారవదనంతో కూర్చొనివుండగా కారాగినచప్పుడయి ఎవరా అనిచూసింది. ఎదురుగా చిరునవ్వులతో సరోజినీదేవి ప్రత్యక్షమైంది. ఆమెనుచూసి తన దుఃఖాన్ని మరిచిపోయి ఉత్సాహాన్ని తెచ్చుకొంది రజియా.

బయట కారాగినచప్పుడు విని "ఎవరమ్మా, రజియా" అని లోపలినుండి వచ్చిన ఖాన్‌గారు "సరూ, నువ్వా! చాలరోజుల కొచ్చావే!" అన్నారు పైప్ నోట్లోంచి తీసి చేతిలో పట్టుకొని.

చిరునవ్వుతో జవాబుచెప్పింది సరోజినీదేవి. నౌకరుతెచ్చిన టీ త్రాగినతర్వాత "అమ్మాయిని మా మహిళామండలికి తీసుకెళ్ళదాని కొచ్చాను. పంపిస్తావా, ఖాన్" అందామె.

"అలాగే. అమ్మాయి యిష్టపడితే తీసికెళ్ళు."

రాజ్ వస్తాడేమోనని ఎదురుచూస్తూ నిరాశలో ఆశను పెంచుకొంటున్న రజియా "ఏం రజియా" అని సరోజినీదేవి అడగ్గానే ఇబ్బందిలోపడి ఒప్పేసుకొని లేచింది.

కాలేజీనుండి వచ్చి దుస్తులుకూడా మార్చుకోలేదు రజియా. "ఈ డ్రెస్ బాగులేదు. నేను అలంకరిస్తానురా" అని లోపలికి తీసుకుపోయింది సరోజినీదేవి.

కాసేపటికి బయటికిపోతున్న వారిద్దరినీ చూసి నిర్లిప్తంగా నిట్టూర్చడం మినహా మరేం చెయ్యలేకపోయారు ఖాన్‌గారు.

మహిళామండలి లోపలికి ప్రవేశించగానే వారికి మరో ఇద్దరు స్త్రీలు ఎదురయ్యారు. వారిలో ఒకరిని జడ్జిగారి భార్యగా గుర్తించ గలిగింది రజియా.

"ఈ అమ్మాయి నీ కూతురా, సరోజా!" అడిగిందామె సరోజినీ దేవిని.

ఆ హఠాత్ ప్రశ్నకు తల ఊపేసింది సరోజినీదేవి.

"అదేమిటే, నీకింత కూతురుందని మా కెప్పుడూ చెప్పలేదేం" అంది మరో కావిడ. సరోజినీదేవి తల ఊపడం చూసి ఆశ్చర్య పోయింది.

అప్పుడే రజియాను తనివితీరా చూసి తృప్తిపడుతున్న సరోజినీ దేవి ఆవిడమాటలు విని "సారీ. ఈ అమ్మాయి మా స్నేహితురాలి కుమార్తె. వీళ్ళ తల్లి, నేను బాల్యమిత్రులం" అంది. మనసులో ఉబుకుతున్న దుఃఖాన్ని పైకి కనబరచకుండా ఉండాలని ప్రయత్నిస్తూంది ఆమె. అది గమనించింది రజియా. బహూశా తన తల్లి చనిపోయిందనే దుఃఖం ఆమెలో ప్రబలిందేమోనని అనుకొంది.

సరోజినీదేవి వారిని రజియాకు పరిచయం చేయాలనుకొన్న విషయమే మరిచిపోయి అక్కడ ఎక్కువసేపు ఉండలేక రజియాను తీసుకొని లోపలికి పోయింది.

సరోజినీదేవి రజియాను మహిళామండలిలోని ఒక్కొక్కచోటికి తీసుకెళ్ళి అన్నీ చూపించింది. ఒకచోట కుట్టుమిషన్‌మీద పని నేర్పుతున్నారు. స్వంతంగా కుట్టుమిషన్ పెట్టుకొని తమపనులు నిర్వర్తించుకొనేందుకేమో ఆ పని నేర్పుతున్నారు. అందరూ ఆ విధంగా చేస్తే మరి టెయిలర్లు జీవనోపాధి లేక మాడిపోరూ?

మరోచోట సంగీతశిక్షణ నిస్తున్నారు. ఎవరికిష్టమైన విధంగా వారికి ఆ సంగీతాన్ని నేర్పుతున్నారు. ఎవ్వరూ నిరుత్సాహపడకూడదు. అందరికీ ఉత్సాహాన్నీ, ప్రోత్సాహాన్నీ ఇచ్చి కష్టపడుతున్నారు. ఆయా వృత్తులకు నియమింపబడిన ఇన్‌స్ట్రక్టర్లు. వారికి వేతనాలు. అదే కాదు, అల్లికపనులు, కుట్టు పనులు మొదలగున వెన్నో నేర్పుతుంటారు. ఆటలకు ప్రోత్సాహమూ, శిక్షణా విరివిగా వుంటాయి. దాని లోపలే చదువుకొనడానికి లైబ్రరీ వుంది. వివిధరకాలైన ఆటలు ఆడుకోవచ్చు.

మహిళామండలి మొత్తంమీద ఒక అభివృద్ధిసూచక సంస్థ అని చెప్పక తప్పదు. దీని ఉద్దేశ్యమేమిటి? వెనుకబడివున్న స్త్రీ జాతిని పున

రుద్ధరించడమే। మహిళలు అన్నిరంగాల్లో ముందంజ వేయాలి. మగ వారికి ఎందులోనూ తీసిపోకూడదు. వారితో సమానమైన స్థానాన్ని సంఘంలో సంపాదించుకోవాలి. స్త్రీ అంటే అబల కాదు, సబల అని ఈ ఆధునిక జీవితంలో నిరూపించుకోవాలి. స్త్రీ విద్యావిహీనురాలు కాదు. విజ్ఞానవంతురాలు అని లోకానికి చూపాలి. గౌరవం లేకుండా బ్రతుకు తూంది స్త్రీజాతి. ఎందుకు? ఏమీ చేతకానిదనా? ఎందుకూ కొరగానిదనా? కాదు. ఆమె కన్నీ చేతనవును, ఆమెకు తగిన గౌరవం యివ్వాలి. అందుకే కంకణం కట్టుకొంది స్త్రీ జాతి నుద్ధరించడానికి ఈ మహిళా సమాజం.

చదువు రానివారికి చదువు నేర్పించడం, విజ్ఞానాన్ని బోధించడం లాంటి పనులు చేస్తుంటుంది. సభ్యత సంస్కారాలు అలవరచుకొనే విధం నేర్పుతుంది. పదుగురిలో మెలగవలసిన విధానాన్ని యిక్కడ నేర్చుకొంటారు స్త్రీలు. ప్రతి విద్యలోనూ కాకపోయినా ఒక విద్యలో నైనా ప్రావీణ్యాన్ని గడించుకొమ్మంటుంది. సంసార జీవితానికి అవసర మైన నడవడికను నేర్చుకోగలదు ఆడది. తమ బాల్యంలో చదువుకోవ డానికి గానీ, విజ్ఞానాన్ని అలవరచుకోవడానికి గానీ వీలుపడని సంసార స్త్రీలకు ఇవి మరొక అపూర్వ అవకాశంలాంటిది. ఉదయంనుండి భర్తతోనూ, బిడ్డలతోనూ విసిగిన స్త్రీకి యిది కొంచెం విశ్రాంతినిచ్చి స్వేచ్ఛావాయువులను పీల్చుకొనడానికి అవకాశాన్నిస్తుంది. కాలక్షేపానికి వుపయోగించుకొనే వాఞ్ఛా లేకపోలేదు. తోటి స్త్రీలతో కలిసి పిచ్చా పాటీ మాట్లాడుకునే అవకాశం లభిస్తుంది. జీవనోపాధికి వృత్తుల నభ్య సించుకొనే ఉద్దేశ్యంకూడా కొందరికి ఉండకపోదు. కొందరికి జీవనో పాధులను కలిగించే ఈ మండలి అందరి మన్ననలకూ పాత్రమవు తుంది.

కానీ మానవత్వానికి కొన్ని చెడ్డగుణాలు ఉన్నాయి. అవి అప్పు డప్పుడు వారిని పెడదారిని పట్టిస్తూంటాయి. యిక్కడికి వచ్చే స్త్రీలలో స్వార్థం, గర్వం, అసూయ, పరస్పర విభేదం ఎక్కువగా కనిపిస్తాయి. ధనవంతులమనే గర్వం, ఆఫీసర్ల భార్యలమనే ఠీవి ఎక్కువగా ఉం టాయి। మంచి మనసుతో యితరుల నర్థం చేసుకొని సభ్యత సంస్కా

రాలు అలవరచుకొనేవారు చాల అరుదు. ధనవంతులకు పేదవారిపై చులకన. వారూ తమతోబాటు మండలికి వస్తారే అనే భావం వారిలో మెదలుతుంటుంది. వారూ తమవలె మనుష్యులే, వారికీ తమవలెనే ఎన్నో కోరికలు ఉంటాయన్న విషయం విస్మరించి అవహేళనగా మాట్లాడతారు. వారిలో వారికి అసూయా, పరస్పర విభేదాలు ఎప్పుడూ మసలుతుంటాయి. ఒకరిపై మరొకరికి మనసుల్లో కోపమూ, జుగుప్సా కారణం లేకుండానే కలుగుతుంటాయి. ఆఫీసర్ల భార్యలూ తమకన్నా తక్కువవారితో మాట్లాడడానికీ, వారితో కలిసిపోవడానికీ భయపడి అది తమ కవమానమని భావిస్తారు. అది వీరి తప్పుకాదు. మానవసహజమైన దుర్గుణాలను వారు ఆచరిస్తున్నారు. అలాగని మంచి నడతతో పేదలనే భావం లేక హెచ్చుతగ్గుల తారతమ్యం లేక అందరిలో కలిసిపోయే మహానుభావురాళ్ళు వుండకపోలేదు.

పేదలకు తమ లేమిపై కోపం, అందవికారులకు తమ కటువంటి రూపాన్నిచ్చిన దేవునిపై కోపం, తక్కువ కులస్థులకు, తమ కులంపైనే అసహ్యం. మండలిలో సామాన్య దృష్టిలో కులమతాలకు పట్టింపులు లేకపోయినా వ్యక్తిగతంగా వీటికి ఎక్కువ ప్రాధాన్యం వుంది. మనం సృష్టించుకొన్న ఈ మతాలనుచూసి మనం భయపడుతుంటే దేవుడు సృష్టించిన మనలను, మనలోని దుర్గుణాలనుచూసి ఎవరు భయపడతారు? అదికూడా మనమే భరించవలసివుంటుంది. ఎప్పుడు పుడతామో, ఎప్పుడు చచ్చిపోతామో తెలియని మనం ఆ చావు బ్రతుకుల మధ్యకాలంలో ఎన్నిపనులు చేస్తుంటామో! ఎన్నిపనులు చేయాలని ఆత్రుత పడుతుంటామో! ఎందుకో ఆ ఆవేదన? ఎందుకో ఆ ఆత్రుత? జీవితం బుద్బుదప్రాయమని తెలిసినా ఈ ఆవేదననుండి, ఈ కష్టాలనుండి మనం విముక్తులం కాలేకున్నాము.

సరోజినీదేవి తన టేబుల్‌ముందు కూర్చొని ఏదో ఫైలు తిరగవేస్తూంది. రజియా అక్కడే బీరువాలలోనున్న పుస్తకాలను చూడసాగింది. అవి చూడడం ముగించి గోడలకున్న ఫోటోలను చూస్తూ ముందుకు పోయింది. ఆ గోడలకు ఎన్నో ఫోటోలు. ఆ ఫోటోలలో ఎందరో వ్యక్తులు. ఎవరు వారంతా? బహుశా అక్కడ వుండి సర

దాగా జ్ఞాపకార్థం గ్రూపుగా తీయించుకున్న ఫోటోలేమో. కలిసికట్టుగా నున్నపుడు ఆప్యాయతను, అభిమానాన్ని ఒలకబోస్తారు. దూరమైతే ఎవరికి వారే! మరి ఎందుకీ తతంగమంతా అని నవ్వుకొంది రజియా. అక్కడే గోడలకు కొన్ని చిత్రలేఖనాలు ఉన్నాయి. మొదట అవి ఫోటోలా అని భ్రమపడ్డది రజియా. కానీ ఆ తర్వాత కాదని తెలుసుకొంది. బాపూజీని, దేశనాయకుడు నెహ్రూగారిని అతినేర్పుతో చూపరులచే మెప్పింపబడే విధంగా చిత్రించిన ఆ చిత్రకారు లెవరో పుణ్యాత్ములు అనుకొంది.

మరికొన్ని చిత్రాలు చూసింది. అన్నిటికన్నా ఒక చిత్రం ఆమెను ఎక్కువగా ఆకర్షించింది. అది ఒక నగ్నరూపమైన స్త్రీ చిత్రం. కళను అర్థంచేసుకొని, తనలోని హావభావాలను చూపించి లోకపు చీకటితెరలను తన శక్తితో తొలగించి లోకానికొక దివ్య సందేశాన్నివ్వాలని అతి కష్టంతో, ప్రయాసతో చిత్రకారుడు నిర్మించిన జ్యోతి. నగ్నరూపమని తెలియనివారు అసహ్యించుకోవచ్చు. కానీ కళాకారులకు, కళాహృదయులకు దానిపై దృష్టే పోదు. ఆ నగ్నరూపం వెనుక దాగిన సత్యాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తారు వారు.

స్త్రీ దుస్తులు ధరించి ఉన్నప్పుడు అందంగా కనబడుతుంది. కోరికలను కలిగిస్తుంది. అదేరూపాన్ని నగ్నంగా చూసినపుడు అసహ్యించుకొంటాం. ఆ ఆకర్షణ అనేది అంతా ఉత్త భ్రమేనన్న నిజాన్ని చెప్తుంది. ఆ స్త్రీ సృష్టికి అర్థం తెలుసుకొన్ననాడు ఆమె నగ్నరూపం మాత్రమే మన కగపడి ఇదొక భ్రమ అనే సందేశాన్నివ్వవచ్చు. లేదా ఇదొక మహత్తర శక్తి అనే సత్యాన్ని తెలుపనూవచ్చు. అలాగే జీవితపు విలువలను, ప్రపంచపు బూటకాన్నీ ఆలోచించి అవగాహన చేసుకోగలిగిననాడు లోకం మాయ అనే భావమేకాక అర్థంకాని అద్భుత శక్తిగా కనబడుతుంది. అది తెలుసుకొన్నవారు జీవితాన్ని త్యజించి మహాత్ములుగా, విరాగులుగా మన కళ్ళముందు నిలిచారు.

"అమ్మా, ఇక్కడ చిత్రలేఖనంగూడా నేర్పుతారా ?" అని అడిగింది రజియా ఆ ఆశ్చర్యంలో.

'అమ్మా' అన్న పదం విని ఉలిక్కిపడింది సరోజినీదేవి. ఆ పిలుపు ఆమెలో నిద్రాణమైన కోరికను లేపింది. ఆపుకోలేని ఆత్రుత, ఆనందం ఆమెను ఆవరించాయి. ఆవేదన కలతపెట్టగా దాన్ని ఆనందంతో అణిచివేసింది. ఏ శక్తీ ఆమె ఆనందానికి అడ్డు రాలేకపోయింది. దేనికోసమో తహతహలాడుతూంది ఆ ఎండబారిన మనసు.

"మిమ్మల్ని అమ్మా అని పిలవాలని ఉంది. అభ్యంతరమా ?" అంది రజియా.

ఆమెనుండి జవాబురాకపోవడంతో ఆమె పరిస్థితినిచూసి తనేమన్నది తెలుసుకొని ఆశ్చర్యపోయింది. "రజియా" అంటూ ఆమె రజియాను ఆలింగనంచేసుకొంది. ఆ ఆలింగనలో మితిలేనిఆనందముందిఇద్దరికీ. ఆహాయినీ, ఆ సుఖాన్నీ ఎన్నడూ పొంది ఉండలేదేమో ! ఆ సుఖం ఎక్కడ దూరమవుతుందోనని ఆత్రుతతో ఒకరినొకరు గట్టిగా ఆలింగనం చేసుకొని ఉండిపోయారు. రజియా ఆమె హృదయంపై తలపెట్టి ఆ సుఖంలో పులకరించిపోయింది. అదొక క్రొత్త సుఖం, ఆనందం. అది ఎటువంటి ఆనందం ? మాతృమూర్తి కన్నబిడ్డకిచ్చే క్రొత్తసుఖాన్ని అనుభవిస్తూంది రజియా. తన బిడ్డను తనకౌగిలిలో తీసుకొని ఆనందించినట్లుంది సరోజినీదేవికి. ఎందుకో ఆ ఆనందం ? ఎన్నాళ్ళదో ఆ బంధం ?

"ఏమేమి చూశావమ్మా ?" అడిగారు ఖాన్‌గారు రజియాను. అన్నీ విడిచిపెట్టకుండా చెప్పి "నాన్నా, ఆమె ఆలింగనంలో చిన్నప్పుడు నేను దేనికై మారాం చేస్తుంటినో ఆ సౌఖ్యం లభించింది" అంది.

"ఊఁ" అని దీర్ఘంగా నిట్టూర్చారు ఖాన్‌గారు.

"నీకు కోపమా, నాన్నా ?"

"ఆమె నీకు తల్లితో సమానురాలు. నువ్వామెకు బిడ్డవు, అటువంటి మీ ఆనందాన్ని రోజూ ప్రత్యక్షంగా చూసి ఆనందించే వ్రాత భగవంతుడు నా నొసట తప్పించాడమ్మా ! నాకెందుకు కోపం" అని తన మొహం త్రిప్పేసుకొని అక్కడినుండి వెళ్ళిపోయాడు ఖాన్. తండ్రి మొహంలో బాధ, కన్నీరు చూసి అర్థంకాక అతనిమాటలను మననం

చేసుకొని ఒక నిర్ణయానికి రాలేకపోయి అక్కడే కూలబడింది రజియా.

# 13

రాజ్ విధీ విరామం లేకుండా ఆనందరావుగారి ప్రక్కనే కూర్చుని పరిచర్యలు చేయసాగాడు. అతని సేవలో కొస్త కోలుకొన్నారు ఆనందరావుగారు. సాయంకాలం "ఎలావుంది, నాన్నా ?" అంటూ వచ్చింది వసంత.

"నా తలకాయలా ఉంది. ఎలావుంటే నీ కెందుకు ? నే చస్తే నీ కెందుకు ? పో" అన్నా రాయన కోపంగా.

ఏడుస్తూ అక్కడినుండి వెళ్ళిపోయింది వసంత.

ఆవేశం ఎక్కువకాగా అలాగే ప్రక్కపై పడుకోబెట్టాడు రాజ్ ఆయన్ను. బయటికి వెళ్లాడు. వసంత సోఫాలో కూర్చొని మొహం చేతులతో కప్పుకొని ఏడుస్తూంది. ఆమె స్థితికి జాలిపడ్డాడు రాజ్.

"వసంతా! నాన్నగారు త్వరగా కోలుకోవాలంటే రెండు రోజుల వరకు వారి కంటబడకు" అన్నాడు.

తలెత్తి అతనికళ్ళలోకి చూసింది వసంత. నిస్సహాయత చూపిస్తూ తప్పదంటున్నాయి ఆ కళ్ళు.

"భయపడుతున్నావా, వసంతా !"

"లేదు, మీరు వారిప్రక్కనుండగా వారికెలాంటి భయం లేదని నాకు తెలుసు. మీచెయ్యి తాకితే చాలు, వారికి జబ్బు నయమవుతుంది."

అక్కడినుండి తిరిగి వచ్చేశాడు రాజ్.

గదిలోకివెళ్ళి పడుకొన్న వసంతకు చదువుకోవాలనిపించి పుస్తకాలు తీసింది. కానీ ఆ పని చేతకాక తిరిగి పడుకొంది. నిద్ర రావడం లేదు. కడకు తండ్రిచేతకూడ అసహ్యింపబడింది తను. తనఎదుటే తనను గౌరవిస్తున్నారు తన మిత్రులు. అదీ తన అందాన్ని చూసి. తన వెనుక తనగురించి ఎటువంటి మాటలు, విమర్శలు జరుగుతున్నాయో తను

ఊహించుకోగలదు. ఛీ! పాడు బ్రతుకు! అని నిద్రకు ఉపక్ర మించింది.

వసంతకు పెళ్ళి నిశ్చయం చేశారు ఆనందరావుగారు. ఆనాడు ఆమె పెళ్ళి. పెళ్ళిపందిరి కోలాహలంగా వుంది. వసంత మరొకరిదై పోయింది. ఒకరి పాదదాసి! ఎవరా ఒకరు? రాజశేఖరం. ఆ పెళ్ళి ఆమె కిష్టమో, లేదో ఆమెకే తెలియదు. ఆమె స్వేచ్ఛ అరికట్టబడింది.

కానీ అది ఆమె కిష్టంలేదు. తన స్వేచ్ఛను వదులుకోలేదు. తన ఆనందాని కడ్డు రాకూడదని ప్రతిఘటించింది. ఏమీ అనలేకపోయాడు రాజ్. తన యిష్టంవచ్చినట్లు తిరిగింది. తనకిష్టమైన వారితో స్నేహం చేసుకుంది. అడ్డు చెప్పే అధికారం రాజ్‌కు లేదు. ప్రతిఫలంగా అవ మానాల పాలయ్యాడు. మానవత్వపు సహనానికి హద్దులను మించి ఓర్పు వహించాడు. దుర్భరమైపోయింది. జీవితంతో విసిగిపోయాడు. యౌవ నంలో అనుభవించవలసిన ఆనందం బదులు నరకాన్నే అనుభవించాడు. ఎవరికోసం ఈ మౌనాన్ని వహించాలి? ఎందుకీ పాడు జీవితం? ఆలో చించాడు. మనశ్శాంతి అనే చావును వెతుక్కుంటూ ప్రయాణమయ్యాడు. తనతప్పు తెలుసుకుని క్షమాపణకై అతన్ని వేడుకుంది. కానీ అదివరకే అతనిహృదయాన్ని కఠిన శిలగా మార్చిన ఆమెకు క్షమాపణ దొరక లేదు. ఎక్కడికో పోతున్నాడు. ఎత్తైన కొండలనుండి తనను దాచు కొమ్మని అగాధమైన లోయలలోకి వెళ్ళిపోయాడు.

కలవరపాటుతో ఉలిక్కిపడి నిద్ర మేల్కొంది వసంత. గదిలో దీపం వెలుగుతూంది. కలను తలుచుకుని భయపడింది. క్రిందికివచ్చి చూసింది. తండ్రిగదిలో రాజ్ చదువుకుంటున్నాడు. అక్కడే సోఫాకు జేరగిలబడి నిద్రపోయింది.

ఎక్కడో సైరన్‌మ్రోత ఆమెను నిద్ర లేపింది. టైమ్ చూసు కుంది. అయిదయింది. తండ్రిగదిలో రాజ్ ఇంకా మేల్కొనే ఉన్నాడు. ఆశ్చర్యపోయింది.

ఎందు కంత మమకారం? అత నెవరు? నాన్నగారికీ, అతనికీ గల సంబంధ బాంధవ్యా లేమిటి? ఏమీ లేవు. అతని చదువుకు సహాయం చేస్తున్నాడు తండ్రి. అందుకని నాన్నగారిపై అంత భక్తి వుందా?

అర్థంకాని ఆంతర్యమే. కన్నకూతురైన తను ఆ సేవలు చేయలేదు. తన కంత ఓపిక లేదు. రక్తాన్ని పంచుకుని పుట్టిన బిడ్డలకే లేని మమత, మమకారాలను ఎవరికో యిచ్చి వారిచేత పరిచర్యలు చేయిస్తున్నాడు భగవంతుడు. 'నీ లీలలు అమోఘం!' అనుకుని వెనుతిరిగింది.

ఉదయానికి పూర్తిగా కోలుకొన్నారు ఆనందరావుగారు. డాక్టరు గారు వచ్చి చూసిపొయ్యారు.

"నువ్వు కాలేజీ కెళ్ళవోయ్! నాకేం ఫర్వాలేదు" అన్న ఆయన గారి ఆజ్ఞ కాదనే ధైర్యంలేక కాలేజీకి బయలుదేరాడు రాజ్. కాలేజీలో మూడవ పీరియడు క్లాసు లేకపోవడంతో ఇంటికి తిరిగి బయలుదేరాడు. ఆనంద్ తననుచూసి తల త్రిప్పుకుని పొయ్యాడు. అది తనకు బాధా కరంగా ఉంది.

"ఏమండీ?" అన్న పిలుపు విని వెనుతిరిగిచూశాడు. లత.

"ఏం, లతా!" అని ఆమెను కాసేపు ఉడికించాలనుకొన్నాడు మనసులో.

"మీరు ఒకసారి మా యింటికి రావాలి."

"ఎందుకూ?" ఆశ్చర్యపోయాడు రాజ్.

"మీకు కాఫీ ఇవ్వాలని ఉంది."

"ఇక్కడే క్యాంటీన్‌లో ఇప్పిస్తే సరిపోతుందిగా!"

"అది కాదండీ! ఇంట్లోనే ఇవ్వాలని మా అక్కయ్య తీసుకు రమ్మంది" అంది లత, ఎక్కడ రానంటాడోనని.

ఇందుకు ముఖ్యపాత్రధారులుకూడా ఒకరున్నారా అని ఆశ్చర్య పోయాడు. కొంపదీసి వీళ్ళక్కయ్యకూడా ఏదైనా చిక్కుల్లోపడి సలహా కోసం ఈవిడగారి రికమెండేషన్‌పై అడ్వాన్సుగా కాఫీ లంచంగా పడే స్తుందా అని అనుమానపడి తన ఊహకు తనే నవ్వుకున్నాడు. అయినా ఈమధ్య తాను సలహాలరావు అయిపోయాడేమిటి? తన పేరైనా మార్చు కుంటే బావుంటుంది.

"ఏమంటారు? సాయంకాలం వస్తారా?"

"ఇంతకూ ఏ సందర్భంలో ఈ ఆహ్వానం జరుగుతోందో తెలుసు కోవచ్చా?" ఎందుకైనా మంచిదని ముందుగానే అడిగేశాడు.

"మీరు నా జీవితానికో మార్గాన్ని చూపించారు. అందుకు కనీసం కృతజ్ఞతనైనా తెలుపుకోవాలిగా?"

"ఇది నాకు లంచమా!"

"ఎలాగైనా అనుకోవచ్చు." నవ్వింది లత.

"కొంపదీసి అలా ఎవరితోనైనా చెప్పేరు. అవినీతి నిరోధక శాఖ అని ఒకటి బయలుదేరింది మధ్య మన కాలేజీలో. నేను మీ దగ్గర లంచం పుచ్చుకున్నానని వారు తెలుసుకుంటే నామీద దాడిచేసి ఎంక్వయిరీ లంటూ పలుమార్లువచ్చి ఒక కాఫీకి బదులుగా ఏ అయిదారు కాఫీలైనా మర్యాద అనే లంచంగా తీసుకొని మరీ విడిచిపెడతారు. ముందే బీద వాణ్ణి. అంతపని చేయకండి. భరించలేను."

అతని మాటలకు నవ్వకుండా ఉండలేకపోయింది లత. "మీరు చాలా తమాషాగా మాట్లాడుతుంటారే!"

"అది అప్పుడప్పుడు మనకొచ్చే జబ్బు. ఇంతకూ రాకతప్ప దంటావా?"

"ఊహూఁ. ఏం లాభంలేదు "

"సరే. రేపు ఆదివారం వస్తాను" అని ఆమెదగ్గర సెలవు తీసుకొని ముందుకు నడిచాడు.

కారు హారన్ వినిపించింది. అదెవరిదో గ్రహించగలిగేంతలో ఆ కారు అతనిప్రక్కనే ఆగింది.

"ఇంటికొస్తున్నారా? " ప్రశ్నించింది వసంత.

ఔనని తల ఊపాడు.

"అయితే కారెక్కండి" అని తలుపు తీసింది వసంత. ఆమెను నిరుత్సాహపరచడం ఇష్టంలేక కారెక్కాడు.

"మీకూ క్లాసులులేవా?" అడిగింది వసంత.

"అంటే మీకుగూడా లేవా?" తిరిగి ప్రశ్నించాడు రాజ్.

"మా క్లాసువారు స్ట్రైక్ చేస్తున్నారు."

"కారణం?"

"క్రొత్తగా వచ్చారు, భానుమూర్తిగారని లెక్చరరుగారు. తెలుసా?"

"ఆ వామనరావుగారి వెంట ఉండేవారేకదా? తెలుసు."

"ఆయన ఉన్నట్లుండి మా క్లాసు తీసుకోవడం మానేశారు. మాకు ఆయనే కావాలని విద్యార్థులు స్ట్రైక్ చేశారు. ఆయన ససేమిరా అని మొండికేశారు."

"ఆయన మీ క్లాసు తీసుకోకపోవడానికి కారణమేమిటో నీకు తెలుసా?"

ఆ ప్రశ్న విని కంగారుపడి స్టీరింగ్ వదిలేసి తిరిగి సంబాళించు కొంది వసంత. అది చూసి అనుమానంగా ఆమె మొహంలోని భావా లను కనిపెట్టడానికి ప్రయత్నించాడు రాజ్. ఏదో దాచ ప్రయత్ని స్తూంది వసంత. మొహంలోనికి చిరునవ్వు తెచ్చుకొని "నాకెలా తెలు స్తుంది?" అంది.

రాజ్ మౌనం వహించాడు.

"రాత్రి కాసేపయినా నిద్రపోయారా?" అడిగింది వసంత.

"ఊఁ"

"అబద్ధాలాడటంకూడా అలవాటుందా?"

"తెలిసీ అడగడం దేనికి?"

"ఒకవిషయం అడుగుతాను, చెప్తారా?"

"ప్రయత్నిస్తాను."

"మీకు నాన్నగారిపై ఎందుకంత మమకారం?"

"మనిషికి మనిషిపై మమకారం లేనప్పుడు మానవత్వానికే అర్థం లేదు.

"ప్రతి మనిషికీ యితరుల నాదుకోవాలనే ఆత్రుతా, పరాయివారికి సహాయం చెయ్యాలనే కోరికా ఉంటాయా?"

"అది వారివారి మనస్తత్వాలనుబట్టి వుంటుంది. తమవారికిగూడా రవంతసహాయం చేయలేని మూర్ఖులు ఉన్నారు; పరాయివారినిసైతము తనవారిగా ఎంచి ఆదుకొనే పుణ్యాత్ములూ ఉన్నారు. అదే మానవ

త్వాన్నీ, సంఘీభావాన్నీ చాటుతుంది. మానవులలోనేకాదు; పశుపక్ష్యాదులలోకూడా ఈ భావాలుంటాయి."

వసంత మరి మాట్లాడలేదు. కారును బంగళాలోనికి త్రిప్పింది. తనకూడా వస్తున్న వసంతను, నిలబడి ఒకవిధంగా చూశాడు. అర్థం చేసుకొన్న వసంత నిస్పృహను సూచించే ఒక చిరునవ్వు విసిరి తన గదికి వెళ్ళిపోయింది.

"ఏమిటోయ్, అప్పుడే వచ్చేశావు?" అడిగారు ఆనందరావుగారు.

చెప్పాడు రాజ్.

"మరి అమ్మాయికూడా వచ్చిందా?"

"వచ్చిందండీ! పాపం మీరు కేకలేశారని చాల బాధపడి ఏడుస్తోంది."

ఆనందరావుగారిలో పుత్రికా వాత్సల్యము, జాలి పుట్టుకొచ్చాయి. నౌకరును పిలిచి అమ్మాయిని పిలుచుకురమ్మని చెప్పాడు. అది విని ఆశ్చర్యపోయినా తిరిగి ఏం ఉపద్రవం వాటిల్లమన్నదో అని భయపడింది వసంత.

"ఇలా రా అమ్మా! కూర్చో" అని ఆయన ప్రేమతో పిలవగానే మొదట నమ్మలేకపోయింది. నమ్మి ఉప్పొంగిపోయింది. మెల్లిగా అతని ప్రక్కనే కూర్చుంది.

"నిన్ను కోపంలో ఏమేమో అన్నానుకదూ? ఎన్నడూ పల్లెత్తు మాట అనలేదు. ఈనాడు నిన్ను నోటికొచ్చినట్లు తిట్టాను. తల్లిలేనిదానివని ముద్దుగా పెంచి ఈనాడు నిన్ను కష్టపెట్టాను" అంటుండగా ఆయన కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

రాజ్ వారి ప్రేమను అర్థంచేసుకొన్నాడు.

"నాపై కోపమొచ్చిందికదూ? నాకు చావైనారాదు."

ఆ మాటలు విని వసంత తనపై తండ్రికెంత ప్రేమవుందో అర్థం చేసుకొంది. తనపై తనకే కోపంరాగా దుఃఖం పెల్లుబికి "నాన్నా! అలాంటి మాటలనకు" అని అతనిమీద వాలిపోయింది.

ఇక అక్కడ ఉండలేకపోయి హాల్లోకివచ్చి సోఫాలో కూర్చున్నాడు రాజ్. వారిద్దరివాత్సల్యం అతనిలో కలవరాన్ని రేపింది. తనకు

తల్లీ, తండ్రీ ఎవరూ లేరు. తల్లితండ్రుల ప్రేమకు నోచుకోలేని నిర్భా గ్యుడు తను. అందరిలా తన కష్టాలను వారి ఓదార్పులో, లాలనలో మరచిపోయి హాయిగా ఉండే అదృష్టం తనకులేదు. తప్పు చేసినప్పుడు కోపగించుకొని, బాధపడగానే దగ్గరకుతీసి ఓదార్చేవారు తనకీ ప్రపంచంలో ఎవ్వరూలేరు. పాపాత్ముడైన తనను ఈ లోకంలో వదలి తమ దారి తాము చూసుకున్నారు. తోడు నీడా లేక ఆదరణాప్యాయతలు కరువై ప్రేమతో దగ్గరకుతీసి లాలించేవారు లేక తనవారున్నారంటూ గర్వంగా చెప్పుకోలేని ఈ బ్రతుకును ఇన్నాళ్ళు ఎలా గడుపుకొచ్చాడో తనకే తెలియదు.

ఆ సాయంకాలం డాక్టరుగారి సలహా ప్రకారం వారిని షికారు తీసికెళ్ళాడు రాజ్. తనూ, రజియా కలిసికొనే స్థలానికి తీసుకుపోయాడు వారిని.

"ఇక్కడ మనసుకు చాల ప్రశాంతంగా ఉంటుందోయ్" అన్నారు ఆనందరావుగారు చుట్టూ చూస్తూ.

వసంతకూడా ఆ ప్రకృతికి ముచ్చటపడింది, వారితో మాట్లాడుతూ రాజ్ అటువైపే వస్తున్న రజియాను చూశాడు. దగ్గరగా వచ్చిన రజియాను పరిశీలించాడు. ఆమె మొహంలో కళలేదు. దేనిపైనా శ్రద్ధలేక దీనమైన చూపులతో ఏదో ఆలోచిస్తుందామె. కళకళలాడుతూ ఉండే రజియాను ఆ పరిస్థితిలో చూసి కలుక్కుమంది రాజ్ హృదయం.

వారిని దాటిపోతూ అటుచూసిన రజియా రాజ్‌ను చూసింది. ఆమె హృదయం ఎగిరి గంతేసింది. ఆమె కళ్ళు మిలమిల మెరిశాయి. ఒక్కసారిగా అతనిమీద వాలిపోయి ఇన్నాళ్లూ కలిగిన దుఃఖాన్ని పోగొట్టుకోవాలని గబగబావచ్చి ప్రక్కనే ఉన్నవారిని చూసి ఆ ప్రయత్నానికి స్వస్తి చెప్పింది.

"కూర్చో, రజియా" అన్నాడు రాజ్ చిరునవ్వుతో.

అతనిలో ఏదో మార్పువచ్చిందని గ్రహించింది రజియా. చకోరం ఎదురు చూసిన చంద్రోదయమయి తిరిగి కనబడకుండా మబ్బుల్లో అంతమయినప్పుడు తపించే విధంగా తపించింది ఆమె హృదయం.

ఎంత వద్దనుకున్నా "ఈ మూడు రోజు లెక్కడికెళ్ళావు రాజ్" అని అడుగలేకుండా ఉండలేక పోయింది ఆమె.

రాజ్ ఏదో చెప్పబోతుండగా వసంత ఆమె బాధను అర్థం చేసుకొని "నే చెప్తానుండండి" అని జరిగిన విషయాలు చెప్పింది. అది విని నవ్వు కొన్నారు ఆనందరావుగారు.

రాజ్, రజియాను వారికి పరిచయం చేశాడు.

రజియాను చూసిన ఆనందరావుగారు ఆమె ముఖ కవళికలు ఎవరినో జ్ఞాపకానికి తేగా "అమ్మాయ్, మీ తల్లి పేరు సరోజిని కదూ!" అన్నాడు.

"కాదండీ, మేము ముస్లిములము. అదీకాక మా తల్లి పేరేమిటో నాకింతవరకు తెలియదు."

"పేరునుచూసి అదే అనుకున్నాను. కానీ, ఎందుకో నా కళ్ళు నన్ను మోసగించలేవుకదా అని. కోరి ఆ పేరు పెట్టుకుని ఉండవచ్చనీ సందేహమెచ్చి అడిగాను. అయినా పొరపాట్లు సహజమేగా" అని నవ్వారు ఆయన.

చీకటి పడుతుండగా అందరూ లేచారు. ఆనందరావుగారి మాటలు రాజ్ మనసులో ఒక ఆలోచనా తరంగాన్ని లేపినా అప్పటిలో వాటికంత ప్రాముఖ్యాన్నివ్వలేకపోయాడు.

కారు డ్రైవ్-చేస్తున్న వసంత అప్పుడప్పుడు ప్రక్కనే కూర్చున్న రజియాను పరిశీలిస్తూంది.

"అమ్మాయ్, ఆమెను వారింటిదగ్గర దిగబెట్టు" అన్న తండ్రిగారి మాటలువిని దారెటు అని రజియావైపు చూసింది వసంత. రజియా చెప్పింది. ఆమెను ఇంటిదగ్గర దిగబెట్టి మిగతావారితో కారు ఆనందరావు గారింటివైపు దూసుకుపోయింది. కారు నుండి దిగుతూ "రాజ్, రేపు తప్పక వస్తావు గదూ" అన్న రజియా మాటలు రాజ్ చెవుల్లో గింగురు మంటున్నాయి. ఎందుకొచ్చింది తనకీ విషమ పరిస్థితి? అమాయకమైన రజియాను మోసగించాలి. అదికాకుంటే మిత్రుడికి దూరం కావాలి. ఇద్దరి మనస్సులూ నొప్పించకుండా, ఉండేందుకు మార్గమేదైనా చూపించలేవా, దేవుడా అని మనసులోనే ప్రార్థించాడు.

"ఏమిటోయ్, ఆలోచిస్తున్నావు?" అన్న ఆనందరావుగారి పిలుపుతో ఆ ఆలోచనలకు స్వస్తి చెప్పాడు.

"ఏమీ లేదండీ" అన్నాడు తనలోని భావాలు బయట పడకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ.

నవ్వుకున్నారు ఆనందరావుగారు.

# 14

"రండి." ఆహ్వానించింది లత.

చిరునవ్వుతో ఆమెను అనుసరించాడు రాజ్. అతన్ని సోఫాలో కూర్చోబెట్టింది లత.

ఇందిరను పిలిచి అతనికి పరిచయం చేసింది. ఆమెను చూడగానే వయసుకు మించిన అనుభవాలను గడించిందని ఊహించాడు రాజ్.

"లత మిమ్మల్ని గురించి ఎప్పుడూ చెపుతుంటుంది" అంది ఇందిర చిరునవ్వుతో.

"మరి మిమ్మల్ని గురించి నాకెప్పుడూ చెప్పలేదే? ఏం లతా?" అన్నాడు రాజ్.

"ఊ" ఏం చెప్పాలో తెలియక తికమకపడింది లత. నవ్వొచ్చింది ఇందిరకు ఆమెస్థితి చూసి.

"కాలేజీలో ఆ విషయం జరిగినప్పటినుండి ఇంట్లో ఎప్పుడూ ఏడుస్తూంటుంది. ఆమెను ఓదార్చలేక నే బాధపడిపోయేదాన్ని. మీ సహాయంవల్ల ఆ కష్టం తీరింది. ఆనందంగా ఉంటోంది. అందుకు మీకు మా కృతజ్ఞత."

"మీరిలా మాట్లాడతారని తెలిసిఉంటే నేనసలు వచ్చేవాడినే కాదు. నన్ను పిలిచి చిన్నబుచ్చినట్లవుతుంది."

"క్షమించండి. మీ కది ఇష్టం లేకుంటే మానేస్తాను."

"ఒకరి అదృష్టాన్ని మనం బాగుచేయగలమా, చెప్పండి?"

"ఇది నిజంగా వారికదృష్టమే నంటారా?"

"ఆ నిర్ణయం చేసుకోవలసిన బాధ్యత వారిపైనుంది. విత్తనములు వేస్తే మొక్క మొలిచింది. కానీ పెద్దదై ఫలదాయకం కాకముందే ఎండి పోయింది అంటే మనం ఏం చెయ్యగలం చెప్పండి?" అని ఆమె నిగూఢ ప్రశ్నను అర్థం చేసుకొని జవాబు చెప్పాడు.

"అందుకు మన అజాగ్రత్తకూడా కారణం కావచ్చుగా?"

"కాదని చెప్పలేము. అదేకాదు పరిసరాల ప్రభావంకూడా ఒక కారణం అని ఒప్పుకోవాలి. కానీ మీలాంటి సహోదరి ఉండగా లత జాగ్రత్తగానే ప్రవర్తించగలదని నాకు నమ్మకముంది. ఏం, లతా, ఏమంటావు?"

"అక్కయ్య సలహా పాటిస్తే నా జీవితాన్ని ఏ అడ్డంకులూ లేని పూలబాటగా మార్చుకోగలననే ధైర్యం నాకూ ఉంది."

"బాగుంది, నామీద అంత నమ్మకం మీకెలా కలిగిందో తెలుసు కోవచ్చా?"

"కొందరిని చూస్తేచాలు వారెంత గొప్పవారైనదీ చెప్పవచ్చు."

"అది అందరికీ సాధ్యం కాదు. మీలాటి వారికే అది కరతలా మలకం."

ఇంతలో వాళ్ళమ్మ అక్కడికి వచ్చింది.

"వారు మా అమ్మ. అమ్మా, వీరు మన లత క్లాస్‌మేట్" అని పరిచయం చేసింది ఇందిర.

"నమస్కారమండీ" అన్నాడు రాజ్.

లతావాళ్ళమ్మ రాజ్‌ను పరీక్షగా చూడసాగింది. అది లతకూ, ఇందిరకూ కష్టంగా ఉంది.

"నీకు తల్లీ, తండ్రీ ఉన్నారా నాయనా?" అని అడిగిందామె.

ఆ ప్రశ్నతో తల్లిపై కూతుళ్ళిద్దరికీ కోపం వచ్చింది. రాజ్ తమను ఎక్కడ అపార్థం చేసుకొంటాడోనని బాధపడ్డారు. వారి దృష్టిలో అది సభ్యతకు లోకువ కావచ్చు. రాజ్‌కుమాత్రం ఆమె అలా చూడటం ఆశ్చ ర్యంగా లేకపోయినా బహుశా తన తల్లిదండ్రులెవరైనా తెలిసి ఉండ వచ్చేమో అనుకొన్నాడు.

"అంత అదృష్టానికి నోచుకోలేదండీ."

"మీ నాన్నగారి పేరు?"

"రామమూర్తి."

"తల్లి పేరు?"

ఆమె ప్రశ్నలు వింటూంటే యిందిరకూ,లతకూ కోపం వస్తూంది. యింటికివచ్చిన అతిథిని అలా అడగడం బాగులేదని వారు బాధపడు తున్నారు. ఏమీ చేయలేక ఒకరిమొహాలు ఒకరు చూసుకొన్నారు.

ఆమె ప్రశ్నవిని సందిగ్ధావస్థలో పడ్డాడు రాజ్. విచిత్రమే. తనకు తనతల్లిపేరే తెలియదు. నవ్వుకొన్నాడు. ఆ మాటే చెప్పాడు.

"మీ యింటిపేరైనా తెలుసా?"

"కందుకూరివారండీ!"

అది విని ఆమె మొహం వికసించింది. మొహంలో ఆనందం వ్యక్తమైంది. ఏదో ఒక నిశ్చయానికి వచ్చింది. కానీ వెంటనే ఆమె మొహంలో బాధ, పాపభీతి కొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి. రాజ్‌ను సరిగ్గా చూడలేకపోయింది.

"అమ్మా, నువ్వెళ్ళమ్మా! ఇంట్లోపనులు...." అంటూ తల్లి ముఖకవళికలు చూసి ఆగిపోయింది లత.

"అవునమ్మా! నేనిక్కడ వుండతగను. పాపాత్మురాలిని. నేచేసినపాపానికి నావారిని నా వారనే చెప్పుకొనే యోగ్యత లేనిదాన్ని."

"ఏమిటమ్మా, నీ మాటలు?" అని అడిగింది ఇందిర ఆత్రుతగా.

"ఔను, ఇందిరా! నే చేసిన పాపాలకు ఈనాడు నా అన్న కుమారుడైన యితడిని రక్తబంధువని చెప్పుకొనే అదృష్టాన్ని పోగొట్టు కొన్నాను."

ఆశ్చర్యపోయారా ముగ్గురూ.

"ఏమిటమ్మా, నువ్వన్నది?" అర్థంకాక అడిగింది ఇందిర.

"నిజమే, ఇందూ! నా మేనల్లుడు."

బావ అవుతాడని తెలుసుకొన్న లత ఆనందానికి హద్దులేక పోయింది.

నమ్మాలో లేదో అర్థంకాలేదు రాజ్‌కు.

"నువ్వు మీ నాన్నను గుర్తుపట్టగలవా, బాబూ!"

"లీలగా గుర్తున్నాడు."

"అయితే ఇలా రా. ఈ ఫోటో చూడు" అంది ఆమె ఒక గోడ కున్న పెద్దఫోటోను చూపిస్తూ.

రాజ్ ఆ ఫోటోదగ్గరికివెళ్ళి చూశాడు. ఆ ఫోటోలో నవదంపతులు ఉన్నారు. వారిలో పెళ్ళికొడుకు స్థానంలో వున్నతండ్రిని పోల్చుకోగలిగాడు. అతనిప్రక్కనే ఉన్న తల్లినికూడా చూశాడు. ఒక్కక్షణం అతని హృదయం బాధతో నిండిపోయింది. తల్లిని ప్రత్యక్షంగా చూడలేకపోయినా వీరి దయవల్ల ఫోటోలోనైనా చూడగలుగుతున్నాను అనుకొన్నాడు. మనసులోనే వారికి చేతులెత్తి నమస్కరించాడు. వారి వెనుక ఒకయువతి, ముసలిదంపతులు నిలబడివున్నారు. ఆ యువతిని లతా వాళ్ళమ్మగానూ, ఆ ముసలిదంపతులను తన అవ్వా, తాతగానూ ఊహించుకోగలిగాడు.

వెనుదిరిగి మేనత్తమొహంలోకి చూశాడు. ఆ కళ్ళలో ఏదో ఆపేక్షమెదులుతూంది. ఆవేదన గూడుకట్టుకొని ఉంది.

"అత్తయ్యా!" అని ఆమె పాదాలకు నమస్కరించబోయాడు. మధ్యలోనే అతణ్ణిలేపి "అంతభాగ్యానికి అర్హురాలు కాదు, నాయనా, ఈ పాపాత్మురాలు" అని రాజ్‌ను ఆలింగనం చేసుకొంది. ఆమె కన్నీరు ఆనందబాష్పాలుగా మారిపోయింది.

అత్తయ్యను కలుసుకొన్న రాజ్‌కు తల్లితండ్రులను కలుసుకొన్నంత సంబరమయింది. ఆ ఆనందం అతనిలో దుఃఖాన్నే తెచ్చింది. అతనికన్నులు ఆర్ద్రమయినాయి.

"అత్తయ్యా! ఇన్నాళ్ళూ నేను బ్రతికివున్నానని తెలిసిగూడా మౌనం వహించావా? తల్లీతండ్రుల ప్రేమకు నోచుకోని ఈ దౌర్భాగ్యుడికి నీ ప్రేమనుగూడా దూరంచేశావా?"

ఆ మాటలు ఆమె గుండెల్ని పిండి కన్నీటిని రాల్చాయి.

"వివరంగా చెప్తాను కూర్చో, బాబూ" అని రాజ్‌ను సోఫాలో కూర్చోబెట్టింది ఆమె. రాజ్ కళ్ళు తుడుచుకొన్నాడు.

అంతలో ఇందిర కాఫీ తెచ్చింది. కాఫీత్రాగుతూ తనవిషయమంతా చెప్పాడు రాజ్.

"హుం. లక్షాధికారి బిడ్డఅయినా ఒకరిదగ్గర ఊడిగం చేయవలసిన ఖర్మపట్టింది వాటికి. వాడి వారసుడవైన నువ్వు ఒకరి ఆధారంతో బ్రతుకుతున్నావు. ఈ పాపానికి నాకు నిష్కృతి ఉండదు."

"ఇందులో నువ్వు చేసిందేమిట త్తయ్యా?"

"అన్నిటికీ కారణం నేనే, నాయనా! వాడికి పెళ్ళయిన మరు సంవత్సరమే నా పెళ్లి జరిగింది. వాడు చిన్నప్పుడు అల్లరి చిల్లరిగా తిరిగేవాడు. అప్పుడప్పుడు ఇంట్లో డబ్బు దొంగతనంగా పట్టుకెళ్ళి ఊళ్ళు తిరిగొస్తుండేవాడు. మా నాన్నగారు చనిపోయేముందు 'అమ్మాయ్, శకుంతలా! ఆస్తి వాడిపేర వ్రాస్తే నీకు చిల్లిగవ్వ దక్కనియ్యడు. అందుకని అంతా నీపేరవ్రాశాను. వాడిని ఒకదారికి తీసుకురా' అన్నారు. అన్నయ్యంటే నాకు ప్రేమే. కానీ డబ్బు నా ప్రేమను నాశనంచేసింది. నా బుద్ధిని పెడదారిని పట్టించింది. వాడి నొకదారికి తెమ్మన్న నాన్నగారి మాటలు మరిచి వాడిదారినే దుర్భరంగా చేశాను. అంత ఆస్తీ నాదన్న అహంభావంతో రక్తం పంచుకుపుట్టిన తోబుట్టువుఅన్న జ్ఞానంలేకుండా, వాడు నాకన్నా పెద్దవాడన్న విచక్షణలేకుండా, కేవలం హోదాతో వాడిపై అధికారం చెలాయించాను. పెద్దింటిదైనా వదిన అనే గౌరవ మివ్వకుండా నీచంగా చూశాను. అదిచూసి మా వదిన వాడితో మొర పెట్టుకుంది. కానీ వాడు అన్నీ సహించాడు. ఒకసారి మా వదినను నోటికొచ్చినమాట అనేశాను. అది విన్న వాడు సహించలేక నన్ను కేక లేశాడు. నా కోపం మితిమీరిపోయింది. ధనమనే మదం కళ్ళకడ్డుపడి ఏంచేస్తున్నదీ తెలుసుకోకుండా వారి నిద్దరినీ ఇంట్లోనుండి వెళ్ళిపొమ్మ న్నాను. అభిమానం గలవాడు కాబట్టి కట్టుబట్టలతో ఇల్లు విడిచాడు. అప్పటికీ నాలో పశ్చాత్తాపం కలుగలేదు. మావారు నన్ను అసహ్యించు కొన్నారు.

"అప్పుడనగా యిల్లువిడిచినవాడు ఒకసారి నిన్నుతీసుకొని ఇక్కడి కొచ్చాడు. అప్పుడు నువ్వు చిన్నపిల్లవాడివి. సామాన్యంగా మాన వత్వమున్న ఏ ఆడదీ అన్ని సంవత్సరాలతర్వాత ఇంటికొచ్చిన అన్నను కావలించుకొని తన తప్పుకు క్షమాపణ వేడుకొంటుంది. కానీ నేను వాడిని పలుకరించనుకూడా లేదు. సరికదా, ఎందుకొచ్చావు అని ఆడి

గాను. అప్పటి నా కర్కశత్వము తలుచుకుంటే నేనూ ఒక మనిషినేనా, నాకూ ఒక హృదయముండేదా అనిపిస్తుంది. సూటు బూటుతో హాయిగా కాలం గడపవలసినవాడు చిరిగిన దుస్తులతో కనబడ్డాడు. అందుకు కరిగి పోవలసిన నేను కోపగించుకొన్నాను. వాడే తలుచుకొనివుంటే ఈ ఆస్తి వాడిచే అయివుండేది. కానీ విచిత్రమేమిటంటే ఆస్తికధికారి అయి నవాడే నన్ను ఒక చిన్నకోరిక అర్థించాడు. ఆజ్ఞాపించవలసినవాడు ప్రార్థించాడు.

"నా ప్రవర్తనకు కన్నీరుకారుస్తూ 'చెల్లాయ్! నీకెన్నడూ నేను ఏ అపకారం తలపెట్టలేదు. జీవితంలో ఏ కోరికా కోరలేదు. కానీ ఈనాడు ఒకటి అర్థిస్తున్నాను. వీడు తల్లిలేనివాడు. నేను రోగిష్టిని. కొద్ది రోజులకు వీడు తండ్రిలేనివాడుకూడా కాబోతాడు. నా గతి ఎలాగైనా కానీ వీడిని నీకప్పగించిపోతాను. పెంచి పెద్దచెయ్యి' అన్నాడు.

"ఆ మాటలు చాలు నాలో మానవత్వాన్ని మేలుకొలపడానికి. నా పాపాన్ని బ్రద్దలుచేసే శూలాలవి. కానీ డబ్బు అడ్డుపడి నాలో కరుణను కలిగించలేదు. అతనికోరిక నిరాకరింపబడింది. వెళ్ళిపోయాడు. అప్పుడు నాలో స్వార్థం, గర్వం, నిర్లక్ష్యం, రాక్షసత్వం, డబ్బులాలస ఎక్కువగా ఉన్నాయి. వాడికి ద్రోహం తలపెట్టడమేకాకుండా మంచి చెడులు తెలి యని నీకు అన్యాయం చేశాను. ఇదీ ఈ దుర్మార్గురాలు నీకు మేనత్తయి మరిచిపోలేని చేసిన మహోపకారం."

అంతవరకూ ఆ విషయాలేమీ తెలియని ఇందిర, లత తల్లి గుణా లను అసహ్యించుకొన్నారు. పైకి తియ్యగా కనుపించే ఆడవారిలో ఇంత కుళ్ళు, కాఠిన్యం, స్వార్థం ఉందా అని ఆశ్చర్యపోయాడు రాజ్. తండ్రికి జరిగిన అన్యాయాన్ని, తండ్రిపడిన కష్టాలు ఊహించుకొని కరిగి పోయాడు. మరొకరైవుంటే ఆమె నసహ్యించుకొని ప్రతీకారాన్ని సాధిం చాలనుకొనేవారు. కానీ రాజ్ తన కోపాన్ని నిగ్రహించుకొని మౌనం వహించాడు.

"నన్ను అసహ్యించుకొంటున్నావుకదా, బాబూ!" అందామె. అంతకన్నా ఘాటైనసమాధానమే బావనుండి వస్తుందని ఎదురుచూసిన లత "లేదత్తయ్యా, నీలోని బలహీనతకు జాలి పడుతున్నాను" అన్న

రాజ్ పలుకులు విని ఆశ్చర్యపోయింది. వీళ్ళ మంచితనానికి హద్దులు లేవా అని నివ్వెరపడింది. నీ విశాలహృదయానికి జోహార్లు బావా అను కొంది మనసులో ఇందిర.

"నన్ను క్షమించగలవా, నాయనా!"

"అదేమిటత్తయ్యా! ఈ లోకంలో జరిగేవాటికి మనం కేవలం నిమిత్తమాత్రులమే. ఏదో శక్తి మనలను ఆడిస్తోంది. ఆ దుష్టశక్తిని ఎదురుకోలేనప్పుడు ఎన్నో తప్పులు చేస్తుంటాం. యిందులో నీ తప్పేం లేదు."

రాజ్ కోపంతో ఏమైనా అంటాడేమోనని ఆశించిందామె. అతని క్షమాహృదయానికి మరింతగా రోదించింది. అతడికి కోపమొచ్చివుంటే ఆమెకు శాంతికలిగేది. కానీ అది జరుగలేదు.

"అంతేకాదు. ఇంకా విను. అప్పుడు నేను క్షమార్హురాలనుకానని తెలుసుకుంటావు."

తల్లినుండి యింకా ఏం వినవలసివసుందోనని భయపడ్డారు ఇందిర, లత.

"మావారి తల్లి చనిపోగానే తన ఒక్కగానొక్క చెల్లెలిని తనతోనే ఉంచుకొన్నారు వారు. ఆమె చాల మంచిది. నేను ఆడబిడ్డనే గౌరవం లేకుండా సూటిపోటిమాటలతో బాధించాను. అన్నింటినీ సహించింది. ఆమె ఏనాడూ ఈ యింట్లో కడుపునిండా తిని ఉండలేదు. ఒకసారి మావారి చిన్ననాటి మిత్రుడెవరో వచ్చారు. వారు లేరు. ఆమెకు అతడు బాగా తెలుసు కాబట్టి ఆప్యాయంగా మాట్లాడి పంపించింది. ప్రతిఫలంగా ఆమెకు కులట అనే బహుమానాన్నిచ్చి ఇంట్లోనుండి గెంటేశాను. ఆ రాత్రే ఆమె ఆత్మహత్య చేసుకొంది. తన ప్రియమైన చెల్లెలి చావుచూసి కుమిలిపోయినవారు ఆమె చావుకు కారణమైనా నన్ను క్షమించగలిగారు. మగవారిలోని క్షమాగుణాన్ని జీవితంలో రెండోసారి అప్పుడు చూశాను. అప్పటికీ నా కళ్లు తెరుచుకోలేదు.

"పాపం పండిందంటారు—అదే కాబోలు. నా ధనం, అధికారం, గర్వం, హోదా నన్ను ఎటువంటి స్థితికి తెచ్చాయంటే కడకు కట్టుకొన్న

భ ర్తనే అవమానించాను. నేనెన్ని తప్పులుచేసినా క్షమించారు. అభిమానం ఉన్నవాడు అవమానం సహించడు. నన్ను విడిచి వెళ్ళిపోయ్యారు. ఎక్కడో, ఎవరితోనో సుఖంగా సంసారం చేస్తున్నారని విన్నాను. ఎప్పుడో ఒకసారివచ్చి తనబిడ్డలను చూచుకొని వెళ్లుతుంటారు. డబ్బు నావారినందరినీ దూరంచేసింది. నాకు సుఖాన్ని యివ్వలేకపోయింది. ఈ డబ్బును ఇచ్చేస్తాను. తిరిగి నా వారంతా నాకు దక్కుతారా? ఊహూ? ప్రయోజనం లేదని తెలుసుకొన్నాను. వారి సుఖానికడ్డు తగులకూడదని గుట్టుగా ఉంటున్నాం. అందరినీ దూరంచేసుకొన్నతర్వాత నా కళ్లు తెరుచుకొన్నాయి. అంతలోపలే జరగవలసిన అనర్థాలన్నీ జరిగిపోయాయి. యిప్పుడు చెప్పు—నన్ను ఎవ్వరైనా క్షమించగలరా? కన్న బిడ్డలు సైతం అసహ్యించుకొనే నా పాపాలకు ప్రాయశ్చిత్తముందంటావా?

"నీ పశ్చాత్తాపమే నీ పాపాలకు ప్రాయశ్చిత్తమత్తయ్యా! చేసినదేదో చేశావు. చేసినదానికి విచారిస్తూ కూర్చుంటే ప్రయోజనంలేదు. మానవులమైన మనం విచారించకుండా ఉండలేము. అన్నీ మరిచిపో."

"ఎవరి శిక్షణలో పెరగకుండానే నువ్వు ఇన్ని మంచిగుణాలను అలవరచుకొన్నావు. నేను నీకు చేసిన అన్యాయానికి ఫలితంగా ఒక కోరిక కోరుతాను. అంగీకరిస్తావా?"

"ఆజ్ఞాపించే అధికారం,వయస్సు ఉండగా అర్థిస్తావేమిటత్తయ్యా!"

"నేనా అర్హతను పోగొట్టుకున్నాను, బాబూ! నువ్వు యిప్పటినుండి యిక్కడే ఉండిపోవాలి."

"ఔను, బావా!" అంది లత ఉత్సాహంతో.

"అంగీకరించండి" అంది ఇందిర.

"క్షమించండి. యిప్పట్లో అది అసాధ్యమే. కానీ ఎప్పుడో ఒకసారి తప్పక ఇక్కడే ఉండిపోవలసివస్తుంది. అప్పుడు తప్పక ఉంటాను."

"నా ఈ ఒక్కకోరిక తీరే ఆశగూడా లేదా?"

"క్షమించత్తయ్యా! యిప్పుడు నేను నిస్సహాయుణ్ణి. ఆలోచించి

ఆనందరావుగారి అంగీకారాన్ని తీసుకోవాలి. అంతకన్నా ప్రస్తుతం నేనేం చెప్పలేను."

"సరే. నీ యిష్టప్రకారమే చెయ్యి. కానీ నీకోసం ఒక ముసలి అత్తయ్య, ఆమె కుటుంబం ఎదురు చూస్తుంటారని మరిచిపోవద్దు."

"ఏమంటారు?" అని అడిగాడు రాజ్, ఆనందరావుగారిని.

"ఏం చెప్పమంటావోయ్? ముసలితనంలో ఒక్కగానొక్క కోరిక పెట్టుకొన్న ఆమెను నిరాశపరచడం ఇష్టంలేదు. వారికోరిక తీర్చు. రక్తసంబంధపు మమకారాన్ని అర్థం చేసుకోగలిగి ఈ మాట చెపుతున్నాను. తన పాపాలకు అంతిమదశలోనైనా ఆమె మనసుకు శాంతిని ప్రసాదించు. అది చెయ్యగలిగితే చాలు."

"అలాగే" అన్నాడు రాజ్ ఆనందంగా.

# 15

"ఏమిటే, ఈమధ్య అలాగున్నావు?" అడిగింది అరుణ.

"ఏమీలేదు." ముక్తసరిగా సమాధాన మిచ్చింది రజియా.

"నా దగ్గర దాస్తా వెందుకే? రాజా దూరమయ్యాడని కదూ ఈ బాధ?"

"అరుణా!"

"నిజం చెప్పు. అంతే కదూ?"

తల ఊపింది రజియా మెల్లిగా.

"అయితే అన్నంతపనీ చేస్తున్నాడన్నమాట" అంది అరుణ కోపంగా.

"ఏమి టరుణా, నువ్వంటున్నది?"

"మా అన్నయ్య స్వార్థమూ, రాజ్ త్యాగమూ నీపై దెబ్బతీస్తున్నా యన్నమాట."

"నువ్వు చెప్పేదేదో సరిగా చెప్పకూడదూ?"

అరుణ తమయింట్లో ఆనంద్‌కు, రాజ్‌కు జరిగిన సంభాషణ వివరంగా చెప్పింది.

"అదన్నమాట విషయం. మీ అన్నయ్య నన్ను అనవసరంగా అపార్థం చేసుకొన్నాడు."

"అన్నయ్య వట్టి మూర్ఖుడైపోయాడు, రజియా! అతని తరపున నేను క్షమాపణ చెప్పుకుంటున్నాను."

"ఛ. ఏం మాటలే అవి?"

"అయినా రాజ్‌కూడా అంత తెలివితక్కువగా ప్రవరిస్తాడనుకోలేదు. నేను కలుసుకొని చెప్తానుండు."

"అంత అవసరం లేదులే, అరుణా!" అంది రజియా, ఏదో ఆలోచించుకుంటూ.

అప్పుడే బయటికి వస్తున్న రాజ్ వాకిట్లో నిలబడి ఉన్న రజియాను చూసి తలవంచుకున్నాడు.

"నా ఎదుట పడ్డందుకు బాధపడుతున్నావా, రాజ్?"

"నీ మాటలు అదోరకంగా ఉన్నాయేమిటి, రజీ?"

"అలాగే ఉంటాయిలే కానీ ఒక విషయం అడుగుతాను. చెప్తావా?"

"ఏమిటి, రజీ? నీ మాటలు వింతగా ఉన్నాయి. నీ మొహంలో ఆ దీనత్వమేమిటి? నీ మాటల్లో నిరాశా నిస్పృహలేమిటి?"

"అదంతా తర్వాత చెబుతాను గానీ, నాతో తిరగడానికి కానీ, నాతో మాట్లాడడానికిగానీ, కనీసం నా మొహం చూడడానికికూడా నీ కిష్టంలేదు కదూ?"

"నీ మనసు వెవరో చెడగొట్టారు. తీరికగా మాట్లాడుకుందాం పద."

"చెడగొట్టింది నా మనసును కాదు, రాజ్! నీ మనసునే. ఆనంద్‌కు నువ్విచ్చినమాట నిజంకాదా?"

"రజీ" అని బాధగా తలను చేతపట్టుకొని వెనుతిరిగాడు రాజ్.

రజియా కళ్ళనుండి కన్నీరు ఏకధాటిగా ప్రవహిస్తుంది. ఆమె హృదయం రోదిస్తుంది. గుండె దిటవు పరుచుకొంది.

"రాజ్, నిన్ను మొదటిసారిగా చూసినప్పుడు, నీ చూపులు నాలో ఒక జ్యోతిని వెలిగించాయి. నీ స్నేహం లభ్యమైననాడు నాలో ఆనంద సాగరమే పొంగి పొరలింది. పులకరించిపోయాను. నీ రూపాన్ని మనసులో ప్రతిష్ఠించుకొని ఆరాధించాను. నా పూజలఫలితంగా నా కోరిక తీరుతుందనే వరాన్ని ప్రసాదించావు. ఆనాడు ఈప్రపంచాన్నే జయించానన్న తృప్తి, ఆనందం నాలో కలిగాయి. ఈనాడు ఎవరో మూర్ఖంగా పలికిన పలుకులకు విలువనిచ్చి నా కెడబాటు కలిగిస్తావా? అతడు నీకు మిత్రుడే కావచ్చు. అతని ఆనందంకోసం నువ్వు అర్థంలేని త్యాగానికి సిద్ధపడ్డావు. కానీ, ఈ విషయం విను. అతనిదగ్గర నేను ఒక చెల్లెలి చనువునే తీసుకొన్నాను."

"రజీ!"

"నమ్మలేవుకదూ! అతడు అపార్థం చేసుకొన్నాడు. ఈనాడు అతని అర్థంలేని కోరిక తీర్చడంకోసం నీ జీవితానందాన్నేకాక నా ఈ అమూల్యమైన ఆరాధ్యదైవాన్ని దోచుకొని దూరంగా విసిరివేస్తున్నావు. అందువలన ఎవరికీ ఎలాంటి ప్రయోజనం ఉండదు. మిగిలేది జీవితాలను నాశనం చేయగల బాధమాత్రమే. వరాన్ని ఇవ్వగలిగినవారికి శపించే అధికారంకూడా ఉంది. మొక్కలను పెంచేవారికి వాటిని పెరికివేసే అధికారం వుంది. నీ యిష్టప్రకారమే కానివ్వు. కానీ ఈ నిర్భాగ్యురాలిని జ్ఞాపకముంచుకో. నీ కోరికప్రకారం ఇక నీ కెప్పుడూ కనిపించి నిన్ను కష్టపెట్టను. వస్తాను" అని వెనుదిరిగింది రజియా.

"రజీ" బాధగా అరుస్తూ తిరిగాడు రాజ్. ఆమె ఒక్కొక్కమాటా అతన్ని శరాఘాతానికి గురిచేసింది. ఆ కంఠం రజియా కాళ్ళకు బంధమైపోయింది. ఎంతప్రయత్నించినా కాళ్ళు భూమికి అంటుకుపోయినట్లు ఆమె ప్రయత్నాన్ని కొనసాగనియ్యలేదు. వెనుదిరిగింది. రాజ్ కన్నీరు చూసి కలవరపడింది. అతనిచూపుల్లో అర్థింపూ, దీనత్వమూ గుండెల్ని చలింపజేస్తున్నాయి. "రాజ్" అంటూ ఒక్క ఊపులో అతనిచేతుల్లో వాలిపోయింది.

"రజీ, నువ్వుకూడా నన్ను ఏడిపిస్తావా? జీవితంలో అందరికీ దూరమవుతున్నాను. నువ్వుకూడా నన్ను వదిలిపెడతావా! నన్ను నిస్సహా

యుడుగా, నిరాధారంగా చేయడం నీకు న్యాయమా? ఎవరేమైనా అను కొన్నా, దూరమైనా ఫరవాలేదు. కానీ, నిన్ను దూరంచేసుకోలేను. అజ్ఞానంతో నీ మనసుకు కష్టం కలిగించాను. నాకు దూరం కావద్దు. నన్ను మళ్ళీ అంధకారకూపంలోకి త్రోసివెయ్యకు. నాలోని నిస్సహాయతకు జాలిపడకుండా నీ దారిన నువ్వు వెళ్ళిపోవడం నీకు ధర్మమా! నాకు ధైర్యాన్నిస్తూ నా సరసనే ఉండడం నీ విధికాదా?"

"రాజ్! క్షమించు. నిన్ను వదిలి ఎక్కడికీ పోలేను. పోయి సుఖంగా బ్రతకలేను."

బయటినుండి అంతా చూస్తున్న సుగుణ నిట్టూర్చి లోపలికి పోయింది.

కాలేజీ ఆవరణంతా బి. ఎ. సెకండియర్ విద్యార్థుల కోలాహలంతో నిండివుంది. ఒక్కరూ క్లాసుకు వెళ్ళడంలేదు. తమ వినతిని ఇంగ్లీషు హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు లెక్చరర్ నారాయణరావుగారికి తెలుపుకొన్నారు. ఆయన భానుమూర్తిగారిని పిలిపించాడు.

"పిలిపించారట" అన్నాడు భానుమూర్తి ఆయనగదిలోకి వెళ్ళి.

"అలా కూర్చోండి, మిస్టర్ భానుమూర్తీ!"

భానుమూర్తి మౌనంగా ఆయనకెదురుగానున్న కుర్చీలో కూర్చు న్నాడు.

"చూడండీ! సెకండ్ బి. ఎ. విద్యార్థుల స్ట్రైక్ చూస్తున్నారుగా? మీ ఒక్కరికోసం క్లాసులు జరగకపోవడం, కాలేజి అంతా అల్లరికావడం ఏమీ బాగుండడంలేదు."

"నన్నేం చేయమంటారు?"

"వారిక్లాసు తీసుకోండి."

"క్షమించండి. ఆ పని నాచేతకాదు."

"మీరిలా ఎందుకు మొండికేస్తున్నారో అర్థంకావడంలేదు. మీకేమైనా అవమానం జరిగివుంటే చెప్పండి. తగినచర్య తీసుకుంటాం."

"అలాటిదేమీ లేదుకానీ నేనా క్లాసు తీసుకోలేను."

"మిస్టర్ భానుమూర్తీ! మీమధ్య, వారిమధ్య మేం నతమతమయి పోతున్నాం. ఇంతవరకూ మీకు నచ్చచెప్పాలని ప్రయత్నించాను. ఇక మా అధికారాన్ని వినియోగించదలుచుకొన్నాను. మీరాక్లాసు తీసుకొని తీరాలి."

భానుమూర్తి వారిమొహంలో కాఠిన్యాన్ని చూశాడు. "ఆలోచించడానికి నాకు కొంత వ్యవధి ఇవ్వండి."

"ఓ అలాగే. మీ యిష్టంవచ్చినంత వ్యవధి తీసుకోవచ్చు."

భానుమూర్తి అక్కడినుండి లేచి స్టాఫ్‌రూమ్‌కు బయలుదేరాడు. వరండాలో ఉన్న విద్యార్థులు అతన్నిచూసి నిశ్శబ్దంగా ప్రక్కకు జరిగారు. తలవంచుకొని వెళ్ళిపోయాడు భానుమూర్తి.

ఆయనలా పోగానే నారాయణరావుగారు వచ్చి "నేను ఆయనకు చెప్పాను. అంగీకరించారు. యిక మీరువెళ్ళి క్లాసులో కూర్చోండి" అన్నారు.

విద్యార్థులు విజయంతో, ఆనందంతో క్లాసులోపలికి పోయి కూర్చున్నారు. విద్యార్థులంతా ఆయన ఎప్పుడొస్తాడా అని ఎదురు చూస్తున్నారు. ఏ చప్పుడు వినబడినా వారి హృదయాలు జాగ్రత్తగా వింటున్నాయి.

భానుమూర్తి ప్రిన్సిపాల్‌గారి ముందు ఒక కాగితాన్ని వుంచాడు. అది చదివిన ప్రిన్సిపాల్‌గారు ఆశ్చర్యంతో "ఏమిటిది, మిస్టర్ భానుమూర్తీ?" అన్నారు.

"నా రాజీనామా."

"చాలా తొందరపడుతున్నావు."

"ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాను, సార్!"

"చూడు. యువకుడివి. నీలో పట్టుదల సాధించాలనే అభిలాష ఉండవచ్చు. కానీ దానికోసం అనవసరంగా ఉద్యోగానికి రాజీనామా ఇవ్వడంలో అర్థంలేదు. ఇంకోసారి ఆలోచించుకొని నీ నిర్ణయాన్ని మార్చుకొంటావని ఆశిస్తున్నాను."

"క్షమించండి. ఇదే నా ఆఖరు నిశ్చయం. దాన్ని మార్చుకొనే వుద్దేశ్యం కానీ, అలవాటుకానీ నాకు లేదు."

క్లాసులో నిశ్శబ్దం తాండవిస్తూంది. విద్యార్థులు ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. అడుగుల చప్పుడయింది. వారి ఆత్రుత హెచ్చింది. అందరి కళ్ళు ఎవరికోసమో, ఏ రూపంకోసమో చిరునవ్వుతో చూచాయి. కానీ ఆ వచ్చిన వ్యక్తి వారి ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ చంపేశాడు. వారి చిరునవ్వు మాయమైంది. ఆ వ్యక్తి నారాయణరావుగారు.

జాలిగొలిపే చూపులతో అందరినీ కలయజూశాడు ఆయన. "మీ కందరికీ ఒక బాధాకరమైన వార్త చెప్పబోతున్నందుకు విచారిస్తున్నాను. భానుమూర్తిగారు రాజీనామా యిచ్చి వెళ్ళిపోయారు."

ప్రక్కలో పిడుగుపడ్డట్లు ఉలిక్కిపడ్డారంతా. ఒక్కరినోటా మాట పెగలలేదు. క్షణంక్రితం విజయచిహ్నాలైన వారి మొహాలు అపజయాన్ని విని క్రుంగిపోయాయి. అనవసరంగా తమ మూర్ఖత్వంవలన ఆయనను కాలేజీకే దూరం చేశామే అని బాధపడ్డారు. అందరికన్నా వసంతకు ఆవార్త కలచివేసింది.

"మీ స్ట్రైక్‌వల్ల ఆయనను నేను నిర్బంధించవలసివచ్చింది. తత్ఫలితంగా మన కాలేజి ఒక మంచి లెక్చరర్‌గారిని పోగొట్టుకుంది. అందుకు మీతోపాటు నేనుకూడా చింతిస్తున్నాను. ఈ సమయంలో ఎక్కువ మాట్లాడలేను" అని వెళ్ళిపోయాడాయన.

ఆయనపోగానే విద్యార్థులందరూ ఒకరి మొహం మరొకరు చూసుకోవడానికి భయపడ్డారు. ప్రతిఒక్కరూ తప్పుతనదే అయినట్లు తలలు వంచుకొని తప్పుకొనిపోయినారు. వసంత ఏదో ఆలోచించుకుంటూ అక్కడే కూర్చుండిపోయింది.

సాయంకాలం అయిదుగంటలవుతూంది. ఆకాశన్నంటుకొని ఉన్న మబ్బులు ఇక మాచేతకాదంటూ వర్షరూపంగా భూమిపై పడ్డాయి. ఎక్కడిదా ఈ విపరీతకాలపు వర్షం అని ప్రజలంతా ఆశ్చర్యపడ్డారు.

ఏ విపరీత సంఘటనకు సూచకంగా పడుతూందా అని ఆలోచించారు కొందరు. చలికితోడు ఇదొకటా అని చీదరించుకొన్నారు మరికొందరు. పిల్లలు ఆనందంతో గంతులు వేస్తున్నారు.

ఆ వర్షంలోనే ప్రజలు తమపనులు ముగించుకొంటున్నారు. ఆ కొద్దిసేపటికే ఏదో మునిగిపోతున్నట్లు వారిలో ఆ హడావుడి. కార్లు రయ్‌మంటూ నీళ్ళను చిమ్ముకుంటూ దూసుకుపోతున్నాయి. వసంత కారు డ్రైవ్‌చేసుకుంటూ ఆలోచిస్తూంది. ఆమెదృష్టి రోడ్డుమీదఉన్నా మెదడు ఎక్కడో ఉంది. ఎవరినిగురించో ఆలోచిస్తూంది. ఎవరితోనో ఏదో చెప్పాలని ఆత్రుత పడుతూంది. మనసు ఎవరినో కలుసుకోవాలని ఆరాట పడుతూంది. కళ్ళలో మెదిలే రూపాన్ని కళ్ళముందు చూడాలని వెతుకు తున్నాయా కళ్లు.

కారు నిలిపి వర్షంలో తడుస్తూ ఒక చిన్న సందుగుండా నడిచింది. వాకిలి వేసిఉన్న ఒకయింటిముందాగి తలుపు తట్టబోయి దానికున్న తాళంచూసి తల తిరిగినట్లయి అలాగే తలుపుకి ఒరిగి నిలబడిపోయింది. అటూ యిటూ చూసింది. ప్రక్కయింట్లోనుండి రేడియో వినిపిస్తూంది. గబగబా అక్కడికి చేరింది. ఒక నడివయస్కురాలు బయటికి వచ్చింది.

"అమ్మా, ప్రక్కగదిలో భానుమూర్తిగారని ఒక లెక్చరర్‌గా రున్నారు. వారెక్కడికెళ్లారో చెప్పగలరా?" అని అడిగింది వసంత ఆత్రుతగా.

"ఆయన గది ఖాళీచేసి వెళ్ళిపోయాడమ్మా!"

ఆ జవాబు విని క్రుంగిపోయింది వసంత. "ఖాళీచేసి వెళ్ళిపో యాడా! ఆ మాటలు అప్రయత్నంగా వసంత నోటినుండి వెలు వడ్డాయి.

"ఔనమ్మా! మధ్యాహ్నమనగా వెళ్ళిపోయాడు. వాళ్ళవూరికి పోతున్నాననిగూడా మా వారితో చెప్తుండగా విన్నాను."

ఇంతలో ఎవరో ఒకమధ్య వయస్కుడు "ఎవరే" అంటూ అక్కడికివచ్చి "అదేమిటే, వచ్చినవారినలా వాకిట్లో వానకు తడుస్తూం డగా చూస్తూ ఇంట్లోకైనా రమ్మనకుండా మాట్లాడుతున్నావు" అన్నాడు.

అతనిభార్య అయిన ఆవిడ నాలిక కొరుక్కొని లోపలికి పోయింది.

"ఎవరు కావాలమ్మా!" అన్నాడాయన వసంతను వరండాలోకి ఆహ్వానించినతర్వాత.

చెప్పింది వసంత.

"ఆయన కిక్కడ మనసుబాగులేదట. ఉద్యోగానికికూడా రాజీ నామా యిచ్చి వెళ్ళిపోయాడు. ఆఁ. అన్నట్లు మరిచాను. ఎవరైనావస్తే ఒక కవరిమ్మని, లేకుంటే రేపు పోస్టు చెయ్యమనీ చెప్పాడు" అని ఆయన లోపలికి వెళ్ళి ఒక కవరుతెచ్చాడు.

ఆ కవరుపై తన అడ్రసు ఉండడం చూసి తీసుకొని చింపి చదువు కొంది వసంత.

"వసంతా,

నువ్వు ఇక్కడికొస్తావని, వచ్చినా ప్రయోజనం వుండదని నాకు తెలుసు. ఆ రాత్రి నా జీవితానికి అనుకోని వసంతాన్ని తెచ్చావు. యిక మీదట జీవితమంతా వసంతమనే కలలుకన్న నా కలలు కలలుగానే నిలిచి పోయాయి. వసంతం ఎల్లకాలం ఉండదనే నిజం తెలుసుకొన్నాను. నీ అభిప్రాయం తెలుసుకోవాలనుకొన్న నా ఆశ నిరాశైంది. నా ఆశలు నిరాశలైనచోట, నా కలలు ఫలించనిచోట ఉంటూ దర్పణంలాంటిమనసు మాటిమాటికీ, నా నోరూరించే ఆశలను చూపిస్తుండగా నిగ్రహంతో మనసును అదుపులో పెట్టుకొని ఉండలేను. అలా ఉండగలిగిననాడు లేనిపోని అనర్థాలు సంభవిస్తాయి. అందుకే నీకు నా మొహంకూడా చూపించకుండా పోతున్నాను. కొన్ని వందలమైళ్ళదూరం. కానీ ఒక్క చిన్నకోరిక. నీపై అఘాయిత్యానికి పూనుకొన్నానన్న కోపంతో కానీ, ఒక అబల అమాయకంగా దరిచేరితే అక్రమాని కొడిగట్టా

ననే అసహ్యంతోగానీ నీతో కొన్ని అమూల్యమైన క్షణాలు గడిపాడనే విషయం జ్ఞాపకముంచుకుంటావు కదూ!

సెలవు!

ఇట్లు
భానుమూర్తి."

తగిలిన గాయాన్ని కత్తితో రేపినట్లయింది. గాయం కలిగించిన వారిదగ్గరే దాన్ని మానిపించుకోవాలని, రూపుమాపుకోవాలని ఆశతో వచ్చింది. కానీ దురదృష్టం! ఆ అదృష్టాన్ని తనకు దక్కనివ్వలేదు. ఎందుకు తనపై విధి కింత పగ? వెనుతిరిగింది చేతిలోని ఉత్తరంతో.

"వాన తగ్గాక పోదువుగానీ ఉండమ్మా!" అన్నాడాయన.

"ఫరవాలేదులెండి" అంటూ బయటికి వచ్చింది.

ఆ చిన్న సందులో నీరుపారుతూంది. ఒకచోట కాలుపెట్టగానే కాలుజారింది. పడబోయి నిలదొక్కుకుంది. చేతిలోని ఉత్తరం క్రింద పడింది. నీటిపై తేలుతూందా ఉత్తరం. టపటపమని చినుకులు దానిపై పడుతున్నాయి. అక్షరాలు చెరిగిపోతున్నాయి. అటూ యిటూ ఊగుతూ తనకు అందకుండాపోతూంది. అందుకో ప్రయత్నించలేదు. తనది కాని వస్తువు, వ్యక్తి దూరమైపోయాక అందుకై ప్రయత్నించడం తెలివి తక్కువే. వానకు పూర్తిగా తడిసిపోయింది ఆ ఉత్తరం. తన మనసు లోని భావాలనుకూడా కన్నీటితో తడిపింది. తను ముద్దయింది. భావాలు, ఆలోచనలు అంతే. తనబట్టలు తడిసినా ఆరక తప్పదు. అవీ అంతే.

## 16

"నువ్వేన్నయినా చెప్పు. నేనుచస్తే ఒప్పుకోను." లోపలికి అడుగుపెడుతున్న రాజ్ ముకుందయ్యమాటలు విన్నాడు. రాజ్‌నుచూసిన గోపీకి కొండంత ధైర్యం వచ్చింది.

"నువ్వయినా చెప్పబ్బాయ్. వీడు దానికి వంతపాడుతున్నాడు."

"నా మాట వింటావా?"

"ఏమిటో చెప్పు."

"అయితే ఈ పెళ్ళి చేయకండి."

"ఏమిటి! ఇదా నువ్విచ్చే సలహా?"

"నే చెప్పేది కాస్త ఆలోచించండి. ఇష్టంలేని పెళ్ళిచేస్తే సంసారం సుఖంగా గడుస్తుందా? ఎప్పుడూ కలతలు. తీరనికోరికలకోసం అంతఃకలహాలు. తాము సుఖపడకపోయేదేకాకుండా ఎదుటివారికిగూడా శాంతినివ్వలేరు. అప్పుడు తప్పంతా మీదేనంటారు."

"వారికిష్టం ఎందుకువుండదు అనే నా ప్రశ్న. చిన్నప్పటినుండి కలిసిమెలిసి తిరిగారు. ఈనాడు ఏ కారణం లేకుండా ఇష్టంలేదంటే సరిపోతుందా?"

"చిన్నప్పటి జీవితంవేరు. ఇప్పటి జీవితంవేరు. అది నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు అని నమ్మే జీవితం. కానీ ఇప్పుడు పెద్దవారై తమజీవితాలనుదిద్దుకోగల శక్తిని, తెలివిని అలవరచుకున్నారు. తప్పుదారే త్రొక్కుతారో,మంచిదారే ఎన్నుకొంటారో వారిపై ఆధారపడి ఉంటుంది. వారిజీవితాన్ని వారినే పరీక్షించుకొననివ్వండి."

"ఏడిశారు! గుడ్డిగా ప్రేమ అని, నేనూ ప్రేమించాను అని అంటే సరిపోతుందా? ఏమితెలుసు వీరికి జీవితమంటే? దాన్ని ఏనాడైనా అర్థం చేసుకోగలరా?"

"అందుకే వారిష్టమొచ్చినట్లు నడుచుకోనివ్వండి. తాము ఎన్నుకొన్న దారిగుండా ప్రయాణించి వచ్చే కష్టనష్టాలను ఎదుర్కొని మంచి చెడులను తెలుసుకుంటారు."

"వారిష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తే పెద్దవారమంటూ ఏడిచేమే మెందుకు?"

"పెద్దవారైన మీరు వారి మేలేకోరి చెప్పి ఉండవచ్చు. కానీ ఎదిరించే వయసు వారిది. చిన్నతనంలో మీ మాట వినకుంటే దండిస్తారు. కానీ ఇప్పుడు దారికడ్డు తగిలితే మీ పెద్దరికాన్నిగూడా లెక్కచెయ్యరు. అప్పుడు ఆ పెద్దరికానికున్న గౌరవంపోతుంది. దాన్ని నిలబెట్టుకోవాలంటే వారి ఇష్టప్రకారమే నడుచుకోవాలి."

"అంతేనా!"

"అంతకన్నా గత్యంతరంలేదు. చెరువులకు ఆనకట్టలున్నాయి. వరదలకాలంలో ఆ గట్లు అడుకోలేవు."

"అతి చిన్నదైన ఒక కాలువను ప్రవహించకుండా ఆపలేము. కాలువ చిన్నదే కావచ్చు. కానీ నిరంతరంగా ప్రవహించే ఆ ప్రవాహాన్ని కొంతసేపు ఆపగలము. కాలం గడిచేకొద్దీ అది ఆ అడ్డును దాటి దానిమీదుగానే ప్రవహిస్తుంది. అప్పుడు మన శ్రమ వృథా అవుతుంది. వారిజీవితాలను సౌఖ్యవంతం చేసుకోలేనినాడు కొన్ని అనుభవాలనైనా గడించుకొంటారు."

"వేరే దారే లేదా?"

"లేదు. ఇది అణుయుగం. మనుష్యుల కోరికలను అరికట్టగలిగే శక్తి దేవుడికే లేదని నిరూపించుకొనే మానవుడిని మానవమాత్రులు ఏమాత్రం అరికట్టగలరో ఆలోచించండి. మొండిగా ప్రయత్నించినా మన స్పర్ధలకు లోనై వారిని దూరం చేసుకోవలసివస్తుంది."

"మరి ఈ ఆస్తినంతా ఎవరికో అంటగట్టాలంటే బుద్ధి పుట్టడం లేదు."

'నాన్నా! ఈ ఆస్తిని బావకే ఇచ్చెయ్యి. నాకేమీ వద్దు" అంది శారద.

"శారదా! నువ్వు ప్రేమించినవారిని చేసుకొని సుఖపడగలనన్న ధైర్యం నీకుందా?"

"ఉంది. అది లభించనినాడు ఖర్మే అనుకుంటాను. ఎవరిఖర్మకు ఎవరు బాధ్యులు, నాన్నా?"

"సరే. మీ సుఖానికి అడ్డుచెప్పే హక్కు నాకు లేనప్పుడు మీ ఇష్ట ప్రకారమే కానివ్వండి. వారితో మాట్లాడి త్వరలో ముహూర్తం పెట్టిస్తాను" అని లేచిపొయ్యాడు ముకుందయ్య భారంగా.

"విజయం మనదే" అని రాజ్ చేతిని తనచేతిలోకి తీసుకున్నాడు గోపి.

"శారదా! మేమలా వెళ్ళొస్తాం. కానీ నువ్వు తీరికగా మీకాబోయే భర్తగారికి ఉత్తరం వ్రాసుకో" అంటూ లేచాడు గోపి.

"షో బావా!" అని అక్కడినుండి పరుగెత్తి పోయింది శారద.

"ఒరేయ్ గోపీ! అతనికి ఇంజనీరింగ్ ఈసంవత్సరంతో పూర్తవు తుంది కదూ!" అడిగాడు రాజ్, కారులో.

"అవును. పాపం, మామయ్య ఒప్పుకోడని భయపడింది."

"ఎక్కడికిరా, కారును నీ యిష్టమొచ్చినట్లు పోనిస్తున్నావు?"

"మీ యింటికి."

"ఊం."

"ఆ, లతను చూసి చాలారోజులైందిరా" అన్నాడు గోపి కారును కుడివైపుకు త్రిప్పుతూ.

హాల్లో ఎదురైంది ఇందిర. గోపీ కళ్ళు నలువైపులా వెతికాయి. అదిచూసి నవ్వుకుని "పైనుంది. వెళ్ళండి" అంది ఇందిర.

రాజ్‌ను అక్కడే వదిలేసి పైకిపోయాడు గోపి. గోపీనిచూసి ఎగిరి గంతేసింది లత.

"వదినా, ఇవ్వేళ నిన్నొక విషయం అడగదలుచుకొన్నాను" అన్నాడు రాజ్.

"ఏమిటో అడుగు రాజూ" అంది ఇందిర.

"నాకు ఒకనాడైనా అన్నయ్యను చూపించలేదేం?"

ఆ ప్రశ్నవిన్న ఇందిరమొహం నల్లబడింది. మబ్బులు ఆవరించాయి ఆమె హృదయాన్ని. వెంటనే జవాబివ్వలేకపోయింది.

"నీ మనసును కష్టపెట్టేదైతే క్షమించు, వదినా!"

"లేదు, రాజూ, నీతోచెప్తే నా ఈ ఆవేదనైనా తగ్గుతుంది. విను. నేను అందరిలా ప్రేమించి పెళ్ళిచేసుకోలేకపోయినా తెలిసినవరుడే అయినందువలన ఇష్టపడ్డాను. పెళ్ళిచేసుకొన్న కొద్దిరోజులవరకూ జీవిత మాధుర్యాన్ని అనుభవించి నా అంత అదృష్టవంతురాలులేదని గర్వపడ్డాను. అలా సాగింది మా దాంపత్యజీవితం.

"సంసారంలో కలతలు రావడానికి ఎంతోసేపు పట్టదు. అతి సామాన్య విషయాలే అతి భయంకరంగా మారవచ్చు. అందుకు మన దోషమే కారణం. కొద్దిరోజులతర్వాత ఆయన యింటికి ఆలస్యంగా

రావడం మొదలుపెట్టాడు. కారణమడిగాను. ఏదో సాకుచెప్పి తప్పించుకున్నారు. రోజూ అలా జరగడం భరించలేకపొయ్యాను. సహజంగా మగవాడైనవారికి అటువంటి సమయంలో భర్తలమనే అధికార గర్వం బయలుదేరుతుంది. అదే జరిగింది. కీచులాటలు ప్రారంభమయ్యాయి.

"ఒకనాడు త్రాగి ఇంటికొచ్చారు. ఆశ్చర్యపోయాను. ఏడుపొచ్చింది. ఏడిచాను. ఓదార్చే వారుకూడా లేరు. పేకాట, త్రాగుడు ఎక్కువయ్యాయి. అడిగితే చెయ్యి చేసుకునేవారు. అడిగే అధికారాన్ని పోగొట్టుకొని కుక్కినపేనల్లే రోజులు గడపసాగాను. అంతకన్నా ఎక్కువ ఏం చెయ్యగలను? అడిగితే "నా యిష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తాను. నోరు మూసుకొని పడి ఉండు" అనే అదిలింపు, ధిక్కరిస్తే "బయటికి గెంటేస్తాను" అనే బెదిరింపులతో వారిని దూరం చేసుకోలేక అలాగే కళ్ళుమూసుకుని కాలం గడిపాను.

"ఆ తర్వాత కొద్దిరోజులకే నేను ఒక మగబిడ్డను ప్రసవించాను. ప్రసవపురోజుల్లో దగ్గరేవున్న ఒక నర్సింగ్‌హోమ్‌లో చేరాను. అక్కడ ఉన్నన్నిరోజులూ ఒక్కసారైనా నా దగ్గరికి రాలేదు. ఏ అర్ధరాత్రైనా వస్తారని ఆశించాను. నా ఆశ నిరాశే అయింది.ఇంటికొచ్చాను.ఆదరంతో పలుకరిస్తారనీ, బాబునుచూసి మురిసిపోతారనీ ఇంటికితిరిగొచ్చాను. నన్ను పలుకరించలేదు సరికదా, పండంటి బాబును తలెత్తి గూడా చూడలేదు. అతనిప్రవర్తన నాలో అతనిపట్ల వున్నప్రేమను తుడిచిపెట్టింది. ఒంటరిగా ఎన్నోరాత్రులు రోదించాను. నా రోదన భగవంతుడుకూడా వినలేదు. వినవలసిన అవసరం అతనికి లేకపోయింది. ఒకనాడు వాళ్ళఆఫీసు టైపిస్టు అమ్మాయిని ఇంటికి తీసుకొచ్చారు. 'ఇదేమిటండీ' అన్నాను.

"నా ఆనందానికి అడ్డురావడానికి నువ్వెవరు?" అదీ జవాబు.

"నేను మీకేం అన్యాయంచేశాను. నాలో ఏం లోపముంది?" అని నిలదీసి అడిగాను. కాళ్లావేళ్లాపడి ఏడిచాను. అతని హృదయం కరగలేదు.

"ఆదుఃఖంతో బాబుపై శ్రద్ధ తీసుకోలేకపోయాను. తత్ఫలితంగా బాబుకు జ్వరంవచ్చింది. డాక్టరును తీసుకురమ్మని అడిగాను. మౌనంగా

వెళ్ళిపోయారు. అమరునాడంతా చూశాను. రాలేదు. నేనే డాక్టరుదగ్గరికి పరుగెత్తాను.

"చాలా ఆలస్యం చేశావమ్మా! అయినా ప్రయత్నిస్తాను" అని డాక్టరు మందిచ్చింది. కానీ ఆమెమందులు కానీ, నా ప్రార్థనలుకానీ నా బాబును నాకు దక్కనియ్యలేదు. నాకు పిచ్చిపట్టినట్లయింది. ఒకప్రక్క బిడ్డ ఆరోగ్యం బాగులేక తల్లి విలపిస్తుంటే నిశ్చింతగా ఉండే ఆయన రాక్షసుడే ననిపించింది.

"అమరురోజు ఆ విషయం తెలిసి ఇంటికొచ్చారు. వారిని చూడ గానే నాలో కోపం మిన్నుముట్టింది. భర్తఅనే గౌరవ మివ్వలేక పోయాను. 'ఎందుకొచ్చారు?' అని సూటిగా అడిగాను. 'ఇందూ' అని బాధగా అన్నారాయన. అది గమనించే స్థితిలో లేను. 'నేను బ్రతికి వున్నానో లేదోనని చూడటానికివచ్చారా! చూడండి. చూసి ఆనందించండి. కన్నతండ్రయి ఉండికూడా బాబును నాకు కాకుండాచేశారు. నా బాబును చంపేశారు.' పిచ్చిగా వాగాను.

"నన్ను క్షమించు, ఇందూ" అనగలిగా రాయన.

"మిమ్మల్ని క్షమించడానికి నేనెవరిని? మీరు నా హృదయాన్ని శిలగా మార్చేశారు. నా ఆనందాన్ని నాశనం చేశారు. నా జ్యోతిని ఆర్పే శారు. నాలో ప్రేమఅనేదే లేకుండాచేశారు. ఏ వ్యామోహంలోపడి నా హృదయాన్ని గాయపరిచారో, ఎవరికోసం నా ప్రేమకు దూరమయ్యారో, ఏ వ్యామోహంలో కన్నబిడ్డను చంపుకొన్నారో అక్కడికే పొండి. ఇక్కడ మీ కెవ్వరూ లేరు. అందరూ చచ్చిపొయ్యారు. మీ ఆనంద మయ జీవితానికి ఎవరూ అడ్డురారు. వెళ్ళిపొండి.' పిచ్చిగా అరిచాను.

"ఇందూ, నా మాట విను. ఆవేశపడకు" అన్నవారిమాటలు విని "మీరు పోకుంటే నేనే పోతాను. మీలాంటివారిదగ్గర కాపురం చెయ్యడంకంటే చావడం మేలు" అని వారు ఎంతబ్రతిమాలుకున్నా విన కుండా ఆనాడే వచ్చేశాను. ఇందులో నా తప్పుందో వారి తప్పుందో తెలి యదు కానీ అదృష్టహీనులు జీవితంలో పరిస్థితులకు ఎదురుతిరిగితే చాలా బాధలు పడవలసివస్తుందనే అనుభవాన్ని గడించాను. నేనలా వచ్చే య్యడం తప్పంటావా, రాజూ?"

"లేదు, వదినా! పరిస్థితులు మానవుడిని రాక్షసుడుగా మారుస్తుంటాయి. ఆవేశం యుక్తాయుక్త విచక్షణలను నశింపజేస్తుంది."

"నా బ్రతుకును చూసి అమ్మ అప్పుడప్పుడు తన పాపాలకు ఫలితం తనబిడ్డలను అనుభవించమంటున్నావా దేవుడా అని దుఃఖిస్తుంటుంది. ఎన్నోమార్లు తిరిగివెళ్ళాలని ప్రయత్నించాను. కానీ తిరిగి ఆ జీవితం తలుచుకొంటే ఒళ్ళు జలదరిస్తుంది. మనశ్శాంతి, సుఖం, ఆనందం, భర్త ప్రేమ, ఆదరణ, ఆప్యాయత, సానుభూతి—వీటిలో ఏ ఒక్కటీ లేని ఆ జీవితంలోకి ప్రవేశించాలంటే భయపడి ఇక్కడే ఉండి ఈ జీవితాన్ని గడపడం మేలనుకొన్నాను."

"చీకటిలో ఉంటూ అదే ఆనందమనుకొంటే ఎలా, వదినా? కష్టాలను ఎదురుకొన్నప్పుడే నిజమైన ఆనందం లభిస్తుంది."

"అంతధైర్యం అబలనైన నాకులేదు, రాజూ!"

"అలాగని వాటికి భయపడి పారిపోతే సుఖంగా వుండలేం, వదినా!"

"ఏమో! ఇక వారితో సంసారం చేస్తానన్న నమ్మకం నాకులేదు. అది నా కంతగా ఇష్టంలేదుకూడా."

"ఈ మోడుబారిన జీవితంపై ఇష్టమా?"

"యిక్కడేం లోకువ? అమ్మ వుంది. లత ఉంది. అన్నిటికీ మించి నువ్వు ఉన్నావు. కావలసినంత ఆనందం, శాంతి, సౌఖ్యం లభిస్తున్నాయి."

"ఇవన్నీ కృత్రిమాలు. నువ్వు భ్రమపడుతున్నావు."

"రాజూ!"

"అవును, వదినా! ఇదంతా నీ భ్రమే. ఈ కృత్రిమానందాన్ని నువ్వు ఎక్కువరోజులు అనుభవించలేవు. నువ్వనుకొనే ఆనందం వెనుక అంతులేని దుఃఖం దాగివుంది. నువ్వుకోరే శాంతికి వెనుక అగాధమైన శాంతి ఉంది. అది తెలిసీ నువ్వు కప్పిపుచ్చుతున్నావు. యింతకూ ఆయన పేరేమిటి? ఎక్కడుంటున్నారు? ఏం చేస్తున్నారు?"

"వద్దు, రాజూ, వద్దు. నీబోటివాళ్ళు అతనితో మాట్లాడకూడదు. ఆయన కక్కడ అది సుఖంగా ఉంది. కనీసం ఆయనైనా సుఖంగా ఉంటే చాలు."

"నువ్వు ఏమీ చెప్పవన్నమాట."

"క్షమించు. నేనేం చెప్పలేను."

"సరే" అన్నాడు రాజ్. "నువ్వు చెప్పనంతమాత్రాన తెలుసుకోలే ననుకున్నావా, వదినా" అనుకొన్నాడు మనసులో.

# 17

"అన్నయ్యా!"

"ఏమ్మా, అరుణా!" అని చదువుకుంటున్న ఆనంద్ తలెత్తి చూసి "రజియా, నువ్వా!" అని ఆశ్చర్యపోయాడు.

"తప్పుగా పిలిచానా, అన్నయ్యా?"

ఆనంద్ గుండెల్లో ఒక్కసారిగా ఎవరో వెయ్యి శూలాలతో గుచ్చినట్లు బాధతో ఊగిపోయాడు. ఎవరిని ప్రేమించి తనప్రేమను బయటికి చెప్పలేక లోలోపలే కుమిలిపోతున్నాడో, ఆమే అన్నయ్యా అని దగ్గర చేరింది. అంతకన్నా ఎదురుదెబ్బ ఏం కావాలి?

"ఏం అన్నయ్యా, పలుకవు?"

భరించలేకపోయాడు ఆనంద్. ఎవరిని హృదయంలో భద్రంగా దాచుకొని భవిష్యత్తునుగురించి కలలుగన్నాడో, ఎవరిని తనకలల్లో ఊహించుకొని గాలిమేడలు కట్టుకొన్నాడో, వారే తన కలలను భగ్నం చేసి తనగాలిమేడలు కూలద్రోస్తున్నారు. తన భవిష్యత్తు అంధకారమైపోతూంది. ఈ ప్రపంచంలో అంతా మాయ,అంతా భ్రమ, అంతా మోసం అని ఘోషిస్తూంది అతనిహృదయం.

"నాతో మాట్లాడకూడదనుకున్నావా, అన్నయ్యా? అప్పుడు ఎంతో ప్రేమతో, ఆప్యాయంతో, పలుకరించి కబుర్లుచెప్పి నవ్వించేవాడివే? ఇప్పుడు నేనేం తప్పుచేశానని నాకీ శిక్ష, చెప్పన్నయ్యా!"

"రజియా, నన్నిలా బాధించడం నీకు న్యాయంకాదు."

"బాధించేది నేను కాదన్నయ్యా! నువ్వే! నువ్వు మమ్మల్ని చిత్రహింసకు గురి చెయ్యాలనుకుంటున్నావు. ఇది నీకు ధర్మమా? ఒకచెల్లెలి జీవితంలో చిచ్చురగల్చడం నీకు న్యాయమా? అంతకన్నా నీ చేతులతో చంపెయ్యకూడదూ!"

"రజియా!"

"నేను అన్నయ్యా అని పిలిస్తే భరించలేవు కదూ!"

"ఎవరికోసం ఒక ఆప్తమిత్రుడిని, ప్రాణానికి ప్రాణమిచ్చే స్నేహితుడిని కక్షతో దూరం చేసుకొన్నాడో, అందరికీ విరోధి అయ్యాడో, ఆమె ఈనాడు తననుండి చెల్లెలిప్రేమను కాంక్షిస్తూంది. కానీ తనకు కావలసింది అదికాదు. ఒక స్త్రీ ప్రేమకావాలి. అది తనకు లభ్యంకాదా? ఇదేనా తన ఇన్నాళ్ళ పూజకు ఫలితం? ఓ భగవంతుడా, నేను నీకేం అపకారం చేశాను? నాకీ శిక్ష ఎందుకు? ఇలాంటి పరిస్థితి నాకెందుకు కలిగించావు?"

"నన్ను అరుణతో సమానంగా చూడలేవా? నన్ను అరుణ అనుకొని నాలో అరుణను చూడలేవా? పోనీ, ఒక అనాథఅయిన చెల్లిగా భావించలేవా?"

"ఆమె ఒక్కొక్కమాటా తనను దహించివేస్తున్నది. ఆమె చూపులకు శక్తే ఉంటే తను పశ్చాత్తాపంతో, పాపంతో భస్మమైపోయి ఉండేవాడు. ఆమె కన్నీరు తనను అగాధాల్లోకి త్రోసివెయ్యగలదు. కానీ తను తనప్రేమను మార్చుకోగలడా? తనకెందుకు అంత బలహీనత నిచ్చావు? తనామెను చెల్లిగా భావించి మాట్లాడగలడా! తన కా శక్తిలేదు. కనీసం - ఆ శక్తినైనా ప్రసాదించావా!" మొరపెట్టుకుంటోంది అతని గాయపడ్డ హృదయం.

"అన్నయ్యా! నువ్వింత తెలివితక్కువగా ప్రవర్తిస్తావనుకోలేదు. ఆనాడు రాజశేఖరం త్యాగం చూసైనా నీబుద్ధి మారుతుందనుకొన్నాను. కానీ ఇంత మూర్ఖంగా రజియాను అపార్థం చేసుకొని అందరి మనసులూ నొప్పిస్తావనుకోలేదు. నీలాంటివారిని అన్నయ్యగా పొందినందుకు చింతిస్తున్నాను" అంది అరుణ కాస్త కోపంగా.

"అరుణా!" బాధగా మూలిగింది ఆనంద్ హృదయం.

తన ప్రియమైన చెల్లెలు అరుణే తనను అసహ్యించుకొంటూంది. యిది తను సహించలేడు. యిందరిని బాధించే సుఖం తనకు వద్దు. తను రజియానుండి ఒకచెల్లెలి ప్రేమనే పొంది ఆనందిస్తాననుకొన్నాడు.

"నీబాధ నర్థం చేసుకోగల నన్నయ్యా! కానీ యిది ప్రపంచం. యిక్కడ మన మనుకొన్న వ్యక్తిని, మనం కోరుకున్న సుఖాన్ని మన మనుకొన్న రీతిగా పొందలేము. ఆ వ్యక్తిగానీ, ఆ సుఖంగానీ మనకు లభించబోయేరీతిగా పొందాలి. అప్పుడే నిజమైన ఆనందం ఉంటుంది. కానీ కోరని సుఖాలను కోరి, ఆశించరాని వస్తువులను ఆశించి, అవి లభ్యంకానినాడు మొండిగా ప్రవర్తిస్తే నీకు మిగిలేదేమీ ఉండదు ఒక్క బాధతప్ప. అంతేకాక యితరులకు బాధ కలిగించినట్లవుతుంది. అమృత హృదయాలుగల యితరులను నొప్పించిననాడు నీకు జీవితంలో శాంతి, సౌఖ్యం ఏనాడూ లభించవు. మనం ఒక సమాజంలో కొన్ని సూత్రాలకు, అలవాట్లకు కట్టుబడి ఉన్నాము. వాటినితప్పి చరిస్తే అవమానాల పాలు కావలసివస్తుంది. జీవితంలోకూడా మనం కొన్ని అదృశ్య శక్తులకు కట్టుబడి వాటిచేత నడుపబడుతున్నాము. ఆ అదృశ్య శక్తులలో మంచీ, చెడూ రెండూ ఉన్నాయి. వాటిని విభజించుకొనేందుకు, ఆలోచించుకొనేందుకు మనకు దేవుడు మనసును ఇచ్చాడు. దాన్ని సరిగా ఉపయోగించుకోలేని నాడు కర్తవ్యాన్ని మరిచి బానిసలమయి పరిస్థితుల నెదుర్కోలేము. అప్పుడు మనజీవితం అధోగతి పాలవుతుంది. మనం కేవలం నటులము. నటించలేక ఎదురు తిరిగినప్పుడు బాధలు పడవలసివస్తుంది. మనకిచ్చిన పాత్రనే మన నటనా కౌశల్యంతో మెప్పించాలి. అప్పుడే పేరు, తృప్తి, సౌఖ్యము లభిస్తాయి. యింతకన్నా ఎక్కువ నేను నీకు చెప్పే పాటిదాన్ని కాదు. తెలివిగలవాడివైతే నీ బుద్ధి మార్చుకొని వారికి క్షమాపణ చెప్పుకొని ఒక్కసారి రజియాను నన్ను పిలిచినట్లుగా చెల్లెమ్మా అని పిలువు. అప్పుడు చూడు నీలో ఇప్పుడున్న భరించరాని బాధపోయి మోయలేని ఆనందం కలుగుతుంది. నువ్వలా చేయలేనినాడు నీలో మానవత్వం నశించింది అనుకోవలసిందే!"

"పోనీలే, అరుణా! అనవసరంగా అన్నయ్యను ఎందుకు నొప్పి స్తావు? నాతో మాట్లాడకుంటే పోనీలే, అన్నయ్యా! నీ మనసుకు కష్టం కలిగించుకోకు. వస్తాను" అని వెనుదిరిగింది రజియా కళ్ళు తుడుచు కొని.

"ఆగమ్మా, చెల్లీ!"

"నన్నేనా, అన్నయ్యా, పిలిచావు!" నమ్మలేక ఆనందంతో వెనుదిరిగి అడిగింది రజియా.

అరుణ సంతృప్తిగా ఒక శ్వాస విడిచింది.

"ఔనమ్మా, నిన్నే. నన్ను క్షమించు. అనవసరంగా మీ అంద రినీ నొప్పించాను."

"అంతమాట లనకన్నయ్యా!"

"లేదు, చెల్లీ! ఈ పాపానికి నిష్కృతిలేదు. స్నేహంలోని విలు వనుగూడా గుర్తించలేకపోయాను. వాడిని అవమానించి బాధించాను. సహించికూడా నా సుఖాన్నే కోరాడు. అటువంటి మిత్రుని శాశ్వతంగా పోగొట్టుకుంటానేమోనని భయంగా ఉంది."

"లేదన్నయ్యా! రాజ్ నిన్ను తప్పక చేరదీస్తాడు" అంది రజియా కళ్ళనుండి ఆనందబాష్పాలు రాలుతుండగా.

"యింకా ఎందుకు రజియా, ఈ కన్నీరు?"అనిఆనంద్ తన చేత్తో ఆమె కన్నీరు తుడిచి "ఏదీ, ఒక్కసారి నవ్వమ్మా!" అన్నాడు.

రజియా నవ్వింది.

ఆ నవ్వు అతనిలో ఒక గ్రుడ్డిదీపాన్ని ఆర్పివేసి క్రొత్తజ్యోతిని వెలిగించింది.

* * *

"రాజా!"

ఉలిక్కిపడ్డాడు రాజ్ ఆ గొంతు విని.

"రాజా, నన్ను క్షమించరా!"

"యిప్పు డేమొచ్చిందిరా, అంత ప్రమాదం?

"ఈ మాటలతో నన్ను చంపకు. నువ్వు క్షమించాను అంటే కానీ నాకు శాంతిలేదు."

"నీకంతగా వినాలని ఉంటే అలాగే అంటాను. ఇంతకూ యిప్పుడు వచ్చిన నష్టమేమిటి?"

"ఏమీ జరగనివాడిలా మాట్లాడి నా హృదయాన్ని మరింత గాయ పరుస్తున్నావు." తలవంచుకొన్నాడు ఆనంద్.

"ఒరేయ్! ఏమిట్రా ఆడపిల్లలా తలవంచుకుంటావు! తప్పుచేస్తే నువ్వు ఎందుకు తన్ను దండించలేదు అని ధైర్యంగా అడగాలి. అదీ స్నేహం. తెలుసా?"

"పోనీ ఇప్పుడడుగుతున్నాను; చెప్పు."

"అరి పిడుగా! నాకే ఎసరుపెట్టావు అప్పుడే? పద. అలా పోయి వద్దాం."

యిద్దరూ అక్కడినుండి షికారు బయలుదేరారు.

"పరీక్షలు రేపేకదా? బాగా చదువుతున్నావా?" అడిగాడు రాజ్.

"ఏం చదువులో, పోరా! ఎంత చదివినా అర్థమయ్యి చావవు."

"అంత విసుగైతే ఎలారా? యింకా చాలావుంది."

"ఏమిటో! నేరక ఈ ఇంగ్లీషు లిటరేచర్ తీసుకొన్నానా అని ఇప్పుడు ఏడుస్తున్నాను."

"పోనీ, ముందుగానే ఆలోచించలేకపోయ్యావా?"

"అప్పుడంత తెలివేఏడ్చివుంటే ఇప్పుడీబాధ ఉండేదికాదు; అసలు దీనికి భయపడవలసిన ఖర్మ ఏంపట్టింది?"

"మొదటి సంవత్సరమే యింత నిరుత్సాహపడితే పైసంవత్సరం ఏంచేస్తావురా?"

"ఏమిటో ఈ చదువులు? కూడు పెట్టలేని చదువులు. చదువై పోగానే ఉద్యోగంకోసం ప్రాకులాడాలి. అది దొరక్కుంటే ఏడుస్తూ కూర్చోవాలి. ఆ ఉద్యోగంకోసం యింటర్వ్యూ ఒకటి. సెలెక్షన్ ఒకటి. యిన్ని సంవత్సరాలు చదివిన చదువులూ, పరీక్షలూ కాక యింటర్వ్యూలో తిరిగి మళ్ళీ ఒక పరీక్ష. యిన్నిబాధలుపడి ఉద్యోగం దొరికినా సుఖం లేదు. మనగోపీగాడిపని మేలనుకో."

వారు తిన్నగా గోపీ దగ్గరికి వెళ్లారు. వారిద్దరూ కలిసి రావడం చూసి ఆశ్చర్యపోయి ఏదో అర్థంచేసుకొన్నాడు గోపీ.

"ఒరే రాస్కెల్! మేం బ్రతికి ఉన్నామన్నమాటే మరిచి పోయ్యావా?" అడిగాడు గంభీరంగా ఆనంద్.

"పనులు ఎక్కువగా ఉండి కలుసుకోలేక పోయానురా, ఫూల్!"

"నీకేం పనులున్నాయిరా, ఇడియట్?"

"నీ దృష్టిలో నేను మనిషిగా కనబడటం లేదేంరా రోగ్?"

"అది కాదురా, దుర్మార్గుడా! నువ్వు సుఖపురుషుడిగదా!" అని ఇంగ్లీషు తిట్లు ఆపి తెలుగులో తిట్టనారంభించాడు ఆనంద్, రాజ్ నవ్వు కుంటున్నాడు.

"పోరా, నీచుడా! మా మరదలి పెళ్ళి హడావుడి కార్యక్రమ మంతా నానెత్తి నే పడింది.

ఆనంద్ తిరిగి ఏదో అనబోతుండగా చాలన్నట్లు చూశాడు రాజ్. చేత్తో నోరుమూసుకున్నాడు ఆనంద్. అది చూచి పగలబడి నవ్వాడు గోపీ. ఆనంద్ కోపంగా ఒక చూపుచూసి రాజ్ చూడగానే తల ప్రక్కకు త్రిప్పుకున్నాడు. గోపీ, ఆనంద్ కలుసుకున్నప్పుడు గౌర వంగా తిట్టుకోవడం వారికి మర్యాదైన అలవాటు. వాళ్ళనలా వదిలేస్తే లోకంలో ఉన్న తిట్లన్నీ వాడేసుకుంటారని రాజ్‌కు తెలుసు. అందుకే వారిని అప్పుడప్పుడు అదుపులో పెడుతుంటాడు.

"పెళ్ళి ఇక్కడేనా, గోపీ?" అడిగాడు రాజ్.

"మొదట ఇక్కడే చేయించాలనుకున్నాం. కానీ వాళ్ళు తిరుపతి పైనే చేయించాలని పట్టుబట్టారు. కావున మీరంతా బంధుమిత్ర పరి వారంతో వచ్చి వధూవరులను ఆశీర్వదించి మమ్మల ఆనందింపజేయ ప్రార్థన." దండకం చదివాడు.

"ఊ. అది చదువనుకూడా రాదు. అయినా ఎవరొస్తారు అంత దూరం? మేం రాదలచుకోలేదు" అన్నాడు ఎటో చూస్తూ ఆనంద్.

"నీకేమైందిరా అక్కడికి రాకపోవడానికి? నువ్వు రాకపోతే వదిలే దెవరు? మక్కెలు విరగదన్ని కాళ్ళు చేతులు కట్టి గూడ్స్ వేగ నులో వేసి మరీ తీసుకుపోతాను."

"ఆఁ. యిలాంటి బెదరింపులు చాల చూశాం. అయ్యగారు అంత దూరం రావాలంటే ఓ విమానమో లేక హెలీకాఫ్టరో కనీసం రోల్సు రాయిస్ కారైనా ఉండాలి."

"నీ మొహానికి అదొక్కటి తక్కువైంది. మడక కారు కొనిస్తాను. అందులో రా."

"అలాంటివి పనికిరావు."

"పోనీ ఎద్దులబండిలో వస్తావా?" అడిగాడు రాజ్.

"నయం. యింకా గాడిదమీద రమ్మన్నావుకాదు."

"ఇలా పిచ్చి పిచ్చిగా వాగావంటే అదేగతి అవుతుంది."

"అలాగయితే పరీక్షలై పోయిన రాత్రే మా అత్తగారి ఊరైన పల్లెకు క్యాంప్ వేసేస్తాం."

"ఒరే నాన్నా! అంతపనిచేయకు. మా కారు యిస్తాను. అలాగే వద్దువుగాని." అంగీకరించాడు గోపీ.

"ఆనంద్!" గంభీరంగా అన్నాడు రాజ్.

"అబ్బె, నేనేం అనలేదురా! తమాషా కన్నాను. మీతోపాటే ట్రెయిన్‌లో వచ్చేస్తాను."

నవ్వారు వారిద్దరూ. వారితో శ్రుతి కలిపాడు ఆనంద్.

# 18

"రజీ!"

"ఏం, రాజ్?"

"ఈ మధ్య అన్నీ శుభవార్తలే."

"ఏమిటో ఆ శుభవార్తలు?"

"ఈ విశాల ప్రపంచంలో బంధువులంటూ ఎవ్వరూ లేరు అనుకొన్న నాకు ఒక అత్తయ్య, మరదలు, ఒక వదిన ఉన్నారు. గోపీ వాళ్ళ మరదలి వివాహం. కలుసుకుంటాడో లేదోననుకొన్న ఆనంద్ తిరిగి నా మిత్రుడయ్యాడు."

"నేనూ ఒక శుభవార్త చెప్పాలనుకుంటున్నాను."

"త్వరగా చెప్పెయి."

"నాకూ ఒక అమ్మ ఉంది. తల్లిప్రేమ దొరికింది."

"ఎవ రావిడ?"

మహిళామండలిలో జరిగిన విషయాలన్నీ చెప్పింది రజియా.

"రజీ, ఇందులో ఒకపెద్ద రహస్యముంది. దాన్ని బయటికి లాగాలి."

"ఎలా?"

"అదే ఆలోచిస్తున్నాను. ఆనాడు ఆనందరావుగారు నిన్ను ఒక ప్రశ్న అడిగారు. జ్ఞాపకం ఉందా?"

"ఉంది."

"దాన్నిబట్టి ఈ విషయంగురించి పూర్తిగాకాకపోయినా కొంతైనా వారికి తెలిసి ఉంటుందని నా ఉద్దేశ్యం."

"అందువల్ల ఫలితమేమిటి?"

"నీది ఒట్టి మట్టిబుర్ర. ఆయన చెప్పినదాన్ని ఆధారంగా తీసుకొని నిజాన్ని బయటికి లాగుదాం. ఏమంటావ్?"

"మంచి ఐడియానే. కానీ ఫలిస్తుందా అని అనుమానం."

"నీ అనుమానాన్ని గాలికి వదిలెయ్యి. రేపు ఆనందరావుగారి నడిగి ఆ విషయం కనుక్కుంటాను."

"రేపు పరీక్షలు కదా, రాజ్?"

"ఫరవాలేదు. పరీక్ష అవగానే సాయంకాలం వారిని కలుసుకొంటాను. అదీకాక జీవితపు పరీక్షల్లో నెగ్గితే ఈ పరీక్షల్లో అవలీలగా నెగ్గినట్లే!"

"రేపటి పరీక్షలకంత ప్రాముఖ్యంలేదుకదూ?"

"పరీక్షలంటే పరీక్షలే. వాటికి ప్రాముఖ్యం లేకున్నా మనం ఏర్పరచుకోవాలి."

"రాజ్, మా యింటికొచ్చెయ్యి. తోడుగా చదువుకుందాం."

"ఆహా. చదువు సాగినట్లే! మనం యింకా చిన్నపిల్లలమే అను కుంటున్నావా?"

"పెద్దవారిమే అనుకో. నీ ఉద్దేశ్యమేమిటో చెప్పు."

"నీకు నేను నాకు నువ్వు ఎదురుగా ఉంటే చదువు సాగుతుందా!"

"ఎందుకు సాగదు?"

"నీకన్నీ విడమరిచి చెప్పలేను, ఫో."

నవ్వింది రజియా.

"రజీ!"

"ఊఁ."

"నీ వరాల నవ్వుతో గులాబీలు వికసిస్తాయి."

"వేళాకోళానికేం తక్కువలేదు."

"నిజం రజీ, అలా చూడు. సముద్రుడుకూడా నీ పెదవిచాటున దాగివున్న చిరునవ్వుకోసం ఉరకలువేస్తూ పరుగెత్తుకొస్తున్నాడు."

"ఛ. నాకు సిగ్గేస్తోంది" అని రజియా అతని ఒడిలోనుండి లేచింది.

రాజ్ ఆమెను రెండుచేతులతో బంధించి తనవైపుకు త్రిప్పుకొని "ఇప్పుడు నీ మనసేమంటుందో చెప్పు, రజీ" అన్నాడు.

"ఉహుఁ" అంటూ రజియా తల త్రిప్పేసుకొంది.

"ఊ" అంది తల త్రిప్పకుండానే.

"నువ్వలా తల త్రిప్పేసుకొని ఉంటే నీ కెంపెక్కిన చెక్కిలిలో నా ప్రతిబింబం కనబడుతోంది."

"ఊ" అంటూ రెప్పలు తాటిస్తూ అతని కళ్ళలోకి చూసింది రజియా.

"చూడు, ఆ రెప్పలు వద్దంటున్నా నీ కన్నులు నీ హృదయంలో దాగిఉన్నమాటల్ని నాతో చెపుతున్నాయి."

"మరి నన్నడగడం దేనికి?"

"నీ నోటినుండి వినాలని ఉంది."

"అయితే విను. ఎప్పుడూ ఇదేవిధంగా నీ సాన్నిధ్యంలో ఆనం దాన్ని గ్రోలుతూ జీవితాన్ని నీకు అర్పించమంటూంది" అని రజియా అతని భుజంమీద వాలిపోయింది.

"అంత పెద్దకోరికే! కష్టం. నీ కోరిక నెరవేరదు."

"రాజ్!" కలవరపడి అరిచింది రజియా.

"అవును, రజీ. నీ కోరిక ఈ జన్మలో తీరదు" అన్నాడు రాజ్ లోలోపలే నవ్వుకుంటూ.

"రాజ్, నా ప్రేమమీద నమ్మకం లేదా?"

"నీ ప్రేమమీద నమ్మకముందిగానీ, నా నొసటి వ్రాతమీదే నాకు నమ్మకం లేదు."

"రాజ్, అటువంటి అపశకునపు పలుకలు పలుకవద్దు. నా మనసు కంపిస్తోంది."

"ఛ. అంతలోనే కన్నీరా! ఊరికే నిన్ను ఏడిపించడానికిఅన్నాను. పదా పోదాం."

"లేదు, రాజ్. నా మనసు ఏదో కీడును శంకిస్తోంది."

"పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు. నిన్ను నానుండి వేరు చెయ్యడం ఎవ్వరికీ చేతకాదు. మన ప్రేమను దేవుడుకూడా నిరాక రించలేడు."

నిజమా అన్నట్లు చూసి అతని కళ్ళలోని నిండుతనం చూసి ధైర్యం తెచ్చుకొని లేచింది రజియా.

"రాజ్, పరీక్షలై పోగానే ఏదైనా ఊళ్ళు తిరిగి రావాలని ఉంది. ఏమంటావు?"

"నీకేం? మహారాణివి. అన్నికోరికలూ నెరవేర్చుకొంటావు."

"ఈ మహారాజాగారికి ఏం లోటో? లక్షాధికారివేగా?"

"ఎవరైనా వింటే నవ్విపోతారు. ఆ మాటలకేంగాని పరీక్షలై పోగానే గోపీ వాళ్ళమరదలి పెళ్ళి వుంది. తిరుపతి వెళ్లాలి."

"నువ్వుపోతే నా కెలాగో ఉంటుంది, రాజ్!"

"ఏం? నువ్వురావా?"

"పిలువని పేరంటానికి రమ్మంటావా?"

"ఆ మాట అంటారని నాకు తెలుసు. అందుకే మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తున్నాను."

ఆ మాటలు విని ఇద్దరూ ప్రక్కకు చూచారు. సిగరెట్ త్రాగుతూ నిలబడివున్న గోపీని చూసి యిద్దరూ ఆశ్చర్యపోయారు.

"గోపీ, నువ్వా?" అన్నాడు రాజ్.

"మీరా!" అంది రజియా.

"ఆ. నేనే. మీకోసం మీయింటికొచ్చాను. మీరింకా రాలేదని తెలుసుకొని త్వరలో వస్తారని విని సిగరెట్ త్రాగుతూ బయటికొచ్చాను. దూరంగా వస్తున్న మీరు కనిపించారు. ప్రక్కనే నిలబడ్డాను. కానీ మీ దృష్టి నా పైన పడలేదు. ఏం చేస్తాం? మీ కళ్ళకు మేం కనిపిస్తామా?" అన్నాడు గోపీ, చిరునవ్వుతో ఎత్తిపొడుపుతో.

సిగ్గుపడింది రజియా.

గోపీ జేబునుండి పెళ్ళిపత్రికలు తీశాడు.

"ఇంటికెళ్దాం పదండి" అంది రజియా.

"ఆల్ రైట్" అని అనుసరించాడు గోపీ వారిని.

వారు కూర్చొనిమాట్లాడుతుండగా అక్కడికి సుగుణ వచ్చింది.

"ఏం అన్నయ్యా, మీవాళ్ళింటికిపోయి ఈ చెల్లాయిని మరిచిపోయావా?" రాగానే అడిగింది సుగుణ.

"అదికాదు, సుగుణా! ప్రతిదినమూ మీ యింటికి రావాలనే వస్తాను. కానీ మధ్యలోనే రజియా ఆ ఉద్దేశ్యాన్ని మార్చివేస్తుంది" అని రజియావైపు చూశాడు రాజ్.

రజియా ఆశ్చర్యపోయి అతన్ని తీక్షణంగా చూసింది.

"ఏమమ్మా, వదినా, పెళ్ళికాకముందే కొంగున కట్టుకు తిరిగితే ఎలా? మా అన్నయ్యను అప్పుడే మానుండి దూరం చెయ్యకు" అంది సుగుణ, రజియా మొహంలోకి చిలిపిగా చూస్తూ.

ఆ మాటలు విని కోపంగా చూసింది రజియా. గోపీ చూస్తున్నాడని గ్రహించి సిగ్గుతో కుంచించుకుపోయింది. దీనికంతా కారణం నువ్వే

నన్నట్లు చూసింది రాజ్‌ను. నాకేం తెలియదు అన్నట్లు కళ్ళతోనే సైగ చేశాడు రాజ్.

"అప్పుడే కోపంగూడా చూపిస్తున్నావే మా అన్నయ్యమీద!" ఇక అక్కడ ఉండలేక లోపలికి పరుగెత్తింది రజియా.

* * *

రాజ్ కాలేజీనుండి ఆనందరావుగారింటికి బయలుదేరాడు. "మిస్టర్, రాజశేఖరం!" పిలిచా రెవరో.

వెనుతిరిగి చూశాడు. లెక్చరర్ వామనమూర్తిగారు చిరునవ్వుతో వస్తున్నారు. ఆయన్నుచూసి విష్‌చేశాడు రాజ్.

ఆయన తిరిగి విష్‌చేస్తూ "బాగా చదువుతున్నావా?" అనడిగాడు.

"ఏదో చదువుతున్నాను, సార్! మీవెంట ఎప్పుడూ భానుమూర్తిగారుంటుండేవారే?"

ఆ మాటవిని వామనరావుగారి మొహం రంగులుమారింది. ఏదో బాధ గోచరించింది. అప్తుడిని దూరం చేసుకున్నాననే బాధ ఆ మొహంలో కనబడుతూంది.

"ఇంకెక్కడి భానుమూర్తి? రాజీనామా ఇచ్చి వెళ్ళిపోయాడు."

"ఆయనకీ ప్రదేశం ,సరిపోలేదా?"

"ఈ కాలేజీకి అతడిక్కడ ఉండడం సరిపోలేదు."

"మీ మాటలు అర్థం కావడంలేదు, సార్!"

వామనరావుగారు భానుమూర్తి ఎందుకు వెళ్ళిపోయిందీ వివరంగా చెప్పి "ఎవ్వరికీ తెలియదు. ఎవ్వరితోనూ చెప్పవద్దన్నాడు. నా ప్రియశిష్యుడివి కాబట్టి నీకు చెప్పాను. ఈ ప్రపంచంలో ఎన్నో జరుగరాని పనులు జరుగుతుంటాయి. అందుకు బాధ్యులు ఎవరైనదీ నిర్ణయించి చెప్పడం కష్టం! వస్తాను" అని ప్రక్కదారినుండి వెళ్ళిపోయాడు ఆయన.

రాజ్‌కు ఆయన చెప్పినవిషయం చాల బాధాకరంగా ఉంది. ఒక చిన్న తుఫాను రేపింది అతని హృదయంలో ఆ వార్త. ఆ వార్త విన కుండా ఉండినా బాగుండేది.

వాకిట్లోనే ఎదురయ్యారు ఆనందరావుగారు. ఆయనవెంట ఎవరో ఉన్నారు. రాజ్‌ను చూసి "లోపల అమ్మాయి ఉంది. మాట్లాడుతుండు. ఇప్పుడే వస్తాను" అని వెళ్ళిపోయా రాయన.

హాల్లో వసంత ఒక సోఫాలో కూర్చొని వుంది. రాజ్ ఆమె కెదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు. రాజ్‌నుచూసి ఏదో తప్పుచేసినట్లు తలవంచుకుంది. ఆమెను చూసిన రాజ్ మనసులో పలురకాల ఆలోచనలు ఉదయించాయి. పైకప్పుకేసి చూస్తూ తనలోని ఆలోచనలకు ఒక మార్గాన్ని ఏర్పరచుకోసాగాడు.

తలెత్తి అతన్నిచూసిన వసంత "నేను మీ ఎదుట ఉండడం కష్టంగా ఉన్నట్లుంది" అని లేచింది.

"వసంతా! నువ్వు ఎప్పుడూ ఎదుటివారిని గాయపరచడం నేర్చుకున్నావుగానీ అర్థంచేసుకోవడానికి ప్రయత్నించడం లేదు."

ఆమాట లామెను తిరిగి కూర్చోబెట్టినాయి.

"నీ మనసు స్థిమితంగా లేదు కదూ?"

"ఏ విషయంలో?"

"భానుమూర్తి విషయంలో ...."

నెత్తిన పిడుగుపడ్డట్లు అదిరిపడింది వసంత. అతని కళ్ళలోకి చూసింది. అవి తనను సూటిగాచూస్తూ తన హృదయంలోకి చొచ్చుకొని పోయి దేనికోసమో వెతుకుతున్నాయి. ఎక్కువసేపు చూడలేకపోయింది. అతని చూపులలోని నిర్మలత్వము తనలోని మచ్చను వేలెత్తి చూపిస్తూంది.

"మీకెలా తెలుసు?" వణుకుతూంది ఆమె కంఠం.

"నాకంతా తెలుసు" నిర్లిప్తమైన జవాబు.

"అది నా తప్పేనంటారా?"

"ఒకరిది తప్పని చెప్పడానికి వీలులేదు. అందమైనపువ్వు మానవుడి హృదయాన్ని ఆకర్షిస్తుంది. దాన్ని బలవంతంగానైనా చేతిలోకి తీసుకొని వాసనచూసి హాయిని అనుభవించాలని కోరుకుంటుంది అతని హృదయం. ఆ ఆకర్షణకు అంతశక్తిఉందని ఒప్పుకోవాలి. ఆఖరుకు

దాన్ని క్రిందపారేసి తనదారిన తానుపోతాడు. అది ఎవరితప్పు? ఆకర్షించే తత్వం కలిగిఉంది పుష్పం. ఆకర్షణకు లొంగిపోయే బలహీనత మానవుడి హృదయంలో ఉంది. అది అతనిలో భయంకరమైన కోరికలను రేపుతుంది. అనాదినుంచీ వస్తున్నది. అంత విచిత్ర సృష్టిచేసిన ఆ సృష్టికర్తదే తప్పేమో!"

అతనికి మనసులోనే జోహార్లు అర్పించింది.

"ఇప్పుడా విషయం నాన్నగారితో చెప్పడానికొచ్చారా?"

"మళ్ళీ నన్ను అపార్థం చేసుకుంటున్నావు."

"క్షమించండి; పొరపాటయింది."

తిరిగి మౌనం తాండవించింది వారిమధ్య. వసంతకు అతనితో మాట్లాడుతుంటే హృదయం తేలిక పడ్డట్లనిపించి యింకా మాట్లాడాలి అనుకొంది, కానీ ఏం మాట్లాడాలి?

"మీకు రజియా అంటే ఇష్టమా?" మెల్లిగా అడిగింది.

"ఇష్టం అనేది చాలా రకాలుగా ఉంటుంది. ఆమె తనస్నేహంతో అంధకారబంధురమైన నా జీవితానికి ఒక వెలుగును తెచ్చింది. అందుకే ఆమెను ఆరాధిస్తున్నాను."

"మరి, ఆమె?"

ఆ ప్రశ్న అడగడంలోని ఉద్దేశ్యమేమిటో అని వసంత మొహంలోని భావాలకై వెదికాడు. కానీ ఏమీ కనిపించలేదు. అడగాలని అడుగుతూందని గ్రహించాడు.

"ఆమె నన్ను తనమనసులో ప్రతిష్ఠించుకొని ఆరాధిస్తోంది."

"వెలుగును, చీకటినికూడా దేవుడే సృష్టించాడు. అంతటా వెలుగూ, అంతటా చీకటీ ఉండవు. అందరి కోరికలూ నెరవేరవు. ఒకరికి సుఖం, మరొకరికి దుఃఖం ప్రసాదించాడు భగవంతుడు."

అందరూ నమ్మే సత్యం. అనాదిగా వస్తున్నజీవితపు నిజం. కానీ అప్పటిలో ఆమెనుండి వెలువడ్డ ఆ మాటలు రాజ్‌ను బాధించాయి. ఆమె హృదయంలో రగిలే బాధను అర్థంచేసుకొన్న బాధ అది.

ఇంతలో పోర్టికోలో కారాగిన చప్పుడు విని వసంత పైకి పోయింది.

"ఏమిటోయ్, ఏమిటి సమాచారం? బాగా చదువుతున్నావా? అమ్మాయేదీ?" హడావుడిగా అడిగారు ఆనందరావుగారు వచ్చి.

"ఇప్పుడే పైకెళ్ళిందండీ!"

"అదెప్పుడూ అంతేలే. ఇంతకూ ఏమిటి విశేషం? మీ అత్తయ్య బాగా చూస్తోందా నిన్ను?"

"అక్కడ దేనికీ కొదవలేదు. ఒక విషయం అడుగుతాను. చెప్తారా?"

"ఎప్పుడైనా చెప్పనన్నానా?"

నవ్వాడు రాజ్. "ఆనాడు మీరు రజియాను చూసి ఎవరో జ్ఞాపకం వచ్చింది అన్నారే? ఆమెనుగురించి మీకేమైనా తెలుసా?"

"ఇప్పుడు అదెందుకోయ్?"

"పని ఉందండి. అందులో ఒకరి జన్మరహస్యం దాగి ఉందని నా అనుమానం."

"అయితేవిను. నేనుకాలేజిలో చదువుకొనే రోజులవి. ఆ అమ్మాయి చాలఅందంగాఉండేది. అచ్చంరజియాలాగే ఉండేది ఆమె. బహుశా ఇప్పుడేమైనా మారిఉండవచ్చు. నా చదువైపోగానే ఒకరింటికి పెళ్ళిచూపులకు పోయాము. మరిచాను, నేనప్పుడు కడపలో చదువుకుంటుండేవాడిని. పెళ్ళిచూపులలో ఆఅమ్మాయిని చూసిఆశ్చర్యపోయాను. అప్పట్లో అది ఆనందదాయకంకూడా అయింది. సరోజిని. కాలేజిలో నేను ఆమెను, ఆమె నన్ను ఎగిరిఉన్నా ఎప్పుడూ పలుకరించుకోలేదు. అప్పట్లో అంత అవసరం కలుగలేదు. పెళ్ళిచూపుల్లో ఆమె అయిష్టతనే వ్యక్తపరిచింది. ఇంతలో మానాన్నగారి బాల్యమిత్రుడొకడువచ్చి వారితో ఏదో మాట్లాడాలని బయటికి తీసుకుపోయాడు. ఒంటరిగావున్న నాకు వారి తోటలో తిరగాలనిపించి ఆపనిచేశాను. గుబురుగావున్న ఆ పూలమొక్కలను చూస్తూ ఎదురుగా నిలిచివున్న సరోజినిని చూసి ఆశ్చర్యపడకుండా ఉండలేకపోయాను.

"చూడండి,మీరు నన్ను పెళ్ళిచేసుకోవడానికి ఇష్టపడకండి" ఆమె మాటలు నన్ను మరింత నివ్వెరపరిచాయి.

కారణమడిగాను.

"కారణం చెప్పలేను. కానీ, మీ రంగీకరించకండి" అంది.

"కారణం చెప్పకుండా ఆజ్ఞాపిస్తే ఎలాగండి?" మొండికేశాను నేను.

"సరే అంతగా వినాలని ఉంటే వినండి. నేను వాసన చూడబడిన పువ్వును. మనసును, తనువును రెండింటిని వేరే ఒక వ్యక్తికి అర్పిం చాను. మీరు మంచివారు. మీ కన్యాయం జరగడం నాకిష్టం లేదు" అని వెళ్ళిపోయింది.

మెరుపులా వచ్చి ఒక దాగివున్న సత్యాన్ని చెప్పిపోయింది. తను వును, మనసును మరొకరికి అర్పించింది. అంతమాత్రంచేత ఆమె నాకు అనర్హురాలు కాలేకపోయింది. ఈ జీవితంలో ఇటువంటివి ఎన్ని ఘోరాలు జరగడంలేదు? భర్తలకు తెలియకుండా శరీరాన్ని పరులకర్పించే పతి వ్రతలు ఉన్నారు. ఏ ఒకటి రెండుమార్లో గర్భాన్ని పోగొట్టుకొని గుట్టుగా మరొకరికి అంకితమయ్యే మహా పతివ్రతలు ఎందరో ఉన్నారు. వారికన్న ఏం ఎక్కువ తక్కువ కాలేదీమె. పైగా చేసినదాన్ని ధైర్యంగా చెప్పింది. అప్పట్లో అది ఆమె స్వార్థం కావచ్చు. కానీ భవిష్యత్తుకు ఎంతో అపాయకారి అని తెలిసికూడా ధైర్యంచేసి తన రహస్యాన్ని నన్ను నమ్మి నాకు చెప్పింది. వయసులో ఎన్నో తప్పులు చేస్తుంటాం. చిన్నప్పుడుచేసే ఎన్నోతప్పులు తెలివి వచ్చినతర్వాత చేయం. అంతే. ప్రేమ అనే ప్రవాహంలో ఎన్నోతప్పులు చేస్తూ ఎంతోదూరం కొట్టుకు పోతాం. వాటి నాధారంగా తీసుకొని మనం కొన్నిజీవితాలను నాశనం చేయకూడదు. వివాహం కాకముందు చేసినతప్పులను వైవాహిక జీవి తంలో దిద్దుకోగల అవకాశాన్ని వారికివ్వాలి. అప్పుడే అందరి జీవితాలూ అమృతతుల్యాలు కాగలవు. అందుకే నిర్ణయించుకొన్నాను ఆమెనే పెళ్ళి చేసుకోవాలని.

ఇంటికిపోయి ఏ విషయం తెలుపుతామంటూ నాన్నగారు నన్ను ఇంటికితీసుకొచ్చి ఆ అమ్మాయి అప్పుడు గర్భవతి అనీ, అటువంటి

సంబంధం చూడటానికిపోవడం తప్పనీ అన్నారు. అనీ నా మనసెందుకో ఆయనమాటలు లెక్కచెయ్యలేదు. ఆమెనే పెళ్ళిచేసుకుంటానని పట్టు బట్టాను. నాన్నగారిని ఎదురించే ధైర్యంలేకపోయినా నచ్చచెప్పాను. ఒక్కగానొక్క కొడుకునైన నా కోరిక కాదనలేని నాన్నగారు తన హృదయాన్ని గాయపరుచుకొని అంగీకరించారు. ఆ విషయం తెలిపి సంబంధం ఖాయంచెయ్యను పోయినవ్యక్తి తెచ్చినకబురు నన్ను క్రుంగ దీసింది. వారు ఊరు విడిచి ఎక్కడికో పోయారట. జీవితంలో మొదటి సారి అపజయాన్ని పొందాను. ఒక వైరాగ్య సూచకమైన నవ్వు నా పెదవులపై విరిసింది. అదే ప్రాప్తమంటారు పెద్దలు. ఒకసారి నాన్న గారి ఆరోగ్యం బాగులేక వేలూరు తీసికెళ్ళాను. అక్కడ ఆమెను చూశాను. ప్రసవపు వార్డులోనుండి కళాకాంతులులేని మొహంతో బయటి కొస్తుండగా చూశాను. ఆమెప్రక్కన ఆమె నాన్నగారు, అమ్మ, అమ్మ చేతిలో ఒక చిన్నపాప. ఊహించుకొన్నాను.అప్పటికి ఒక నెలక్రితమే నాకు పెళ్ళయింది. ఆ తర్వాత ఇంతవరకూ జీవితంలో ఆమె నాకు తటస్థించలేదు."

అతనిమాటలు విన్న రాజ్‌మనసు అతనిపట్ల గౌరవాన్ని పెంపొం దించుకుంది. యింత విశాల హృదయులైన ఆయనకు ఈ కష్టాలెందుకు? నిజంగా భగవంతునికి హృదయం లేదనిపించింది.

"ప్రతి యువకుడూ మీలాంటి భావాలు కలిగివుంటే ఈ భూమి స్వర్గంగా మారిపోతుందండీ."

"అవన్నీ మనమనుకోవలసిందే. స్వర్గంకాకుంటే మానె నరకం కాకుంటే మేలే."

అదీ నిజమే. భూమిని స్వర్గంగా మార్చాలని ప్రయత్నించేవారి కంటే నరకంగా మార్చాలనుకునేవాళ్ళే ఎక్కువ. మనమనుకునే లోకాన్ని మనం చూడలేం. మనమాశించిన సంఘాన్ని మనం పొందలేం. భూమి స్వర్గం కావాలనీ, ప్రజలంతా దేవతలు కావాలనీ అనుకొంటే అది అత్యంత దుర్లభం అని తెలుసుకోవడానికి ఎంతోసేపు పట్టదు. మనం కనే కలలు ఫలించవు. మన ఆశలు నెరవేరవు. పూర్తిగా కాకపోయినా

సగమైనా ఫలించవు. దినదినానికి పాపభూయిష్ఠమైపోతున్న భూమెక్కడ? అమరత్వంతో మన ఊహకందని అందాలతో, సుఖాలతో, గుణాలతో కాలంగడిపే దేవతలుండే స్వర్గమెక్కడ? మనకోరిక బయటికి తెలిపితే పిచ్చివాళ్ళంటుంది సంఘం. అవును. అది పిచ్చేకదూ? కానీ ఏం పిచ్చి? సంఘంలో, సమాజంలో, మనుజుల్లో మార్పుతేవాలనే పిచ్చి. మానవుల్లో రాక్షసత్వాన్ని పూర్తిగా తుడిచిపెట్టి దేవత్వాన్ని తేవాలనే పిచ్చి చంచలమూ, క్రూరమూ అయిన మానవుడి మనస్సును పటిష్ఠంగానూ, దయాస్వరూపంగానూ మార్చాలి. కోరికలను రూపుమాపి వాంఛారహితంగా చేయాలి. మనిషికి నిలువెల్లా విషమేనన్న నినాదాన్ని పోగొట్టి అమృతవాహిని అని నిరూపించాలి. ఇదంతా చేయడం సాధ్యమా? సాధ్యంకాదు. ఎప్పుడు సాధ్యం? మానవులంతా మేల్కొని నడుం బిగించిననాడు అది సులభం. విజయాన్ని అవలీలగా సాధించవచ్చు. మానవులుకోరేది దేన్ని? పునర్జన్మవద్దనే ఎన్నో పుణ్యకార్యాలు చేస్తున్నారు. తిరిగి పాపభూయిష్ఠమైన ఈ లోకంలోకి రాకూడదనే తాపత్రయం అందరికీ ఉంది. కానీ అదే కొనసాగదు. అందరికీ సాధ్యంకాని, అందరికీ కనిపించే వస్తువది. అందరికీ దాన్ని అందుకోవాలనే అభిలాష. కానీ ఎవరో తప్ప అందరూ దాన్ని చేరలేరు. అలా చేరుకొన్ననాడు దాని గొప్పతనం ఏముంది? దాన్ని చేరుకొనే లోగానే ప్రక్కనేఉన్నకోరికలకు లొంగిపోయి ఓడిపోతారు. జన్మతోనే నాకీ మానవజన్మ వద్దు అని చేతులు జోడించి కనబడని దేవుడిని ప్రార్థిస్తూ, వినబడని అర్థంగాని భాషతో ఏడుస్తూ ఈ లోకంలోకివచ్చిన నరుడు దాన్ని అంత సులభంగా అందుకోలేడు.

తన జీవితాన్ని అతి దుఃఖమయంగానే కాక సౌఖ్యవంతంగా మార్చుకోగలిగే తెలివిని, శక్తిని ప్రసాదించాడు భగవంతుడు. ఆ తెలివితో, ఆ శక్తితో తమ కర్తవ్యాన్ని గుర్తించి తమ జీవితాలను సార్థకం చేసుకుంటారు కొందరు. మానవలోకంలోనే దేవతలుగా పూజింపబడతారు. తమచుట్టూ ఒక దివ్యతేజస్సును అలంకరించుకొని, ఆ తేజస్సులో ఒక స్థావరాన్ని ఏర్పరచుకొని,మిగతావారికి అందని గుణాలతో అలరారి ఆదర్శంగా నిలిచిపోతారు.

యిచ్చిన తెలివిని, శక్తిని దుర్వినియోగపరుచుకొంటూ ఐహిక వాంఛలకూ, కోరికలకూ లోబడి అల్పమైన, క్షణికమైన ఆనందాలను అనుభవించి శాశ్వతమైన ఆనందాన్ని, ముక్తిమార్గాన్ని పోగొట్టుకొంటారు మరికొందరు.

తమకున్నశక్తిని తెలుసుకోలేక పుట్టినందుకుగాను జీవిస్తున్నామని, ఏ ఆనందాలనూ కోరక, దొరికిన ఆనందాన్ని అనుభవించి జీవిత కాలమంతా అమాయకులుగా జీవించి అంత్యకాలంలో ఏమీ తెలియక, తెలుసుకోలేక చావు పుట్టుకలు మానవుడికి సహజమనే భావనలో చని పోతారు. కానీ ఈ మధ్యకాలంలో చేయవలసిన పనులు, విధులు ఉన్నాయనే భావన వారికి కలుగదు.

తమ సామర్థ్యాన్ని తెలుసుకొని ఉపయోగించుకోలేని అభాగ్యులు ఉన్నారు. ఏవిధంగా చేస్తే ఏమిపొందగలరో తెలుసుకోలేని తెలివితక్కువ వారు ఎక్కువ. జీవితకాలంలో తాము కొన్నివిధులను చేయాలి. ఫలితంగా పుణ్యాన్ని సాధించుకొని తమజీవితాలు సార్థకం చేసుకోవాలని తెలుసుకొన్నా ఆచరించలేరు. అది వారి బలహీనత.

యిన్నిరకాల మనస్తత్వాలు కలిగిన ఈ లోకం అర్థంకాని ఒక విచిత్రమైన, అందమైన సృష్టి.

# 19

"నాన్నా! మా అమ్మ ఎవరు?" ఊహించని ప్రశ్నకు ఉలిక్కిపడ్డారు ఖాన్‌గారు.

ఎదురుగా రజియా ఏదో దృఢనిశ్చయంతో, దేన్నో తెలుసుకోవాలనే ఆత్రుతతో, పొందలేని సుఖాన్ని పొందాలనే ఔత్సుక్యంతో అడుగుతూంది. ఆమెలో వాటిని కలిగించినవ్యక్తి ఆమె ప్రక్కనే ఉన్నాడు. గ్రహించగలిగారు ఖాన్‌గారు.

"ఇప్పుడెందుకు రజియా, ఆ విషయాలన్నీ? మీ అమ్మ చని

పోయి చాల సంవత్సరాలైంది." తప్పించుకోవాలనే ఆత్రుత వారిలో కనిపిస్తూంది.

"నాన్నా! ఇక నన్ను మోసగించలేవు. నిజం చెప్పు." నిలదీసి అడిగింది రజియా.

నిట్టూర్పు విడిచారు ఖాన్‌గారు. రాజ్ కళ్ళలో కాంతి కనిపించింది.

"రజియా, యిక దాచి ప్రయోజనంలేదు. అంతా చెప్తాను, విను. నా హృదయాగ్ని బయటికి వెళ్ళగ్రక్కుతాను. శాంతి, సౌఖ్యాలు లేని ఈ జీవితగాథ వినే ధైర్యముంటే విను. నే చేసినది తప్పయితే, క్షమించగలిగితే క్షమించు. నేను కడప కాలేజీలో బి. ఎ. చదువుతుండేవాడిని. మా నాన్నగారు రిటైర్డ్ డెప్యూటీ కలెక్టర్. నన్నెలాగైనా కలెక్టరును చెయ్యాలని వారి అభిలాష. అందుకే డాక్టరీ చదువుతానన్న నా కోరిక నిరాకరించి బి. ఎ. లో చేరిపించారు.

"ఆ రోజుల్లో ఏవేవో ఆశలు పెట్టుకుంటాం. భవిష్యత్తునుగురించి కలలుగంటాం. కానీ వాటిలో ఏ ఒక్కటైనా ఫలిస్తుందో లేదో చెప్పలేము. భవిష్యత్తుకు సోపానాలను నిర్మించుకొనే రోజులవి. ఎవరెంత జాగ్రత్తగా తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తారో అంతగా వారి భావిజీవితం సుఖంగా గడిచిపోతుంది. కానీ ఆ యౌవనం, ఆ పరిసరాలు జాగ్రత్తను మరిపిస్తాయి. కేవలం ఆనందాన్ని అనుభవించమని చెప్పే వయసు, వయసును ఎదురించలేక అనురించే మనసు.రెండూ తోడైతే వినాశనానికి అడ్డులేదు. ఆరోజులు ఇక జీవితంలో రావు. అందుకే వాటిని 'టర్నింగ్ పాయింట్ ఆఫ్ లైఫ్' అన్నారు. ఎవడైతే ఆదర్శాల ప్రకారం నడుచుకొంటాడో సుఖం వాని సొత్తు. అన్నీ కాకపోయినా కొన్ని ఆదర్శాలనైనా పూర్తిచేయగలిగితే భవిష్యత్తులో ఏ ఢోకా ఉండదు. అలాకాక జీవితంలో ఉండే ఆనందాన్నంతా అప్పుడే అనుభవించాలనే ఉద్దేశ్యంతో చాలామంది విద్యార్థులు ఉంటారు. వారు ముందు ముందు చాలా బాధలు పడవలసివస్తుంది.

"ఆ యౌవనం వింత వింత క్రొత్త కోరికలను కలిగిస్తుంది.

అందనివాటిని ఆశించమంటుంది. అందుకే కొందరు కవులు యౌవ్వనం మహా ప్రవాహమని, దానికి ఆనకట్టకట్టి అనుకూలంగా మార్చుకోగలిగిన వాడు బ్రతుకు ఫలదాయకమవుతుందని అన్నారు. అప్పుడు హెచ్చుగా ఉన్న ఆవేశానికి లోబడితే ఫలితాలు చాలా బాధాకరంగా ఉంటాయి. యిదంతా ఎందుకు చెపుతున్నానంటే విద్యార్థిజీవితంలో వారు ఏ పరిస్థితులలో తప్పుదారులు త్రొక్కుతారు అని. అనుభవపూర్వంగా నేర్చుకొన్నాను కాబట్టి బయటపెట్టలేకుండా ఉండలేకపోతున్నాను.

"మా క్లాసులో సరోజిని అని ఒక అమ్మాయి ఉండేది. అందానికే మారుపేరు. ఆమెకోసం ప్రయత్నించనివారు ఏ కొందరో. నాకూ అప్పుడప్పుడూ ఆమెను దక్కించుకోవాలనే తాపత్రయం ఉండేది. ఆమె చూపుల్లో చూపులు కలపాలనే కోరిక కలిగేది. ఆ పని చేసేవాడినికూడా. కొందరిని అదృష్టవంతులూ, మరికొందరిని దురదృష్టవంతులూ, అని ఊరికే అనలేదు. ఆ అమ్మాయి బ్రాహ్మణులమ్మాయి. నేను ముస్లిమును. మా ఇద్దరికీ పొత్తు కుదిరేది ఎలా?

"కొన్ని సంఘటనలు మనగీతనే మార్చివేస్తాయి. ఒకనాడు ట్యూషన్‌కు వెళ్ళివస్తున్న ఆమెను ఒక చిన్నవీధిలో అకస్మాత్తుగా చూశాను. ఆమెను చూడగానే నాలో ఏదో చెడుబుద్ధి పుట్టింది. ఆమె దారికడ్డం నిలబడ్డాను. రాత్రి. జనసంచారం లేని వీధి. ఆమె తలెత్తి చూసింది. అంతే. ఏం చేస్తున్నానో తెలియకుండానే ఆమెను కౌగిట్లోకి తీసుకొని ముద్దుపెట్టుకొన్నాను. చెంప ఛెళ్ళుమంది. ఆ దెబ్బతో తప్పు తెలుసుకొన్నాను. లేకుంటే ఏం చేసేవాడినో తెలియదు. అక్కడినుండి ప్రక్కసందులో పడి యిల్లు చేరుకున్నాను. ఆ తర్వాత రెండు రోజుల వరకూ కాలేజీ ఎగ్గొట్టాను. కానీ మూడోరోజు పోక తప్పదుగా? మునుపటి ధైర్యంలేదు. తలెత్తి తిరగలేకపోయాను.

"ఒకరోజు సినిమానుండి యింటికొస్తున్నాను. 'మిస్టర్ ఖాన్' అని వినిపించింది. చూశాను. సరోజిని. ఎక్కడ తిట్టేస్తుందోనని భయంతో పరుగెత్తిపోవాలనిపించింది. అలా చేస్తే ఎవరైనా దొంగ అంటారేమోననే భయం. గబగబా అడుగులు వేశాను.

"ఒక్క నిమిషం ఆగండి." ఆ పలుకులు నా కాళ్ళకు బంధాల్నే వేశాయి. దగ్గరికివచ్చి 'ఎందుకు నన్ను చూసి అలా భయపడుతున్నారు?' అంది.

"నేనేం మాట్లాడే స్థితిలోలేను. ఆమె తిట్టేతిట్లను సహించి అడగబోయే ప్రశ్నలకు ఏం సమాధానం యివ్వాలా అని ఆలోచిస్తున్నాను.

"మీకు నేనంటే ఇష్టమా?" ఆమె అడిగినప్రశ్న అర్థంకాక తల ఊపాను.

"నమ్మమంటారా?" అంది. అప్పుడు ఆమె అడిగినప్రశ్న నర్థం చేసుకొన్నాను. ఆమె అడిగినప్రశ్ననే నమ్మలేకపోయాను. అలా అడిగినట్లడిగి ఒక్కసారిగా ఎక్కడ తిట్టేస్తుందోననే అనుమానం.

"మీ యిష్టం" అనేశాను.

"చేయి చాపిందామె. ఆ చేతిలో చేయి కలిపాను. అంతవరకు ఆమె ప్రక్కనేవున్న చిన్నతమ్ముడు అర్థంకాక నా వైపు చూశాడు.

"ఆనాడు చేతులు కలిశాయి. కాలక్రమేణా ఇద్దరం కలిసిపోయ్యాం.

"ఖాన్, నేను తల్లిని కాబోతున్నాను" ఆ వార్త నా గుండెల్ని చెదరగొట్టింది. ధైర్యం తెచ్చుకున్నాను. ఆమెకు ధైర్యం చెప్పాను.

"సరే, మీ నాన్నగారిని నేరుగా అడిగేస్తాను" అన్నాను.

"కోరి ఆపదలను కొని తెచ్చుకున్నట్లవుతుంది. మానాన్న అసలే కోపిష్టి. అందుకుతోడు డి. ఎస్. పి. మతాంతర వివాహానికి ఒప్పుకోడు. నిన్నూ, నన్నూ కాల్చిపారేసి నిశ్చింతగా జైల్లో కూర్చుంటాడు" అంది.

"కాస్సేపు తర్జన భర్జనలు జరిపాక ఆ రాత్రే ఎక్కడికైనా పారిపోయి గుట్టుగా పెళ్ళిచేసుకోవాలని నిర్ణయించుకొన్నాం. ఆ రాత్రి ఆమె కోసం కాచుకొన్నాను. కానీ ఆమె రాలేదు.

లభించిన ఆనందం దూరమైపోయింది. భవిష్యత్తును ఊహించుకోకుండా ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించి యుక్తాయుక్త విచక్షణలను మరిచి చరించాను. జీవితాన్నే జయించానని గర్వపడి దానిచేతనే మోసగింప

బడి ఓడిపోయాను అని తెలుసుకొని క్రుంగిపోయాను. అందుకు ఫలితం సమాజంలో అవహేళన. మగవారికి ఫర్వాలేదు. ఆడవారిబ్రతుకే నవ్వుల పాలవుతుంది. వారిఆత్మ ఘోషిస్తూనే ఉంటుంది. జీవితాంతం ఆ బాధను మరిచిపోలేరు. ఆశించినదిలభించదని తేలిపోయినప్పుడు ఆత్మహత్యచేసు కొనే బలహీనులు ఉన్నారు.ఆప్రేమను మరిచిపోలేక పిచ్చివాళ్ళుగా తయా రయ్యేవారూఉన్నారు.మనసునుచిక్కబట్టుకొని జీవితమంతా ఆబడబాగ్నిని కడుపులో దాచుకొని బ్రతకగలిగే మహానుభావులూ ఉన్నారు. తమ మను గడలో కొందరికి ఉదాహరణంగా నిలిచి కనీసం వారి జీవితాలనైనా బాగు చెయ్యాలనే కోరిక వారికుంటుంది. ఆమె నన్ను మోసగించిందను కొన్నాను. కానీ ఆ తర్వాత...."

"ఆ తర్వాత నేను చెప్తాను, ఖాన్." అక్కడే నిలబడివున్న సరోజినీదేవి అంది. ఆమె రాక నెవ్వరూ గమనించలేదు.

"సరూ, వచ్చావా? నువ్వు ఉంటే బాగుండును అనుకొంటున్నాను. ఇంతలో వచ్చావు. రా. వీళ్ళ అనుమానాలని తొలగించు" అని కళ్ళు తుడుచుకొని లేవబోయారు ఖాన్‌గారు.

"వద్దు, ఖాన్. నువ్వుకూడా కూర్చో."

ఆ ఆజ్ఞను మీరే శక్తి అతనికేనాడూ లేదు.

"ఆ రాత్రి మమత, మమకారాలను చంపుకోలేక చాలాసేపు మథనపడ్డాను. రక్తసంబంధాన్ని త్రెంచుకొని ఖాన్‌కోసం అన్నిబంధాలు వదిలించుకొని అంతా సిద్ధంచేసుకొన్నాను. అందరూ నిద్రపోయారను కొని మెల్లిగా నాగదినుండి బయటికొచ్చాను. రెండడుగులువేసి ముందుకు చూసి భయంతో వణికిపోయాను. నాన్న. నాచేతిలోని సూట్‌కేస్ క్రింద పడిపోయింది. నాన్నగారికళ్ళు రౌద్రంగా ఉన్నాయి. ఆయన జేబులో నుండి రివాల్వరు తీశారు. భయపడ్డాను. కానీ అలా చనిపోవడమే మేలను కొని స్థిరచిత్తంతో తలవంచుకొని నిలబడ్డాను. నా దగ్గరగా వచ్చా రాయన. రెండు కన్నీటిబొట్లు క్రిందపడ్డాయి. తలెత్తిచూశాను. నాన్న కన్నీరు కార్చడంచూసిన నా హృదయాన్ని బాధ ఆవరించింది. ఆయన నా చేతిలో రివాల్వరు వుంచారు. వణికిపోతూ ఆయన కళ్ళలోకి చూశాను.

అప్పటికే ఆయన వెనక్కు వెళ్ళి నిలబడ్డారు. ఆయనప్రక్కన కన్నీటితో జననమిచ్చిన తల్లి, అమాయకుడైన తమ్ముడు నిలబడి ఉన్నారు.

"ఊ. కానీ ఆ ట్రిగ్గర్ నొక్కు. నీకు ఎలాంటి అడ్డంకులూ వుండవు. నిశ్చింతగా మా శవాలపైన నడిచిపో. పోయేముందు ఆ పనిచేసి కాస్తపుణ్యం కట్టుకొని పో."

"చలించిపోయాను. "నాన్నా!" అంటూ రివాల్వరు దూరంగా విసిరేశాను.

"నువ్వు ఇప్పుడుచేసేపనికన్నా ఇదేం పెద్దపనికాదు.వంశమర్యాద, పరువు ప్రతిష్టలు గాలిలో కలిసిపోయాయి. సహించాను. అవి నీకు అక్కర్లేదు. కన్నకడుపు తీపిచేత వాటిని వదులుకొన్నాం. కానీ ఈనాడు మేమే నీకు అక్కరలేనప్పుడు ఈ జీవితాలెందుకు?"

"నాన్నా!" చేతులతో మొహం కప్పుకొని గట్టిగా ఏడిచాను.

"సరే. నీకంతగా వెళ్ళిపోవాలని ఉంటే పో. కానీ ఒక్కసారి మా మొహాలు చూడు. మేం ఎప్పుడు పోతామో మాకే తెలియదు. అప్పుడు వీడు అనాథ అయిపోయి వీధులలో బిచ్చమెత్తుకుని తిరుగుతుంటాడు. అదిచూసి సంతోషించు. నిన్ను ఆపే హక్కు మాకులేదు. నీ యిష్టమొచ్చినచోటికి పోవచ్చు."

"తలెత్తి వారిని చూశాను. నవమాసాలు మోసి పాలిచ్చి పెంచిన తల్లి, దేహమునిచ్చి, విద్యాబుద్ధులు చెప్పించిన తండ్రి, రక్తం పంచుకొని తోడుగా పుట్టిన చిన్నారితమ్ముడు - వారిని విడిచిపోవాలంటే కాళ్ళాడలేదు. రక్తపాశం నన్ను బంధించింది. కానీ, అక్కడ ఖాన్! ఆలోచించలేకపోయాను. ఏడుస్తూ నా గదిలోకి వెళ్ళిపోయి తలుపులు వేసుకొన్నాను.

"ఆ తర్వాత ఆ ఊరే వదిలి వచ్చేశాము. నా హృదయావేదన ఖాన్‌తో చెప్పే అవకాశం లేకపోయింది. నా ఖాన్‌ని నేను మోసం చేశాననే బాధతో కుమిలిపోతూ జీవచ్ఛవంలా గడిపాను. నాకు వేలూరులో కానుపు జరిగింది. నా పాపను చూసుకొని ఆనందించే అదృష్టానికి

గూడా నోచుకోలేదు. ఒక అనాథ ఆశ్రమంలో చేర్పించారు. వారి మాటలకు బోధనలకు లొంగిపోయాను. ఆ సంవత్సరమే నా పెళ్ళయిపోయింది. ఆయనలో ఖాన్‌ను చూసుకుంటూ జీవితాన్ని గడిపాను.

"నిజం దాచినా దాగదు. పెళ్ళవగానే హనీమూన్ పోవాలని పట్టుబట్టారు మావారు. ఒకరాత్రి. ట్రెయిన్‌లో వస్తున్నాము. ఆ కంపార్ట్‌మెంట్‌లో నేనూ, మావారుతప్ప మరెవ్వరూలేరు. మావారు పైబెర్తుమీద పడుకొన్నారు. నేను చీకటిలో కూర్చొని జీవితపు పుటలను తిరగవేసుకొంటున్నాను. ఎవరో కంపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశించారు. చీకటిలో ఎవరైనదీ గుర్తించలేను. ఆ వచ్చిన వ్యక్తి ఎదురుగావున్న బెర్తుమీద కూర్చొని లైటు వేసుకొన్నాడు. అతడు నన్ను గమనించలేదు. ఏదో ఇంగ్లీషుపత్రిక చదువుకోసాగాడు. అతనిమొహం కనిపించకపోయినా అతన్ని గుర్తించి దడదడ కొట్టుకొంది హృదయం.

"ఖాన్" అన్నాను. ఉలిక్కిపడి చూశాడతను, ఒక్కసారిగా హృదయపు భారాన్నంతా అతని హృదయంపై వాలిపోయి తీర్చుకోవాలనుకొన్నాను. కానీ పరాయిదాన్ని.

"సరూ, నువ్వా!" అనగలిగాడు ఖాన్, అతనిమొహంలో విషాద ఛాయలు వ్యక్తమయ్యాయి.

"ఏం మాట్లాడలేకపోయ్యాను. హృదయం రోదిస్తోంది. గట్టిగా ఏడవడానికిగూడా నోచుకోని నిర్భాగ్యురాలిని.

"ఖులాసాగా ఉన్నావా, సరూ!" పలుకరించాడు ఖాన్. ఆ ప్రశ్నకు కలవరపడ్డాను. అతన్ని పరీక్షించాను. అతనిలో చాలామార్పు వచ్చింది. గాంభీర్యం అలుముకొంది. యౌవనంలో ఏదోబాధకు గురై జీవితమంటే విసిగి నిరాశా నిస్పృహలతో జీవిస్తున్నవాడిలా కనుపించాడు.

"నువ్వు చాలా మారిపొయ్యావు, ఖాన్" ఎంత ఆపుకుందామన్నా ఆగక పొర్లుకొచ్చింది దుఃఖం.

"చూడు, సరూ, జీవితమంతా ఏడుస్తూ కూర్చుంటే ప్రయోజనం లేదు. ఇకమీదనైనా సుఖంగా కాకపోయినా కనీసం ప్రశాంతంగా గడపడం నేర్చుకుందాం." సలహా యిచ్చాడు.

"సాధ్యమా, ఖాన్?" అన్నాను దుఃఖాన్ని అపుకొంటూ.

"అసాధ్యాన్ని సాధ్యంగా మార్చుకొనే శక్తినిచ్చాడు దేవుడు."

"అనుభవంవలన చాలా నేర్చుకోగలిగాడనే భావించాను. ఏదో చెప్పమని హృదయం ప్రబోధిస్తూంది.

"బిడ్డ నేం చేశావు?" అతడే అడిగాడు.

"అంతా చెప్పాలని చెప్పలేకపోయి బిడ్డవిషయం మాత్రం చెప్పాను.

"మనబిడ్డ అనాథగా జీవించడానికి వీలులేదు" అని బండి ఆగగానే పోవటానికి ఉద్యుక్తుడయ్యాడు.

"ఖాన్" అన్నాను ఆవేదనతో.

"సరూ, అయిందేదో అయిపోయింది. నువ్వు మోసగించావని నేను బాధపడడం లేదు. నీ జీవితంలో నేను కనబడకూడదు. అందువల్ల అనర్థాలు సంభవిస్తాయి. జరిగిన అనర్థం చాలు. క్రొత్తకష్టాలను కోరి తెచ్చుకోవడమెందుకు? నీవైనా సుఖంగా ఉండు. సెలవు" అని వెళ్ళిపోయాడు.

"కనుచూపుకు దూరమయ్యేంతవరకూ అతన్ని చూశాను. బాధతో వెనుతిరిగి కళ్ళు తిరిగినట్లయి పడబోయాను. అంతవరకూ నన్నే నిశితంగా చూస్తూండిన మావారు నన్ను పట్టుకొని కూర్చోబెట్టారు. వారిని చూడలేకపోయాను.

"ఫరవాలేదు, సరూ, దేవుడు మీపట్ల క్రౌర్యాన్ని చూపించాడు. కానీ నేనూ ఆ పనిచేయలేను. ఏ కారణంవలన తప్పుచేసి విధి కోరలకు చిక్కి దాన్ని ఒప్పుగా మార్చుకునే అవకాశం కలగని నిన్ను క్షమించి చేరదీయలేనినాడు నా ఈ మనుగడకే అర్థంలేదు. అతడన్న ప్రకారం మీ బిడ అనాథగా జీవించకూడదు. ఇంటికిపోగానే ఆ బిడ్డను తెచ్చుకుందాం.'

"వారిమాటలు ఏ దేవుని దీవనలో అనిపించాయి. ఇటువంటి వారుకూడా ఉంటారా అనుకొన్నాను. సంతోషంవల్లనో, దుఃఖంవల్లనో నోట మాటరాలేదు. భక్తితో అతనిపాదాలపైపడ్డాను.

"పిచ్చిదానా! అందుకే మీ ఆడవారు సుఖమొచ్చినా దుఃఖమొచ్చినా భరించలేరు" అని నన్ను హృదయానికి హత్తుకొన్నారు.

"ఆ తర్వాత ఆ బిడ్డకై ప్రయత్నించగా ఎవరో తీసికెళ్ళిపొయ్యారని తెలిసింది. చేసేదిలేక కన్నబిడ్డ చిలిపిమాటలు విని, చిలిపిచేష్టలు చూసి ఆనందించే భాగ్యానికి నోచుకోలేకపోయాను. ఇప్పుడు కన్నబిడ్డను నా బిడ్డ అని చెప్పుకోలేని నిర్భాగ్యురాలిని. అదృష్టహీనురాలిని. ఇదీ నీ కన్నతల్లి కథ. అసహ్యించుకొంటావో జాలిపడతావో ఆలోచించుకో."

"అమ్మా!" అంది రజియా.

"రజియా" అంటూ రజియాను తనకౌగిలిలోకి తీసుకొంది సరోజినీదేవి.

"ఇన్నాళ్ళూ ఈ మాట నాతో చెప్పలేదెందుకమ్మా! అంతపాపం నేనేం చేశానమ్మా!" అంది రజియా ఏడుస్తూ.

"లేదమ్మా! ఈ పాపపుగాథ చెప్పి లేతహృదయాలను గాయపరచడం ఇష్టంలేక చెప్పలేదు."

"రజియా! నీకు తల్లేకాదు. తండ్రికూడా అన్యాయం చేశాడు. ఆనాడు నిన్ను శరణాలయంనుండి తీసుకొచ్చి పురిట్లోనే మీ అమ్మ చనిపోయిందని మోసం చేశాను. తల్లిప్రేమకు దూరంచేశాను. అందుకు నన్ను క్షమించు, తల్లీ" అన్నారు ఖాన్‌గారు.

రాజ్ మౌనంగా వారిని చూడసాగాడు.

"నాన్నా! అలాంటి మాటలనకండి. మీవంటి తల్లితండ్రులను కలిగి ఉన్నందుకు నేనెంతో గర్వపడుతున్నాను."

తానొక హిందూ స్త్రీ అని తెలుసుకొని తన పద్ధతులు మార్చుకొంది రజియా.

ఈ విశాల ప్రపంచంలో ఇలా ఎందరి జీవితాలు నాశనమవుతున్నాయో, ఎందరి జీవితసౌఖ్యం మట్టిలో కలిసిపోతుందో, ఎందరు అమాయకుల హృదయాలు అలమటించిపోతున్నాయో, ఎందరు తమ తొందరపాటుకు చింతిస్తూ జీవితాన్ని గడుపుతున్నారో తెలుసుకోవడం కష్టం.

## 20

వై. నారాయణరావు మేనేజర్. క్లాత్‌మిల్—అన్న బోర్డు చూసి లోపలికి నడిచాడు రాజ్. కాని ఆఇంటికి తాళంవేసివుంది. అక్కడి నుండి వేగంగా మిల్లుకు పోయాడు.

"సార్, మీతో మాట్లాడాలని ఎవరో వచ్చారు." ప్యూన్ చెప్పాడు.

"లోపలికి పంపించు" అని చూస్తూన్న ఫైలు ప్రక్కన పడేసి సిగరెట్ దమ్ము పీల్చాడు ఆయన.

"నమస్కారమండీ." లోపలికి వచ్చాడు రాజ్.

"నమస్కారం కూర్చోండి" అని కుర్చీ చూపించి 'ఎన్నడూ చూడలేదే, అయినా ఇతని కేమిటి పని! అనుకొన్నాడు ఆయన.

రాజ్ అక్కడవున్న కుర్చీలో కూర్చొని నారాయణరావును పరీక్షించాడు. పాతికేళ్ళవయసుతోవున్న నిండైన విగ్రహం. అందమైన మొహానికి రింగుల వెంట్రుకలు ఆకర్షణ నిస్తున్నాయి. మనిషిలో ఉద్యోగ హోదా ఉట్టి పడుతూంది. నోట్లో సిగరెట్టు ఆ హోదాకు చిహ్నంగా వుంది. కళ్ళు అహంభావాన్ని చాటుతున్నాయి. చూపుల్లో ఆత్రుత, అయిష్టత ఉంటుందప్పుడప్పుడు. మావదినకు తగినజోడే అనుకున్నాడు రాజ్.

"ఆఁ. మీరొచ్చిన పనేమిటో చెప్తారా?"

"మీతో ఏకాంతంగా మాట్లాడాలి."

"ఏ విషయంలో?"

"మీ శ్రీమతి ఇందిరగారి విషయంలో."

నారాయణరావు కనుబొమ్మలు ముడిచి ఏదో ఆలోచించాడు.

"ఆ విషయం మాట్లాడడానికి మీరెవరు?"

"నే చెప్పినా మీకు తెలియదేమో!"

"ఆమె పంపిన రాయబారులా?"

"మీరెలాగైనా భావించుకోవచ్చు."

"సూటిగా సమాధానం చెప్పండి."

"ఆమె, నేనూ బంధువులం."

"వదినా, ఒక శుభవార్త. మీ భర్తగారు అంటే మా అన్నగారు ఈ మధ్య దురలవాట్లను దూరంచేశారు."

ఇందిర హృదయం ఆ వార్త విని పొంగిపోయింది. తన ఆనం దాన్ని బయటికి కనబడనీయకుండా "అయితే ఇప్పుడు నన్నేం చెయ్య మంటారు, మరిదిగారూ!" అంది.

"ఆ ఆనందాన్ని బయటికి కనబడనీయకుండా లోపలే అణగ ద్రొక్క వద్దంటున్నాను, వదినగారూ! మీరు సంతోషంగా ఉంటే మాకు మహదానందం."

"రాజూ, నీలో రోజురోజుకూ చిలిపితనం ఎక్కువవుతోంది. త్వరలో నీ మెడకో గుదిబండకట్టి నీ నోరు మూయించమని అమ్మతో చెప్తానుండు. అన్నట్లు మరిచాను. రజియాను తీసుకొస్తానన్నావు. తీసుకు రాలేదేం?"

"ఆవిడగారు సిగ్గుపడుతున్నారు."

"ఎందుకూ?"

"పిన్నిగారింటికి రావాలంటే సిగ్గుగా ఉందండీ అంది."

"అప్పుడే వరుసకూడా కలిపేసిందా?"

"అంతా అయిపోయింది. చదువైపోగానే ముహూర్తం పెట్టించా లని వాళ్ళనాన్నగారి నిశ్చయం. లత ఏదీ?"

"వచ్చేశాను, బావా!" అంటూ లోపలికొచ్చింది లత.

"మరి ఆ గోపీగాడితో కబుర్లు అయిపొయ్యాయా, లతా? ఏమ న్నాడు వాడు? త్వరలో ముహూర్తం పెట్టిస్తానన్నాడా లేక చదువై పోయేంతవరకు ఆగుతానన్నాడా?"

"ఫో, బావా! నీ కెప్పుడూ నన్ను ఏడిపించడమే పని" అంది లత సిగ్గుతో.

"ఇంతకూ నీ వుద్దేశ్యం చెప్పావుకాదు."

"చదువైపోనీ, రాజూ" అంది ఇందిర, చెల్లెలివైపు ప్రేమగా చూస్తూ.

"వదినా! నా కిప్పుడు ఎంతో సంతోషంగా ఉంది."

"కారణం మేం వినకూడదా బావా!" అడిగింది మధ్యలోనే లత.

"చెప్తాను విను, లతా. నా అన్నవారు లేని నాకిప్పుడు ఇంతమంది ఆప్తులు, బంధువులూ ఉన్నారు. అంతకన్నా ఆనందమేముంటుంది? ఇటువంటి ఆప్తులను, బంధువులను ప్రసాదించిన ఆ భగవంతుడికి కృతజ్ఞత తెలుపుకొంటున్నాను."

"కానీ మేం మాత్రం. మాకు యిటువంటి మరిదిని ఆలస్యంగా ప్రసాదించినందుకు చింతిస్తున్నాం."

"ఊఁ."

"ఔను, బావా! అక్క చెప్పింది అక్షరాలా నిజం."

"నీకుకూడా తెలుసా!" అన్నాడు రాజ్ వెక్కిరింపుగా-అది విని సిగ్గుతో చిన్నబుచ్చుకుంది లత. ఫక్కున నవ్వేశాడు రాజ్. ఇందిరకూడా రాజ్ హాస్యానికి నవ్వింది. దానితో తుర్రున లోపలికి పారిపోయింది లత.

"ఏమిట్రా, అంతగా నవ్వుతున్నారు" అని అక్కడికొచ్చింది వాళ్ళమ్మ.

◆ ◆ ◆

కుర్చీ చూపించి "సిగరెట్?" అన్నాడు నారాయణరావు.

"నో థాంక్స్" అని కూర్చున్నాడు రాజ్.

"మీరు చెప్పదలచుకున్నది నిరభ్యంతరంగా చెప్పండి."

"మా వదినను ఎప్పుడు దిగబెట్టమన్నారు?"

ఆ మెతరపునుండి ఏ క్షమాపణో, అర్థింపో వస్తుందని ఆశించాడు అతడు. కానీ ఆ సూటిప్రశ్న వస్తుందని ఊహించని రావు ఆలోచనలో పడ్డాడు. తన ఇందు తిరిగి తన యింటికొస్తుంది. అంతకన్నా తనకు కావలసినదేముంది? కానీ ఇంత సులభంగా తను అంగీకరించకూడదు.

"ఆమెను ఇక్కడెందుకు దిగబెట్టడం?"

"విచిత్రమైన ప్రశ్న వేశారు. ఆమె మీ భార్య కనుక మీ దగ్గరే ఉండాలి."

"ఆవిషయం ఆమె కిప్పుడు జ్ఞాపక మొచ్చిందా?"

"జరిగిపోయిన విషయాలు త్రవ్వితే మీరుకూడా సిగ్గుపడి బాధ పడవలసివస్తుంది."

"ఆనాడు నన్ను ధిక్కరించి వేడుకొన్నా వినక వెళ్ళిపోయిందే! ఆమెను నేనిప్పుడు ఎలా స్వీకరిస్తాను?"

"స్వీకరించక విడిచిపెడతారా!" గద్దించాడు రాజ్.

ఆ గద్దింపుకు ఉలిక్కిపడ్డాడు రావు.

"నా మాటకు జవాబియ్యండి."

"నేను ఆమాట అనలేదే!"

"మరి ఏమిటి మీ ఉద్దేశ్యం?"

"చేసినతప్పుకు పశ్చాత్తాపపడి నా కాళ్ళపైబడి క్షమాపణ వేడు కోవాలి."

నవ్వు వచ్చింది రాజ్‌కు. భార్య ఎప్పటికీ భర్తకు పాదదాసే! యితడు అర్థంలేని పట్టుదలతో ఉన్నాడు. తప్పక దారికి వస్తాడులే అను కొని నవ్వును లోపలే అణుచుకొన్నాడు.

"అదేం వీల్లేదు. ఆమె మీయింటికి వస్తుంది. మర్యాదగా ఏలు కోండి."

"అలా చేయకపోతే?"

"ఎలా చేయరో నేనూ చూస్తాను."

"అసలు నువ్వెవరు? ఆమెకూ, నీకూ ఏదో సంబంధముంది. మీ రహస్యం బయటపడింది. అందుకే ఆమెను నా దగ్గర చేర్చాలని ప్రయ త్నిస్తున్నావు" అన్నాడు రావు లేచి.

"నోర్ముయ్!" అని రాజ్ కోపంతో లేచి అతనికాలరు పట్టుకొని "ఆమెకు భర్తవయ్యావు కనుక సరిపోయింది లేకుంటే...." అని రావును వెనక్కు త్రోశాడు. పాపం క్రిందపడ్డాడు రావు. భయపడిపోయాడు రావు.

"నువ్వు ఇంత మూర్ఖుడివనుకోలేదు. ఆలోచించి నీ నిర్ణయం చెప్పు. మళ్ళీవస్తాను" అని అక్కడినుండి చరచరా వచ్చేశాడు రాజ్.

"రాజూ! కారు ఆనంద్ చేత పంపిస్తాను. అందరూ కలిసి రాత్రికి అందులో వచ్చెయ్యండి. నేను అక్కడ అన్ని ఏర్పాట్లూ చేసి ఉంటాను. మరిచిపోవద్దు. మరి నే వెళతాను. అవతల చాలా పని ఉంది" అని గోపి కారు స్టార్ట్‌చేసుకొని వెళ్ళిపోయాడు.

"ఏమిటి, రాజ్, ఆలోచిస్తున్నావు?" అంది రజియా.

"ఆనందరావుగారు బాల్యమిత్రుడి కుమార్తె పెళ్ళికి తాను రాలే నంటూ వాళ్ళమ్మాయిని పంపిస్తానని ముకుందయ్యగారితో చెప్పాడట. నన్ను పిలిచి వసంతతోకూడా వెళ్ళి రమ్మన్నాడు. ఎలాగూ వెళుతున్నాం కదా అని సరేనన్నాను. కానీ ఇంతమందిఉన్నామే, ఒక కారులో ఎలా వెళ్ళడం?"

"పోనీ మనంమాత్రం ట్రెయిన్‌లో వెళదాం."

"అదే ఆలోచిస్తున్నాను."

"రాజ్, ఆ కారెవరిది? ఆనందరావుగారిది కదూ?"

రాజ్ అటు చూశాడు. అవును. ఇటు ఎక్కడికివస్తూంది అను కుంటుండగా కారు వారిముందు నిలిచింది. అందులోనుండి వసంత రతీ దేవిలా అలంకరించుకొని చిరునవ్వుతో దిగింది. ఆమె రాకకు కారణం ఊహించలేకపోయాడు.

"నాన్నగారి నడిగి కారులో వెళ్ళడానికి అనుమతి తీసుకొన్నాను. మీకావిషయం చెబుదామని వచ్చాను" అంది వసంత, అతని సందేహ నివృత్తిచేస్తూ.

సమస్య తీరిపోయిందిగా అన్నట్లు చూసింది రజియా.

"ఏమంటారు?" అంది వసంత.

"మరేంలేదు. కారులో అతిథులు ఎక్కువవుతారు."

"మరేం ఫరవాలేదు. కారు అరిగిపోదుగా!"నవ్వింది వసంత.

ఇంతలో అక్కడికి సుగుణ వచ్చింది.

"ఏం, సుగుణా, నువ్వు తయారుగా ఉన్నావా?"

"ఓ, నేను రెడీ, అన్నయ్యా!" అంది సుగుణ ఉత్సాహంతో.

"మనం వీధిలో నిలబడి మాట్లాడుతున్నాం. లోపలికి పదండి" అంది రజియా. అందరూ లోపలికిపోయారు.

# 21

రాత్రి పదిగంటలవుతుండగా అంతా సిద్ధమయ్యారు. రజియా, సుగుణ వెనుకసీటులో కూర్చున్నారు. వసంతడ్రైవింగ్‌సీటులో కూర్చుంది. రాజ్ ఆమె ప్రక్కనే కూర్చున్నాడు. ప్లిమత్‌కారు సిమెంటురోడ్డుపై సాఫీగా సాగిపోతూంది. వసంత కారును నిర్లక్ష్యంగా నడుపుతూంది. ఇంతలో వెనుక ఏదో కారు వస్తుండగా సైడు తీసుకొంది. ఆ కారు తమ కారునుదాటిపోతుండగా "టాటా" అని వినిపించి ఎవరా అని చూసి "ఆనంద్" అన్నాడు. క్షణంలో ఆ కారు మలుపు తిరిగిపోయింది.

"అందులో ఎవరెవరున్నారు, రాజ్?" అడిగింది రజియా. "సరిగ్గా చూడలేదు, రజీ" అని వసంతవైపు చూశాడు రాజ్. అతని ఉద్దేశ్యాన్ని అర్థంచేసుకొని ఏక్సిలరేటర్‌ను నొక్కింది వసంత. కారు టాప్ తీసేసింది. కొన్ని నిమిషాలలోనే ఆనంద్ వాళ్ళు పోతున్న అంబాసిడర్‌ను చేరుకోగలిగింది ప్లిమత్. ఆ వెలుగులో టాప్ తీసివున్నా అంబాసిడర్‌లో ఆనంద్ ప్రక్కనేవున్న అరుణను స్పష్టంగా చూశారు వారు. వసంత సైడు ఇవ్వమంటూ టిప్‌కొట్టింది. కానీ ఆనంద్ సైడివ్వక కారును వేగంగా ముందుకు పోనిచ్చాడు. వసంత వేగం తగ్గించింది.

"మరి లతా, ఇందిరక్కయ్యా రావడం లేదా, రాజ్!"

"లత గోపీతో అప్పుడే వెళ్ళిపోయింది. ఇందిర అమ్మకు తోడుండాలి అని రాలేదు."

దారికి అడ్డంగా నిలబడివున్న కారును చూసి దానివెనుకే తన కారు నిలిపింది వసంత. అక్కడ రెండుకార్లు ఉన్నాయి. ఒకటి అంబాసిడర్. మరొకటి ఎవరిదో ఫియట్, ఆ ఫియట్ టైరు బరస్టు అయింది. జాకీ లేక దిగాలుపడి ఆ ఫియట్ యజమాని అంబాసిడర్‌ను ఆపాడు.

కానీ అందులో ఉంటేగా? అంతా కలిసి ప్లిమత్‌కోసం ఎదురు చూశారు.

రాజ్ క్రిందికి దిగగానే ఆ ఫియట్ యజమాని దగ్గరికి వచ్చి "మీ జాకీ ఒకసారి ఇవ్వగలరా, ప్లీజ్" అన్నాడు. రాజు ప్రశ్నార్థకంగా వసంతను చూశాడు. "డిక్కీలో ఉంది. చూడండి" అంది వసంత. తీసి యిచ్చాడు రాజ్.

ఆ వ్యక్తి టైరు మార్చుకొనేందుకు ఒక్కడే కష్టపడసాగాడు. అతని భార్యేమో పాపం అతనికి సాయపడుతూంది. అప్పటికీ వారి కది లొంగలేదు. ఆనంద్ నిలబడి తమాషా చూస్తున్నాడు. వసంతకు వారు పడే అవస్థచూసి నవ్వు వచ్చింది. వారి అవస్థ చూడలేక రాజ్ "మీరు తప్పుకోండి" అన్నాడు. ఆవిడ నుదుటపట్టిన చెమట తుడుచుకొంటూ ప్రక్కకు జరిగింది. త్వరలోనే ఆ టైరుస్థానంలో క్రొత్తటైరు వచ్చింది.

"థేంక్సండీ" అన్నారు వారు.

"ఫరవాలేదులెండి" అని తిరిగి వచ్చాడు రాజ్.

ఆనంద్, రాజ్‌తో మెల్లగా "ఒరేయ్! ఏమిట్రా, ఆడపిల్ల డ్రైవ్ చేస్తుంటే ప్రక్కన కూర్చున్నావు? స్టీరింగ్ తీసుకోరా" అన్నాడు.

రాజ్ జవాబు చెప్పలేదు. అది చూచి ఆనంద్ "ఓడిపోయానని ఒప్పుకో" అని కారు స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు.

"వసంతా, అలా ప్రక్కకు జరిగి కూర్చో" అన్నాడు రాజ్.

"ఆ! మీరు డ్రైవ్ చేస్తారా?" కంగారుగా అడిగింది వసంత. చిరునవ్వు విసిరాడు రాజ్.

"ఫరవాలేదులే. ప్రమాదాలు జరుగనివ్వను."

అనుమానంగానే ప్రక్కకు తప్పుకొంది వసంత.

"రాజ్, నీకు డ్రైవింగ్ తెలుసా!" నమ్మలేకపోయింది రజియా.

సుగుణ ఏం మాట్లాడకుండా మెల్లిగా నవ్వుతూ కూర్చొని వుంది.

ప్లిమత్ అతనిచేతిలో గాలిలో తేలిపోయినట్లుపోతూంది. ఆన

లతనికి డ్రైవింగ్ తెలియదనుకొన్న రజియా, వసంత అది చూసి ఆశ్చర్యపోవడమేకాక భయపడ్డారు. సుగుణ ఉత్సాహం అతిశయించగా కనుచూపుమేర దూరంలో వున్న అంబాసిడర్‌ను చూసి, "అన్నయ్యా, ఈ దెబ్బతో ఆనందన్నయ్య చిత్తు" అంది.

ఒక మలుపులో హారన్ నొక్కిపట్టి ఏక్సిలరేటర్‌మీద కాలు తీసి వేసి అదేవేగంతో టర్నింగ్ త్రిప్పి తిరిగి ఏక్సిలరేటర్ నొక్కబోయి ఎదురుగా వస్తున్న లారీని చూసి ఆ ప్రయత్నం మానుకున్నాడు రాజ్. టర్నింగుతిరిగి అదేవేగంలో వస్తున్నకారునుచూసి దానికి సైడు ఇవ్వాలన్నమాటే మరిచి భయంతో బ్రేక్ వేశాడు. లారీడ్రైవర్ లారీ ప్రక్కకు తప్పుకొంటుందన్న రాజ్ అలా జరుగకపోవడంతో ప్రక్కలకు చూశాడు. ఆ లారీకి కుడివైపు పోవడానికి వీలులేదు. ఎడమవైపు కారు మెల్లిగా పోగలిగే స్థలం వుంది. కానీ ఏమాత్రం పొరపాటు జరిగినా ప్రక్కనే వున్న పెద్దపెద్ద చెట్లకు గ్రుద్దుకోవడం ఖాయం. అప్పటికే కారు లారీని సమీపించింది. అప్పటికీ కారు వేగం తగ్గకపోవడం చూసి ఆ లారీ డ్రైవర్ భయపడి మరోవైపునుండి క్రిందికి పరుగెత్తాడు. కారులోనివారు కారు లారీకి గ్రుద్దుకొందని కెవ్వున కేకవేసి కళ్ళు మూసుకున్నారు. లారీ సమీపించగానే స్టీరింగ్ ఎడమవైపుకు త్రిప్పి తిరిగి కుడివైపుకు కట్‌చేస్తూ రెండుచెట్లను తప్పించుకొని తిరిగి రోడ్‌మీదికి వచ్చాడు, రాజ్.

కళ్ళు తెరిచినవారు తాము సురక్షితంగా కారులోనే కూర్చొని వుండడం, కారు అతి వేగంగా ముందుకు పోతుండడంచూసి వెనుతిరిగి చూశారు. కానీ వారికా లారీ కనిపించలేదు. కారు దాటిపోగానే లారీ డ్రైవర్ కారుపోయినస్థలానికి వచ్చి చూశాడు. తన లారీకి ముందు భాగంలో పదడుగులదూరంలో ఒక పెద్దచెట్టువుంది. అంత చిన్న దూరంలోనే దాన్ని దాటి లారీని తప్పించుకొని అక్కడ ఉన్న మరో చెట్టును తప్పించుకుపోయిన వైనం చూసి 'బాప్‌రే' అనుకుని ముందుకు చూశాడు కానీ ఆ కారు అతనిచూపుకు అందలేదు.

క్షణం ముందు జరుగబోయిన ఆపదను తలుచుకుని జలదరిం

రించాయి ముగ్గురిగుండెలు. అతనిధైర్యాన్ని చూసి అదిరిపడింది వసంత.

అంతవరకూ ఉత్సాహంగావున్న సుగుణ భయంగా "అన్నయ్యా, వేగాన్ని తగ్గించు" అంది.

"మరేం ఫరవాలేదు. రజీ, సుగుణకు ధైర్యం చెప్పు."

"నేనే భయపడి చస్తుంటే ఆమె కేం చెప్పను, రాజ్!"

"మరి నువ్వు, వసంతా?"

"ఇప్పుడిప్పుడే భయంపోయి ఉత్సాహమొస్తోంది."

"వెరీగుడ్!" అని టర్నింగ్ త్రిప్పి అక్కడేవున్న అంబాసిడర్‌ను చూసి హుంషార్ అన్నట్లు హారన్ ఇచ్చాడు రాజ్.

వెనక్కు చూశాడు ఆనంద్. రాజ్‌కారు నడుపుతుండడంచూసి "హాయ్ హాయ్ నాయకా" అని ఒక్క కుదుపుతో అంబాసిడర్‌ను ముందుకు పోనిచ్చాడు.

ముందు అంబాసిడర్, వెనుక ప్లిమత్ బాణాల్లా ఆ చీకటి రాత్రిలో ముందుకు దూసుకుపోతున్నాయి. ఆనంద్ ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. రాజ్ చిరునవ్వుతో సారెసారెకు హారన్ నొక్కుతూ అంబాసిడర్‌కు రెండడుగులదూరంలో ప్లిమత్‌ను పోనిస్తున్నాడు. విసిగిపోయాడు ఆనంద్. వేగం తగ్గించాడు. అదిచూసి నవ్వుకొని అంబాసిడర్ ప్రక్కనే కారును పోనిస్తూ "ఏరా, పొగరణగిందా!" అన్నాడు రాజ్.

"ఓడిపోయానురా నాన్నా!" ఒప్పుకున్న ఆనంద్ మనసులో ఒకభావం మెదిలింది. రెండుకార్లూ ప్రక్కప్రక్కనే పోతున్నాయి. ముందుకు పోనివ్వాలని ప్రయత్నించి, రాజ్ తన పథకం విఫలం చేయడంతో నిట్టూర్చాడు ఆనంద్. అరుణ, రజియా చిరునవ్వుతో పలుకరించుకొన్నారు. సుగుణ ప్రక్కప్రక్కనేపోతున్న కార్లనుచూసి ప్రాణాలను అరచేత పట్టుకొంది. వసంత సినిమాలో సస్పెన్సును చూసినట్లు చూడసాగింది.

ఎదురుగా కారు వస్తుండడం చూసి వెనక్కు తగ్గాడు రాజ్. ఆ

కారు దాటిపోగానే తిరిగి ముందుకుపోబోయిన రాజ్ అంబాసిడర్ రోడ్లో నాట్యం చేస్తున్నట్లు అటూ ఇటూ తిరగడం చూసి "మోసం చేశావు గదరా" అనుకున్నాడు. చేసేదిలేక దాన్ని అనుసరిసూ ఆలోచించ సాగాడు. తమాషా చూస్తున్నారు కారులోనివారు.

మరోలారీ ఎదురుగా రావడంతో హుషారుగా సిద్ధంగా కూర్చు న్నాడు రాజ్.

ఆనంద్ హుషారుగా వెనక్కిచూసి చేయిఊపి ముందుకు చూసి లారీకి సైడు యిచ్చాడు. లారీ దగ్గరికి వస్తుండగా వేగాన్ని హెచ్చించి అంబాసిడర్ దగ్గరికి పోనిచ్చి లారీ అంబాసిడర్‌ను దాటిపోగానే కుడివైపుకు స్టీరింగ్ త్రిప్పి అప్పుడే రోడ్‌మధ్యకువస్తున్న అంబాసిడర్ ప్రక్కనే పోనిచ్చాడు. తన కారుప్రక్కనేవస్తున్న ప్లిమత్‌నుచూసి కంగారుతో ఏక్సిలరేటర్ నొక్కాడు ఆనంద్.కానీ ప్రయోజనం లేకపోయింది. అప్పటికే తనకన్నా కొంచెంముందుగా వుంది ప్లిమత్. దాన్ని దాటాలని ప్రయత్నించి విఫలుడైపోయాడు. ప్లిమత్ ముందుకుపోయింది. తనకు సైడు ఇవ్వకుండా మెల్లిగాపోతున్న ప్లిమత్‌ను చూసి "అన్యాయం" అని అరిచాడు ఆనంద్.

"నువ్వు నేర్పినవిద్య" అన్నాడు రాజ్ వెనక్కిచూసి. అరుణ అన్నయ్యఅవస్థచూసి నవ్వింది. సుగుణసంతోషంతో లేచి ఆనంద్‌ను వెక్కిరించింది.

"హా. ఎవరుచేసినఖర్మ వారనుభవించకా ఏనాటికైనా తప్ప దన్నా!" అని పాట పాడుతూ వేగం తగ్గించాడు ఆనంద్. నవ్వులతో తమాషాగా చేరుకున్నారు తిరుపతి.

తిరుపతి చేరేప్పటికి అయిదయింది. దారిలో వారికోసం కాచుకొని వున్నాడు గోపీ. గోపీని ఎక్కించుకుని కొండపైకి దారితీశారు వారు.

దారిలోకి పోగానే ఆనంద్ కారును మెల్లిగాపోనిస్తూ అక్కడి నుండి కనిపిస్తున్న దృశ్యాలను చూడసాగాడు. ఎలక్ట్రిక్ లైట్ల వెలుగులో తిరుపతి చూడముచ్చటగా వుంది. అప్పుడప్పుడే తెలతెలవారుతూంది. వసంత ట్రాన్సిస్టర్ ఆన్‌చేసింది. సుప్రభాతం ఇంపుగా విన

బడుతూంది. మంచు దట్టంగా అలముకొని కొండలలో ఆడుకుంటూంది. కొండలమాటున దోబూచులాడుతూంది మంచు. మంచునుచూసి మేఘ మనే భ్రమ కలుగుతుంది. లోయలలోని పచ్చనిచెట్లు, పిచ్చిపిచ్చి మొక్కలు, పనికిరాని పూలచెట్లు ఏవో సందేశాలను అందిస్తున్నాయి.

ఎక్కడాచోటు దొరకలేదంటూ, మనుజులకు దూరంగావుండే అంత ఎత్తైనకొండలో తన స్థావరాన్ని ఏర్పరచుకొన్నాడు భగవాన్ వెంకటేశ్వరుడు. ఆ దేవుని మహిమతెలియని ప్రజలే లేరు. దేశం నలుమూలలనుండి ఆ భగవంతుడి దర్శనార్థం అశేషప్రజానీకం వస్తూంది. అందరినీ ఆకర్షించి, అందరినీ తన దగ్గరకు రప్పించు కొంటున్నాడు ఆ దేవుడు. ఇంతవరకూ ఏ దేవుడూ జరిపించుకోలేని ఘనమైన సన్మానాన్ని ఈ అవతారంలో పొందుతున్నాడు లోకేశ్వరుడు. కలియుగంలో పాపాలను అంతమొందింపదలచిన ఆపత్సంపన్నుడు వెంకటేశ్వరుడు.

ముందుగానే గోపీ ఏర్పాటు చేసిన బసలలో దిగారు అంతా. రాజ్ బసలోని కిటికీగుండా చూశాడు. అక్కడినుండి చంద్రగిరి కోట కనిపిస్తూంది. రాజ్ బయటకు వచ్చాడు. బసముందున్న గార్డెన్‌దాటి ముందుకెళ్ళిపోయాడు. అక్కడ నిలబడి ఆ దృశ్యాన్ని చూశాడు. నయనానందకరంగా ఉన్న దృశ్యం. ఎత్తయిన కొండల్లో ఎక్కడో ఒక చిన్న కోట. దానిచుట్టూ దూరంగాకట్టబడిన ఆధునికమైన భవంతులు. వాటికి అండదండగా చెట్లు. కళ్ళార్పకుండా అలాగే చూస్తూ నిలబడ్డాడు రాజ్.

అది చూసిన ఆనంద్ "కవి మహాశయా! తమ పని అప్పుడే మొదలుపెట్టారా!" అన్నాడు.

రాజ్‌కు అది వినబడలేదు.

"ఏమిటన్నయ్యా!" అంటూ రజియా వచ్చింది.

"వీడు అప్పుడే ప్రకృతిసౌందర్యాన్ని పరిశీలిస్తున్నాడు. మన కేమో ఆకలవుతుంటే వీడు ఆ ఆనందంతో కడుపు నింపుకుంటున్నాడు. ఆ గోపీగాడు టిఫిన్ పంపిస్తానని ఇంతవరకూ పత్తాలేడు."

ఇంతలో అక్కడికి వసంత, సుగుణకూడా వచ్చారు. వసంత రాజ్‌ను చూసింది. అతను వీరి నెవ్వరినీ గమనించలేదు. కళ్ళు ఎదురుగా ఉన్న దృశ్యాల్ని చూసి మెదడుకు ఏదో పని కల్పిస్తున్నాయి. మనసు ఏవో భావాల్ని, ఆ భావాలొక పాటనూ సమకూర్చాయి.

వసంత, రాజ్‌కు కుడిప్రక్కగా జరిగి అతన్ని సైడు పోజుతో ఫోటో తీసింది. ఎవరూ ఏమీ మాట్లాడలేకపోయారు.

"ఒరేయ్!" గట్టిగా పిలిచాడు ఆనంద్. ఉలిక్కిపడి వారినందరినీ చూసి తన పరధ్యానానికి సిగ్గుపడ్డాడు రాజ్.

"వచ్చి గంటయిందో లేదో అప్పుడే నీ పని మొదలుపెట్టావా! ఇక్కడ నాలుగురోజు లుంటాంగా? అప్పుడు చూడచ్చులే పద!" అని రాజ్‌చెయ్యి పట్టుకొని లాక్కుపోయాడు ఆనంద్.

* * *

బసలోకి వచ్చి తల చేతులతో పట్టుకొని కూలబడ్డాడు గోపి. అది చూచి అతనిచుట్టూ మూగారంతా.

"ఏమైందిరా, గోపీ?" అతని పరిస్థితి చూసి అర్థంగాక అడిగాడు

"అయిపోయింది. అంతా నాశనమయిపోయింది" అన్నాడు గోపీ తల ఎత్తకుండానే.

"వివరంగా చెప్పరా" గట్టిగా అడిగాడు ఆనంద్ ఆత్రుతతో.

"పెద్ద అనర్థం వచ్చిపడిందిరా! మా శారదకు పెడతామన్న నగలన్నీ ఇంట్లోనే ఉండిపోయాయి. అవి ముందక్కడ పెడితేనేకానీ ఈ పెళ్ళి జరుగదు అంటున్నాడు వియ్యంకుడు. ఎంతచెప్పినా వినడంలేదు."

"ఎవడ్రా ఆ బుద్ధిలేనివాడు! పద. తగిన బుద్ధి చెప్పేస్తాం" ఆవేశంగా అరిచాడు ఆనంద్.

"ప్రయోజనం లేదురా! అవి లేనిదే పెళ్ళి జరగదని మొండిపట్టు పట్టాడు. పెద్దమనుషులు అందరూ చెప్పారు. పెళ్ళి జరుగనివ్వండి. తెప్పిస్తాను అన్న మామయ్య మాటకూడా పెడచెవిని పెట్టాడు. నలుగురిలో తలెత్తుకు తిరగలేను. ఈ పెళ్ళి అనుకున్న ముహూర్తాన జరుగ

కుంటే అని ఏడుస్తూ కూర్చున్నాడు మామయ్య." కన్నీరు పెట్టు కొన్నాడు గోపీ.

రాజ్‌కు ఏం చేయడానికీ పాలుపోలేదు.

"ఎందుకురా ఏడుస్తావు? వాళ్ళు జరుగదంటే పెళ్ళి నిలిచి పోతుందా! నాలుగు తన్ని ఆ పెళ్ళికొడుకుచేత తాళి కట్టిద్దాం. అంతే కానీ ఆడపిల్లలా ఏడిస్తే ప్రయోజనమేమిటి?" అని గోపీని లేపి నిల బెట్టాడు ఆనంద్.

"ఆనంద్! అటువంటి మూర్ఖులతో మాట్లాడుతూ టైమ్ వృధా చేయడంకన్నా అక్కడికి వెళ్ళి నగలు తీసుకురావడమే మంచిది" అన్నాడు రాజ్.

"అదెలా సాధ్యం, రాజ్? ఇప్పుడు గంట పదయిపోయింది. మర్నాడు ముహూర్తం. అక్కడికి వెళ్ళడమెప్పుడు? తిరిగి రావడ మెప్పుడు?" అంది రజియా.

"ఫరవాలేదు, రజీ. గోపీ, నగలు ఎక్కడున్నాయి?"

"ఇనప్పెట్టెలో ఉన్నాయి. ఇంద తాళంచెవులు."

రాజ్ మొహంలోని ఆవేశం, అతడు కారు నడిపే విధం తెలిసిన అందరూ ఒక్కసారి ఆ పరిస్థితులు చూసి భయంతో వణికిపోయారు.

రాజ్ తాళంచెవులు తీసుకొని బయటికి పరుగెత్తాడు అతనివెంటే. అందరూ వచ్చారు.

"రాజ్, ఈ కారు తీసుకొని పో. అల్లుడికోసం యాభై వేలు పెట్టి కొన్నాడు. వారికి ఆ అదృష్టముందో, లేదో" అని ఒక క్రొత్తకారును చూపించాడు, గోపీ.

రాజ్ ఆ కారులో కూర్చున్నాడు.

"రాజ్, పెళ్ళి ఆగిపోయినా ఫరవాలేదు కానీ...." బాధగా మరి చెప్పలేకపోయాడు గోపి.

అది విని ఒక నవ్వు నవ్వాడు రాజ్.

"నా ప్రాణాలకేం ఫర్వాలేదు. నువ్వు ఇక్కడ అన్ని పనులూ జరిపించు" అని మరోవైపు కార్లో కూర్చుంటూన్న ఆనంద్‌ను చూసి "నువ్వెక్కడికిరా?" అన్నాడు.

"సీతోపాటే నేనూ" అన్నాడు ఆనంద్ నిశ్చింతగా. "సరే" అని కారు స్టార్టుచేసుకొని ముందుకు చూస్తూ కారు నడపసాగాడు రాజ్.

కొండపైనే అంత వేగంగా నడుపుతున్న రాజ్‌నుచూసి "రాజా" అన్నాడు కంగారుగా ఆనంద్.

"ఆనంద్, ధైర్యం ఉంటే నోరు మూసుకొని కూర్చో. లేకుంటే తిరిగి వెనక్కు వెళ్ళిపో. అంతేకానీ నువ్వు భయపడి నాకు భయం కలిగించవద్దు."

గంభీరమైన అతని పలుకులు విని మాట్లాడకుండా కూర్చున్నాడు ఆనంద్.

దారిలో అప్పుడప్పుడూ కార్లు, లారీలు వస్తుండడంవల్ల వేగం తగ్గించవలసివస్తూండేది. యాభై వేలరూపాయల కారు అన్న గోపీ మాటలు జ్ఞాపకానికి వచ్చి కీ బోర్డుకు చుట్టుప్రక్కల చూశాడు రాజ్. ఒక ఎర్రటిబటన్‌చూసి విజయగర్వంతో దాన్నినొక్కాడు. అప్పుడే ఎదురుగావస్తున్న లారీ ఒకటి బ్రేక్‌వేసి రోడ్డుకు ప్రక్కగానిలబడిపోయింది. అదే వేగంతో దాన్ని దాటిపోయాడు రాజ్. కొలది గంటల ప్రయాణమే తమను గమ్యం చేర్చిందని టైమ్ చూసి తెలుసుకొన్న ఆనంద్‌కు నోట మాట రాలేదు.

నగలు తీసుకొనేటప్పుడు చూశాడు ఆనంద్. ఇనప్పెట్టెలో నోట్ల కట్టలు, బంగారు కడ్డీలు. అంత ధనం ఒక్కసారి కళ్ళబడటంతో కళ్ళు తిరిగాయి ఆనంద్‌కు. రాజ్ నిర్లిప్తంగా నగలపెట్టె తీసికొని తలుపు వేసేశాడు.

"ఒరేయ్ రాజా! నాకొక సందేహం."

"ఏమిటి?" దృష్టి మరల్చకుండా అడిగాడు రాజ్.

"ఇంత డబ్బు నిక్కడ పెట్టి తాళాలిచ్చాడు కదా ఆ గోపీగాడు? వాడికి మనపై అనుమానం కలుగదా?"

"నమ్మకం మనిషిని ప్రాణత్యాగానికికూడా వెనుదీయదన్న విషయాన్ని మరిచిపోతున్నావు. ఇక కలలోని సుఖంలాంటి ఈ డబ్బు ఏం చేసుంది దాని ముందు?"

"మిత్రులపైనే మనిషికి ఇంత నమ్మకముందికదా మనిషికి, మరి వియ్యంకులు కాబోతున్నా ఆ మూర్ఖులు వీరి మాటలను నమ్మలేదేం?"

"నీ ప్రశ్నకు జవాబు నీ ప్రశ్నలోనే ఉంది."

నవ్వాడు రాజ్ మాటలు విని, ఆనంద్.

మలుపుల్లో కారు ఒక వైపు రెండుచక్రాలు పైకి లేస్తూ ముందుకు సాగిపోతూంది. అలా చక్రాలు పైకి లేస్తున్నప్పుడు కాలు ఏక్సిలరేటర్ మీదినుండి తీసి బ్రేక్‌పై ఉంచి తిరిగి ఏక్సిలరేటర్ వెంటనే నొక్కుతుండడం గమనించాడు ఆనంద్.

బొయ్‌మని వినిపించిన క్రొత్త కారు హారన్ విని నమ్మలేక బయటికి పరుగెత్తుకొచ్చాడు గోపి. అప్పటికే ఒక్క కుదుపుతో ఆగింది ఆ కారు. అంత త్వరగా వారు రావడంతో ఏ ఆటంకంవల్లనో తిరిగి వచ్చారనుకొన్నాడు గోపీ, వారిని చూసి. రాజ్ ఒకవైపు, ఆనంద్ మరోవైపు దిగి నిలబడ్డారు. ఆనంద్ చేతిలో ఉన్న నగలపెట్టెను చూశాడు. అంతవరకూ కునుకుకు లొంగిపోయిన అతని మనస్సు నమ్మలేకపోయింది. కలా అనుకొని చెయ్యి గిల్లి చూసుకొన్నాడు గోపీ.

"ఏమిత్రా అలా చూస్తున్నావు" అన్నాడు చిరునవ్వుతో రాజు.

ఆనందంతో రాజును కౌగలించుకొన్నాడు. దేవుడంటే ఆ రూపంలోనే ఉన్నాడేమో ననిపించింది.

"రాజా, నీ ఋణం........"

"అదంతా తర్వాత చెపుదువుగానీ ముందు అక్కడి కెళ్ళు" అని అతని భుజం తట్టి గోపీని పంపించేశాడు.

అందరూ కళ్ళప్పగించి తననే చూస్తుండడం గమనించి "ఏమిటలా చూస్తున్నారు? ముందు టాయ్‌లెట్ అయి రండి. అక్కడ ముహూర్తానికి టైం అవుతోంది" అన్నాడు రాజ్.

ఆనంద్ తప్ప అంతా సిగ్గుపడి అక్కడినుండి వెళ్ళిపోయారు. రాజ్, ఆనంద్‌ను వెంటబెట్టుకొని పెళ్ళిమంటపంవైపు పోయాడు.

"అబ్బాయ్, నిన్నెలా అభినందించాలో తెలియడంలేదు. నా పరువు ప్రతిష్టలు కాపాడావు" అన్నాడు రాజ్ చేతులు పట్టుకొని ముకుందయ్యగారు.

"ముందు మీరు వెళ్ళి అతిథులకు స్వాగతమివ్వండి" అని అక్కడినుండి పెళ్ళికూతురికి అలంకరణచేసే గదివైపు ఒక్కడే నడిచాడు రాజ్. ముకుందయ్య కళ్ళు పైపంచతో తుడుచుకొని ముందుకు పోయాడు.

రాజ్‌ను చూసిన శారద కళ్ళు కృతజ్ఞతతో మెరిశాయి. ఏదో చెప్పాలనుకొంది. కానీ అప్పట్లో ఉన్న పరిస్థితులలో ఏం మాట్లాడలేక పోయింది.

ముహూర్తానికి సమయం అయింది. పెళ్ళికుమార్తెను తీసుకురండంటూ కబురు వచ్చింది. ముత్తయిదువులు ఆమెకు ఇరుప్రక్కలా ఉండి నడిపించుకు పోసాగారు. చీరె కుచ్చెళ్ళు కాళ్ళకు అడ్డుపడగా సంబాళించుకొనబోయి చేతకాక ముందుకు పడిపోయింది శారద. ఆమెను కంగారుగా లేవనెత్తారు. ఆమె మొహాన బొట్టు చెరిగింది. గాజులు కొద్దిగా పగిలిపోయాయి. కలుక్కుమంది రాజ్ హృదయం. గిరుక్కున వెనుదిరిగి పోయాడు.

పెళ్ళిపందిరిలో ఎక్కడా రాజ్ కానకపోవడంతో వసంత "రజియా, శేఖర్‌గారెక్కడ?" అంది. రజియాకూడా వెదికింది. కానీ వారి కెక్కడా కనిపించలేదు. గోపీకి చెప్పారు ఆ విషయం.

"మీ రిక్కడే ఉండండి, నే చూసివస్తాను" అన్నాడు గోపీ చుట్టూ చూస్తూ.

"రాజా!"

తలెత్తిచూశాడు కుర్చీలో కూర్చొనివున్న రాజ్.

"ఏమిట్రా ఇక్కడున్నావు? నీ కోసం అక్కడంతా వెదుకుతున్నాం."

రాజ్ ఏమీ చెప్పలేకపోయాడు. అతడు ఏ విషయం గురించో బాధపడుతున్నాడని గ్రహించాడు గోపీ.

"నీ బాధేమిటో మాతో చెప్పకూడదా!"

"శారద అక్కడ పడిపోవడం చూసి నా మనస్సేదో కీడును శంకిస్తోంది. ఈ పెళ్ళి ఆగిపోయి ఉంటే బాగుండునేమో?"

"రాజా, ఏమిట్రా ఆ మాటలు? అటువంటి చిన్న విషయాలు మనసులో పెట్టుకొని అనవసరంగా బాధపడకు. పద, తర్వాత చూసుకొందాం."

అతన్ని అనుసరించాడు రాజ్.

ముహూర్తం సమయంలో రాజ్ అక్షింతలు చల్లడానికి చేయి పైకెత్తాడు. కానీ అది ఎవరి చేతినో తగిలి అక్షింతలు అక్కడే పడిపోయాయి. బాధగా నిట్టూర్చింది అతని హృదయం. శారదను చూశాడు. ఆమె మొహం సంతోషంతో కళకళలాడుతూంది. సిగ్గుతో భరవె పు ఓరగా చూస్తూంది.

# 22

"ఊఁ."

"నన్ను పెళ్ళిచేసుకొంటావా?"

"ఛ, ఫో. ఎప్పుడూ నన్నేడిపించటమేనా నీకు పని" అని రజియా సిగ్గుతో చేతులతో మొహం కప్పుకొంది.

ఆమె ఒడిలో తల పెట్టుకొని పడుకొనున్న రాజ్ ఆమె చేతులు తీసివేసి "నా దగ్గర సిగ్గెందుకు? నువ్వు చెప్పకుంటే నీ కిష్టం లేదనుకుంటాను" అన్నాడు.

"అటువంటి మాటలు మాట్లాడేకంటే నన్ను చంపెయ్యి."

"మరి చెప్పు, నన్ను పెళ్ళిచేసుకుంటావా?"

"ఊఁ."

"అలా కాదు."

"ఇంకెలా చెప్పమంటావు?"

"మిమ్మల్ని భర్తగా స్వీకరించి మీ పాదసేవకు నా జీవితం అంకితం చేస్తాను అని చెప్పాలి."

"అంత అదృష్టమే ఉంటే ఈ జన్మకు ఇంకేం కావాలి?"

"ఉంచే ఏమిటి. మధ్యలో పానకంలో పుడకలా" అని రాజ్ కళ్ళు మూసుకొన్నాడు.

అతని మొహంలోకి చూసింది రజియా. నిర్మలంగా ఉన్న ఆ మొహంలో అతని భావాలను అర్థంచేసుకోవాలని ప్రయత్నించింది. అలా చూస్తూండగా రజియాలో ఏదో వికారం బయలుదేరింది. ఆమె కళ్ళలోకి ఆశ, ఆవేశం ప్రవేశించాయి. వాటికి లొంగిపోయింది. అతని పెదవులను ముద్దు పెట్టుకుంది.

"రజీ!" అన్నాడు రాజ్ గట్టిగా కళ్ళు తెరవకుండానే. ఆ కంఠం లోని కాఠిన్యానికి భయపడిపోయింది రజియా. రాజ్ మెల్లిగా కళ్ళు తెరిచి చూశాడు. తప్పుచేసిన దానిలా చూపు తప్పించింది రజియా.

ఆమె మెడ చుట్టూ చేతులువేసి ఆమె మొహాన్ని దగ్గరగా లాక్కొని చిరునవ్వుతో "ఇటువంటి బలహీనతకు లొంగిపోగూడదు, రజీ" అన్నాడు రాజ్.

రజియా మాట్లాడలేకపోయింది.

"పిచ్చి రజీ!" అని ఆమెను మరింత దగ్గరగా లాగాడు రాజ్.

రజియా అతని కళ్ళలో కళ్ళు పెట్టి వెదికింది. ప్రశాంతంగా ఒక దివ్యఆనందాన్ని అనుభవిస్తున్నాయి ఆ కళ్ళు. తనకు ఒక సందేశాన్ని చెపుతున్నాయి.

నవ్వాడతడు. ఆమెకూడా నవ్వింది.

"రాజ్!"

"ఊఁ."

"నన్ను పెళ్ళిచేసుకోవడానికి సంఘం అంగీకరిస్తుందా?"

రాజ్ ఆమెను వదిలిపెట్టి కూర్చున్నాడు.

"నీకిప్పు డీ సందేహం ఎందుకొచ్చింది?" అని అడిగాడు.

"నేను హిందువుల అమ్మాయిని కాదుగా?"

"అయితే దానికొచ్చిన అభ్యంతరమేమిటి? అయినా నువ్వు అచ్చమైన బ్రాహ్మణుల అమ్మాయివిగా?"

"ఆ విషయం లోకానికి తెలియదు."

"రజీ, ప్రేమ పేదరికాన్ని, నాగరికత, కులమత భేదాన్ని ఎంచదు. ఏ కులం కానీ, ఏ మతం కానీ నా కక్కరలేదు. నిన్ను పెళ్ళి చేసుకోబోయేది నేను. అందుకు నీకెందుకు భయం?"

"అనవసరంగా నువ్వు సంఘంలో వ్రేలెత్తి చూపబడటం నాకు బాధగా ఉంటుంది."

"నువ్వు చెప్పే సంఘం మారింది. ఇప్పటి సమాజంలో అసహ్యించుకొనేవారికన్నా ఆదరించేవారు, ఆనందించేవారు, జాలిపడేవారు ఎక్కువగా ఉన్నారు."

"ఏమో, ఎవరు చూచారు?"

"రజీ, సంఘమంటే ఎవరు?"

"ప్రజలు."

"మనంకూడా అందులోని ప్రజలమే కదా?"

"కాదనలేను."

"మరి మనం ఆ విధంగా ప్రవర్తిస్తున్నామా?"

"ఇతరులుకూడా మనలాగే ఉంటారని అనుకోవడమెలా?"

"ఎందు కనుకోకూడదు?"

"పుర్రెకో బుద్ధి, జిహ్వకో రుచి అన్నారు. అందరూ మనం అనుకున్నట్లే అనుకోరు."

"పొరబడుతున్నావు. అందరూ కాకపోయినా కొందరైనా ఉంటారు. నేటి సమాజం నాగరికత, సభ్యత, సంస్కారం వీటిని నేర్చుకొంది. ఇతరుల కష్టాలను చూసి ఎగతాళిచేయడం మాని జాలిపడి చేతనైతే సహాయం చేయగలదు."

"పురాతన ఆచారాలతో మట్టిపట్టిపోయిన మన సంఘంలో ఇంత మార్పు ఎలా వచ్చిందంటావు?"

"ఎందరో అమాయకుల యువతీయువకుల ప్రాణాలు ఆ సమాజం కరాళ హస్తాల మధ్య నలిగిపోయాయి. ఎందరి జీవితాలో దాని పాదాల క్రింద క్రుంగి, కృశించి నశించిపోయాయి. ఆదర్శవంతులైన యువతీ

యువకులు ధైర్యంతో ముందంజవేసి తమ ప్రాణాలు దానికి బలిగా యిచ్చి దాని కళ్లు తెరిపించారు. మహానుభావులైన కవులు చాలామంది తమ కలాలను నడిపించి ఎన్నో ఆదర్శాలను, సత్యాలను లోకానికి చూపించారు. గూడుకట్టుకుపోయిన సమాజపు ఘూళిని తుడిచారు."

"పుస్తకాలు మానవుడికి విజ్ఞానాన్ని సమకూరుస్తాయా?"

"అవి అందుకే నియోగింపబడ్డాయి. వాటినుండి దాన్ని గ్రహించలేనినాడు మానవుని మనుగడకే అర్థం లేదు. కానీ, లోకజ్ఞానంకూడా పుస్తక విజ్ఞానానికి తోడైననాడు అతడు పరిపూర్ణ విజ్ఞానవంతుడు కాగలడు."

"మరి కవులు కొందరు అసంభవమైన విషయాలను గురించి వ్రాస్తే అవి నమ్మవలసిందేనా?"

"రజీ, ఇది అణుయుగమన్న మాట మరిచిపోతున్నావు. ఇక్కడ అసంభవమన్న మాటకు తావులేదు. ప్రతి అసంభవాన్ని సంభవంగా మార్చ ప్రయత్నిస్తున్నాడు మానవుడు. తన తెలివితో ఊహించరాని గొప్ప గొప్ప పనులు చేస్తున్నాడు. నీ ఉద్దేశ్యం పుస్తకాలలో ఎన్నడూ జరుగని, జరుగరాని విషయాలు ఉంటాయని కదూ?"

"అవును."

"లోకంలో మంచేకాక చెడుకూడా ఉంది. అలాగే సహజమైన సంఘటనలతోపాటుగా అసహజమైన సంఘటనలుకూడా ఎన్నో జరుగుతున్నాయి. జరిగిన విషయాలే అందరూ వ్రాస్తూ కూర్చుంటే ఎలా? జరగబోయేవి, జరుగవనుకొన్నవికూడా వ్రాసి లోకానికి చూపిస్తే మంచిదికదా? ఇంతకు మునుపు మానవు డెప్పుడైనా ఆకాశంలో షికారు చేస్తాడనీ, కొద్దినిమిషాలలో ప్రపంచాన్ని చుట్టిరాగలడనీ అనుకొన్నామా? అదీ అంతే."

"ఈ మధ్యే ఒక నవల చదివాను. అందులో ఒక తండ్రి తన ముగ్గురి కూతుళ్ళ జీవితాలను చూస్తూ చూస్తూ నాశనం చేస్తాడు. తన కడుపున పుట్టినవారు తనముందే అసభ్యంగా, నీచంగా ప్రవర్తిస్తుంటే చూస్తూ ఊరుకుంటాడు. అది సంభవమంటావా?"

"ఎందుకు కాకూడదు? అతడు తన ప్రతి కూతురినీ ఒక్కొక్క విధంగా తీర్చిదిద్దాలని ప్రయత్నించి ఉంటాడు. కానీ మధ్యలోనే పరిస్థితులు ఎదురుతిరిగి అలా జరిగి అతణ్ణి నిస్సహాయుణ్ణిచేసి ఉండవచ్చు."

"అంత చేతకాని తండ్రులు ఉంటారా?"

"చేతకానివారే కాదు. చేతనైనవారుకూడా ఉంటారు. తన సుఖంకోసం కన్నకూతురిని వ్యభిచారిగామార్చి కాలం గడిపే తండ్రులు, తల్లులుకూడా ఉన్నారు. వారు రాక్షసులా, పశువులా అనే ప్రశ్న అడగవద్దు. వారిలో కాస్త మానవత్వముంటుంది. ఆ మానవత్వాన్ని విధి మరో మార్గంలో ఆడిస్తోంది. దాన్ని ఎదిరించి నిలువగలిగే శక్తి లేనివాడు వారేకాదు. నువ్వూ అంతే. నేనూ అంతే. పతనం కాకతప్పదు."

* * *

"నువ్వు మళ్ళీ ఎందుకొచ్చావు?"

"కోప్పడవద్దండి. నేను ఈ జన్మలో మిమ్మల్ని వదలదలుచుకోలేదు."

"నీ ఉద్దేశ్యమేమిటి?"

"మీ నిర్ణయం చెప్పండి."

"ఇంతకుముందే చెప్పాను. అంతే."

"అది జరగదని నేనూ చెప్పాను."

"అయితే నీ యిష్టం."

"సరే. మీ నిర్ణయం మార్చుకోకపోతే ఇక ఎప్పుడూ మా వదిన మీతో కాపురం చెయ్యదు."

"బెదిరిస్తున్నావా?"

"బెదిరింపు కాదు. మా వదినె రెండో పెళ్ళి చేసుకోబోతోంది."

ఆ మాటలు విని నెత్తిన ఎవరో కొట్టినట్టయింది నారాయణరావుకు.

"అంటే నాకు విడాకులిస్తుందా?" రెండవపెళ్లి ఎలా చేసుకుంటుందో నేనూ చూస్తాను. కోర్టులో దావా వేస్తాను. నాలో ఏం లోపం చూపిస్తుందో నేనూ తేల్చుకుంటాను."

"కోర్టుకు పోనవసరం లేకుండానే ఆవిడకు రెండో పెళ్లి జరుగుతుంది."

"అంటే?"

"నీకు విడమర్చి చెప్పే అవకాశం నాకు లేదు. వస్తా."

"ఆ చెప్పేదేదో సరిగ్గా చెప్పకూడదూ?" అంటున్న నారాయణరావు మాటలు వినకుండా వచ్చేశాడు రాజ్.

ఇందిరకు పెళ్లి. రెండో పెళ్లి. మొదటి మొగుడు బ్రతికి ఉండగానే, అతడికి విడాకులు ఇవ్వకుండా రెండో పెళ్లి చేసుకుంటుందా? ఇదేమిటి అని తలపై చేతులు పెట్టుకొన్నాడు నారాయణరావు.

దారిలో ఆలోచిస్తూ వస్తున్న రాజ్‌కు ఆనంద్ ఎదురయ్యాడు. నారాయణరావు సామాన్యంగా లొంగే ఘటంలా లేడు. అతనికి ఇందిర అంటే ఇష్టమే. అభిమానం అడ్డువచ్చి మొండిగా పట్టుదలగా ఉన్నాడు, ఏదో ఊహ తట్టగా చిక్కావురా బ్రదర్ అనుకొన్నాడు విజయగర్వంతో రాజ్.

"ఒరేయ్. ఏమిట్రా అది? నీలో నువ్వే మాట్లాడుకుంటున్నావు?" అర్థంగాక అడిగాడు ఆనంద్.

"తర్వాత చెప్తాలే. నా వెంట రా" అని ఒక ప్రెస్‌లో ప్రవేశించాడు రాజ్.

రాజ్ ఇచ్చిన శుభలేఖ చదువుకొన్న నారాయణరావుకు కళ్ళు తిరిగినట్లయింది. నాలుగుసార్లు చదువుకున్నాడు. ఇందిర పెళ్ళి. పిచ్చి పట్టినట్లయింది.

"ఏయ్, ఎవరీ వెంకటేశ్వర్లుగాడు? నేను బ్రతికుండగానే నా భార్యను పెళ్ళిచేసుకోవడానికి వీడికి అధికారం ఎవరిచ్చారు?" గర్జించాడు నారాయణరావు.

"నీ గర్జనలకు బెదిరేవారు ఎవరూ లేరిక్కడ. అతడూ మనలాగే ఒక మనిషి. ఆ అధికారాన్ని అతడికి మేమే ఇచ్చాం."

"మీకేం హక్కుంది? నా ఇందిరకు పెళ్ళిచేయడానికి నువ్వెవరు? నేను చచ్చిపోయాననుకున్నారా?"

"నీ ఇందిరా? ఈ మాటలు ఆనాడేమయ్యాయి?" రావు మాట్లాడ లేదు.

"త్రాగి తందనాలాడి, కులుకుతున్నప్పుడు ఆమె నీ ఇందిర కాదా? కన్నబిడ్డకు మందుతెమ్మని ప్రాధేయపడనాడు ఆమె నీ భార్య కాదా? ఇన్నాళ్లు ఆమె పుట్టింట్లో పుట్టెడుదుఃఖంతో ఏడుస్తూ కూర్చొని వుండే? అప్పుడామె పరాయిదా? ఇప్పుడిలా మాట్లాడడానికి సిగ్గులేదూ? ఆమెకు అందం వుంది. చదువూ వుంది. వయసు, గుణం అన్నీ ఉన్నాయి. ఏం తక్కువని ఇలా జీవితాంతం చింతిస్తూ కూర్చోవలసిన ఖర్మ పట్టింది?"

తల వాల్చేశాడు రావు.

"మా వదినకేం? హాయిగా రెండో పెళ్లి చేసుకుంటుంది. సుఖంగా ఉంటుంది. ఇక నువ్వే నీ పాపాలకు ఏడుస్తూ కూర్చో."

"ఈ పెళ్లి ఎలా జరుగుతుందో నేనూ చూస్తాను. నాకు న్యాయం చేకూర్చడానికి కోర్టులు చాలా ఉన్నాయి."

"అంత అవకాశం నీకు లేదు. పెళ్లి రేపువుదయమే. వరుడు అమెరికాలో పనిచేస్తున్నాడు. పెళ్ళయిపోగానే మధ్యాహ్నమే వాళ్ళిద్దరూ అమెరికా వెళ్ళిపోవడానికి ఏర్పాట్లు జరిగిపోయాయి."

"పెళ్ళిలో ఇందిర నా భార్య అని చెప్పేస్తాను."

"నీకు అందుకుగూడా అవకాశం ఇవ్వను. రేపు రాత్రివరకూ నిన్ను ఇక్కడే బంధించివేస్తాం."

"ఏమిటీ? మోసం! దౌర్జన్యం! నారాయణా! నారాయణా!" కేకలు వేశాడు రావు భయంతో.

"ప్రయోజనంలేదు. వాడిని అప్పుడే పంపించివేశాం. ఈ చుట్టు ప్రక్కల నీ కెవ్వరూ సహాయపడేవారే లేరు."

"అన్యాయం. పోలీసు రిపోర్టిచ్చి మిమ్మల్ని జైలుకు పంపుతాను." పిచ్చిగా అరిచాడు రావు.

"ఆ. ఆ. అలాగే చేద్దువులే!" అని ఆనంద్, రావు నోటికి చేతి రుమాలు కట్టేశాడు. ఇంకొక త్రాడుతో రావు కాళ్ళూచేతులూ కట్టేసి

మంచంపై పడుకోబెట్టారు వారు. రావుకళ్ళలో దీనత్వం కనిపిస్తూంది. బయటికొచ్చి వాకిలి వేశారు.

స్కూలుకు బయలుదేరుతున్న ఇందిరచేతిలో పెళ్ళిపత్రికతో వస్తున్న రాజ్, ఆనంద్‌లను చూసి ఆగిపోయింది.

"ఎవరిది రాజా, పెళ్ళి?"

"నీదే వదినా!"

"రాజూ!" కోపంగా అరిచింది ఇందిర.

"కోప్పడకు వదినా! చూడు." పత్రిక అందిచ్చాడు రాజు.

అది చదివి ఆమెకు ఏడవాలో, కోప్పడాలో అర్థంకాలేదు.

"రాజూ, ఏమిటిదంతా, నీకేమైనా పిచ్చిపట్టిందా! ఈ వెంక టేశ్వర్లు ఎవరు? అతనితో నాకు పెళ్ళేమిటి? జీవితాలతో ఆటలాడు కుంటున్నావా?"

"అన్నిప్రశ్నలు ఒకేసారి అడిగితే ఎలా చెప్పను? మరేం భయపడకు. ఇది ఆధారంగా పెట్టుకుని మీ శ్రీవారిని ఒకఆట ఆడిస్తాను" అని అంతా వివరంగా చెప్పాడు రాజ్.

"ఏమో, రాజూ? ఇదంతా చూస్తుంటే నాకు భయంగా వుంది. వారు మంచివారై ఉంటే నేను వారు కోరినప్రకారం క్షమాభిక్ష వేడుకోవడానికి సిద్ధమే."

"వదినా, నువ్వు కొద్దిరోజులు ఓపికపట్టు. నా పథకం సఫలం కాకపోతే ఆపనే చెయ్యి. భార్యఅంటే ఏమిటో, ఆమె విలువ ఎంతనో అని అతనికి చూపించదలుచుకున్నాను."

"నన్ను ప్రశాంతంగా బ్రతకనివ్వవా?"

"కొద్దిరోజులతర్వాత నీ భర్తతో నువ్వు ఇంతకన్నా సుఖంగా జీవించగలవులే. నీ కెందుకు? నువ్వు స్కూలుకెళ్ళు. నాకూ కాలేజీకి టైమవుతోంది. అంతా నే చూసుకుంటాను."

"రాజూ, వారిని బందీగా ఉంచడం నాకిష్టం లేదు."

"ఉండవమ్మా; వదినా! అంత సుకుమారంగా బ్రతికారేం

ఘవారు! కాస్త బాధకూడా సహించాలి. సాయంకాలం నువ్వుకూడావస్తే ఘవారి స్థితి చూద్దువుగానీ."

మరేం మాట్లాడలేక స్కూలుకు పోయింది ఇందిర.

# 23

"అబ్బాయి ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. ఆనందరావుగారూ, ంతకన్నా మంచి సంబంధంరాదు. ఆస్తికి తక్కువలేదు. అబ్బాయూ? మాస్తే మీరే తప్పక ఒప్పుకుంటారు."

"అదికాదు, మల్లన్నా. అమ్మాయి చదువైపోతే బాగుండును అని ా ఉద్దేశ్యం."

"చదువు ఏం అడ్డమొస్తుందండీ? పెళ్ళిచూపులు కానివ్వండి. ి తర్వాత నిశ్చయతాంబూలాలు తీసుకోండి. చదువైపోగానే మీ యిష్టం చ్చినట్లుగానే పెళ్ళి జరిపించండి."

"ఇప్పుడు అంత తొందర ఏమొచ్చింది?"

"తొందర అంటారేమిటండీ? మంచిసంబంధం. తప్పిపోతే ష్టం. మీరు ఊఁ అనండి. రేపే వారిని పెళ్లిచూపులకు తీసు స్తాను."

"సరే. నీ యిష్టం" అన్నారు ఆనందరావుగారు. సంతృప్తిగా రేచాడు ఎదుటివ్యక్తి, పెళ్లిళ్ళపేరయ్యలాగా.

* * *

"రాజూ, వారు మధ్యాహ్నం భోజనం చేశారా?"

"మరేం ఫర్వాలేదులే వదినా. ఒకపూట భోంచెయ్యకుంటే అరిగి పోదులే. అహంకారం అణిగివుంటుంది."

"రాజూ!" బాధగా అంది ఇందిర.

ఆ కంఠంలో ధ్వనిస్తున్న బాధ, ప్రేమను అర్థంచేసుకోగలిగాడు ాజ్. తన విషయమే అనుకోకుండా వుండే భర్త ఒకపూట భోజనం

చేయలేదని ఎంత ఆవేదన చెందుతుంది ఆడదానిహృదయం! ఇంతటి పతిభక్తి హిందూస్త్రీలకు ఎందుకిచ్చావు భగవంతుడా అనుకున్నాడు

ప్రక్కనే వున్న ఆనంద్ ఆమె బాధచూచి ఈ ఆడవారికి బుద్ధి లేదు అనుకున్నాడు.

"నువ్వు ఇలాగే బాధ పడుతుంటావా? లేక మీ శ్రీవారి దర్శనార్థం వస్తావా?" పరిస్థితులు మార్చాలని అడిగాడు రాజ్.

"మరి వారికి రాత్రికూడా...."

"ఆ భయం లేదులే, వదినా! హోటలునుండి మేమే పట్టుకెళ్ళి తినిపిస్తాం. సరేనా?"

"హోటలుకూడు ఆయనకు వంటబట్టదు. ఇక్కడినుండే కారియర్‌లో తీసికెళ్దాం."

"ఇంకేం? ఈ దినం అన్నయ్యగారికి అదృష్టంపట్టింది, అలాగే చెయ్యి."

ఇందిర ఉత్సాహంతో లోపలికి పోయింది. మరో అరగంటలో ఆనంద్, రాజ్, ఇందిర రావుఇంటికి చేరుకున్నారు. అప్పటికే పూర్తిగా చీకటిపడింది. ఇల్లంతా చీకటిగా వుంది. తలుపులు తెరిచి తారాడుతూ స్విచ్ వేశాడు రాజ్.

లైటు వెలిగింది.

"వదినా, నువ్వు ఈ గదిలోనుంచి చూస్తుండు" అని రాజ్ ఆనంద్‌ను పిలుచుకుని ప్రక్కగదిలోకి పోయాడు.

నీరసంగా పడివున్న రావు అడుగుల చప్పుడు విని ఆశతో చూశాడు. వీరిని చూసి దాన్ని చంపుకున్నాడు.

ఆనంద్ కట్లువిప్పి అతన్ని కూర్చోబెట్టాడు. ఉదయంనుండి కడుపులోకి ఆహారం లేదు. ఆకలి చంపేస్తూంది. బాధపడుతూ తన స్థితికి తిట్టుకున్నాడు. నోటికున్న కట్టు విడివడగానే వారిపై మితిలేని కోప మొచ్చింది. చేతనైతే వారిద్దరినీ బాగా చావగొట్టాలనుకున్నాడు. కానీ ఆపనివాళ్లే చేయగలరని భయపడ్డాడు. అందునా తాను తిండికూడా లేక నీరసంగా ఉన్నాడు.

"మీరు మనుష్యులా, రాక్షసులా? నన్నిలా కట్టిపడేస్తే ఎలాగను కొన్నారు? అన్నంకూడాలేకుండా మాడి చావవలసిందేనా?" కోపం పట్ట లేక అడిగాడు రావు.

ఎవరూ మాట్లాడలేదు.

"మీకు నేనేం అన్యాయం చేశాను? నన్ను ఎందుకిలా ఏడిపిస్తు న్నారు?" దుఃఖం పొర్లుకు రాగా ఆపుకొంటూ అడిగాడు రావు.

అతని స్థితికి, బేలతనానికి జాలేసింది వారికి.

"ముందు అన్నం తినండి. తర్వాత చెప్తాం" అన్నాడు రాజ్.

ఆకలితోఉన్న రావు ఆ మాట విని బాధ మరిచిపోయి ఆశగా కేరి యర్‌వంక చూశాడు.

ఆనంద్, రావుకు విస్తరివేసి వడ్డించాడు.

రాజ్‌కు తమ పరిస్థితి చూసి నవ్వు ఆగలేదు. నవ్వితే నాటకం చెడిపోతుందని వదినను పరామర్శిద్దామని బయటికొచ్చాడు.

ప్రక్కగదిలోనుంచి చూస్తున్న ఇందిరకు కోపం ఆగలేదు. భర్త స్థితి ఆమెనలా మార్చివేసింది.

"రాజూ, ఏమిటీ అన్యాయం?"

"కోప్పడకు, వదినా!"

"కోపం రాకుండా ఎలా ఉంటుంది? అటుచూడు. ఆఖరకు కడుపు నిండా అన్నంతినే అర్హతకూడా లేదా ఆయనకు?"

రాజ్ లోపలికి చూశాడు. ఆనంద్, రావును అల్లరిపట్టిస్తున్నాడు. ఆనంద్‌పెట్టిన సగం అన్నంతో అర్ధాకలితో ఏడుపుమొహంపెట్టి కూర్చొ నున్నాడు రావు.

"నేను వారిదగ్గరికెళ్తాను" అని ఇందిర ముందు కడుగువేసింది.

ఆమెను పట్టుకొని "వదినా, ఆవేశపడి మా ప్లాను పాడుచేయద్దు!" అన్నాడు రాజ్.

"ఏమిటి మీ ప్లాను? ఇలా వారిని హింసించడమేనా? అసలు మా కుటుంబ వ్యవహారాల్లో జోక్యం చేసుకొనే అధికారం మీ కెవరిచ్చారు?"

ఎవరో శూలంతో పొడిచినట్లయింది. రాజు మొహంలో ప్రశాంతత మాయమయింది. దానిస్థానంలో గాంభీర్యం! గాంభీర్యం వెనుక బాధ అలుముకొన్నాయి.

"క్షమించు, వదినా! పొరపాటే జరిగింది" అని "ఆనంద్" అన్నాడు గట్టిగా రాజ్.

"వస్తున్నా రా" అని బయటికొచ్చాడు ఆనంద్.

"ఇక వెళ్ళండి. మీ కుటుంబ వ్యవహారాల్లో తల దూర్చే హక్కు మాకు నిజంగా లేదు. కానీ తెలివితక్కువతో వచ్చాము. అందుకు మమ్మల్ని క్షమించండి. అనవసర విషయాల్లో జోక్యం తీసుకోవడం మంచిదికాదనే పాఠాన్ని నేర్పారు. వస్తాను. పదరా" అని ముందు కడుగువేశాడు రాజ్. అతన్ని అనుసరించాడు ఆనంద్.

తనన్న మాటలకే పశ్చాత్తాపపడుతున్న ఇందిర అది చూచి భరించలేకపోయింది.

"రాజూ!" అంది బాధగా.

నాలుగడుగులువేసిన వారిని ఆ పిలుపు అడ్డగించింది.

"రాజూ, ఎందుకూ కొరగాని ఈ దీనురాలిని ఓదార్చేందుకు నువ్వు దిక్కున్నావని తృప్తిపడ్డాను. నువ్వుకూడా నాపై కోపగించుకొని వెళ్ళిపోతావా?"

వెనుతిరిగి చూసిన రాజ్ ఆమె కన్నీరు చూసి "వదినా" అని దగ్గరికొచ్చాడు.

"నన్ను క్షమించు, రాజూ! ఆవేశంలో బుద్ధిలేక అన్నాను" అంది తలవంచుకుని ఇందిర.

"అంతమాటలనకు వదినా" అని ఆమె కన్నీరు తుడిచి "మీరు కాస్సేపు బయట ఉండండి. నేనిప్పుడే వస్తాను" అని లోపలికి నడిచాడు రాజ్.

ఎవ్వరూ లేనిది చూచి కారియర్‌లోని అన్నమంతా ఖాళీచేసి తీరిగ్గా కూర్చున్నాడు రావు.

రాజ్‌ను చూడగానే తిరిగి అతనిలో కోపం బయలుదేరింది. కానీ

కోపం అతనిముందు పనిచేయదని దీనంగా "నేను మీకేం అపకారం చేశాను? అక్కడ నా భార్య రెండో పెళ్ళి చేసుకోబోతోంది. ఇక్కడ మీరు నన్ను బంధించారు. ఇంతకన్నా నన్ను ఏ కత్తితోనైనా పొడిచి చంపెయ్యండి" అన్నాడు.

అది చూసి అనవసరంగా తాను ఆ భార్యాభర్తలను బాధిస్తున్నానేమో ననుకొన్నాడు రాజ్.

"ఇవి చేతులు కావనుకో. నన్ను విడిచిపెట్టు. నేను నా ఇందిరను దక్కించుకొంటాను."

"ఎలా? పెళ్ళిలో రభసచేసి తీసుకొచ్చుకుంటావా?"

"కాదు. ఆమెను కలుసుకొని ప్రాధేయపడి ఒప్పించుకుంటాను."

"ఆమె అంగీకరించకుంటే?"

"తప్పక ఒప్పుకుంటుంది. నాకు తెలుసు. నా ఇందూ మంచిది. నా మాట కాదనదు."

"అయితే ఈసారి ఆమె నీ ఇంటికొస్తే ఏ కష్టం కలుగకుండా చూచుకొంటావా?"

"ఇంకా ఆమెకు కష్టం కలిగిస్తానా? ఆమె దేవత. పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాను."

"సరే ఒక అయిడియా తట్టింది. చెప్తాను వినండి. నేనే ఎలాగైనా మా వదినను ఒప్పిస్తాను. రాత్రి పదకొండుగంటలకు వాళ్ళవీధి చివరి కొస్తే ఆమె వస్తుంది. త్వరపడి ముందుకు రాకూడదు; జాగ్రత్త ఉదయమే ఆమె మొదటిభర్తదగ్గరికి వెళ్ళిపోయిందని ఆ పెళ్ళికొడుకును తరిమేస్తాం. సరేనా?"

"అలాగే" అన్నాడు రావు ఆనందంతో.

ఆ రాత్రే చీకట్లో ఒక స్త్రీ ఆకారం వీధిచివరలో కాచుకొని ఉన్న మరొక పురుషాకారాన్ని కలుసుకొంది.

"ఇందూ" అందా పురుషాకారం.

"ఏమండీ" అని ఆ ఆకారం చేతుల్లో వాలిపోయింది.

"ఊc. త్వరగా పద. ఎవరైనా చూస్తారు" అన్నమాటలు వినిపించాక ఆ ఆకారాలు కదిలి వెళ్ళిపోయాయి.

ఆ ప్రక్కనే గోడచాటునే నిలబడిఉన్న మరొక ఆకారం అది చూసి నవ్వుకుంది.

"ఓ భగవంతుడా! నీ లీలావిలాసాలు అద్భుతం. భార్యాభర్తలే దొంగతనంగా కలుసుకుంటున్నారు. వారికున్న హక్కులను పోగొట్టి దొంగలుగా మార్చి పారిపొమ్మని చెపుతున్నావు" అనుకుని వెనుదిరిగిందా ఆకారం.

"అమ్మా, అక్కయ్య ఎక్కడికెళ్ళింది?" అడిగింది వుదయమే లత.

"ఇంకెక్కడి అక్కయ్య, లతా! ఇవ్వేళకు మీ బావతో అలా ఊర్లు తిరిగిరావడానికెళ్ళింది." జవాబిచ్చాడు రాజ్ మధ్యలోనే.

"బావా! నీకు ఉదయం లేచినప్పటినుండీ నవ్వులాటలేనా?"

"మనం పుట్టిందే అందుకు, లతా! మనం నవ్వకపోయినా ఇతరులను నవ్వించాలి."

"నేను అడిగింది అది కాదు."

"నీ ప్రశ్నకు జవాబు ఎప్పుడో చెప్పాను. నామీద నమ్మకం లేకపోతే అత్తయ్యనే అడుగు." అని బ్రష్ నోట్లో పెట్టుకొని వెళ్ళిపోయాడు రాజ్.

"ఔనమ్మా, లతా! మీ రాజ్‌బావ చలువవల్ల అది తిరిగి తనభర్త దగ్గరకెళ్ళింది."

"ఏమిటమ్మా నువ్వంటున్నది?"

అంతా వివరంగా చెప్పింది ఆమె.

నమ్మాలో లేదో తెలియడంలేదు లతకు. ఎన్నడూ కలలోగూడా అనుకోనివిషయం జరిగింది. అదీ బావ తెలివివలన. "బావా, మీలాంటి వారిని పొరపాటున దేవుడు ఈ మానవలోకంలో పుట్టించాడు. అయినా కనీసం మీబోటివాళ్ళు లేకుంటే ఈ లోకం ఎప్పుడో నాశనమైపోయేది. నీ ఋణం తీర్చుకొనే విధానాన్నయినా తెలుపు. ఏంచేస్తే నీ ఋణం తీరుతుంది?"

"బావా!"

"ఊఁ." ఎటో చూస్తూ పళ్ళతోముతూ జవాబిచ్చాడు రాజ్.

"ఎన్నడూ భర్తతో కాపురం చేయలేననుకున్న అక్కయ్య జీవితంలో అంధకారాన్ని పోగొట్టి వెలుగునిచ్చావు."

"ఎవరినీ? దేవుడిని ప్రార్థిస్తున్నావా! యింకా బాగా ప్రార్థించు."

"ఔను. ఆ దేవుడి పాదపద్మాలకే నమస్కరిస్తున్నాను" అని క్రిందికి వంగింది లత.

"లతా!" కోపంగా ఆమెను లేవదీసి "ముందు లెంపలు వేసుకో" అన్నాడు రాజ్.

"ఎందుకు బావా?"

"ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చేయనని లెంపలు వేసుకొనేంత వరకూ నేను నీతో మాట్లాడను."

"అంత శిక్ష వద్దు బావా. ఇదో అలాగే చేస్తున్నాను" అని చేసి "తప్పా బావా!" అంది లత.

"తప్పొప్పులు నాకు తెలియవు. ఇంకోసారి ఇలా ప్రవర్తిస్తే క్షమించేది లేదు."

"చేసిన మేలుకు కృతజ్ఞత చెప్పుకుండే యోగ్యతకూడా లేదా, బావా?"

"అందుకు నీ నోరు ఏమైంది? అయినా నేను పరాయివాడినా? పరాయివాడిననే భావనతోనే ఇదంతా చేస్తున్నావు."

"అంతమాటనకు, బావా! పోనీలే క్షమించు."

"క్షమించాను పో." చిరునవ్వు విసిరాడు రాజ్.

"బావా!"

"ఇంకా ఏం?"

"నేనూ నీ అంత గొప్పదాన్ని కావాలని ఉంది."

"అయితే నా దగ్గర శిష్యత్వం చేయి."

"తప్పకుండా."

"చాలా కష్టపడతావే అని బాధగా ఉంది."

"ఫరవాలేదు. ఎన్ని కష్టాలనైనా ఎదిరిస్తాను."

"అయితే నే చెప్పిన మాట నెన్నడూ కాదనగూడదు. అది ఎటు వంటి విలువ నిచ్చేదైనాసరే. అంగీకరించాలి."

"అక్షరాలా నీ అడుగుజాడల్లో నడుస్తాను."

"అయితే యిప్పుడు లోపలి కెళ్ళు."

"ఊఁ!"

"వెళతావా లేదా? బుద్ధిగా చదువుకోమంటే గొప్పదాన్ని కావా లనీ, శిష్యురాలిని కావాలనీ, కోతిచేష్టలు చేస్తున్నావు. ఫో" అని చేయెత్తే లోగా లత లోపలికి తుర్రుమంది.

"వసంతా" అన్నాడు ప్రకాశం బాధగా.

"ఏమిటి, ప్రకాశం?" అంది వసంత. అతనెందుకు అంతగా బాధపడుతున్నాడో ఆమెకు తెలుసు. కానీ ఇప్పుడు తానా బాధ తీర్చ లేదు. ఎవ్వరినీ నవ్వించలేదు. తను నవ్వదు. ఏది ఆనందమని అను కొందో దాన్ని సాధ్యమైనంతవరకూ దూరం చేసుకొంది. తన అలవా ట్లను పూర్తిగా మార్చుకోవాలని ప్రయత్నిస్తూంది. ఆ ప్రయత్నానికి అప్పు డప్పుడు ఎవరో ఒకరు అడ్డువస్తున్నారు.

ప్రకాశం తనను నిర్లక్ష్యం చేయడం సహించలేక అతన్ని ప్రేమ మాటలతో వంచించింది. అతడు వలచాడు. ఈనాడు అతన్ని వంచించ దలుచుకోలేదు. ఇంక ఎవరినీ మోసగించదలచుకోలేదు. పరిస్థితులు ఆమెను మార్చివేశాయి. ఎవ్వరితోనూ మాట్లాడదు. కానీ వారామెను అలా ఉండనివ్వరు.

"నువ్వు ఏ విషయం తేల్చక ఇలా బాధిస్తున్నావు. ఇది నీకు న్యాయం కాదు."

"ఇందులో తేల్చవలసిన దేముంది?"

"అదే — మన ప్రేమ."

"ఈ ప్రేమా, గీమా నాకేం తెలియదు"

"వసంతా, ఈనాడు నువ్విలా ఏం తెలియనట్లు ప్రక్కకు తప్పుకోవడం న్యాయం కాదు. నన్ను కవ్వించావు. పిచ్చివాడిగా తయారు చేశావు. అందని పండు లెమ్మని దూరంగా ఉంటున్న నన్ను అందుకొమ్మని ఆశలు కల్పించి దగ్గరికొచ్చి అందుకోబోయేంతలో ఏం తెలియదు అంటున్నావు. నా మనసులో రగిలే బాధ నీకర్థంకాదు. ఏ పని చెయ్యబోయినా నువ్వే, ఎక్కడున్నా నువ్వే కనిపించి నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నావు."

"దానికి నన్నేం చేయమంటావు? అది నీ బలహీనత."

"అదే నేనూ అంటున్నాను. ఈ బలహీనతను నువ్వే నాలోకి ఎక్కించావు. సుస్థిరంగా ఉన్న నా హృదయాన్ని నీ చూపుల బాణాలతో, చిలిపిచేష్టలతో కదిలించి పటుత్వాన్ని పోగొట్టి, విలవిలలాడించి, క్రింద పడిపోతూ పట్టుకొమ్మని ప్రాధేయపడితే ఏమీ పట్టించుకోని అమాయకురాలిలా వెళ్ళిపోతున్నావు. ఇలా మగవారి హృదయాలతో ఆటలాడుకొనే అధికారం నీ కెవరిచ్చారు?"

"అదే నేనూ అడుగుతున్నాను. అమాయకులయిన ఆడపిల్లల వెంటబడటమేనా మీ పని?"

"అమాయకురాలివా నువ్వు? కత్తి అక్కరలేకుండానే మగవారి మనసులను హింసించి, చిత్రహింసకు గురిచేసే మాయావినివి. వారికి జీవితంపై ఆశను కల్పించి, నిరాశను నింపుతున్నావు. ఆనందమంటూ దుఃఖాన్నిస్తున్నావు. ప్రేమ జ్యోతిని వెలిగిస్తానంటూ అగ్నినే రగిలిస్తున్నావు. నీ అందం ఎరగాబెట్టి జీవితాలనే బలిగా కొంటున్నావు. తృప్తినిస్తానంటూ అసంతృప్తినే నింపుతున్నావు. శాంతిగా సాగే జీవితాలలో అశాంతిని రేకెత్తిస్తున్నావు."

"ప్రకాశం?" గట్టిగా అరిచింది వసంత,

"ఎందుకలా అరుస్తావ్? అయిపోయింది. అంతా అయిపోయింది. ఇందరి జీవితాల్లో చిచ్చుపెట్టిన నీ జీవితం ఎన్నడూ సాఫీగా, సుఖంగా సాగదు. అందరి శాపం నీకు తగిలి నీ జీవితంలో కుళ్ళికుళ్ళి ఏడుస్తావు.

అప్పుడర్థం చేసుకో — మా హృదయాలలో రగిలే బాధను, నువ్వు బ్రతికిఉండగా నీకు శాంతి లభించదు. సుఖాన్ని దరిజేరలేవు. ప్రశాంతంగా జీవితాన్ని గడపలేవు" అని గిరుక్కున వెనుదిరిగి వెళ్లిపోయాడు ప్రకాశం.

ఆ మాటలు విని వణికిపోయింది వసంత. ఎన్నో చేతులు తన గొంతు నులుమను వస్తున్నాయి. తనను దరిజేర్చేవారిని నిర్దయగా దూరంగా విసిరివేస్తున్నాయి. తనపై జాలిజూపేవారే లేరు. తన నాదరించేవారే లేరు. తన ఆవేదనను వినేవారేలేరు. ఒక్కవ్యక్తి....ఆ వ్యక్తే తనకు శాంతి నివ్వాలి. అభయమిచ్చి చేరదీయాలి. అతని ఎదుట నుంటే తనకు ఏ కష్టమూ, ఏ భయమూ ఉండదు. ఎవరతను?

• • •

అప్పుడే వస్తున్న రాజ్‌నుచూసి "అదుగో నాన్నా! వారుకూడా వచ్చేశారు" అంది రజియా ఉత్సాహంతో.

రాజ్ అక్కడ ఉన్న క్రొత్తకారును చూసి ఎవరొచ్చారా అని చుట్టూ చూశాడు. కానీ ఎవరూ కనిపించలేదు. కారును పరీక్షిస్తున్న ఖాన్‌గారు, రజియా మాత్రమే అక్కడ ఉండటంతో ఒహో అనుకున్నాడు.

"రా, అబ్బాయ్, రా! ఈ కారు కొనేంతవరకూ రజియా ప్రాణాలు తోడేసిందనుకో. కొని మీ చేతికి అప్పగిస్తున్నాను, ఇక దీని బాధ్యత అంతా నీదే."

"నాదా!" ఆశ్చర్యపోయాడు రాజ్.

"అవును. అమ్మాయి నీకోసమే కొనిపించింది ఈ కారు. నీకు డ్రైవింగ్‌కూడా వచ్చుటగా? అమ్మాయికూడా నేర్చుకోవాలంటోంది. ఆ భారంకూడా నీకే అప్పగిస్తున్నాను. ఇంద తాళంచెవులు" అని ఖాన్‌గారు రాజ్ చేతిలో అవి ఉంచి లోపలికి వెళ్ళిపోయారు. రాజ్ రజియాను చూశాడు. ఆమెలో క్రొత్త ఆనందం వెల్లివిరుస్తూంది. ఏం మాట్లాడలేకపోయాడు. ప్రక్కనేఉన్న తోటలోకి నడిచాడు.

"కోపమా?" అనుసరించింది రజియా.

"రాజ్, నే నిప్పుడేం చేశానని?"

"కారు కొనమని మీ నాన్నగారిని ఎందుకు వేధించావ్?"

"మరి అందరికీ కారుంది. మనకు లేదు. అందుకని...."

"అదే నా కిష్టంలేదు."

"రాజ్, ఈ ఒక్క తప్పు మన్నించు. ఇంకెప్పుడూ నిన్ను అడగనిదే ఏ పనీ చెయ్యను."

"ఊ" అని మూలిగాడు రాజ్.

"అదికాదు, రాజ్, కారుంటే చాలా బాగుంటుంది. అదీగాక దినం మనం అంతదూరం నడిచిపోవాలంటే కష్టంగా ఉంది."

"అప్పుడే అంత సుకుమారివయ్యావన్నమాట!"

"పోనీలే. నీ కిష్టంలేకుంటే ఆ కారు తిరిగి అమ్మివెయ్యమని నాన్నగారితో చెప్తాను."

లేచింది రజియా. కంగారు పడ్డాడు రాజ్. "రజీ" అంటూ ఆమెను పట్టుకొన్నాడు. అప్పటికే రెండడుగులు ముందుకువేసిన రజియా కొంగుమాత్రమే అతనికి చిక్కింది.

"అబ్బ! వదులు రాజ్!" ప్రయత్నించింది రజియా.

"ఊహుం" అని ఆమెను లాగాడు. గుండ్రంగా తిరుగుతూ అతని మీద వాలిపోయింది. రెండుచేతులతో బంధించి "అప్పుడే అమ్మాయి గారికి అలుకా?" అన్నాడు.

ఆ కౌగిలిలో అమితమైన సుఖాన్ని అనుభవిస్తున్న రజియామాట్లాడలేకపోయింది.

"నీ యిష్టప్రకారమే కానీ. ఏదీ నవ్వు."

నవ్వింది రజియా జయించానన్న గర్వంతో.

"రజీ, అటుచూడు నీ నవ్వుకు ఆ మొగ్గలు వికసిస్తున్నాయి."

"ఇక ఈ కవిత్వం చాలించకుంటే నే వెళ్ళిపోతాను."

"అంతేకాదు, రజీ. నీ నవ్వు నాలోని కోరికలను మత్తెక్కిస్తోంది."

"రాజ్!" మధురమైన బాధ రజియాను ఆవరించింది.

"అవును, రజీ. ఇంత అందమైన అందాలరాశితో అంతులేని ఆనందాన్ని అనుభవించ అంటున్నాయి ఈ నిలకడలేని కోరికలు. కానీ అంతరాత్మ ప్రమాదంసుమా అని హెచ్చరిస్తోంది."

"నీ భావం నాకర్థం కాలేదు."

"నా జీవితానికి యింత సౌఖ్యాన్నిస్తున్నావు. ఇంకా యివ్వాలని ప్రయత్నిస్తున్నావు. విధివశాత్తూ నువ్వు నా తోడు విడనాడితే నేను జీవితంలో ఎదురుదెబ్బలు తిని పతనమైపోతానేమోనని భయంగా ఉంది."

"రాజ్, అటువంటి మాటలనేకన్నా నీ చేతులతో గొంతు నులిమి చంపెయ్యి."

"రజీ!"

"లేకుంటే ఏమిటి? నువ్వు నన్నిలా ఏడిపించడం బాగుందా?"

"మాటవరస కన్నాను. అంతేకానీ ఇంకేంలేదు."

"నిజం చెప్తున్నాను. నిన్ను విడిచి బ్రతకడం దుర్భరం. నువ్వు ఎప్పటికీ నా హృదయంలో పదిలంగా ఉంటావు. నువ్వు లేనినాడు నాకు ఈ లోకంతో పనిలేదు.

"రజీ, నాకు ఈ విశాల ప్రపంచంలో నీ హృదయంలో తప్ప ఎక్కడా శాంతిలేదు. పద కొత్తకారు చూద్దాం."

* * *

"మీ సంబంధం వారి కిష్టం లేదటండీ!"

"కారణం?"

"అమ్మాయి నచ్చలేదట."

"మల్లన్నా, నువ్వేదో దాస్తున్నావు. నిజం చెప్పు."

"క్షమించండి, ఆనందరావుగారూ. వారన్నమాటలు నే చెప్పలేను.'

"మల్లన్నా, పరవాలేదు చెప్పు."

"అమ్మాయి ప్రవర్తన ఏమీ బాగులేదట. కాలేజీలో ఆమె ప్రవర్తన గురించి, ఎవరో ఆ వరుడికి చెప్పారట. అమ్మాయి నీతిమాలినదనీ, యింకా ఏమేమో అన్నారులెండి."

బాధగా నిట్టూర్చి చేతులతో తలపట్టుకున్నారు ఆనందరావుగారు.

"క్షమించండి. నేను మాట్లాడిన సంబంధం తప్పిపోవడం ఇది మొదటిసారి. మీగురించి నేనుకూడా మాటలు పడవలసివచ్చింది. చెపితే మీరుకోపపడతారుకానీ మీ అమ్మాయిని ఇప్పటికైనా మందలించకుంటే చాల విపరీత పరిస్థితులు సంభవించవచ్చు. ఊళ్ళో ఆమెపై రేగుతున్న పుకార్లకు అంతులేదు. ఇక సెలవు. వస్తాను" అని ఆ మల్లన్న ఉరఫ్ పెళ్ళిళ్ళపేరయ్య వెళ్ళిపోయాడు.

"హా! ఎటువంటి ఖర్మం పట్టింది. ఆఖరకు ఒకరిచేత బుద్ధి చెప్పించుకునే గతిపట్టిందా! ఊళ్ళో అందరికీ తమపైనే కన్నుపడిందా! ఇన్ని సంబంధాలు వచ్చాయి. ఒక్కటీ స్థిరపడలేదు, అందరూ పలురకాలుగా తిట్టి వెళ్ళిపొయ్యేవారే! ఒక్కరైనా ధైర్యంతో జాలిపడి ముందుకొచ్చి పెళ్ళి చేసుకొనేవారే లేరా! తనిలా లోకంచేత ఛీ అనిపించుకుంటూ బ్రతకవలసినదేనా! నేను ఎవరికీ తెలిసి అన్యాయం చెయ్యలేదు. మరి ఎందుకు తనకీ శిక్ష?"

కారు హారన్ వినిపించింది. వసంత లోపలికి వచ్చింది. పైకి వెళ్ళిపోయింది.

తల్లిలేనిబిడ్డ అని చిన్నప్పటినుండి అల్లారుముద్దుగా పెంచాడు. బహుశా తల్లి పెంపకంలేని లోటే ఆమెను అలా మార్చిందేమో? తను ఆమెకు ఏ లోటూ రాకుండా చూశాడు. కోరింది తెచ్చి యిచ్చాడు. ఆమె పాడింది పాటగా ఆమోదించాడు. స్వాతంత్ర్యాన్నిచ్చి చదువు చెప్పించాడు. అందుకు ప్రతిఫలమిదా? తానుకోరింది యిదేనా? తను ఆశించింది యిదేనా? తనకు కావలసింది యిదా? బిడ్డలను కని పెంచి పెద్ద చేసినందుకు ప్రతిఫలం దుఃఖమేనా? నలుగురిలో తలవంపులు, పలువురిలో అవమానం. వంశమర్యాద మట్టిలో గలవవలసినదేనా? ఆశతో తనబిడ్డలు పెరిగిపెద్దవారై తమకు పేరుతెస్తారని ఆశించేవారి ఆశలు నిరాశలేనా? కీర్తి లేకుంటే పోనీ అపకీర్తి వద్దు, భగవంతుడా అని ఏడ్చే తల్లితండ్రుల హృదయాలకు రంపపుకోతనిచ్చే బాధనేనా బిడ్డలు మిగల్చవలసినది? తల్లితండ్రుల సుఖం మట్టిలో కలిపి, వారిపేరు ప్రతిష్ఠలను

గంగలో కలపడమేనా వారిబాధ్యత? అటువంటిబిడ్డలు కలుగకుంటేనేమి? ప్రపంచం మునిగిపోతుందా? లోకం గొడ్డుపోతుందా? ఉన్నబాధలకు తోడుగా వీరుతెచ్చే బాధలను ముసలితనంలో భరించలేక మనశ్శాంతికి దూరమై కనీసం చచ్చేటప్పుడైనా సుఖంగా చావలేని ఈ మనుష్యులకు యిటువంటి బిడ్డలను ఎందుకు ప్రసాదిస్తావు? మమత మమకారాలతో పెంచి పెద్దచేసి, ప్రేమతో చేరదీసి, విద్యాబుద్ధులు చెప్పించి, విజ్ఞానా నిచ్చినది వారినుండి నిర్లక్ష్యతను, అసహ్యాన్ని పొందడానికేనా?

ఆలోచిస్తున్న వారికి వసంత తిరిగి వెళ్ళిపోవడం వినిపించింది. ఆ క్షణంలో ఆమెను పట్టుకొని ఆ చెంపా ఈచెంపా వాయించేయా లను కున్నాడు.కానీ అది చేతనై ఉంటే యిప్పుడామె ఆ స్థితిలో ఉండేదికాదు; తనకీగతిపట్టి ఉండేది కాదు.

శేఖరం। తల్లీ, తండ్రీ లేరు. ఎవరూ ఏదీ నేర్పలేదు. చిన్నప్పటి నుండి అదే వినయం, అదే గౌరవం తనపట్ల చూపుతున్నాడు, మంచి నడవడిక, మంచిగుణాలు, అలవాట్లు, ఇతరులపై దయ, ఇతరుల కష్టా లను ఆదుకోవడం, యితరులపై సానుభూతి చూపించడం - యివన్నీ ఎవరు నేర్పారు? ఎలా అలవడ్డాయాతనికి? అవే అందరిబిడ్డలలోనూ ఎందుకు వుండవు? సుఖం అంటే ఎరుగని జీవి. ధనమే మానవులను చెడిపేస్తుందా? మనిషికి సౌకర్యాలు ఎక్కువయ్యేకొద్దీ చెడుదారులు, చెడుబుద్ధులు వృద్ధిపొందుతున్నాయా? అదే కారణమైతే ఎందుకీ ధనం? మనిషి మంచితనాన్నీ, సహృదయాన్నీ అతనికి కాకుండాజేసే ఈ ధనం ఏంచెయ్యను? అది లేనిదే మనిషి జీవించలేడు. అతని ప్రాపులేనిదే దానికి విలువలేదు. దానిగుణం తెలిసి ఉండి దాన్ని ఆదరించే మానవుడు గొప్పవాడా? అతని బలహీనతను గుర్తించి తాను లేనిదే మనిషికి బ్రతుకే లేదని అందరికీ అందక అందరినీ ఆకర్షించే డబ్బువిలువ గొప్పదా? దాన్ని అందుకోలేకపోయిననాడు మనిషికి జీవితమేలేదు. అతని ఆదరణ లేనినాడు ధనమేలేదు. మనిషికి కావలసిన సౌకర్యాలను యిచ్చేడబ్బు ప్రతిఫలంగా అతనిలోని మంచిగుణాలను బయటికి గెంటి వేస్తుందా? దానికి లోబడినవాడు లోకానికి గొప్పవాడై మనసును, మమ

తను చంపుకొని, పరువు మర్యాదలను అమ్ముకో ప్రయత్నిస్తాడా? అందరూ అంతేనా? ఆఖరుకు దానివలన మానవుడు పతనం కాక తప్పదా?

# 25

"రాజా!"

"ఏమిట్రా అలా వున్నావు? నాన్నగారేమైనా అన్నారా? ప్రొద్దున్నే ఏడుపు మొహం పెట్టుకోమని ఎవరు చెప్పార్రా?"

"రాజా!" బాధగా పిలిచాడు ఆనంద్ మొహం త్రిప్పేసుకొని. అది చూసి తాను అనవసరంగా వాడినేమో అన్నానే అని బాధపడ్డాడు.

"ఏమిట్రా విషయం?"

"ప్రకాశం చచ్చిపోయాడు."

"ఎవరూ? మీ దూరపు చుట్టమని చెపుతుంటివే అతడేనా? ఎలా? ఎప్పుడూ? ఎందుకు? నిన్న సాయంకాలం మనతో మాట్లాడిపోయాడు కదరా?" ఆత్రుతగా అడిగాడు రాజ్.

"ఆత్మహత్య చేసుకొన్నాడు."

"ఏమిటి! ఆత్మహత్యా?"

"ఔను. యిది చదువు" అని ఆనంద్ చేతిలోని వారాః రాజ్ కిచ్చాడు.

రైలు క్రిందపడి ఒక విద్యార్థి దుర్మరణం.

ఈ దినం ఉదయం ఒక విద్యార్థి హౌరామెయిల్ క్రిందపడి చచ్చిపోయ్యాడు. ట్రెయిన్ వేగంగా వస్తుండగా రైలురోడ్ ప్రక్కనే పోతూ హఠాత్తుగా పట్టాలపై పడిపోయాడట. పోలీసులు అతని జేబులు వెతికి ఒక చీటీని బయటికి తీశారు. అందులో ఇలా ఉంది:

"జీవితంలో భయపడ్డ నిజం ఎదురైంది. ఆశించకూడదనుకున్న దాన్ని, పరిస్థితులకు బానిసనై పోయి అర్థంలేకుండా కోరాను. ఆ కోరిక ఫలించలేదు. జీవితంపై విసుగుపుట్టింది. బ్రతకడం నిరర్థకమనిపించింది.

అందుకే ఈ లోకాన్ని వదిలిపోతున్నాను. నా చావుకు ఎవరూ బాధ్యులు కారు."

క్రింద సంతకముంది.

"యిదేమిట్రా! నమ్మశక్యంకాకుండా ఉంది. అసలతనికి ఆత్మ హత్య చేసుకోవలసిన అవసరం ఏమిటి?"

"అదే అర్థం కావడంలేదు. ఏదో పెద్దవిషయమే అతన్ని బాధించి వుంటుంది."

"అతని మిత్రుల కెవరికైనా అతనిగురించి తెలుసా?"

"ఊహూ౦. ఎవరితోను ఎక్కువ మాట్లాడడు. ఒకనెల క్రింద చూశాను. ఆ ఆనందరావుగారికూతురు వసంతతో ఎక్కువగా తిరుగు తూండడం చూశాను."

"ఎవరూ? వసంతతోనా!" ఆశ్చర్యంగా అనుమానం వచ్చి దిన పత్రికలోని వార్తను మరొకసారి చదివాడు రాజ్. ఏదో ఊహ అతని మనసులో లీలగా మెదిలింది. అది నిశ్చయించుకోవడానికే బయలు దేరాడు.

హాల్లో ఎవరూలేకపోవడంతో నేరుగా మేడపైకిపోయాడు రాజ్. గది వాకిట్లో నిలిచి లోపలికి చూశాడు. వసంత తల టేబిల్‌పై ఆన్చి చేతులతో తలపట్టుకొని కుర్చీలోకూర్చొని వుంది. దీర్ఘాలోచనలోనే ఉందని గ్రహించాడు. పలుకరించాలా, వద్దా అనే సందిగ్ధావస్థలో పడ్డాడు. అప్పుడే తలఎత్తి కళ్ళు తుడుచుకోబోయిన వసంత, రాజ్‌ను చూసింది. గుండె ఝల్లుమంది. "రండి" అంది. రాజ్ కదలకుండా, పలుకకుండా ఆమెను పరీక్షించాడు.అతనిదృష్టి క్రిందపడివున్న దినపత్రికమీదపడింది. పూర్తిగా అర్థంచేసుకొన్నాడు. ఆమె కళ్ళల్లో పశ్చాత్తాపం కనిపిస్తూంది. జరిగిన దుర్ఘటనకు కారణం నేనే అని ఆమె చూపులు చెపుతున్నాయి. అది గ్రహించగలిగితే చాలు ఇంకా ముందుముందు అంతకన్నా ఎక్కువ మేలుజరగడానికి.కాస్త ఉపశమనాన్నే ఇచ్చిందతనికి ఆమెపరిస్థితి.ఆమెకా విషయం తెలియదేమో, తెలిసినా లక్ష్యపెట్టదేమో అనుకొన్నాడు. కానీ ఆశించని మంచిపనే జరిగింది. ఇక తనకక్కడ పని లేదనుకొని వెను దిరిగాడు.

"వెళ్ళిపోతున్నారేం?"

"వచ్చినపని అయిపోయింది" అన్నాడలాగే.

"ప్రకాశం విషయమా?"

వెనుతిరిగి ఆమెదగ్గరి కొచ్చాడు. సూటిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"ఇలా ప్రతివిషయంలో నేను జోక్యం తీసుకోవడం నీకు బాధగా ఉంటుంది. కానీ...."

"లేదు. మీరు తప్పకుండా వస్తారని నాకు తెలుసు. ఇంతత్వరగా తెలుసుకుంటారని అనుకోలేదు. మీ రాకే నా అశాంతికి శాంతి."

"సంతోషం. కానీ నామాటలుకానీ, నేనుకానీ, నీపాలిటికి గాయంపై చల్లబడిన కారంలా వుంటుందన్న విషయం మరిచిపోతున్నావు."

"ఫరవాలేదు. గాయానికి కారం తగిలితే అప్పటికది బాధాకరంగానే వున్నా గాయాన్ని త్వరలో పూర్తిగా మాన్పివేయడానికే తోడ్పడుతుంది."

"ఫరవాలేదు. కొద్దికొద్దిగా నేర్చుకుంటున్నావు. నువ్వుకూడా కొన్ని స...్యాలను ఆలోచించి కనుగొంటున్నావంటే అంతకన్నా సంతోషించవలసింది ఏముంటుంది?" అనుకొన్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

"లోకానికి ఈ సత్యం తెలిసిననాడు ఏం జరుగుతుందా అని ఆలోచిస్తున్నాను."

మౌనం వహించింది వసంత.

"వసంతా, నువ్వు ఇప్పటికైనా మగవారి హృదయాలను అర్థం చేసుకొని వుంటావనుకొంటాను. కేవలం నీపైని ప్రేమను చంపుకోలేక, చంపుకొని బ్రతకలేక ఆడవారిలా ఆత్మహత్య చేసుకొన్నాడు ప్రకాశం. అందుకు అతన్ని లోకం ఏమంటుందో, తెలుసా? ఒక చేతకానివాడుగానూ, తెలివితక్కువవాడుగానూ పరిగణింపబడతాడు అతడు. అందుకు కారణమైన నిన్ను ఏమీ అనలేదు. అనకూడదని దానికీ ప్రత

మేమో చెప్పలేను గాని అతని హృదయదౌర్బల్యాన్ని అర్థంచేసుకో ప్రయత్నించదు. దానికి ఆ విషయం అక్కరలేదు."

ఆగి ఆమెనుండి ఏదైనా జవాబువస్తుందని చూశాడు. "చిన్నప్పుడు నీకు జ్ఞాపకం వుందనుకొంటాను. చిన్నచిన్న చీమలను పురుగులను చేతులోకి తీసుకొని వదిలిపెడుతూ తిరిగిచేతుల్లో బంధిస్తూంటాం. ఆఖరుకు దాని చావుకు కారకులం అవుతాం. అది పసితనం. ఇప్పుడున్నది యౌవనం. అది జీవితానికి పసితనం. యిది యౌవనానికి పసితనం. అప్పుడేంచేసినా చెల్లుతుంది. యిప్పుడటువంటివిచేస్తే కొందరు మాత్రం జాలి చూపగలుగుతారు. ఈ అలవాటునే మనం కొనసాగిస్తుంటే భరించదులోకం. రాక్షసులు మానవులను ఒకేసారి చంపరట. ఆడుకొని బాధించి మరీ చంపుతారట. మనం రాక్షస ప్రవృత్తిని కాదు అలవరచుకొనవలసింది; మనలో ఉన్నది మానవత్వం. దాన్ని గుర్తించి నడుచుకోలేనినాడు ఆ మానవత్వానికి, మనుగడకూ, అర్థమూ, ఆంతర్యమూ లేవు."

వసంత మౌనంగా అన్నీ వినసాగింది.

"ఒక్కసారి అతడు చనిపోయేముందు ఏవిధమైన బాధకు గురై ఉంటాడో ఊహించుకోగలవా? ఆ బాధనెవ్వరూ వర్ణించలేరు. ఒకవేళ ఆ ఆదిశేషుడే వర్ణించగలిగినా దాన్ని వినేశక్తి మనకు ఉండదు. దానిలో ఏ నూరవవంతు ఊహించుకోగలిగినా లేక విన్నా, పగవారికి వద్దు ఈ బాధ అని చింతిస్తాము. నీ జీవితానికి వెలుగుచూపడానికీ, సరియైనత్రోవన నడపడానికీ అదిచాలు. అతను చనిపోతూ నీ కళ్ళు తెరిపించాడనే భావిస్తున్నాను. అతని మరణానికి బాధపడాలో, నీ కళ్ళు తెరవబడినందుకు ఆనందించాలో తెలియడంలేదు."

"దీనికి విముక్తి లేదా?"

"విముక్తిమాట దేవుడెరుగు. కొందరిజీవితాలు దుఃఖమయమైనవైనా వారిపై ఆధారపడ్డ మరికొందరికి కష్టం కలిగించకుండా వుండడం నేర్చుకో. ఈ వయసులో మీ నాన్నగారిని హింసపాలు చెయ్యకు. అదే నా కోరిక."

క్రింద ఆనందరావుగారి గొంతు వినిపించింది.

"ఏమిటోయ్, బాగా చదువుతున్నావా? అన్నట్టు మీ పరీక్ష లెప్పుడు?"

"ఇంకో వారంరోజు లున్నాయండి."

"అవును. ఎవరో విద్యార్థి ఆత్మహత్య చేసుకొన్నాడట. అతడొట్టి పిచ్చివాడులాగున్నాడే!"

నవ్వుకొన్నాడు రాజ్ ఆ మాట విని.

♦ ♦ ♦

"ఒరేయ్!"

"ఏమిట్రా అలా అరుస్తావు?"

"ప్రమాదం!"

"ఏమిట్రా ఆ ప్రమాదం?"

"అటు చూడు."

ఇంటిముందు టాక్సీ దిగుతున్న ఇందిరను, రావును చూసి గతుక్కుమన్నాడు రాజ్.

"చచ్చాం. ఇప్పుడాయన ఎదురు పడడమెలాగరా?"

"అదేకదా నే చెప్తూంట? ఉపాయం?"

"పలాయనమే. పద. పైన నా గదిలో కూర్చొని తలుపులు బిగిద్దాం" అని రాజ్ ఆనంద్‌ను పిలుచుకొని మేడపైకి పోయాడు.

అప్పుడే మేడపైనుండి అక్కయ్యనూ, బావనూ చూసిన లత హుషారుగా క్రిందికివస్తూ రాజ్‌ను ఢీకొంది. అదికూడా గమనించకుండా పైకి వెళ్ళిపోయారు వారు. ఏమిటా వీళ్ళంత హడావుడిగా పోతున్నారు అనుకొన్న లత. అప్పుడే లోపలికొచ్చిన అక్కయ్యనూ, బావనూ చూసి గంతులేస్తూ పోయి అక్కయ్యను కౌగలించుకుని చిలిపిగా రావును చూసింది.

"ఏం కొంటెపిల్లా! బాగున్నావా!" అడిగాడు రావు.

"బాగున్నాను కొంటెబావగారూ! అయినా మనుష్యులు చేదుగా కూడా ఉంటారా!" అంది.

"నీకు తెలియదులే, చిన్నపిల్లవు." నవ్వాడు రావు. యింతలో వాళ్ళమ్మ లోపలినుండి చిరునవ్వుతో వచ్చింది.

రావు క్రిందనున్న రెండుమూడు గదులలోకి వెళ్ళి చూశాడు. యిందిరకూడా ఎవరికోసమో వెదుకుతూంది.

"లతా, రాజ్ ఎక్కడికెళ్ళాడే?" అప్పుడు గ్రహించింది లత బావ హడావుడికి కారణం.

"అక్కయ్యా, బావ ఈమధ్య ఆడపిల్లయిపోయాడు. మీరు వస్తున్నది చూచి తనగదిలో దాక్కున్నాడు." పగలబడి నవ్వుతూ చెప్పింది లత.

"లతా, ఏమిటే అదిః" మందలించింది వాళ్ళమ్మ.

"రాజూ!" మేడపైకి పోయింది యిందిర.

వదిన గొంతువిని బయటికి రాక తప్పిందికాదు, రాజ్‌కు.

"వదినా!"అంటూ గదిలోనుండి బయటికొచ్చి యిందిర ప్రక్కనే ఉన్న రావును చూసి తల వాల్చేశాడు రాజ్.

"ఏమయ్యోయ్ కాలాంతకుడా! నువ్వే యిలా సిగ్గుపడిపోతే ఎలా చెప్పు? సిగ్గుపడవలసింది నువ్వుకాదు; నేను."

"అన్నయ్యా!" అన్నాడు తలెత్తి రాజ్.

"ఊఁ. అదేవరస, యిక పద. అత్తయ్యచేసిన వేడివేడి వంట కాలు తిందాం" అని ప్రక్కనే ఉన్న ఆనంద్‌ను చూసి "ఓ! నువ్వు కూడా యిక్కడే ఉన్నావా, మరీ మంచిదైంది. పద. నాకు ఆకలి ఎక్కువ" అన్నాడు రావు. నవ్వుకొని అనుసరించారు యిద్దరూ.

* * *

చల్లనిగాలి, మనోహర దృశ్యాలు, కన్నుల కింపైన తోట, తోటలోని పువ్వుల ఘుమఘుమ గాలిలో కలిసి మనసును మైమరపిస్తుండగా, మల్లెపందిరి, నిశ్శబ్దము—వీటిమధ్య కూర్చొన్న మానవుడికి అవతలి లోకముతో పనిఏమి? ఆకలి దప్పులకు అల్లాడవలసిన అవసర

మేమిటి? వీటికి తోడు అన్నింటినీమించిన అందమైన అప్సరసలాంటి యువతి ప్రక్కనుంటే యిక ఆనందానికి హద్దువుండదు. మల్లెపందిరి మధురమైన హాయి ప్రసాదిస్తుండగా పిల్లగాలి కోరికల అలలను అప్పుడప్పుడు రేపుతుండగా, ఆ నిశ్శబ్దంలో ఆ మనోహర దృశ్యాలను చూస్తూ ఆ చక్కని తోటలో ప్రక్కన అమ్మాయితో ఆ ఆనందాన్నీ, ఆ సుఖాన్నీ, ఆ హాయినీ, ఆ తృప్తినీ, ఎవ్వరికీ పంచిపెట్టక ఒక్కడినే అనుభవించాలనే స్వార్థం మానవుడిలో తప్పక కలుగుతుంది. ఆ తోటలో విహరించే భాగ్యం కలిగినప్పుడు ఏ దేవలోకంలోనో విహరించిన తృప్తి అతనికి కలుగుతుంది. ఆ ఆనందాన్ని అనుభవించి దేవతలతోనే పోటీ చేయమంటుంది అతని హృదయం. ఆ పడతి అందాన్ని అలాగే కళ్ళతో త్రాగి అమృతాన్ని గ్రోలిన సంతోషాన్ని పొందుతాడు అతడు. ఆ చల్లగాలి శరీరాన్ని పులకింపజేస్తుండగా మనసులోని వేడి కోరికలను మరగింప జేస్తుండగా, ఆ పులకింతలో ఆ వేడి మిళితమై బాధాకరమైన ఆనందాన్ని అనుభవిస్తాడతడు. ఆ బాధలో తియ్యదనం, ఆ తృప్తిలో లోపం, ఆ ఆనందంలో అందుకోలేమనే ఆవేదన, ఆ సంతోషంలో భయం పెనవేసుకొని ఉండగా తనది అదృష్టమా, దురదృష్టమా అని తెలుసుకోలేక అన్నీ చెయ్యాలని ఏమీ చెయ్యలేక ఉండిపోతాడు.

మల్లెపందిరి నీడలో ఒక చిన్నబల్ల. ఆ బల్లచుట్టూ కుర్చీలు. ఆ బల్లపై రెండు ఖాళీ చెయ్యబడ్డ టీ కప్పులు. అక్కడ ఉన్న ఇద్దరినీ దీనంగా చూస్తున్నాయి. కానీ వాటిపై దృష్టిలేదు ఆ వ్యక్తులకు. వారి కళ్ళు కలిశాయి. నాలుగు కాళ్ళా ఏకమై ఏవో గుసగుసలాడుకుంటున్నాయి. వారి హృదయాలు మూగగా మాట్లాడుకుంటున్నాయి.

"అన్నయ్యా" అన్నపిలుపుతో ఈ లోకంలోకి బలవంతంగా వచ్చాయి కలిసి ఎక్కడో తిరుగుతున్న వారి మనసులు.

"సుగుణా! కూర్చో." చిరునవ్వుతో చెప్పాడు రాజ్.

"మీ ఏకాంతానికి భంగం కలిగించానా?" అడిగింది సుగుణ.

"సుగుణా! నువ్వు మెడిసిన్‌లో చేరావు, మాటలు సూటిగా విసరడం నేర్చుకొన్నావు."

"అంతా నీ చలువేకదా, వదినా?"

"సుగుణా!"

"మరిచానన్నయ్యా! ముందు అన్నయ్య, తర్వాతనే వదిన."

ఫక్కుమంది రజియా.

"రాజ్, యివ్వేళతో పరీక్షలు అయిపోయాయి. మరి ఏం చెయ్య దలుచుకొన్నావు?"

"అదే ఆలోచిస్తున్నాను, రజీ! చేస్తే లెక్చరర్ ఉద్యోగమే గతి. అది చెయ్యాలన్నా క్లాసు రావాలి."

"నీకు యూనివర్సిటీ ఫస్టు ఇవ్వకుంటే అసలు ఈ యూనివర్సిటీయే పనికిరాదు." లోపలికివస్తూ చెప్పాడు ఆనంద్.

"వచ్చావా! అయితే యిక కాలక్షేపం బాగా జరుగుతుంది."

"ఏం? నేనంటే అంత లోకువైపోయానట్రా నీకు? ఏం చెల్లెమ్మా, యింటికొచ్చిన అతిధిని యిలా అవమానిస్తున్నారే మీవారు? చూస్తూ ఊరకుంటావా?"

రజియాకు మీవారు అన్నపదం చెవిని పడగానే రాజ్ అప్పుడే తనవాడై పోయినట్లు గర్వపడింది. కానీ వెంటనే సిగ్గు ముంచుకురాగా అక్కడినుండి లేచిపోవాలనుకొంది. కానీ సభ్యతా, సంస్కారం అడ్డు వస్తున్నాయి. ఎంతచదువుకున్నా, నలుగురిలో మెలగినా స్త్రీకి పెళ్ళి విషయం ఆమె ముందే చర్చించడం జరిగినా, ఆమెలో ఆ భావాలు మెదిలినా సిగ్గుపడడం సహజం.

"ఏమమ్మా, వదినా? జవాబు చెప్పు."

సుగుణపై కోపమొచ్చింది. ఏదో సామెత చెప్పినట్లు, అత్తగారు తిట్టినందుకు కాదుగానీ తోడికోడలు నవ్వినందుకు కోపమొచ్చినట్లు సుగుణను చిలిపికోపంతో చూసింది.

రజియా అవస్థచూసిన రాజ్ తిరిగి ఏదో అనబోతున్న ఆనంద్‌ను తీక్షణంగా చూశాడు. అది చూసి మాట మార్చేశాడు ఆనంద్.

"పరీక్షలైపోయినా యింకా ఘోషావాళ్ళమాదిరి ఇంట్లో కూర్చొని ఉండటం ఏంబాగోలేదు."

"ఇంకేం చేయమంటావు?" నవ్వుకొని అడిగాడు రాజ్.

"అలా కాళ్ళకున్న చెప్పులు అరిగిపోయేలా ఊరంతా చక్కర్లు కొట్టుకొని రావడమో, చుట్టూవున్న కొండల్లో షికారుకొట్టడమో, అదీకాకుంటే ఏ బొంబేయో, కలకత్తాయో చూసి రావాలి. యిది ఎండల కాలం కాబట్టి ఊటీ కెళ్ళితే యింకా బాగుంటుంది."

"యింకా నయం. ఈ కొండల్లో ఒక ప్రతిధ్వనిలా, ఆ నీల గిరిలో నువ్వూ ఒక కొండగానో, చిన్న సెలయేరుగానో నిలిచిపోవాలనే కోరిక కోరలేదు."

"నేనేం కవినికాదు అటువంటి పిచ్చిపిచ్చి కోరికలు కోరడానికి. మనకు కావలసింది కేవలం సుందరమైన దృశ్యాలను చూడడం, సుందర మైన వాటితో పరిచయం చేసుకోవడం, గొప్పవనబడే స్థలాలను సంద ర్శించడం—అంతే. అందులోనే మనకానందం."

"అయితే, అన్నయ్యా, ఇప్పుడు నువ్వు చెప్పినదంతా చేస్తే ఏమిటి ప్రయోజనం?" అడిగింది సుగుణ.

"ప్రయోజనమా! లేకేం? చాలా ఉంది."

"ఏమిటో కాస్త చెప్పరా. మేం వింటాము."

"ఊ. కేవలం అందాన్ని తెలుసుకోవడమే. దీనికి ప్రయోజన మేముంది?" తికమకపడ్డాడు ఆనంద్.

నవ్వింది సుగుణ.

"అయితే, రాజ్, ఏ పనిచేసినా ప్రయోజనమంటూ ఒకటి ఉండ వలసినదేనా?"

"తప్పదు, రజీ. ఇప్పుడు వాడు చెప్పినట్లు ఏదైనా ఊళ్ళు తిరి గొస్తే విజ్ఞానం ఆర్జించుకోవచ్చు. ఆ అందం వెనుకనున్న ఆనందాన్నీ, అర్థాన్నీ ఆస్వాదించవచ్చు."

"మహా చెప్పొచ్చావు. ఈ జీవితానికి ప్రయోజనమేమిటోయ్?"

"అనుకుంటే చాలా ప్రయోజనాలున్నాయి. లేకుంటే ఏమీ లేవు. ఈ లోకంలో ఒక ఆదర్శంగా నిలిచిపోవాలి. పలువురికి పలు ధ్యేయా లుంటాయి. అందరూ ఆచరిస్తున్నారా అని అడుగవద్దు. అసలు ఈ జీవి

తానికి ఏ ప్రయోజనమూ లేదనుకుంటే అదీ ఒక ప్రయోజనమే అవుతుంది. నాకు ఏ కోరికలూ లేవు అన్ననాడు అదీ ఒక కోరికవుతుంది."

"ఒరే. నీతో మాట్లాడేశక్తి మాకులేదు. సినిమాకు టైం అవుతోంది. పోదాం పద."

ఏమంటారు అన్నట్లు రజియాను, సుగుణను చూశాడు రాజ్. అభ్యంతరం లేదన్నాయి వారి చూపులు.

"ఈ గోపీగాడు ఎక్కడ చచ్చాడ్రా?" అడిగాడు ఆనంద్ థియేటర్‌లో ప్రవేశిస్తూ.

వారిని చూసి "రండి, సార్" అన్నాడు గేట్‌కీపరు వారిని గుర్తించి.

ఆనంద్ ఠీవిగా "మీ మేనేజరుగారు లేరా?" అనడిగాడు.

"వారు రాలేదు, సార్! ప్రొప్రయిటర్‌గారికి ఒంట్లో బాగులేక యింటిదగ్గరే ఉన్నారు."

"ఏమిటీ? ముకుందరావుగారికి ఒంట్లో బాగులేదా? ఎప్పటినుండి?" ఆశ్చర్యపోయి అడిగాడు రాజ్.

"ఓ వారంరోజులవుతోందండీ!"

ఆనంద్‌ను చూశాడు రాజ్. తల ఊపాడు ఆనంద్.

"రజీ, మీరు పిక్చర్ చూస్తుండండి. మేం గోపీ వాళ్ళింటికి వెళ్ళొస్తాం."

"అలాగే" అన్నది రజియా.

"చాలాదూరం వుంది కదరా! నడిచే వెళదామా?" అడిగాడు ఆనంద్.

"రిక్షాలో వెళదాం పద." మౌనంగా ఏదో ఆలోచిస్తూన్న రాజ్ అన్నాడు.

ఇంట్లో ప్రవేశిస్తున్న రాజ్ గడప దాటుతుండగా క్రిందపడ్డాడు.

"ఏమిటిరా" అని ఆనంద్ అతన్ని లేవనెత్తుతుండగా పైనుండి ఎవరో ఆడవారు ఏడుస్తున్నట్లు విన్నాడు రాజ్. ఒక్క పరుగున పైకి చేరుకున్నాడు. శారద తండ్రిశవంపై పడి కన్నీరు మున్నీరుగా ఏడు

స్తూంది. శవం కాళ్ళదగ్గరకూర్చొని కన్నీరు కారుస్తున్నాడు గోపి. ప్రక్కన ఒక కుర్చీపై శారదభర్త తలను చేతులతో పట్టుకొని కూర్చుని ఉన్నాడు. ప్రక్కన గోపీ తల్లితండ్రులూ, బంధువులూ ఉన్నారు.

రాజ్‌ను చూసిన గోపీకి దుఃఖమాగలేదు. మిత్రుడిని కావలించుకొన్నాడు.

"గోపీ, ఏమిటిది? చిన్నపిల్లాడిలా నువ్వుకూడా, ఏడుస్తూ కూర్చుంటే శారదను ఓదార్చేదెవరు? ఈ తతంగమంతా చేసేదెవరు? ధైర్యం తెచ్చుకో. ఊరుకో."

"ఏం, ధైర్యం తెచ్చుకోను? యింత భారాన్ని నానెత్తిన వదిలి ఏం చెప్పకుండా వెళ్ళిపోయాడు మామయ్య. ఈ బరువు నెలా మోయడం?"

"ఛ. ఊరుకోరా." మిత్రుడిని ఓదార్చాడు రాజ్.

# 26

"ఇక ఈ జన్మలో దానికి పెళ్ళిచెయ్యలేను." నిట్టూర్చాడు ఆనందరావుగారు.

"అంత నిరుత్సాహపడిపోతే ఎలాగండీ? మనప్రయత్నాలు మనం చేస్తుంటే సమయం కలిసివచ్చినప్పుడు దానంతట అదే అవుతుంది" అన్నాడు రాజ్.

"ఆ. ఇక నా శ్రాద్ధం కావలసిందే. మానం, మర్యాద పోగొట్టుకొని అందరి గడపా త్రొక్కి నానామాటలూ అనిపించుకొన్నాను. కట్నం ఎక్కువిస్తామని చెప్పినా కూతురిగుణాలు కప్పిపెట్టడానికి డబ్బును ఆసరాగా పెడుతున్నావా అన్నారు."

"వాళ్ళేదో అన్నారని మీరు దిగులుపడితే ఎలా?"

"దిగులుపడక చేసేదేముంది చెప్పు? నేను బ్రతికివుండగా దాని పెళ్ళికాదు. నా ఆరోగ్యం దినదినానికి పాడైపోతోంది. నే చచ్చేలోగా కూతురిపెళ్ళి చెయ్యలేకపోయానని లోకం అపవాదు."

"మీరు దాన్నిగురించి ఎక్కువ ఆలోచించకండి. అదంతా నే చూసుకుంటాను. ముందే మీకు రక్తపుపోటు. దీన్నిగురించి ఎక్కువగా ఆలోచిస్తుంటే వ్యాధి మరింత వృద్ధిచెందుతుంది. ఆ ఆలోచనలే మానెయ్యండి."

"మానివేసి ఏం చెయ్యమంటావు? నా చేతకానితనానికి ఏడుస్తూ కూర్చోమంటావా?"

"నాన్నా, నేను పెళ్ళిచేసుకోను" అంది, అంతవరకూ వారి మాటలు వింటున్న వసంత.

ఆ మాటవిన్న ఆనందరావుగారి కోపం మితిమీరిపోయింది. కోపంగా లేచాడు.

"పెళ్ళిచేసుకోక? ఉన్న మానం మర్యాద అన్నీ మంటగలిపావు. చాలదూ? యింకా సిగ్గులేక పెళ్లికూడా చేసుకోకుండా తిరుగుతానని చెపుతున్నావా? ఫో. అవతలికి."

"ఏమైనా కానీ, నాకు పెళ్లివద్దు."

"ఔను. నీకు నీకన్నవారి మర్యాదతో, వారి సుఖంతో ఏం పని? ముసలితనంలో వున్న తండ్రిని సుఖపెట్టాలనే జ్ఞానం నీ కెందుకుంటుంది? నీ సుఖం, నీ ఆనందం, నీవే! నీకొకరి సుఖశాంతులతో పని లేదు. నీలాంటి బిడ్డలను కన్నందుకు ఇప్పు దేడుస్తున్నాను'' అని గుండె చేత్తో పట్టుకొని "అబ్బా" అని క్రింద పడబోయారు ఆనందరావుగారు.

రాజ్ వారిని పట్టుకొని సోఫాలో కూర్చోబెట్టాడు.

"వసంతా, దయచేసి అవతలికెళ్ళు" అని ఆనందరావుగారిని వారి గదిలోకి తీసుకెళ్ళి నౌకరు పరిచిన ప్రక్కపై పడుకోబెట్టాడు.

"నువ్వెళ్ళి డాక్టరుగారికి ఫోనుచెయ్యి." ఆజ్ఞాపించాడు నౌకరుకు.

"అక్కరలేదోయ్!" చిన్నగా మూలిగాడు ఆనందరావుగారు,

"అదేమిటండి!"

"మరేం ఫర్వాలేదోయ్!" లేవబోయారు.

"అరే! మీరు నెమ్మదిగా పడుకోండి."

"ఏం నెమ్మదో! జీవితంపై విసుగు పుడుతోంది."

"మీరు మనసులో ఏ ఆలోచనలూ పెట్టుకోక తీసు కోండి.'

"ఇక చచ్చిపోయిననాడే విశ్రాంతి."

"నామాట వినండి. నెమ్మదిగా పడుకోండి."

"మరి నా మాట వినేదెవరు?"

"అందరూ వింటారు. కాసేపు నిద్రపొండి. అలత పోతుంది."

"ఆ విషయాలు పోనీలే. అనుకొన్నట్లు నువ్వు ఫస్టున పాస య్యావు. అదృష్టవశాత్తూ లెక్చరర్ ఉద్యోగంకూడా ఈ ఊళ్లోనే దొరి కిందికదూ? ఈనాడు మీనాన్న కిచ్చినమాటను నెరవేర్చగలిగాననే తృప్తి నాకు కలిగింది."

"అంతా మీ చలువే. మీ అభిమానంతోటి యింతవాణ్ణయ్యాను."

"నీలాంటివారికి సహాయం చేసేందుకుగూడా ఎవరికైనా పూర్వ జన్మ సుకృతం అంటూ ఉండాలి" నిట్టూర్చారు వారు.

*　　*　　*

"ఖాన్, మీ అమ్మాయి చాలా అదృష్టవంతురాలు."

"రజియా నీ కూతురు కాదా, సరూ?"

ఏం జవాబు చెప్పగలదు? కన్నకూతురును తనబిడ్డ అని చెప్పు కొనే అర్హతలేదు. నోరుతెరిస్తే సంఘంలో తనకు ఉండబోయే గౌరవం ఊహించుకోగలదు. ఇటువంటి జన్మలను ఎందుకిస్తావ్, భగవాన్!

"పోనీలే, సరూ! ఆ విషయాలు మరిచిపో. అమ్మాయి డాక్టరు. అల్లుడు లెక్చరరు. అంతకన్నా ఏం కావాలి? కనీసం వారి జీవితాలైనా సుఖంగా గడిచిపోతే చాలు."

"వీరింకా రాలేదా?"

"అప్పుడేపోయి ఏం చేద్దాం, రాజ్? ఇంకాసేపు కూర్చో.'

"ఎంతసేపు కూర్చున్నా ఇంతేకదా, రజీ!"

"అక్కడమాత్రం నీకేంపని ఉంది?"

"చెప్పనా?"

"ఊ. చెప్పు."

"ఒక పెద్దయిల్లు కొనుక్కోవాలి."

"యిల్లా? అందులోనూ పెద్దది. నీకెందుకు?"

"ఎందుకంటావేమిటి? మా శ్రీమతి డాక్టరు, ప్రాక్టీసుకు పెద్ద యిల్లు తీసుకోక చిన్నగుడిసె తీసుకోమంటావా!" అతని చిలిపి చూపుల నుండి తప్పించుకోవడానికి రజియా సిగ్గుతో చేతులలో మొహం దాచుకొంది.

"మీ ఆడవాళ్ళకు అడగకుండానే సిగ్గువచ్చేస్తుంది. ఏదీ ఒకసారి సిగ్గుతో ఎర్రబడ్డ నీ మొహాన్ని చూపించు." ఆ చేతులను తీసేశాడు.

"పొండి. మీరు మరీను" అంటూ రజియా అతనిగుండెలలోనే తలదాచుకొంది.

"ఇదేమిటి? బహువచన ప్రయోగం చేస్తున్నావు?"

"మరి సంప్రదాయం ప్రకారంగా భర్తగారిని ఏమంటారు?"

"అప్పుడే పెళ్ళయిపోయిందా?"

"కాకపోయినా అయిందనుకొంటాను."

"ఓహో, ఇది రిహార్సలన్నమాట."

"రాజ్, నాన్నగారు ముహూర్తం పెట్టించమంటావా అని అడుగమన్నారు."

"నాకేం అభ్యంతరం లేదని నేనూ చెప్పమంటున్నాను."

జయించాను అంటూ ఆకాశాన్ని చూసింది రజియా.

సముద్రుడు ఆ శుభవార్త నేనూ విన్నానులే అని ఆశీర్వదిస్తున్నట్లు నీటి తుంపరలను చల్లింది. పక్షుల కలకలారావములు వినిపిస్తున్నాయి. సముద్రపు హోరు ఎక్కువయింది, చల్లనిగాలి వారి శరీరాలతో ఆడుకొంటూంది. ఆవేళ పూర్ణిమ. పున్నమ చంద్రుడు నిండువెన్నెలను కురిపిస్తున్నాడు. అప్పుడే షికారు కొచ్చిన అతని అందం ఆనందాన్ని కలిగిస్తూంది. అది చూచి సముద్రం అంతులేని ఆనందంతో పొంగుతూంది. ఆ పొంగు చూస్తుంటే భయంవేస్తూంది. తనలో విప్పారిన కలు

వలను, తన కాంతికోసం చూసి ఆనందిస్తున్న చకోరాలను చూచి నవ్వు కుంటున్నాడు చంద్రుడు. అప్పుడప్పుడు మబ్బులచాటున మాయమవుతూ వాటితో ఆడుకుంటున్నాడు.

ఆ వెన్నెల పెళ్ళిపందిరి కాగా, చంద్రుడు పెళ్ళిపెద్దయి, సముద్రపు హోరుమేళంలాగా, నీటితుంపరులు అక్షింతలై అలరారగా, పంచభూతములు సాక్షిగానూ, సముద్రుడు కార్యనిర్వాహకుడుగానూ అయి ధైర్యాన్నిస్తుండగా, వారి పెళ్ళయిపోతే?

* * *

పేవ్‌మెంటుమీద నడుస్తున్న రాజ్ తాను ఎక్కడున్నాననికూడా తెలుసుకోలేకపోయాడు. తలతిరిగి పోతున్నట్లు కాగా ఆ ఆలోచనలకు అంతంలేక ఎదురుగా ఏమున్నదీ తెలుసుకోలేకుండా రోడ్‌కు అడ్డం నడిచాడు. "రాజా" అంటూ ఆనంద్ అతన్ని ప్రక్కకు లాగడం, ఒక కారు రయ్‌మని వారి ప్రక్కనుండి దూసుకుపోవడం ఒకేసారి జరిగాయి.

"ఏమిట్రా, అంత పరధ్యానం?" గద్దింపుగా అడిగిన ఆనంద్, రాజ్ మొహంచూసి అదిరిపడ్డాడు. చిన్నప్పటినుండి చూస్తున్నాడు తను. ఏనాడూ అతని మొహంలో బాధ కనుపించేదికాదు. ఈనాడు ఆ బాధలో ఏం చేసేదికూడా తెలుసుకోలేకపోతున్నాడంటే అందుకు కారణం ఎటువంటిదో ఊహించుకోగలిగాడు.

"మా ఇంటికి పోదాం, పద."

రాజ్ మౌనంగా అతన్ని అనుసరించాడు.తనకు కారు ప్రమాదం తప్పింది, అందుకు సంతోషించాలి అనికూడా అనుకోలేదు.

"రాజా! ఎప్పుడూలేని మార్పు ఈనాడు నీలో కనిపించింది. కారణం తెలుసుకోవచ్చా?" గంభీరంగా అడిగాడు ఆనంద్.

కుర్చీలో కూర్చొని వెంట్రుకలలోకి చేతులు పోనిచ్చి విసుగుగా తలను చేత్తో రాచుకుంటున్న రాజ్ అతని కళ్ళలోకిచూసి తిరిగి కుర్చీలో వెనక్కు వాలిపోయి "ఏమీ లేదురా" అన్నాడు.

"అబద్ధం. నువ్వేదో దాస్తున్నావు. నాతో చెప్పకుంటే నామీద ఒట్టు."

"అంత మాటెందుకురా! నీతో కాకుంటే ఇంకెవరితో చెప్పుకొం టాను? నేను వసంతను పెళ్ళిచేసుకోవాలిట."

"ఏమిటీ?"

"ఇది ఆనందరావుగారి ఒక్కగానొక్క కోరిక. ఇప్పుడు చెప్పు. ఏం చెయ్యమంటావు?"

"చేసేదేముంది? వీల్లేదని చెప్పెయి."

"అదంత తేలికే అయివుంటే ఆ పని నేనప్పుడే చేసేవాణ్ణి."

"ఇందులో కష్టమేముందిరా? నీ పరిస్థితుల్లో నేనే ఉంటే అలాగే చెప్పేవాడిని."

"ఆనంద్! ఈబాధ నీకర్థంకాదు. వారి డబ్బుతో పెరిగిందీశరీరం. ఆయనే లేకుంటే నేనీనాడు ఇటువంటి పరిస్థితుల్లో ఉండేవాడినికాదు. అనాథయైన నన్ను చిన్నప్పటినుండీ ఆదరణతో పోషించి చదివించాడు. ఈనాడు నేను నలుగురిలో ఒకరిగా ఉంటున్నాను అంటే ఆయనేకారణం. ఆయనే లేకుంటే నేను ఒకబికారిగానో, బిచ్చగాడిగానో లేక అన్నం దొరకక ఆకలితో అలమటించిపోయి చెయ్యరాని పనులుచేసి ఒక దొంగగా, హంతకుడుగా కూడా తయారయ్యే వాడినేమో? నన్నుదగ్గర తీసి పోషించకుంటే నా ఈ రూపం ఈ ప్రపంచంలో ఉండేది కాదేమో? నాలో ఇంత చదువు, సంస్కారం, విజ్ఞానం అలవడడానికి ఆధారం ఆయన. అటువంటివారి ఒక్కగానొక్కకోరిక తీర్చలేనినాడు ఈ చదువు లెందుకు? ఈ శరీరమెందుకు? మనం మనుష్యులం. చేసిన సహాయానికి కృతజ్ఞత తెలుపుకోవడం మన విధి. అది చేయలేనినాడు మనకూ, మృగాలకూ భేదంలేదు. అలాంటప్పుడు ఒక దిక్కులేని జీవితాన్ని రూపులు దిద్ది సమాజంలో ఒక మనిషిగా నిలిపినవారి ఒక్కగానొక్క కోరిక తీరనప్పుడు ఈ ప్రపంచంలో మంచితనానికే విలువ ఉండదు. నా బ్రతుకు కుక్కకన్నా హీనమైపోతుంది.''

"అది సరే. రజియాకు అన్యాయం చేస్తావా? నిన్ను దైవంగా ఎంచి ఆరాధిస్తోందే—ఆమెపూజలు ఫలించకుండా చేస్తావా? ఆమె ఆశలు మట్టిలో కలిపి ఆమె జీవితాన్ని నాశనం చేయడం నీకు ధర్మమా?"

"ఆమెకు అన్యాయం చెయ్యలేను. వారికి ద్రోహం చెయ్యలేకున్నాను. దిక్కు తోచడంలేదు."

"ఏం నిర్ణయం చేసుకున్నావు?"

"అది చేసుకోలేకనే ఈ బాధంతా! నాకిటువంటి పరిస్థితులు వస్తాయని కలలోగూడా అనుకోలేదు. నేను తెలిసి ఎవరికీ ఏ అపకారం తలపెట్టలేదు. భగవంతుడు నాకీ శిక్ష విధించాడు." చేతులతో తల కొట్టుకున్నాడు రాజ్.

"రాజా!"

"ఏం చెయ్యమంటావురా? జరుగబొయ్యేది తలచుకుంటే తల బాదుకుందామనిపిస్తోంది. ఏం చెయ్యాలి అని హృదయం అడుగుతుంటే మెదడు జవాబు చెప్పలేకపోతోంది. తిక్కపట్టినట్లుంది." కన్నీరు కార్చాడు మిత్రుని కౌగలించుకొని,

ద్రవించిపోయాడు ఆనంద్. "నిర్దయుడవైన భగవంతుడా, ఇటువంటివారికిగూడా కష్టాల నిస్తున్నావా!" అని నిందించాడు మనసులోనే.

"నువ్వుకూడా దుఃఖాన్ని జయించలేవని ఈనాడు తెలుసుకుంటున్నాను."

"ఈ పరిస్థితులను చూస్తుంటే ఏడవడమేకాదు చచ్చిపోవాలని కూడా అనిపిస్తోంది. చిన్నప్పటినుండి కష్టాలలో మునిగి తేలుతూ ఇప్పటికి ఒక గట్టు చేరుకొన్నానని సంతోషించాను. కానీ ఆ గట్టు ఒక చిన్న మట్టిగడ్డేనని తేలిపోతోంది. తిరిగి దుఃఖసముద్రంలోకి ఈదుకుపోయే శక్తి నాలో లేదు. ఒకవేళ ఉన్నా దాన్ని దాటుకునేంతలో ఈ జీవితం అంతమైపోతుంది."

ఆనంద్ ఏమీ చెప్పలేకపోయాడు.

"రజియా—హుం—ఆ అమాయకమైనజీవితంలో ప్రవేశించి ఎందుకు కల్లోలం రేపానా అని చింతిస్తున్నాను. నాపై ఆశలు పెంచుకొని నన్ను భర్తగా ఎంచుకొని తన భావిజీవితాన్ని అందంగా అలంకరించుకొని, తన హృదయపీఠంలో ఒక పవిత్రమైన గుడి కట్టుకొని అందులో నా రూపాన్ని ప్రతిష్ఠించుకొని పూజించింది. నేడు ఆమె

పూజలు నిష్ఫలమవుతున్నాయి. ఆమె పవిత్ర దేవాలయం శిథిలమై పోతుంది. నా జీవితానికే ఒకవెలుగునిచ్చి, నాకో జ్యోతిని చూపించి, జీవితపు ఆనందాన్ని చవిచూపించి, కొన్ని సత్యాలను తెలిపిన ఆమెను ఆరాధించాను. నేడు ఆమెకు దూరంకావాలి. ఇది సాధ్యమా? ఈ బాధ తీర్చేదెవరు? ఈ ఆవేదన వినేదెవరు? ఈ హృదయంలో మండే అగ్ని పర్వతాలను ఆర్పేదెవరు? జీవితమంతా యిలా ఏడుస్తూ గడపవలసిందేనా? నా జీవితంతోపాటు ఒక నిండు జీవితాన్ని బలిచేస్తున్నాను. ఈ పాపానికి నిష్కృతి ఎన్నిజన్మలకైనా లేదు."

"ఊరుకోరా. ఎందుకలా బాధపడతావ్?"

"బాధపడక ఏం చెయ్యాలి? మా కలలన్నీ కరిగిపోవలసినదేనా? ఆనందమయమైన బ్రతుకులను వదులుకొని దుఃఖమయమైన జీవితాలు గడపాలా? దివ్యజ్యోతిని విడిచిపెట్టిఅంధకారకూపంలోకి దిగబడిపోవాలా? ఈ బ్రతుకుకన్నా చిన్నప్పుడేనా తలిదండ్రులతోపాటు ఆ దేవుడు నన్ను కూడా తీసుకుపోయిఉంటే బాగుండేది. ఈ బాధలేమీ ఉండేవికావు."

"వసంత ఎంత సద్గుణవతో నీకు పూర్తిగా తెలుసుకదా? ఆమెతో ఎలా కాపురం చేస్తావ్?"

"అది దేవుడెరుగు. ఇప్పుడు రజియాకు ఏ మొహం పెట్టుకొని ఈ విషయం చెప్పమంటావు? కూతురి సుఖంపై ఎన్నో ఆశలు పెట్టుకొన్న ఆమెతండ్రి నన్ను ఒక మోసకారిగా తలంచి అసహ్యించుకొంటాడే అని దిగులుపడుతున్నాను."

"నా మాట విని నీ ఉద్దేశ్యం మార్చుకో."

"అందుకు అవకాశం లేదురా! డాక్టరుగారేమన్నారో తెలుసా? వారి మనసులో ఏదో చింతవుందని, అది తీరేంతవరకూ ఈ వయసులో ఆ వ్యాధి నయంకాదని అన్నారు. నేను కాదంటే ఆ ముసలిప్రాణం కాస్తా గుటుక్కుమంటుంది. చేసినమేలు మరిచి కృతఘ్నుడనై ఒక జీవితాన్ని హత్యచేసిన వాడినవుతాను. అది మార్చుకొంటే మరొకరి సౌఖ్యాన్ని అంతంచేసిన వాడినవుతాను. ఏ పనిచేసినా నేను మరొకరి దృష్టిలో మోసకారీ, హంతకుడూ అయిపోతాను."

"పరిస్థితులకు బానిసై కోరి నీ జీవితాన్ని నాశనం చేసుకుంటు న్నావ్!"

"కష్టాలను కోరి తెచ్చుకోవడం నాకిష్టంలేదు. కానీ ఇప్పట్లో పరిస్థితులకు బానిసను కాకతప్పదు. ఆ తరువాతే వాటిని ఎదిరించడం నేర్చుకోవాలి. నా కొక్క-విషయం బాధగావుంది. రజియాను ఒప్పించగలను. కానీ ఖాన్‌గారి హృదయాన్ని ఓదార్చే శక్తి నాకు లేదు. జీవితంలో ఒక సారి దెబ్బతిని, తనజీవితాన్ని నాశనంచేసుకొని, కనీసం తన కుమార్తె అయినా ఆనందంగా ఉండాలని కోరుకున్న ఆయనగారి ఆఖరికోరిక తీర్చ లేకపోగా, గాయం కలిగినచోటనే మరో గాయాన్ని కలిగిస్తున్నాను. ఆయన కెలా మొహం చూపించను? ఆయన అడిగేప్రశ్నలకు ఏం జవాబు చెప్పను? తానంటే జీవితంలో అనుకొన్న సుఖాల్ని పొందలేక పోగా, తనకుమార్తె కుకూడా అటువంటిగతే పట్టిందని తెలుసుకొన్న ఆమె తల్లిగారిశాపం నన్ను జన్మజన్మలకూ వెన్నంటి తరుముతుంది.ఇంత పెద్ద శిక్షను నేనెలా భరించను? కనీసం ఆ శక్తినైనా యివ్వు, భగవంతుడా!" అని తలను చేత్తో పట్టుకుని ఉండిపోయాడు.

• • •

సముద్రుని కెదురుగా కూర్చున్నాడు రాజ్. అతని గాంభీర్యం సముద్రుడిని పోటీకి పిలుస్తోంది. అది చూచింది రజియా. అంతటి గాంభీర్యం వెనుక ఎంత విషాదాన్ని దాచాడు అనుకొని విరక్తిపూర్వకంగా ఒక చిరునవ్వు నవ్వింది రజియా. రజియాలో మామూలు ఉత్సాహం లేదు. ఆ మౌనం వెనుకనున్న నిజం, నిస్పృహ ఆమెను అలా మార్చి వేశాయి. అది గమనించినా అప్పట్లో దానికంత ప్రాధాన్యం ఇవ్వలేక పోయాడు రాజ్.

"రజీ, నే నొక విషయం అడుగుతాను. చెప్తావా?"

"అడుగు, రాజ్." ఉద్బోధ కనిపించిందా కంఠంలో.

"ఒక అమ్మాయి అనాధకాగా ఒక సహృదయుడు ఆమెను ఆదరించి విద్యాబుద్ధులు చెప్పించాడు. అతడే ఆమెను ఆదరించకుంటే ఆమె నామరూపాలు ఈ ప్రపంచంలో ఉండేవికావు. ఆ అమ్మాయి ఒక

అబ్బాయిచేత ప్రేమింపబడ్డది; ప్రేమించింది. తమ భావిజీవితాన్ని పటిష్ఠంగా నిర్మించుకొని దానినిగురించి కలలుకంటూ గడిపారు. కానీ ఆమె ఒకచిక్కులో పడింది. ఆమెను ఆదరించిన ఆ సహృదయుడికి ఒక కుమారుడు ఉన్నాడు. త్రాగుబోతు, వ్యభిచారిఅయిన అతణ్ణి పెళ్ళిచేసుకుని అతని జీవితాన్ని బాగుపరచవలసిందిగా కోరాడు ఆయన. మానవ సహజమైన బలహీనత ఆమెలో ప్రవేశించింది. తనప్రియుడికి అన్యాయం చేసి, తన జీవితాన్ని నరకంచేసుకొని ఆయనకు ఒక మనిషిలా కృతజ్ఞత తెలపాలా? తనసౌఖ్యంకోసం, తన ప్రియుడి ఆనందంకోసం ఆ కోరిక నిరాకరించి స్వార్థంతో కృతఘ్నతనే చూపాలా? చెప్పు, రజీ!"

"మానవత్వం నిరూపించుకొనేందుకు ఆమె తన సౌఖ్యాన్నీ, తన ప్రేమనూ త్యాగంచేసి ఆయనకోరిక తీర్చాలి."

"నువ్వూ అలాగే అన్నావా, రజీ!"

"అంతేకాదు, రాజ్. ఆ నరకాన్ని స్వర్గంగా మార్చుకో ప్రయత్నించాలి."

"అవును. రాజ్! నువ్వు వసంతను పెళ్ళిచేసుకోవడమే సమంజసం."

"రజీ!" ఆశ్చర్యంతో అరిచాడు రాజ్.

"నాకంతా తెలుసు, రాజ్!"

"ఎలా?"

"నువ్వూ ఆనంద్ గదిలోకి ప్రవేశిస్తుండగా అప్పటికి అక్కడే అరుణతో మాట్లాడుతున్న నేను చూశాను. మీరున్న గదిలోకి వస్తుండగా నీమాటలు నన్ను అక్కడే ఆపేశాయి. నీబాధ నర్థంచేసుకొన్నాను. నువ్వు ఆనందరావుగారికోరిక తీర్చడమే ధర్మం."

"రజీ, నన్ను పరీక్షిస్తున్నావా?"

"కాదు, రాజ్! నాకోసం నారాజ్ అపనిందపాలుకావడం నాకిష్టం లేదు. నేను ఇన్నాళ్ళూ ఒక గొప్ప వ్యక్తిని, మానవాతీతుడైన నారాజ్‌ను

ఆరాధించాను. నా జీవితాంతం అతన్ని ఆరాధిస్తూనే ఉంటాను. అతనికి ఏ మచ్చ అంటకూడదు. అదే నాకు తృప్తి. నేను ఒక త్యాగమూర్తిని ప్రేమిస్తున్నానన్న అదృష్టాన్ని నాకు కలుగజెయ్యి. అంతేకానీ, ఆతణ్ణి నా స్వార్థానికి ఉపయోగించుకొని ఒక కృతఘ్నుడుగా చేశాననే ఆత్మఘోష నాకు వద్దు."

ఆమె కళ్ళు యిక ఆపలేం అంటూ ఏకధారగా కన్నీటిని ప్రవహింపజేశాయి. అది చూసి చెమ్మగిల్లాయి రాజ్ కళ్ళు.

"రజీ, నా పాపానికి నిష్కృతి ఉండదు."

రజియా కళ్ళు తుడుచుకొని "రాజ్, ఎందుకలా బాధపడతావ్? కష్టాలను ఎదురించమని నువ్వే నాకు నేర్పావు. ఈనాడు నువ్వే ఎందుకిలా వాటికి లొంగిపోతావు?" అన్నది.

"ఇంత ఓర్పు నెక్కడ నేర్చుకొన్నావు, రజీ?"

బదులు పలుకలేదు రజియా.

"రజీ, నిన్ను వదిలి ఎలా జీవించడం?

"అదే అలవాటయిపోతుందిలే. మనసుకు ధైర్యం తెచ్చుకో."

"వద్దు, రజీ. అలాంటిమాటలు అనకు. నిన్ను వదులుకోలేను. లోకం ఏమనుకొన్నాసరే! ఆనందరావుగారు ఏమనుకొన్నాసరే! నిన్ను విడిచిపెట్టవద్దని ఒక్కమాట చెప్పు, రజీ!"

"రాజ్, ఆవేశంలో పిచ్చిగా మాట్లాడకు. నేను ఆలోచించే ఈ నిర్ణయాన్నికొచ్చాను. నేను ఆరాధించేది ఒక త్యాగమూర్తిని కానీ ఒక కృతఘ్నుడినీ, స్వార్థపరుడినీ కాదు."

"అంతేనా, రజీ? నా జీవితానికి ఆనందం, సౌఖ్యం ఇవేమీ ఉండవా! నా జీవితం అంధకారబంధురంచేసుకోవలసినదేనా?"

"ఆ అంధకారాన్ని పోగొట్టి వెలుగుతెచ్చుకునే శక్తి నీలో ఉంది. ప్రయత్నించి నీ జీవితాన్ని సుఖంగా గడుపు."

"సుఖం, శాంతి — ఇక వీటిని మరిచిపోవాలి. రజీ, పోనీ నువ్వు నాకొక ప్రమాణం చేస్తావా?"

"ఆజ్ఞాపించే అధికారం నీకెప్పుడూ ఉంది, రాజ్!"

"నువ్వు నాకు ఎప్పుడూ తోడుగా ఉండాలి."

"ప్రయత్నిస్తాను, రాజ్!" నిట్టూర్చింది రజియా.

# 27

అందమైన చిలుక ఆనందంతో తిరిగింది. అన్నింటినీ అనుభవించాలనే ఆశ. కానీ చేతకాదనే నిరాశ. ఒంటరిదాననే బాధ. తోడు తెచ్చుకోవడానికి భయం. అదృష్టాన్ని త్రాసుతో తూచింది. తనవైపే ముల్లు మొగ్గింది. మంచి నేస్తమైన గోరువంక తోడయింది. అంతులేని ఆనందంతో, పట్టలేని సంతోషంతో, చెప్పలేని భాషతో ఆకాశాన్ని సవాలుచేసి విర్రవీగింది. తెలిసీ తెలియని భావాలను కలిపి లోకానికి ఏమేమో చెప్పింది. అది చూసిన గోరువంక ఆ చిలుక భావాలకు ఒక రూపాన్నిచ్చింది. అంతకన్నా కావలసినదేముంది? ఎవరికీ అందని ఊహా సాగరాల్లో తేలిపోయింది, భయం అనేదాన్నే మరిచిపోయి తిరిగింది. ఆ చిలుక నిర్లక్ష్యానికి కోపగించింది విధి. ఆమెఆనందానికి ఈసు చెందింది. అంతే. తుఫానుసృష్టించబడింది. ఆ తుఫానులో గోరువంక కొట్టుకొని పోతూంది. నిస్సహాయురాలై చూస్తూ ఉండడం మినహా ఏం చేయలేకపోయింది. తనూ ఆ తుఫానుతోనే వెళ్ళిపోదామనిపించింది. కానీ అది చేతకాలేక పోయింది. బాధతో విలవిలలాడిపోయింది. ఆ బాధను భరించలేక ఆ శరీరాన్నే త్యజించాలనుకొంది. పాపమా నిస్సహాయురాలైన చిలుక. కానీ గోరువంక దాన్ని చావనివ్వలేదు. ఏదారీ కానరాని చిలుక అలాగే బాధతో ఏనాడైనా తనబాధకు విముక్తి కలగదా అని కన్నీరును తుడుచుకొని లోలోపలే కుమిలిపోతూ జీవితం గడపాలని నిశ్చయించుకొంది.

దాని ఆనందాన్ని చూసి ఈర్ష్యపడిన తోడి చిలుకలు అపహసించాయి. లోకం వెక్కిరించింది. ఆ అపహాసాలను, వెక్కిరింతలను భరించే

ధైర్యం, శక్తి దానికి ఎక్కడినుండి వచ్చాయి? ఆ గోరువంక నేర్పిందా? ఏమో?

* * *

"ఏమిట్రా ఇది?" గర్జించినట్లుగా అడిగాడు గోపీ, రాజ్ ఇచ్చిన పెళ్ళిపత్రికను చదివి.

"నా పెళ్ళి." తలవంచుకొని చెప్పాడు రాజ్.

"అది నాకూ తెలుసు. ఎవరితో అని అడుగుతున్నాను."

"నీకేమైనా మతిపోయిందట్రా!"

"మతి ఉండే ఈపని చేశాను."

"ఏమిటి, బావా. ఇంతలో ఈ మార్పు?" అడిగింది లత. కారణం చెప్పే స్థితిలో లేడు రాజ్.

"ఒక అమాయకురాలిని మోసం చేయడం నీకు బాగుందా?"

"నేను నిస్సహాయుణ్ణిరా, గోపీ!"

"ఏడిశావ్! నిన్ను పోషించాడని నీ జీవితాన్ని అమ్ముకొంటావా? ఇలా నిండు జీవితాలతో ఎందుకాడుకుంటున్నాడో ఆయన్నే అడుగుతానుండు."

"అది వారి తప్పుకాదు. నా యిష్టంమీదనే ఈ పెళ్ళి జరుగుతోంది."

"అదే. ఏం చూసి యిష్టపడ్డావు? రజియా నీకు అయిష్టమయిందా! ఆమె నీకు ఏం అన్యాయం చేసిందని ఆమె జీవితానికి ఈ అపకారం తలపెట్టావు?"

"ఆ ప్రశ్నకే జవాబు చెప్పగలిగిఉంటే ఈ నా డిలాంటి పరిస్థితులలో ఉండేవాడిని కాదు" అనుకొన్నాడు రాజు మనసులో.

"అంతగా అయితే వారు నీకై ఖర్చుపెట్టిన డబ్బు ఇచ్చెయ్యలేక పోయ్యావా?"

"అవును, బావా. అలా చెయ్యకూడదా?"

"లతా, మీకు నామీద ఉన్న ప్రేమచేత ఏం మాట్లాడుతున్నారో

మీకే తెలియదు. ఇంకా మనం చిన్నపిల్లలం అనుకున్నావా? చిన్నప్పుడు తాయిలం తెచ్చుకొని ఎదుటివారి తాయిలం తీసుకొని మనది వారికి ఇవ్వవలసివచ్చినప్పుడు ఇష్టంలేక వారిది వారికి తిరిగి ఇచ్చేస్తాం. అది పసితనం, అమాయకత్వం, మనం అజ్ఞానంగా ప్రవర్తించడానికి కాదు విజ్ఞానాన్ని నేర్చుకొన్నది."

"అయితే రజియా విషయంలో నీ విజ్ఞానమంతా ఎక్కడేడిచిందోయ్?"

"మీకు నేను నచ్చచెప్పలేను" అని భారంగా తలపట్టుకొని సోఫాలో కూలబడ్డాడు రాజ్.

మానవులందరి కోరికలూ నెరవేరవు. కోర్టులో వాది ప్రతివాదులిద్దరికీ న్యాయం చెప్పబడదు. ఒకరి న్యాయం, మరొకరిపాలిటి అన్యాయం కాకతప్పదు. వాదనలోకానీ ఆటలోకానీ ఇరువురూ గెల్వరు. అలాగే అన్ని విషయాలలోనూ మానవ జీవితానికి అనుకొన్న సుఖం అతనికున్న చిన్న కాలంలో చేకూరడం దుర్లభమే అవుతుంది.

"పోనీ, ఒక విషయం అడుగుతాను చెప్పరా! వసంత స్వభావం ఎలాంటిదో నీకు తెలుసుగదా? ఆమెతో నువ్వు ఎలాగూ సుఖంగా గడపలేవు గదా? అన్నీ తెలిసి ఉండి లేనిపోని కలతలూ, మనస్తాపాలూ, అవమానాలూ కలిగే ఆ జీవితాన్నే ఎందుకు తెచ్చుకొంటున్నావు?"

"గోపీ, బాల్యంలో మనం ఎన్నో తప్పులు చేస్తుంటాం. అవి తప్పని తెలుసుకొనే వయసు వచ్చినప్పుడు తిరిగి చెయ్యం. ఆమే అంతే. తన ప్రవర్తన తప్పని తెలుసుకున్ననాడు తన జీవితాన్ని చక్కదిద్దుకోగలదు. అయినా వెలుగుకు దూరమైననాడు చీకటిని గురించి భయపడితే ఎలా?"

"ఛ. నీతో మాట్లాడడమే తప్పు, అసలు నీ పెళ్ళికే రాను ఫో" అని గోపి అక్కడనుండి బాధతో వెళ్ళిపోయాడు. లత ఏమీ మాట్లాడలేక పోయి రాజ్‌ను చూస్తుండి పోయింది.

"వదినా, కనీసం నువ్వయినా నన్ను అర్థం చేసుకోలేవా?"

"వారి మాటలు మనసులో పెట్టుకోకులే, రాజూ, నువ్వు నీ పనులు చూసుకో."

"కొంతవరకూ అదృష్టవంతుణ్ణి."

* * *

"హుం. ఆఖరకు ఇలాగయిందన్నమాట. నీ జీవితాన్నికూడా పొట్టన పెట్టుకోవడానికి సిద్ధమయింది విధి." తలపట్టుకున్నారు ఖాన్‌గారు.

తండ్రి పరిస్థితి చూసి నోరు మెదపలేక పోయింది రజియా. ఆయనను ఓదార్చాలా? ఏమని? ఏ ధైర్యం యివ్వగలదు? కూతురిసుఖం కూకటి వేళ్ళతో సహా ఊగిపోయినప్పుడు చూచిన ఏ తండ్రిని ఎవరు ఓదార్చగలరు?

ఎదురుగా కూర్చొని ఆలోచనలతో మునిగిఉన్న సరోజినీదేవిని చూసింది.

ఆ మౌనం రంపపుకోతే అయింది. అనుకొంటే ఆవేశాలను తెచ్చి గుండెలు బ్రద్దలుగొట్టే విషయం. పగ, ప్రతీకార వాంఛలు రగిలే సమయం. అపోహలూ, అంతర్యుద్ధాలూ కలిగించే సమయం. లోకంపై, జీవితంపై విరక్తికి, నిరాశా నిస్పృహలకు దారితీసే సంఘటన. మానవుడిలోని బలహీనాన్ని లోకానికి చూపించగలననే సమస్య. భవిష్యత్తంటేనే భయం. తమపై తమకే అసహ్యం. విధికి నిందాలాపాలు, భగవంతునికి దూషణలు విరివిగా లభించే తిరిగిరాని సమయం. ఎదుటివారిపై అర్థంలేని కోపం.

వీటన్నింటినీ ఎదురించి నిలువగలిగిననాడు ఆ జీవితానికే ఆ సమయంలో ఒక సార్థకత, సామాన్యులకందని తృప్తి కలుగుతాయి.

"మనుష్యుల ఆకారాలను చూసి అప్పుడప్పుడూ మోసపోతుంటాం." సరోజినీదేవి నోటినుండి భారంగా వెలువడ్డాయా మాటలు.

"పొరపడ్డావమ్మా! ప్రస్తుత పరిస్థితులనుచూసి భ్రమతో మోసపోయామనుకుంటున్నావు. అంతేకానీ రాజ్‌ను ఏమన్నా అది నిజం కాదు; నేను భరించలేను."

నిట్టూర్చింది సరోజినీదేవి. దుఃఖానికి బదులుగా ఆ నిట్టూర్పు వచ్చిందని రజియాకు తెలుసు. తండ్రి ఒకవైపు చింతిస్తున్నాడు. తల్లి మరోవైపు బాధ పడుతూంది. మరి తనో? నవ్వుతుంది. ఎవరిని చూసి?

వారినిచూసినవ్వుతూందా? కాదు. విధి విచిత్ర వక్రగతిని తలుచుకొని ఏడవ లేక నవ్వుతూంది. దాన్ని జయించాలంటే నవ్వాలి అనే రాజ్ తనకు నేర్పాడు. అదే తను చేస్తూంది.

*　　　*　　　*

పెళ్ళి జరుగుతూంది. అంతా హడావిడి. పెళ్ళికి పెద్దమనుషులు చాలామంది వచ్చారు. ధనవంతులకు ఊరంతా బంధువులే. అందరూ స్నేహితులే. కావలసినవారే. కానీ అందరూ చదివింపులదగ్గర బంధువులు కాదు.

తలెత్తి చుట్టూ చూశాడు పెళ్ళికొడుకు. రజియా చిరునవ్వుతో అతనికి ధైర్యానిస్తూంది. గోపీ చెమ్మగిల్లిన కళ్ళతో చూస్తున్నాడు. బహుశా అది మిత్రుడిపట్లగల అభిమానపు చిహ్నం కావచ్చు. ఆనంద్ మొహంలో ఏ భావాలూ తొంగిచూడడంలేదు. కానీ చూపులు స్నేహితుడి పట్ల జాలిని కురిపించాయి. ఇందిర మరదిని ఆశీర్వదిస్తూంది. లత అతనికి జోహార్లు అర్పిస్తూంది.

ఏమీ తెలియని నారాయణరావు ఉత్సాహంతో చిలిపిగా తమ్ముడిని చూపులతో పలుకరించాడు. జరుగని దానికి విచారమేలనంటూ సుగుణ సంతృప్తిగా నవ్వుతూ అతిధులను ఆహ్వానించి కొంచెపనులు ఎలా చేయడమా అని ఆలోచిస్తూంది. మిత్రురాలికి జరిగిన అన్యాయానికి మగ జాతినే అసహ్యించుకుంది అరుణ. తృప్తిగా మెరుస్తున్నాయి ఆనంద రావుగారి కళ్ళు. అల్లుణ్ణి పెళ్ళిపీటలపైచూసి సంబరపడింది శకుంత లమ్మ. ఒక్కగానొక్క మేనల్లుణ్ణి తన చిన్నకూతురు లతకు భర్తగా చెయ్యాలనుకొన్న ఆమెకోరిక తీరకపోయినా ఒక యింటివాడవుతున్నాడు గదా అని సంతోషించింది.

వసంత క్లాస్‌మేట్సు చాలామంది వచ్చారు. ఎందరో విద్యార్థుల గుండెలలో చిగబడిన బాకులాంటి వసంత అందరికీ దూరమై రాజ్ పర మైంది. వారినీ, వారి చూపులలోని భావాలనూ కనిపెట్టాడు రాజ్. వారిలో ఎందరిని ఆడించిందో, ఎందరిచేత ఆడింపబడ్డదో! పెళ్ళికాబోతున్న వసంతను చూసినవారికి బాధ. వారినిచూసి గడించిన రోజులు జ్ఞప్తికి

తెచ్చుకొన్న వసంత మనసులో చింత. అది ఆలోచించిన రాజ్ మన సులో ఆవేదన. మొదట్లోనే నాకీ పరీక్ష ఏమిటి భగవాన్ అనుకొని మనసు చిక్కబట్టుకొని "మాంగల్యం కట్టండి" అన్న పురోహితుడి పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడు.

ఆ రాత్రి డ్యాన్సు కార్యక్రమం. రజియాకోరి చేయించిందాపని. ఆమె ఉద్దేశ్యంలోని అంతరార్థం ఆమెకూ, రాజ్‌కూ తప్ప మరెవ్వరికీ అర్థంకాదు. ఇదొక పరీక్షకాబోలు అనుకొని వీటిని నెగ్గిననాడే విజయం అనుకొని నిట్టూర్చాడు రాజ్.

అందంగా అలంకరించుకుని వెన్నెనకుండతో తిరిగే రాధ చిలిపి క్రిష్ణయ్యకు కంటబడింది, సార్థక నామధేయుడై ఆ కుండలోనిది ఆర గించాడు. ఆ వెన్నతో తృప్తిపడే స్వభావంకాదతనిది. వెన్నవంటి ఆ కోమలాంగి మనసునే హరించాడు. ఇష్టమున్నా అయిష్టాన్నే ప్రదర్శిం చింది, అంతకుమించి మరేమీ చెప్పలేని చదువుకోలేని ప్రేమైకమూర్తి రాధ. హృదయాలను తస్కరించడమే నేర్చుకున్నాడు గానీ అర్పించడం నేర్చుకోలేదు భగవంతుడైన ఆ గోపాలుడు. అది అమాయకపు రాధకు తెలియదు. తెలుసుకోవలసిన అవసరం కనిపించలేదు. ఆ నల్లనయ్య సమక్షంలో మైమరిచి ఆనందాన్ని అనుభవించడమే తెలుసు ఆమెకు. ఆముగ్ధ మోహనమూర్తికి సంతృప్తిని చేకూర్చడమే అతని నిత్య కృత్యం. కృష్ణుడెప్పుడూ రాధాలోలుడన్న నమ్మకాన్ని కలిగించాడు. ఆ నమ్మకలో మునిగిపోయింది. ఆ ఆనందానికి మురిసిపోయింది. ఆ అదృష్టానికి పొంగిపోయింది. తన మురిపాన్ని ఆ యమునా నదీతీరంలో చెట్టు చెట్టుకు, పుట్టపుట్టకు, పశుపక్ష్యాదులకు చెప్పి ఉబ్బితబ్బిబ్బయింది. అంతులేని ఆనందం ఎగిరిపోయినప్పుడు మిగిలేది అరికట్టలేని దుఃఖ మేగా?

ఆ నమ్మికకూ, సత్యానికీ దూరం చాలావుందని తెలుసుకొనిననాడు ఆమె పరిస్థితి ఎట్లుంటుందో రాధవేషంలో వున్న రజియా హావభావా లతో నాట్యంచేసి చూపించింది. కృష్ణుడు ద్వారకకు వెళ్ళిపోయాడు. వెళ్లిపోయిన కృష్ణుడు తిరిగి తనకు కనిపిస్తాడేమోనని ప్రపంచాన్నే

మరిచి ఎదురు చూసింది. ఆ నిరీక్షణకు అంతంలేదా? ఆ కోరిక తీరదా? తీరనికోరికలమధ్య అంతంలేని నిరీక్షణలలో నలిగిపోవలసిందేనా ఆ జీవితం? తన కృష్ణుడు భగవంతుని స్వరూపమని తెలుసుకొంది. భక్తితో ప్రేమించిన అతన్నే పూజించింది. ఎందుకు? మోక్షప్రదానానికి! ఆ భగవంతుని మనసులో స్థానాన్ని ఆపాదించుకొన్న ఆమెకే లభించదా మోక్షం. కాని లభించబోయే ఆ ముక్తికి ఎదురుచూడడంలోనే వుంది అనుభవపూర్వకమైన ఆనందం.

ఆ నటనలోని రజియా ఆవేదనను అర్థంచేసుకోకుండా ఉండలేక పోయాడు రాజ్. అతని మనస్సు అపూర్వమైన అనుభూతులతో నిండి పోయింది. అనుభవం కన్నీటినిమాత్రం ప్రసాదించగలిగింది. అతని ప్రక్కనేవున్న వసంత అది గమనించింది.

* * *

మొదటిరాత్రి అనుభవం మధురం. యువతీ యువకులు కలలు కని ఎదురుచూసిన తియ్యనిరాత్రి. నవదంపతులు తమజీవితాన్ని సుస్థిరంగా ఏర్పరచుకొనే అంచలమైన రాత్రి. విడదీసినా విడిపోని సంబంధాన్ని కలిగించే అమోఘమైనరాత్రి. జీవితాలకు పునాదులనేకాక భవంతులనుకూడా కట్టించి శరీరాలనే కాక మనస్సులనుకూడా కలిపే రమ్యమైన రా।

రాజ్ పట్టుపానుపుపై కుడిచేతిని నుదుటికానించి పడుకొని వున్నాడు. అతనిమెదడులో అనేక రకాలైన ఆలోచనలు తిరుగుతున్నాయి. తను అనుకున్న సుఖాలను పొందలేక మరొకరిగొంతు కోశాడు. వసంత—ఆమెను ద్వేషించి, ఆమెలోని బలహీనతకు జాలిపడ్డాడు. తనకు ఆమెభార్య అవుతుందని కలలోకూడా అనుకోలేదు. కానీ ఇప్పుడదే జరిగింది. ఆమె ప్రవర్తనా, గతచరిత్రా తనకు సుఖాన్ని ఇవ్వలేవు. గతచరిత్రను మరిచిపోవడానికి ప్రయత్నించవచ్చు. ఆమె ప్రవర్తనను క్షమించవచ్చు. కానీ ఎంతవరకు? తనూ మానవుడే. తనలో మానవ సహజమైన బలహీనతలు వున్నాయి. ఎప్పటికీ ఆమెనుక్షమిస్తూ కూర్చోవడానికి తనకెంత ఓపికఉంది? జరిగిన సంఘటనలు తన మదికి వచ్చి

తనను బాధించవూ? వాటిమధ్య తను నలిగిపోకుండా నిలువగలడా? ఆ ఆవేశంలో తను తప్పుదారి త్రొక్కితే? ఆ తప్పును దిద్దుకోబోయి విధి వశాత్తు అందులోనే అంతమైపోతే? మరికొన్ని ప్రాణాలనుకూడా బలి చేయవలసివస్తుందేమోనని భయంగా ఉంది. వసంత ఎన్నో ఆశలతో తనదరి చేరుతుంది. తనకు సుఖంలేకపోయినా ఆమెకైనా ఆనందమివ్వ గలిగితే అంతేచాలు. ఆమెకూ అన్యాయ్యం చేయకూడదు.

తలుపు దగ్గర నిలబడి రాజ్‌ను చూసింది వసంత, సిల్కు లాల్చీతో ఆ లైటు వెలుతురులో చంద్రునిమించిన ప్రకాశం కలిగిన మొహంతో నవమన్మధుడిలా కనిపిస్తున్నాడు. అతడిని పొందుతానన్న ఆశ తను వదులుకొంది. కానీ నేడు తనకోరిక ఫలించింది. అతని జీవితభాగస్వామినియై, అతని మనసులో తిష్ఠవేసుకొని ఎనలేని ఆనం దాన్ని చవిచూడాలి అనుకొని ఉవ్విళ్ళూరుతున్న మనసుతో పానుపును చేరింది.

భక్తితో అతని పాదాలకు నమస్కరించింది. ఆ క్షణంలో ఆమె మనసులో గతించిన సంఘటన జరిగిపోయిన జ్ఞాపకాలను - రేపింది. ఆ సంఘటన ఆమె మనసునే మార్చివేసింది. భక్తిస్థానంలో ద్వేషం బయలుదేరింది. ఆనాడు ఇవే కాళ్లు పట్టుకొని తనకు ప్రేమభిక్ష పెట్ట మని అర్థించింది. ఏడుస్తూ ప్రాధేయపడింది. ఫలితం — కఠిన మన స్కుడై నిరాకరించి కాలదన్నాడు. పరిచిన హృదయంపై నడిచి పోయాడు. ఆనాడు ఆ హృదయం ఎంతగా గిలగిలలాడింది ! తను ఎంతగా ఏడ్చింది, తన మనసును గాయపరచి తన నేడిపించిన ఇతనితో తను సుఖంగా కాపురం చెయ్యాలా ? ములుకుల్లాంటి మాటలని తన మదిలో శూలాలను గ్రుచ్చి నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోయిన ఇతనిని నేడు ఆనందంతో సేవించాలా? దయ, కరుణ లేకుండా తన మనసును దుఃఖా నికి ఆహూతిచేసి ఆ దుఃఖసముద్రంలో తనను విసిరివేసి తనదారిని తను చక్కాపోయిన ఇతనితో జీవితమంతా సుఖంగా గడపాలా? మంచి చెడులు లేకుండా తనను విమర్శించి అప్రతిహతమైన గుండెలపై ఎదురు

దెబ్బ తీసి వెళ్ళిపోయిన ఇతన్ని పతిగా ఎంచుకొని అన్నీ మరిచిపోయి జీవితమంతా గడపాలా? తనను అర్థంచేసుకోలేక ఆనందమంటే తెలియని ఈ జడపదార్థంతో జీవితాన్ని విర్లిప్తంగా గడపడం అసాధ్యం. ఆనాడు ఇతనుచేసినదానికి తను ప్రతీకారం చెయ్యాలి. తనానాడు అనుభవించిన బాధ ఎలాంటిదో తెలియజెయ్యాలి. 'అంతవరకూ అతని హృదయాన్ని చిత్రహింసలకు గురిచేస్తాను. కానీ, ఫలితం ఎలా ఉంటుందో?'

"వసూ!" మెల్లిగా పిలిచాడు రాజ్ లేచి కూర్చుంటూ. ఆ పిలుపుకు లొంగిపోవాలనిపించింది వసంతకు. కానీ ఆ ప్రతీకారమే మనసులో మెదలకుంటే ఆ పని చేసి ఉండేది.

"వసూ! నువ్వుకూడా అలా సిగ్గుపడతావేం! నేను నీకు క్రొత్త కాదుగా?" లేచి ఆమె భుజాలపై చేతులువేసి ఆ కళ్ళలోకి చూశాడు.

ఆ స్పర్శతో పులకించింది వసంత శరీరం. ఆ స్పర్శశక్తి ఆమెను క్షణంసేపు వివశురాలిని చేసింది. ఆ మాటలలోని 'నువ్వుకూడా' అన్న పదం ఆ హృదయాన్ని కలుక్కుమనిపించింది. తన చరిత్రను ఎత్తి చూపించినట్లనిపించింది. ఆ పట్టు విడిపించుకొని విసురుగా దూరం జరిగింది.

అంతకుముందువరకూ భారతనారీధర్మాన్ని ఆచరించిన వసంతలో ఆ విసురునుచూసి ఆశ్చర్యపడకుండా ఉండలేకపోయాడు రాజ్. చిరునవ్వుతో దాన్ని కప్పేశాడు, వసంత నడుముచుట్టూ చేతులువేసి బంధించాడు.

"అప్పుడే అలుకా!"

"చూడండి. ఇటువంటి ఎగతాళి నాకు నచ్చదు. దయచేసి ఊరుకోండి."

ఆ పట్టు విడిపించుకోవాలని ప్రయత్నించింది. కానీ ఆ ప్రయత్నం ఫలించలేదు.

"ఈ రాత్రికి ఊరుకుంటే లోకం నన్ను పిచ్చివాడిగా జమ కడుతుంది."

చిరునవ్వుతో మరింత దగ్గరగా లాక్కొన్నాడు. వసంత పెనుగు లాడలేదు.

"మీకు కాదూ చెప్పేది? సిగ్గులేదూ? నన్ను వదలండి." కోపాన్ని అభినయించి విసురుగానే అంది.

ఆ అనవసరకోపాన్ని అర్థం చేసుకోలేకపోయాడు.

"క్షమించు, వసూ! నీకిష్టం లేకపోతే పోనీ." వదిలేశాడు.

వసంత ఆ ప్రక్కకు తిరిగింది.

"అసలు మీతో నాకీ పెళ్ళి యిష్టంలేదు." ఆ మాట ఎలా అన గలిగానా అని ఆశ్చర్యపోయింది తరువాత.

అర్థంకాని ఆంతర్యం. విచిత్రమైన మనస్తత్వం. విపరీతపు మాటలు. ఎదుటివారి హృదయాలకు సూటిగా బాణాన్ని వదిలే తత్వం. అనుకొంటే అనర్థాలనే కలిగించవచ్చు.

కఠినమైన జవాబునే వినవలసివస్తుందనుకొంది వసంత. విచిత్ర మైన దరహాసం అతని పెదాలపై విరిసింది.

"ఆమాట ఇప్పుడు చెప్తే ప్రయోజనమేమిటి? ముందే చెప్పి ఉంటే నీకీ బాధా ఉండేదికాదు; నాకీ శ్రమా ఉండేది కాదు."

"అంటే? మీకుకూడా ఈ పెళ్ళి ఇష్టంలేదా?"

"అది నా నోటినుండి వినడం బాగుండదు. నీ కిష్టంలేనప్పుడు నువ్వు ఎందుకు సిద్ధపడ్డావు?"

"నాన్నగారి కోసం."

నమ్మలేని నిజం. నమ్మశక్యమైన సత్యం. నమ్మకూడని అంత రార్థం. నమ్మలేని మనస్తత్వం. నలిగిపోయాడు రాజ్.

"సంతోషం. మీ నాన్నగారి మనశ్శాంతికోసం నువ్వు మన పెళ్ళికి ఒప్పుకొన్నావు, అందుకు అభినందించవలసిందే! అలాగే నీ కిష్టమున్నా లేకపోయినా గుట్టుగా కాపురం చెయ్యాలి."

"అది అసాధ్యం. నాకూ స్వాతంత్ర్యం ఉంది. నాలో కోరిక లున్నాయి. గుట్టుగా కాపురం చెయ్యవలసిన ఖర్మ నాకేం పట్టలేదు."

"అయితే నువ్వు చేసిన త్యాగానికి అర్థం ఉండదేమో!"

"ఆ త్యాగాలు చేసేంతదానిని కాదు. కానీ మీరు చెప్పినట్లు నడుచుకోలేను."

అతని మొహంలోకి చూసింది. ఆశించిన మార్పు రాకపోవడంతో నిరుత్సాహపడిపోయింది.

"మీ నాన్నగారిమనశ్శాంతికి భంగం కలుగకుండా నీ యిష్టంవచ్చినట్లు ప్రవర్తించు."

"అయితే వినండి. నా స్వేచ్ఛకు అడ్డురాకూడదు. నాకు కష్టం కలిగించే పనేదీ మీరు చెయ్యకూడదు."

చిన్నపిల్లల అర్థింపో, పెద్దల ఆజ్ఞనో అర్థంకాదు. రెండూకావు. మొండితనం, దాగివున్న పట్టుదల తాండవిస్తున్నాయి. నవ్వుకొన్నాడు రాజ్.

"అలాగే! ధర్మసమ్మతంగా నీకు కష్టం కలిగించే పనులు చెయ్యను."

ఏమైనా ఫలితం కనిపిస్తుందేమోనని చూశాడు. ప్రయోజనం కనిపించకపోవడంతో ప్రక్కపై పడుకుని కళ్లు మూసుకొన్నాడు. అతని నిర్లిప్తత చూసి వసంత తనను తానే తిట్టుకొంది. ఆ ప్రక్కనే ఉన్న ప్రక్కపై కూర్చొంది.

అనవసరమైన కలతలు పెంచుకొని తన కాపురాన్ని నాశనం చేసుకొంటున్నానేమోననే భయం ఆవరించింది. అర్థంలేని పగ, ప్రతీకారాలకు పోయి ఆనందమయం కావలసిన సంసారాన్ని దుఃఖమయం చేసుకుంటున్నానని వాపోయింది ఆమె హృదయం. ఎంత ఆలోచించినా తప్పంతా తనదేనన్న నిజం తట్టుతూంది. తన తప్పుకు క్షమాపణ చెప్పుకోవాలి. కానీ లొంగిపోవడానికి అభిమానం అడ్డువస్తూంది. అభిమానాన్ని మించిన బాధ మనసును కలవరపెడుతూంది. కలవరానికి తట్టుకోలేని మనసు విలవిలలాడుతూంది. ఆ విలవిలకు అవకాశాన్నిచ్చి, ద్విగుణీకృతం చేసే మౌనం, రాత్రి-భరించలేకపోయింది.

మధురమైన అనుభవాలతో అనుభూతులు కరగిపోగా సుఖంతో ఓలలాడవలసిన ఆ రాత్రి బాధగానూ, గాయపడిన మనసులతోనూ గడిచి

పోయింది. ఊహించలేని పరిణామం — చెప్పినా నమ్మని నిజం — కళ్ళతో చూసినా అనుమానపడే సత్యం — ఊహాతీతమై ఉద్భవిల్లిన సంఘటన—ఆవేశం తెచ్చే అసందర్భం—ఆవేదన నిలిపే ఆవేశం—ఆవేదనతో మరిగిపోయిన మనసు—మనసును అరికట్టలేని వయస్సు—వయసుకు మించిన అనుభవం—అనుభవం యివ్వలేని ఆలోచనా తరంగాలు—వాటిలో కొట్టుమిట్టుకులాడే హృదయపు బేలతనం – పగవారికై నా వద్దనుకొనే ఆ అనుభవం.

సృష్టిలో జరగరాని పనులెన్నో జరుగుతుంటాయి. అదే సృష్టి రహస్యం. దాన్ని ఛేదించే శక్తి మానవుడిలో లేదు. అలా చేయగలిగిన నాడు సృష్టే అంతం కావచ్చు.

ఉదయమే లేచాడు రాజ్. ప్రక్కన చూశాడు. నిశ్చింతగా నిద్రపోతూంది వసంత. క్రిందికి దిగివచ్చాడు. దిగివస్తున్న అతన్ని చూసి ఆనందరావుగారికి దూరపు బంధువులైనా దగ్గరివారమేఅని చెప్పుకొంటూ అక్కడే తిష్టవేసిన కొందరు ముత్తయిదువలు ముసిముసిగా నవ్వుకొంటూ అతన్ని పరీక్షించారు.

అదిచూసి నవ్వుకొన్నాడు రాజ్. వారి అమాయకత్వానికో లేక తన స్థితికో అతనికే తెలియలేదు. "బాబూ" అంటూ నౌకరు టూత్‌పేస్టూ, బ్రష్షూ ఇచ్చాడు. అందుకొన్నాడు.

"రాత్రి బాగా నిద్రపట్టిందటోయ్!" పేపరు చదువుకొంటూన్న రాజ్, మామగారిమాటలు విని దాన్నక్కడ మడిచిపెట్టేశాడు. సమాధానంగా చిరునవ్వుతో తల ఊపాడు. "నువ్వే అమ్మాయికన్నా పెందలాడే లేచినట్లున్నావే!" ఉత్సాహంతో అడిగారు ఆనందరావుగారు.

జవాబు చెప్పలేని ప్రశ్న. అది ఆయనకు తెలుసు. కానీ అడిగించింది. వారి ఆంతర్యం, వారిలో ఉత్సాహం, ఆనందం. అధికంగానే ఉన్నాయి. అటువంటి సమయాల్లోకాక మరింకెప్పుడు మానవుడు సంతోషంగా ఉంటాడు?

"చూడమ్మా, లక్ష్మమ్మా. అమ్మాయి యింకా లేవనట్లుంది. వెళ్ళి

కా స్తలేపు. అయినా ఈ కాలం ఆడపిల్లలకు బద్ధకం ఎక్కువ!" అటుగా వస్తున్న ఒకావిడతో చెప్పారు.

"అలాగే అన్నయ్యా!" అని ఆవిడ మేడపైకి నడిచింది.

కిందఉన్నవారికి పైనుండి వసంత, ఆవిడను నిద్రలేపినందుకు గానూ వేస్తున్న కేకలు వినిపించాయి. అప్పుడే కాఫీ త్రాగబోతున్న ఆనందరావుగారి కప్పు కాస్తా క్రింద పడిపోయింది. క్రిందపడ్డకప్పు రెండు ముక్కలయింది. దాన్ని బల్లపైపెట్టి అతికించాలని ప్రయత్నించా డాయన.

"ప్రయోజనంలేదు, మామయ్యా! మీరెంత ప్రయత్నించినా ఆ పగిలినచోట ఆ సత్యం కనిపించకపోదు. వాటిని ఒకటిగా చేయాలను కోవడం మన పొరపాటే."

ఉలిక్కిపడ్డారు ఆనందరావుగారు, అల్లుడిమాటలు విని.

"అంతేనటోయ్?" బాధగా ప్రశ్నించాడాయన.

"లాభంలేదు. దాన్నెవ్వరూ కాదనలేరు."

ఇంతలో ఆ లక్ష్మమ్మ క్రిందకి దిగి వచ్చింది. ఆ మాటలు విన్నా రని ఆమెకు తెలుసు. అందుకే ఒక్కక్షణం వారిని చూసి లోపలికి వెళ్ళి పోయింది.

"వెంకన్నా, కాఫీ!" పైనుండి వసంత కంఠం వినబడింది.

అప్రయత్నంగా మేడపైకి చూశారు ఆనందరావుగారు. అక్క డేమీ లేదు. ఉండదని ఆయనకు తెలుసు. కానీ ఆ చూపులలోని అర్థం, మనసులోని భావం ఆయనచేత ఆ పని చేయించాయి.

ఇక అక్కడ ఉండలేక లేచాడు రాజ్.

* * *

"ఓ! క్రొత్తపెళ్ళికొడుకుగారా! రండి." ఆహ్వానించింది లత.

"లతా, మీకుగూడా నేను పరాయివాడినయ్యానా?" ఆ సంబోధన భరించలేక బాధపడి అన్నాడు రాజ్.

"ఛ! అదేమిటి బావా! పొరపాటున అన్నాను. ఇంకెప్పుడూ అనను; బుద్ధి వచ్చింది. నువ్వు బాధపడితే మాకు ఆనందమే కరువై పోతుంది."

చిరునవ్వు నవ్వాడు రాజ్. అదే తృప్తి లతకు.

"అక్కయ్యా. ఎవరొచ్చారో చూడు." కేకేసింది లత.

"ఏమిటి? వదినకూడా ఇక్కడే ఉందా! నువ్వెప్పుడొచ్చావు, వదినా?" ఇంట్లోనుండివస్తున్న ఇందిరనుచూసి అడిగాడు.

"ప్రస్తుతం మన ఠికానా ఇక్కడే. ఇక రేపో మాపో లతకూడా అత్తగారింటికి వెళ్ళిపోతే అమ్మ ఈ వయసులో ఒంటరిగా ఉంటూంది. అందుకని ఆ ఇల్లు మార్చేసి యిక్కడే ఉండిపోవాలనుకున్నాం."

"మంచిది. మరి మా మరదలుపిల్లకు త్వరలో నోరు కట్టబడి పోతుందన్నమాట."

"ఫో బావా!"

అందులో ఇష్టంతోకూడిన అయిష్టత. బావ నోటినుండి అటు వంటిమాటలు వినాలంటే లత కిష్టం. ఆ ఇష్టాన్ని కప్పిపుచ్చడానికి సిగ్గనే ఆయుధం.

"సరేగానీ,లతా, ఎం.ఏ. పాసయ్యావుగదా?మరి ఉద్యోగం చెయ్య దలుచుకోలేదా?"

"ప్రస్తుతానికి ఏమీ అనుకోలేదు, బావా. ఇకమీదట ఏమో చెప్ప లేను."

ఆ మాటల్లో ఒకరి ఇష్టప్రకారం నడుచుకోవాలనే భావన, వినయం గోచరిస్తున్నాయి. చదువుకొన్నందుకుగాను, ఆ చదువును సార్థకంచేసి కొనేందుకుగాను ఉద్యోగం చేసితీరవలెననే ఆడవాళ్లు చాలామంది వున్నారు. మరి లత—కాబోయే భర్తగారు అంటే గోపీ ఇష్టాయిష్టాల పైన ఆ పని చేయదలుచుకొంది. స్వాతంత్ర్యంకోసం ప్రాకులాడేవారు అనేకులు వుండగా తమస్వాతంత్ర్యాన్ని మరొకరికి అప్పగించదలుచు కొనేవారుకూడా ఉన్నారు అనుకొని తృప్తిగా నిట్టూర్చాడు రాజ్.

"రాజూ, అమ్మ వసంతనూ, నిన్నూ ఇక్కడ కొద్దిరోజులు నిద్ర చేయించాలని అనుకొంటోంది. ఏమంటావు?"

"నాకేం అభ్యంతరం లేదు. కానీ వసంత ఇష్టపడదేమోనని అను మానంగా ఉంది. అయినా అడిగి చెపుతాలే."

"అదేమిటి బావా! ఆమె ఎందుకొప్పుకోదు?"

"లతా, అందరూ ఒకలా ఉండరు. వివిధరకాల మనస్తత్వాలు కలిగి ఉంటారు. వారిని బలవంతంగా మనం చెప్పినట్లు నడిపించడం కష్టం."

మందలించింది ఇందిర.

"పోనీలే, వదినా, లతకు అవంతా ఏమీ తెలియవు. ముందుముందు తెలుసుకొంటుంది." నవ్వుతూ లతను చూసి చెప్పాడు రాజ్.

వారిమాటలవల్ల వసంత స్వభావం ఎలాంటిదో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించింది లత. అందుకేనేమో బావలో అంత గంభీరత్వం తొంగిచూస్తూంది. అతనిమాటల్లో క్రొత్తదనం గోచరిస్తూంది. ఎవరికోసమో గడిపే జీవితమన్నట్లు చెపుతున్నాయి చూపులు. ఛ! భగవంతునికి దయేలేదు—అనుకొని నిట్టూర్చింది ఆ చిన్నారి హృదయం.

* * *

"రాజ్, నువ్వు అన్యమనస్కుడవై అన్యాయంచేయలేదు కదూ?"

"ఎవరికీ, రజీ?"

"వసంతకు."

"నీకీ సందేహం ఎందుకొచ్చింది. రజీ?"

"సాధారణ బలహీనతకు నువ్వుకూడా లోబడతావనే భయంచేత."

"అలా ఎప్పటికీ చెయ్యనులే, రజీ."

"క్షమించు. తెలివితక్కువగా అడిగేశాను."

"చెప్పరాని విషయమైనా నీతో చెప్పకుండా ఉండలేను. రజీ" అని అంతా చెప్పేసి నవ్వాడు రాజ్.

తాననుకొన్నది జరిగినా అదికూడా తన రాజ్‌పైనే దెబ్బతీసే విషయమే అని బాధపడింది రజియా.ఫలితం ఒకటే అయినా ప్రయత్నం విరుద్ధంగా మారింది. రంగులుమారి కనిపించే దృశ్యం.కారంగా ఉంటుందనుకొని తింటే అది కాస్తా చేదుఅయినట్లనిపించింది. అందుకు సంతోషించాలా, బాధపడాలా?

"నువ్వు క్రొత్తవిశేషాలు చెప్పి నవ్విస్తావనుకొన్నాను. కానీ......"

"పోనీలే, రజీ ఆ విషయాలు మరిచిపో. డిస్పెన్సరీ ఓపెనుచేశావు కదూ? ప్రాక్టీసు ఎలాసాగుతోంది?"

"క్రొత్తకదూ? కుంటిగా వుంది. అప్పుడున్న ఉత్సాహం ఇప్పుడు లేదు."

"ఎందుకని?"

"డాక్టరీ చదివేప్పుడు డిస్పెన్సరీ తెరిచి ఏవేవో చెయ్యాలనుకున్నాను. కానీ ఇప్పుడు ఏం చెయ్యాలనిపించడం లేదు. కేవలం డబ్బు సంపాదించాలనే ఆశ మిగిలి ఉంది. దాన్ని పూర్తిచేద్దామనుకొన్నా సాధ్యం కావడంలేదు."

చదువుకొనేప్పుడు ఆశలకు అంతు వుండదు. ఆదర్శాలకు అడ్డు వుండదు. పెద్దై దేశసేవకులు కావాలనుకున్నవారు జైల్లో కూర్చున్నారు. ఎందుచేత? దేశద్రోహంచేత. డాక్టరై పేదలకు ఉచిత వైద్యం చేయాలనే అమృతపు ఆశ. కానీ ఆచరణలో కాబూలీవాలాలను మించిన కాఠిన్యం. ప్లీడరై న్యాయానికి పాటుపడాలనుకుని పక్కా అన్యాయపు కేసులను తీసుకుంటూ అదృష్టమనేదానికి ఆధారంగా డబ్బు సంపాదించుకోవడం. మంత్రి అయిపోయి నిస్వార్థపరుడు కావాలనుకుని ఒకవేళ అయినా నిస్వార్థం అనేదాన్నే మరిచిపోతారు.

"రాజ్, నువ్వు ఐ. ఎ. ఎస్. పరీక్షకు కట్టకూడదూ?"

"నాకెందుకు, రజీ, అవంతా?"

"ఏం? నువ్వు తప్పకుండా కట్టాలి, నాకోసం."

"సరే. ప్రయత్నిస్తాను."

ఆ అంగీకారంలో భవిష్యత్తుపై ఆశ, ఆ ఆశలో ఆనందం. తన రాజ్ తప్పకపాసవుతాడు.తన రాజ్ జిల్లాకలెక్టరు.తన—కాదు తన రాజ్ కాదు.రాజ్ వసంతకు అధీనం. బాధతో మెలికలు తిరిగిపోయింది."పిచ్చిదానా! ఎందుకలా బాధపడతావు? అతడు వసంతకు కేవలం భర్త. కానీ నీకు దైవం. నీ మనస్సులో చెరగని ముద్ర. నువ్వు పూజించే ఆరాధ్య దైవం. అలాంటప్పుడు అతడు నీవాడుకాక మరేమవుతాడు? ఈ లోకాని

కందని పవిత్ర ఆత్మలు మీవి. అవి కలిసినతర్వాత ఈ ఐహికవాంఛలకు ఆశించడమెందుకు?" ఊరడించింది అదే మనసు.

# 28

సాయంకాలం సింగారించుకొని భర్తకెదురుగా వెళ్ళి చిరునవ్వుతో స్వాగతం చెప్పాలనుకుని త్వరత్వరగా ముస్తాబు ముగించుకొంది వసంత. కానీ ఎందుకో అందుకు మనసు అంగీకరించలేదు. తీరా అక్కడికి వెళ్ళితే నిరాదరణ తనపాలిట పడితే? దుర్భరంకదూ? అంతకన్నా ఊరుకుండడమే మేలు. నిశ్చయించుకుంది వసంత.

ఆదరణకు ఆనందించే హృదయం నిరాదరణకు నిలువలేకుంటే ఎలా? ఆశకు లోబడ్డనాడు నిరాశను భరించాలి. అది చేతకానప్పుడు ఏ ఆదరణనూ ఆశించకూడదు, ఏ ఆశకూ లోబడకూడదు, కానీ మానవుల మనస్సు అంత స్థిరంగా ఉండదు. అయాచితమైన ఆనందంలభిస్తే అందుకునేవిధం తెలియని అసహాయత వారి నావరిస్తుంది.

క్రింద కారువచ్చిన చప్పుడయింది. గుండెల్లో తెలియని ఆనందం, భయం. హృదయంలో చిలిపిగా గంతులువేసే కోరిక. లేచి వెళ్ళమంటూంది. అభిమానానికికూడా ఆస్కారంలేని పట్టుదల ఆపని చెయ్యనివ్వలేదు. అడుగులచప్పుడు దగ్గరపుతున్నకొద్దీ ఆత్రుత హెచ్చుతూంది. ఉత్సాహం పెరుగుతూంది. లేచింది. కానీ అడుగు ముందుకు పడలేదు.

గదిలోకి అడుగుపెట్టిన రాజ్ ఒక్కక్షణం ముస్తాబై ఉన్న వసంతను చూశాడు. కళ్ళు చెదిరిపోయే అందం. కానీ అందుకోకూడదనే నిస్సహాయత. ఆమె చూపులు అతడి దృష్టిని మళ్ళించాయి. వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. మొహంపై చిరుచెమటతో బూట్లు విప్పుకొంటున్న అతన్ని చూసింది వసంత. ఆపని తానుచేసి తనపైట చెరుగుతో ఆ చిరుచెమటను తుడిచివేసే? కానీ ఏదో శ కి అడుపడుతూంది. తన

నిస్సహాయతకు ఏడవాలనిపించింది. కానీ ఎదురుగా ఉన్న భర్తముందు చులకనై పోతాననే భయం.

అందమైన పూలతోట. అందులో ఎత్తుగా, ఆకర్షణీయంగా పెరిగిన గులాబీ! దానిచుట్టూ ముళ్ళకంప. ఆ కంపకు యింటిచుట్టూ కాంపౌండు గోడ అడ్డు. అందరూ తేరిచూడలేని పువ్వు. చూడగలిగినవారికి అందని పువ్వు. అందుకోగలిగినవారికది చేతకాకనో, అక్కరలేకనో? చూడగానే ఉవ్విళ్ళూరించే ఆకర్షణ. ఆ ఆకర్షణకు లొంగి అనుభవించ లేకపోతున్నామనే బాధ.

ఏదో మాట్లాడాలనే ఇద్దరికీ ఆశ. కానీ మూగపోయాయి ఆ హృదయాలు.

దుస్తులు మార్చుకొంటూనే ఆమెను గమనించాడు. ఎక్కడికో బయలుదేరదామనే ఆ అలంకరణ చేసుకొందని గ్రహించగలిగాడు. మరి ఎందుకో ఆ ఆలస్యం? తోడు కావాలనా? అందుకు భిడియమా? అభిమానమా? రెండింటిలో ఏదైనా తనదిగా వర్తించుకోగలడు. మొదటిది సహజం. రెండవది అసహజమైనది. నవ్వువచ్చింది.

"అలా బయటికొస్తావా, వసూ?" అడిగాడు రాజ్.

ఎగిరి గంతేసింది వసంత హృదయం. తను అడగవలసినది అతడే అడుగుతున్నాడు. మరి ఇంకా ఎందుకాలస్యం? సంతోషంతో తన అంగీకారాన్ని తెలుపవచ్చుగా? అదే ఆలస్యమయింది. అదేత్వరగా చెప్పలేకపోయింది. మౌనం వహించింది.

"సరే"నని నిట్టూర్చి వెళ్ళిపోయాడు రాజ్.

ఖస్సుమని బుసకొట్టింది ఆ హృదయం. ఒక్కపరుగున వాకిలి వరకూ వచ్చింది. క్రిందికి వెళ్ళిపోతున్నాడు. "ఏమండీ!" అని పిలవాలనుకొన్న ఆ మాట ఆ నాలిక చివరనే ఆగిపోయింది. తిరిగి బాల్కనీలోకి వచ్చి వీధిలోకి చూసింది. కాంపౌండు గేటుదాటి వీధిలోపోతున్న రాజ్‌ను చూసింది. హుందాగా నడిచిపోతున్నాడు. వసంత కళ్ళమ్మట రెండు కన్నీటిచుక్కలు జారాయి. తుడుచుకొని క్రిందికి దిగింది.

సముద్రపు ఇసుకలో కూర్చొని పిచ్చిపిచ్చి గీతలుగీస్తూ ఆలోచిస్తూంది వసంత. మనసులో తుఫానే రేగుతూంది. పెళ్ళయి నెలదాటిపోయినా ఒక్కనాడైనా భర్తతో మనసిచ్చి చనువుగా మాట్లాడి వుండలేను. ఎందుకీ బ్రతుకు? ఎలా ఈ ఒంటరితనం భరించడం? దీనికి విముక్తే లేదా? చుట్టూ చూసింది. దూరంగా కొన్నిజంటలు నడిచి వస్తున్నారు. మరికొన్నిజంటలు ఖులాసాగా కబుర్లుచెపుతూ నవ్వుతూ గడుపుతున్నారు. వారి అనందం తనకు లేదు. ప్రక్కన చూసింది. అక్కడ రాజ్‌ను ఊహించుకుంది. అప్పుడు అక్కడవున్న వారినందరినీ జయించిన గర్వం. కానీ ఆ ఖాళీస్థలం, ఆ వెలితి. చివుక్కుమనిపించింది.

తలెత్తి చూసింది. అటుగా పోతున్న ఒక వ్యక్తిని చూసి "మూర్తీ" అని పిలిచింది.

ఆ వ్యక్తి వెనుదిరిగి చిరునవ్వుతో ఆమె దగ్గరికి వచ్చాడు.

"ఏం, వసంతా, ఒంటరిగా ఉన్నావు?"

ఎత్తిపొడుపు కనిపించింది. కప్పిపుచ్చింది.

"దానికేంగాని, చాలారోజులకు కనిపించావు" అంది. అతనితో మాట్లాడుతూ ఉండిపోయింది. అందులో ఆ బాధను మరిచిపోగలిగింది. ఊరడి కలిగించే తృప్తి—బాధను పోగొట్టే హాయి—చాలనుకుంది.

"వసంతా, పిక్చర్ కెళదామా?"

జవాబివ్వలేకపోయింది, అస్వతంత్రత ఆమె నావరించింది. ఎదురు తిరిగింది. ఏదో భయం ఆవేశించింది.

"భయపడుతున్నావా?" అడిగాడు మూర్తి.

"అబ్బే! నాకేం భయం?" గర్వం ఆమెను అతనివెంట పిక్చర్‌కు తీసుకెళ్ళింది.

* * *

"గోపీ, రాజా కనిపించాడా?" అడిగాడు ఆనంద్.

"లేదురా! అసలీమధ్య వాడిని చూడడమే తటస్థించటం లేదు."

"అయినా ఇప్పుడు వాడిదగ్గర చేరాలంటే భయంగా ఉందిరా! వాడి గంభీరత్వాన్ని చూసి జడుసుకుంటాను అప్పుడప్పుడు. అప్పుడు

మనకు తోడునీడగా ఉండి కవ్వించి కబుర్లుచెప్పి నవ్వించేవాడు వీడేనా అని అనుమానంకూడా వస్తుంది."

"ఏం చేద్దాంరా? పరిస్థితులు. అటువంటివాడు మిత్రుడుగా దొరకడం మన అదృష్టం. వాడివిషయం తలుచుకొంటే గుండెల్లో వ్యధ బయలుదేరుతుంది. పోనీలేకానీ, నువ్వు మీ నాన్నగారిలా వ్యాపారంలోకే దిగదలుచుకున్నావా?"

"మరేం చెయ్యమంటావు? పరీక్ష తప్పాను. ఒకవేళ పాసయినా ఆ పాడు ఉద్యోగాలు చెయ్యలేను. హాయిగా వ్యాపారం చేసుకొంటే ఏ తంటా ఉండదు."

"అవునులే. ఎవరికిష్టమైనది వారి ప్రవృత్తి అనుకోవలసిందే."

"లత పాసయ్యింది. క్లాసు తెచ్చుకుంది గదా? పెళ్ళికాగానే ఉద్యోగం చేయిస్తావా?"

"అది ఆమె యిష్టం. చేస్తానంటే వద్దని చెప్పను. వీల్లేదంటే బలవంతం చెయ్యను. అయినా పెళ్ళికానిదే ఎందుకి ఆలోచనలన్నీ?"

"అదెంతసేపు లేవోయ్! త్వరలో ఆ ముచ్చటా తీరిపోతుంది."

బాల్కనీలో నిలబడి మిత్రులిద్దరూ మాట్లాడుకుంటున్నారు. సినిమాకు వచ్చేవారిని చూస్తూ మాట్లాడుకుంటూ కాలం గడపడం వారికి సరదా—అలవాటు.

"ఒరేయ్ గోపీ, అక్కడ వచ్చేదెవరో చూడు." గోపీ అప్పుడే థియేటరులోకి ప్రవేశిస్తున్న వసంతనూ, మూర్తినీ చూశాడు.

"ఆ ప్రక్కన వాడు ఎవడ్రా?" అన్నా దర్ధంకాక.

"ఉన్నాడులే. వాడొక వెధవ. ఒకసారి మా అమ్మను ఏమో అన్నాడట; ఊరుకొంది. ఆదేపనిగా ఏడిపించడం మొదలుపెట్టాడు. ఒకసారి బాగా చితకదన్నాను. పీడ వదిలింది. అప్పుడు రాజాకూడా ప్రక్కనే ఉన్నాడు. అయినా ఈ మహాతల్లికేం పోయేకాలం? వీడివెంట తిరుగుతోంది. ఛ!" అని అప్పుడే బాల్కనీలోకి ప్రవేశిస్తున్నవారిని చూసి తల త్రిప్పేసుకొన్నాడు.

గోపి మరేం మాట్లాడలేకపోయాడు. వీరిని చూసింది వసంత.

గతుక్కుమంది. నేరక పీరికంటబడ్డానే. ఏం జరుగుతుందోనని భయ పడింది. ఆనంద్‌ను చూసిన మూర్తి పంచినతల ఎత్తలేదు. వారు లోపలికి పోగానే ఆనంద్ కోపంతో పళ్ళు పటపట కొరికాడు. వారిహృదయాలు బాధతో సుళ్ళు తిరిగాయి.

రాత్రి పదిగంటలవుతుండగా రాజ్ మామగారి గదిలో వారితో చదరంగం ఆడుతూ కూర్చున్నాడు. ఆటకట్టిపెట్టి "నా ఒంట్లో ఏం బాగుండడం లేదీమధ్య. అందుకని రేపే ఆ పని పూర్తిచేయాలనుకొంటు న్నాను. నా నిశ్చయం నేను పూర్తిచేయకముందు అమ్మాయితోకూడా ఒక సారి మాట్లాడాలి. పిలు" అన్నారు ఆనందరావుగారు.

ఆయన ఉద్దేశ్యం గ్రహించాడు రాజ్. విల్లు వ్రాయడానికి తాప త్రయం పడుతున్నాడు అని అతనికి తెలుసు.

"వసంత పైన నిద్రపోతున్నట్లుంది. మీరూ పడుకోండి. రేపు మాట్లాడవచ్చు" అన్నాడు.

"సరే. ప్రొద్దుపోయింది. నువ్వెళ్ళి పడుకో" అని ప్రక్కపై మేను వాల్చారు ఆనందరావుగారు.

రాజ్ బయటికివచ్చాడు. గదిప్రక్కనే అప్పుడే ఎక్కడినుండో తిరిగివచ్చి పీరిమాటలు వింటున్న వసంతను చూశాడు. ఏమైనా అంటా డేమోనని భయపడింది. కానీ అది తనతత్వమే కాదన్నట్లు వెళ్ళి పోయాడు రాజ్ పైకి. తండ్రితో తనబాధంతా చెప్పుకోవాలనిపించింది. కానీ ఏం చెప్పగలదు? తనను పల్లెత్తుమాట అననివారిపై ఏం తప్పు చూపించగలదు? తనను దండించడంలేదని చెప్పగలదా? అతన్ని కవ్వించి కోపాన్ని తెప్పించాలని అతని వెనుకేపోయింది.

"నాన్నతో అబద్ధం ఎందుకు చెప్పారు?

"తర్వాత చెప్తానుగానీ, వంటలక్క పాపం నీకోసం ఎదురు చూస్తూ కునికిపాట్లు పడుతోంది. వెళ్ళి భోజనం చేసిరా."

"నాకూ నా ప్రశ్నకు సమాధానం కావాలి." కోపమొచ్చింది రాజ్‌కు. నిగ్రహించుకొన్నాడు.

"నిజంచెప్పడం నాకిష్టంలేదు గనుక."

"ఎందుకని?"

"అది నేను చెప్పలేను. నీకంత యిష్టమైతే వెళ్ళిచెప్పి వస్తాను."

"ఏమిటా మొండి సమాధానం?" గద్దించింది వసంత ఓర్పు నశించి.

ఎంత దురుసుగా మాట్లాడినా ఏమనదే, ఎలా చావడం అని ఏడుస్తూంది ఆమె మనసు.

ఆ గద్దింపు విని కోపంగా చూశాడు రాజ్. అంతే. అక్కడినుండి తిరిగిచూడకుండా వెళ్ళిపోయింది వసంత.

# 29

"రజీ, ఐ. ఎ. ఎస్" పరీక్ష పాసయ్యాను. పదిహేనో తారీఖున ఇంటర్వ్యూకి కెళ్ళాలి."

"వెరిగుడ్. ఇంతకన్నా శుభవార్త ఇంకేం కావాలి?"

"అంతా నీ ప్రోత్సాహమే, రజీ. లేకుంటే నేనసలు పాసయ్యేవాడినికాదు."

"మళ్ళీ మొదలుపెట్టావా ఈ మాటలు?"

"పోనీలే. రోగులకు మందులో రంగునీళ్ళు కలిపి డబ్బు బాగా ఆర్జిస్తున్నావా?" నవ్వుతూ అడిగాడు రాజ్.

"ఆ. దినానికి వెయ్యిరూపాయలు. నీకూ కావాలా?"

"ఆ డబ్బు నా కొద్దులే. దాన్నిచూస్తేనే భయం. మీ నాన్నగారు ఎప్పుడొస్తారు?"

"ఆయనగారు రారట. అక్కడే ఆయనకు మనశ్శాంతి దొరికిందట. ఏం చాదస్తమోగానీ ఊళ్ళు తిరిగితే మనశ్శాంతి దొరుకుతుందా, రాజ్!"

"ఎవరి అభిప్రాయాలు వారివి. ఇప్పుడు నువ్వు ఒంటరిదానివయ్యావన్నమాట."

"అదెలా? నువ్వెప్పుడూ నాతోనే, నాలోనే ఉంటావుగా?"

నవ్వుకొన్నా రిద్దరూ.

"రజీ, నాదో కోరిక."

"అదే వద్దన్నాను. ఆజ్ఞాపించే అధికారం నీకెప్పుడూ ఉంది."

"ఆ అర్హత పోగొట్టుకొన్నాను. నువ్వు పెళ్ళిచేసుకోవాలి." సూటిగా చెప్పాడు. ఉలిక్కిపడింది రజియా. దాన్నిగురించి ఇంతవరకూ తాను ఆలోచించలేదు. అసలు మరిచిపోయింది. అనుకుంటేనే భయం గొలిపేమాట—పాతస్మృతులను మతికి తెచ్చే విషయం—అనుభవించ లేని ఆనందాన్ని ఎందుకు తిరిగి అందుకోకూడదనే ప్రశ్న—ఆమెను తికమకపెట్టాయి.

కానీ అది తనకు సాధ్యంకాదు. అయిందేదో అయింది. జీవితంలో ఒకేసారే ఒకరికే మనసిచ్చింది. దాన్ని మళ్ళించుకోలేదు. అందువల్ల ఎవరికీ శాంతీ, సౌఖ్యమూ ఉండవు. మరొక అమాయక ప్రాణిని హింసించాలి. ఆ తుఫానులో అంచెలంచెలుగా వచ్చే ఎదురుగాలిని ఎదుర్కోలేదు. అది చేతకానిపని. ఇంత త్వరలో మరొకరిని పెళ్ళిచేసుకోవడం—వారికి తనువునేకాక మనసునుకూడా అర్పించటం-ఇదంతా అసంభవం. అందువల్ల మరొకరిని అన్యాయం చేయడంతప్ప సుఖంగా గడపలేని రోజులూ—వాటిని మననం చేసుకుంటూ తిట్టుకొనే మనసులూ—వాటి ఆధారంతో మొండిగా జీవించే బ్రతుకులూ—ఆ బ్రతుకులనుచూసి ఎగతాళిచేసే మనుష్యులూ—అటువంటి మనుష్యులతో కూడిన ప్రపంచమూ-ఆ ప్రపంచంలో బ్రతకలేక బ్రతికేజీవితమూ-హుం—అసంభవం.

అడుగడునా అద్దంలా నిలిచే మనస్సూ—దాని తీవ్ర దృక్కుల నుండి తప్పించుకోలేని సంఘటనలూ హృదయాన్ని క్షణక్షణానికి బాధకు గురి చేస్తుండగా తీరనికోరికలను చంపుకొని క్రొత్తకోరికలతో, క్రొత్తపోకడలతో జీవితాన్ని సుఖమనే భ్రమతో గడపడం—ఆధారం లేని నిజాలమీద, సాక్ష్యంలేని మనసుమీదా విరక్తి పుట్టడం సహజం. ఆ విరక్తిలో క్రుంగిపోవడం చేతకానిపని. గత్యంతరం కనబడని అతనికి బ్రతుకులు—అసహ్యించుకుంటూ ప్రేమంటే తెలుసుకోలేక కుళ్ళిపోయే

జీవితం—ఊహించుకోలేని సంఘటనలకు దారితీసే గత స్మృతులు—అనుమాన, అసూయాద్వేషాలతో జీవితంలోని సుఖాన్ని చంపుకొని, మనస్సును రాయిచేసుకొని దారి కానరాక జీవితంనుండి పారిపోవడం. తనకు వద్దు.

"ఏమిటి రజీ, ఆలోచిస్తున్నావు?"

"అది ఇప్పట్లో సాధ్యంకాదు, రాజ్! కానీ జీవితంలో ఒక భర్త అవసరమని తోచినప్పుడు తప్పక చేసుకుంటాను." చెప్పి తల వంచింది.

"అంతేనా, రజీ? నా కోరిక తీర్చలేవా? నా ఆశ నిరాశ కావలసిందేనా?" బాధగా అడిగాడు రాజ్.

"రాజ్, నీ ఆజ్ఞ మీరే శక్తినాకు లేదు. కనీసం నాన్నగారు తిరిగి వచ్చేంతవరకూ వేచివుండాలి కదా?"

నిండుగా నిట్టూర్చాడు రాజ్.

"ఇంతకూ పెళ్ళిఅంటే ఏమిటి, రాజ్? దానివలన లాభమా? నష్టమా?"

* * *

"పెళ్ళంటే నూరేళ్ళ పంటరా! నువ్వు పెళ్ళిచేసుకొంటే వచ్చే నష్టమేమిటి?"

"నాన్నా, పెళ్ళంటే వ్యక్తి స్వాతంత్ర్యానికి ఒక గొడ్డలిపెట్టు. అది మానవుడి మెడకు ఒక గుదిబండ. ఆ పెళ్ళిమాట తలంచుకొంటేనే భయంగా ఉంది. ఆ పెళ్లి చేసుకొని ఆ సంసారంలో కష్టాలననుభవించి విసిగేకన్నా హాయిగా సముద్రంలో ఈద ప్రయత్నించడం మేలు. మనిషిని అన్నివిధాలా మోసగిస్తుంది. వివాహం చేసుకొంటే జీవితంలో ఆనందం—నశిస్తుంది. ఎప్పుడూ ఏదో ఒక బాధ. బాధ్యత నెత్తికి తగులుకొని ప్రాణాలు తోడేస్తుంటాయి. ఏ పని చేయాలన్నా ఆటంకమే. ఎక్కడికి పోవాలన్నా అభ్యంతరమే. ఎద్దు ముక్కుకు ముగతాడు లాంటిది పెళ్లి. వైవాహిక జీవితంలో కష్టాలు చూస్తున్నాను. వద్దు, నాన్నా. నాకా పెళ్లి వద్దు." ఆనంద్ ఖండితంగా చెప్పేశాడు తండ్రితో.

"పొరపడ్డావురా. నాయనా, చాలా పొరపడ్డావు. వైవాహిక జీవితాన్ని గురించి నువ్వు తప్పుగా అర్థంచేసుకొన్నావు. సాంసారిక జీవితంలో కష్టాలనే చూశావు; సుఖాలను చూడలేదు. భార్యాభర్తలు ఆనందంగా తమ జీవితాన్ని గడుపుకొంటూ జీవితాన్ని తమ చెప్పుచేతులలో నడిపించుకొనేవాళ్ళని చూడలేదు. పెళ్ళి—అంటే నూరేళ్ళ పంట అని ఊరికే అనలేదు. ఆ జీవితాన్ని తలచుకొంటే ఒళ్ళు పులకరిస్తుంది. సాంసారిక జీవితంలో ఉండే సుఖం నీకెప్పుడూ ఎక్కడా లభించదు. ఆ కష్టాలలో ఉండే సుఖం, బాధలో ఉండే తియ్యదనం, బాధ్యతలో హాయి, బరువులో సంతృప్తి —అందరికీ లభ్యంకావు. ఆ జీవితం నీకు కొంగ్రొత్త అనుభవాలను తెస్తుంది. కష్టసుఖాలను రెండింటిని కలిపి అనుభవించే తరుణమది. అది నీ స్వాతంత్ర్యానికి ఎప్పుడూ అడ్డురాదు. మరొకరి స్వాతంత్ర్యంపై అధికారాన్నీ,తృప్తినీ ఇస్తుంది. లోటుపాట్లను చవిచూపించే జీవితం. మానవుడికి యౌవనం తక్కువ. ఆ కాలంలోనే పెళ్ళిచేసుకొని సుఖాల్ని అనుభవించమన్నారు. ఎందరు జీవితాన్ని ఆనందంగా గడపడం లేదు?"

"కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లు రత్నంకోసం వెదికితే రాయి దొరికితే పడిన శ్రమకూ, దురదృష్టానికీ కలిసి ఏడవవలసి ఉంటుంది. నువ్వు ఏమైనా చెప్పు. నే నిప్పుడు పెళ్ళి చేసుకోను."

"ఇంకెప్పుడు? ముసలాడివైనాక చేసుకొంటావా?"

"నాకసలు పెళ్ళే అక్కరలేదు. అంతగా అవసరమని తోచిన నాడు చేసుకొంటాను. ముందు అరుణకు పెళ్ళి చేసెయ్యండి."

"ఒరేయ్, నిన్ను ఎం. ఏ. చదివించాను. నీ ఇష్టప్రకారమే వ్యాపారం నీకప్పజెప్పాను. ఇప్పటికైనా ఈ యింటిబాధ్యత నీకప్పగించాలని, నువ్వు పెళ్ళిచేసుకొని పిల్లాజెల్లాతో కాపురం చేస్తుంటే చూడాలని ఉంది. నీ ఇష్టం. ఆలోచించుకో" అని వెళ్ళిపోయాడాయన.

"అన్నయ్యా." అరుణ మెల్లగా అంది.

"అరుణా, నువ్వు చెప్పబోయేది నాకు తెలుసు. కాని వినేస్థితిలో లేను."

"అదికాదు నాన్నా. నే చెప్పేదికూడా కాస్తవిను. చదువు యింకా మూడుసంవత్సరాలుంది. చదువు పూర్తయితే నువ్వు చెప్పినట్లు బావనే చేసుకుంటాను."

"అది కాదమ్మా, సుగుణా. ఉన్నది ఒక్కటే మేనరికం. వాళ్ల తొందరపడుతున్నారు. కాదంటే మనస్పర్థలు. పెళ్ళి నీ చదువుకు ఏమీ ఆటంకం రాదు. నీ చదువు నువ్వు చదువుకో."

"పెళ్ళయితే చదువు సాగదు, నాన్నా."

"ఎందుకు సాగదు? బావ నీకేమైనా క్రొత్తవాడా? నువ్వు చదువు కుంటానంటే వద్దంటాడా?"

"నీ యిష్టం, నాన్నా. నేనేం చెప్పలేను. నీకేది మంచిదని తోస్తే అలాగే చెయ్యి" అని సుగుణ కాలేజీకి వెళ్ళిపోయింది.

ఒక కార్యం తీరిపోయిందన్నట్లుగా తృప్తిగా శ్వాసపీల్చారాయన.

* * *

"గోపీ" అంటూ ఇంట్లోకి అడుగుపెట్టాడు రాజ్.

"రండి" అని ఆహ్వానిస్తున్న శారదను చూసి ఎలక్ట్రిక్ షాక్ తిన్నవాడిలా అయిపోయాడు. నోట మాట పెగల్లేదు. ఇదేమిటి, శారదా అని అడగాలనుకొంటూనే నోరు మెదపలేకపోయాడు.

అడగకూడని విషయం. అర్థంకాని ఆవేదన. హఠాత్సంఘటన. అనుమానించలేని నిజం. కానీ....కానీ ఊహించుకోలేకపోయాడు.

"బావ లోపలున్నాడు. పిలుస్తానుండండి" అని వెనుదిరిగిన శారద అక్కడే ఉన్న గోపీని చూసి మాట్లాడకుండా లోపలికి వెళ్ళి పోతుంది.

పోతున్న శారదను చూసి ఆర్ద్రమయిన కన్నులను తుడుచు కొంటూ వచ్చి సోఫాలో కూర్చున్నాడు గోపి.

"ఏమిట్రా యిది?" తడబడుతూ అడిగాడు రాజ్.

"ఏముందీ? ఎవరు చేసిన ఖర్మకు ఎవరు బాధ్యులు? ఆనాడంత సంతోషంగా తాను వరించిన వరుడిని ఉత్సాహంతో పెళ్ళిచేసుకొంది. నేడు విధి ఆమెపాలిటికి వైధవ్యాన్ని ప్రసాదించింది. అంతే." విర క్తిగా చెప్పాడు గోపి.

"అసలు విషయ మేమిట్రా?"

"అతను ఇంజనీరుగా? ఏదో ప్రాజెక్టుదగ్గర పని చేస్తుండగా ప్రమాదంవల్ల క్రిందపడి మరణించాడు."

"ఊ" అని రాజ్ చేత్తో తల పట్టుకొన్నాడు.

"ఆనాడు నువ్వన్నట్లు పెళ్ళి ఆగిపోయి ఉంటేనే దాని జీవితం బాగుండేదేమో?"

"పెళ్ళిచేసుకొని జీవితంలో ఏమీ సుఖాలు అనుభవించకుండానే విధి ఆమెపట్ల కఠినంగా ప్రవర్తించింది. కోరి పెళ్ళి చేసుకొన్నందుకు ఇదా ఫలితం? ఏమీ అనుభవించకుండానే అన్నీ అనుభవించినట్లు ఈ స్థితికి వచ్చింది. హు. ఎంత క్రూరమైనది విధి!"

"దాన్ని చూస్తుంటే గుండె తరుక్కుపోతోందిరా! లత నా జీవితంలో ప్రవేశించకుంటే శారదను ఇప్పట్లో వివాహం చేసుకొని ఉండేవాడిని. ఈ కారణంగా ఆ వివాహంకూడా వాయిదా వెయ్యదలచుకొన్నాను. ఈ దురదృష్టాన్ని చూడకుండా మామయ్య వెళ్ళిపోయాడు. అదృష్టవంతుడు."

నిట్టూర్పు విడిచాడు రాజ్.

సంతోషకరమైన వార్త వినిపిద్దామని వస్తే చావుకబురందింది. లత పెళ్ళివిషయం నిశ్చయించాలని వస్తే ఆ ఆశే వదులుకొంటే మంచిదనిపిస్తూంది.

"నీకో శుభవార్త చెప్పాలని వచ్చానురా! నన్ను అసిస్టెంటు కలెక్టరు ట్రెయినింగుకు రమ్మని ఆర్డర్సు వచ్చాయి. ట్రెయినింగుకు గుంటూరు కెళ్ళాలి."

"వెరిగుడ్. నా ఆప్తమిత్రుడివి. నువ్వు కలెక్టరువు అవుతూంటే నాకు అంతకన్నా సంతోషమైన విషయ మేముందిరా!" పొంగిపోయాడు గోపి.

ఆ రాత్రి పడకపై కూర్చొని ఆలోచించుకుంటున్నాడు రాజ్. అతని దృష్టిలో గోపీ మెదులుతున్నాడు. ఒకవైపు దీనపుచూపులతో శారద నిలబడి ఉంది. మరొకవైపు లత ఆనందంతో చూస్తూ ఉంది.

ప్రపంచం శారదను కనీసం కన్నెత్తయినా చూడటంలేదు. అలాగే ప్రపంచాన్ని తలెత్తి ధైర్యంగా చూసే ధైర్యం శారదకు లేదు. ఆ అధికారం ఆమెకు లేకపోయింది. లత లోకంచేత చూడబడుతూంది. లోకాన్ని ధైర్యంగా చూస్తూ చిరునవ్వులు చిందిస్తూంది. ఆమె కెప్పటికైనా ఈ లోకంలో ఒంటరిగా బ్రతికే అర్హతవుంది. కానీ శారద — ఆమెకు ఆ అర్హత లేదు, అదృష్టమూ లేదు. ఒక తోడు కావాలి. ఆమెకున్నది ఒక్కటే తోడు. అదే గోపి. కానీ గోపి లతకు స్వంతమైపోతున్నాడు. గోపీ ఆసరాలేకున్నా లత జీవించగలదు. కానీ శారదకు అది చేతకాదు. చేతనైనా లోకం ఆమెనలా బ్రతకనియ్యదు.

అలాగే ఆలోచనలతో సతమతమవుతూ ప్రక్కపై మేను వాల్చాడు. నిద్రపట్టక అటూ ఇటూ దొర్లినాడు.

"ఏమండీ!" అన్న పిలుపు వినిపించి వసంతను చూశాడు. దీనంగా తననే చూస్తూంది.

ఆమె పిలిచిందనుకొని "ఏమిటి, వసూ" అన్నాడు సౌమ్యంగా.

ఆ గొంతువిని మరీ దిగజారిపోయింది వసంత. అందులో తనపట్ల కాఠిన్యమూ లేదు, ద్వేషమూ లేదు. ప్రేమ నిండుకొని ఉంది.

"నేనంటే నీ కిష్టం లేదా?"

అర్థంలేని ప్రశ్న ఆశ్చర్యాన్నే ఇచ్చింది.

"అని ఎవరు చెప్పారు?"

"మరి ఒకనాడైనా నన్ను చేరదీసి లాలించకుండా దూరంగా ఉంటారెందుకు?"

చెప్పలేని జవాబు. నవ్వు వచ్చింది రాజ్‌కు. చిన్నగా నవ్వాడు. అతన్ని పెనవేసుకుపోయింది వసంత.

ఆ రాత్రి అతనికి ఏమేమో చెప్పి తనివితీరా ఏడవాలనిపించింది. అతనితో మాట్లాడుతూ ఎప్పుడూ అతని తియ్యని మాటలు వింటూ కూర్చోవాలని ఇష్టంగా ఉందని అతనితో చెప్పాలనిపించింది తహతహలాడే ఆమె హృదయానికి. తన ప్రవర్తనకు క్షమాపణ వేడుకొని ఇంకెప్పుడూ అతనితో శాశ్వత సుఖాలు అనుభవించాలని నిశ్చయించు

కొంది. కానీ ఏ ఒక్కటీ చెప్పలేకపోయింది. ఏదీ చెయ్యలేకపోయింది. ఆ బలమైన కౌగిట్లో, ఆ లాలనలో మధురక్షణాలతో సుఖనిద్రతో ఆ రాత్రి గడిపింది.

ఉదయమే లేచాడు, ప్రక్కనే ఇంకా నిద్రపోతున్న వసంతను చూశాడు. చిరునవ్వు గులాబీపెదాలపై చిందులాడుతుండగా నిద్రపోతూంది. ఆ అందమైన పెదాలను ముద్దుపెట్టుకోవాలనిపించి ఆ పనే చేశాడు.

ఉత్సాహంతో లేచాడు. ఎన్నడూలేని ఉత్సాహం, అంతులేని ఉత్సాహం.

"అమ్మాయ్, మరి ప్రయాణానికన్నీ సిద్ధంచేసుకొన్నావా?" అడిగాడు ఆనందరావుగారు.

వసంత భర్తను చూసింది. పేపరు చదువుకొంటూ ఓరగా తన వైపు చూస్తున్నాడు.

"నేను ఈ ఊరు విడిచి ఎక్కడికీ వెళ్ళలేను, నాన్నా!"

"వసంతా!" గట్టిగా అన్నారు ఆనందరావుగారు.

"క్షమించండి నాన్నా! అంతే."

"ఛ" అని బాధతో అక్కడినుండి వెళ్ళిపోయా రాయన.

"వసూ!" పిలిచాడు రాజ్.

"ఊ!" అని వెనుదిరిగింది.

ఆమె భుజాలపై చేతులుంచి ఆ కళ్ళలోకి సూటిగా చూశాడు. తల వంచుకొంది వసంత.

"నువ్వు నిజంగానే అంటున్నావా ఈ మాట?"

జవాబు చెప్పలేకపోయింది. అతనితో వెళ్ళిపోవాలని ఉంది. కానీ ఏదో పెంకితనం. అర్థంలేని స్వాతంత్ర్యం. బలవంతం చేస్తారనే ఆశ—ఆకాంక్ష.

"ట్రెయినింగు అయిపోతే అక్కడే పనిచేయవలసి ఉంటుంది." ఆలోచించుకొనేందుకు అవకాశం. కానీ అది కాదు తనకు కావలసింది. అధికారపూర్వకమైన ఆజ్ఞ కావాలి."

"నా వెంట రావడం నీ కిష్టంలేదా?"

"ఊహూ."

అప్పటికయినా కోపంతో ఎందుకు రావు అని అడుగుతాడని ఆశించింది. అది జరగలేదు.

"సరే, నీ ఇష్టం." వెళ్ళిపోయాడు.

అర్థంకాని తత్వం. రాత్రే అంతులేని ఉత్సాహాన్నిచ్చింది. అంతలోనే ఆ ఆశను చంపేస్తూంది. అడుగంటా నాశనం చేస్తూంది. బహుశా తన కోరికలు తీర్చుకోవడానికి అది ఒక ఎత్తేమో? కావచ్చు. కాకపోనూవచ్చు. సందిగ్ధావస్థలో సమస్యలను సృష్టిస్తూంది. అధికారం చెలాయించకూడదు. అది చేస్తే అనర్థమే దాపురించవచ్చు. మధ్యన మామగారి మనసు నొప్పిపడవచ్చు. అందుకే గత్యంతరంలేక తన పనిలో నిమగ్నుడై పోయాడు రాజ్.

*　　　*　　　*

రాజ్ వెళ్ళిపోయినప్పటినుండి రజియా మనసే లోపించింది. డిస్పెన్సరీలో కూర్చున్నా మెదడు పనిచెయ్యదు. ఒంటరిగా కూర్చుంటే అవే ఆలోచనలు. క్రొత్త ఊళ్ళో భోజనసౌకర్యం సరిగ్గా అమరిందో లేదోననే ఆవేదన ఆమెను వెన్నాడుతుంది.

సాయంకాలం ఒంటరిగా తను సాంకేతిక స్థలానికి పోయి కూర్చుంటే పరిసరాలు తన ఒంటరితనాన్ని గేలిచేస్తున్నాయి. సముద్రుడు వెక్కిరిస్తున్నాడు. రాజ్ ప్రక్కన లేకుంటే ఆ ప్రదేశమంతా నిర్జనమై నిస్సారమై, నిరుత్సాహంగా ఉన్నట్లు తోస్తుంది. క్రిందనున్న ఇసుక చేతిలోకి తీసుకొంటే ఆ ఇసుక రేణువులలో అదే స్వరూపం. ఏపని చేయాలన్నా అదే రూపం జ్ఞాపకం వస్తుంది. నిద్రపోవాలనుకుంటే కన్నులలో మెదలుతుంటాడు. ఒక పని చేయాలని అనిపించదు. ఊరికే కూర్చోవాలనీ అనిపించదు. క్షణక్షణానికీ ఆ మొహం, ఆ మాటలూ జ్ఞాపకానికి వచ్చి కలవరాన్ని రేపుతాయి. ఒంటరిగా కూర్చున్నప్పుడు అడుగుల చప్పుడు వినిపిస్తే అతడేనేమోనని జాగ్రత్తగా వింటుంది. తిరిగి నిరాశ. అదే నిరుత్సాహం. అప్పుడప్పుడు 'రజీ' అని పిలిచినట్లయి ఉలిక్కి

పడుతుంది. ఎందుకు తనింత బేలై పోతూంది? తన హృదయాన్ని ఇంతగా వశపరుచుకుని తన ప్రభావాన్ని చూపిస్తున్నాడు.

ఆ భావాలనంతా ఉత్తరాల్లో వెళ్ళగ్రక్కుతూంది. "రాజ్, నువ్వు ఎప్పుడూ నా కనులలో మెదులుతుంటావు. నీ రూప మెప్పుడూ నా హృదయంలో వెలుగుతూంటుంది. కానీ నిన్ను చూడాలని నా కళ్ళు, నీ మాటలు వినాలని నా హృదయం ఎప్పుడూ తహతహలాడుతుంటాయి. దీనికి విముక్తి ఎప్పుడో!"

మనిషి విలువ దగ్గరగా ఉన్నప్పటికంటె దూరంగా ఉన్నప్పుడే పెరుగుతుందన్న విషయం వసంత విషయంలో నిజమయింది. భర్త వెళ్లిపోయినప్పటినుండీ ఏ పనీ చెయ్య బుద్ధిపుట్టదు, అలంకరించుకోదు. ఎవరికోసం అలంకరించుకోవాలని ఎదురుతిరుగుతుంది మనసు. అప్పుడప్పుడు భర్త దగ్గిరికి వెళ్లిపోవాలని నిశ్చయించుకొంటుంది. కానీ తండ్రి ముందు ఆ విషయం చెప్పడానికి అభిమానం అడ్డువస్తుంది. ఎప్పుడూ మనసులో రగిలే బాధ తీరడమెలా? ఎంతో ప్రీతిగా భర్త ఉత్తరాలు వ్రాశాడు. జవాబు వ్రాయాలనుకొంటూనే వ్రాయలేకపోయింది. ఆ ఉత్తరాలు రావడం లేదు.

ఆ బాధనుండి తప్పించుకోవడానికి క్రొత్తస్నేహితులను సంపాదించుకొంది. ఉదయం లేచి, వారితో కబుర్లు చెప్పుకోవడం, సాయంకాలం టెన్నిస్ నేర్చుకోవడం పరిపాటయింది. మొదట మహిళామండలికి వెళ్లింది. కానీ అక్కడ సూటీపోటీ మాటలనూ, విమర్శలనూ భరించలేక టెన్నిస్‌క్లబ్బులో చేరింది.

అక్కడే సురేష్ అనే ఒక యువకునితో పరిచయమయింది. సురేష్ మునసబు. అందగాడు, అభిరుచులు గలవాడు. ఇంకేం కావాలి? స్నేహం అధికమయింది. ఆ బాధను మరిచిపోవడానికి ఈ ఆనందం కావాలి అనుకొంది.

పిచ్చి ఊహ, పిచ్చి అభిప్రాయాలు, అభిరుచులు. వీటిలో పడి కాలం సాగిపోతుంది. తప్పు కప్పిపుచ్చాలని మరో తప్పు మానవ యత్నం. అర్థంలేని ఆనందం. అక్కరకురానిఆత్మవిశ్వాసం.

నలుగురూ నాలుగురకాలుగా అనుకొన్నారు. లెక్కపెట్టడం అల వాటు లేదులాగుంది.ఆ ఎత్తిపొడుపులను ఎదురించాలనే చేతకానిధీరత్వం నలిగిపోయింది. నలుగురి కాలక్షేపానికి పాలుపడ్డారు. అది వారికి ఆటంకం కాదు. అదిలించే ఆప్తులు, దండించే పెద్దలు లేనివారికి అధో గతే ప్రాప్తం. కూతురిని మందలించినా ఫలితంలేక కుమిలిపోయారు ఆనందరావుగారు.

మామగారికి ప్రమాదం అన్న టెలిగ్రాం చూచి ఉన్నపాటున రైలెక్కాడు రాజ్. సెకండ్ క్లాసులో కూర్చున్న అతనికి మనశ్శాంతి లేకపోయింది. హౌరా మెయిల్ చిన్నగా పోతుందేమిటా అనుకొన్నాడు.

ఎదురుసీట్లో ఎవరో కునుకుపాట్లు పడుతున్నారు. అతని చేతిలో పత్రిక ఉండనా పోనా అంటూ ఊగుతోంది గాలికి. గాలికి ఆ పత్రిక రాజ్ కాళ్ళకు చుట్టుకొంది. దాన్ని తీసి ప్రక్కన పెడుతూ దానిపై ఉన్న ఫోటో చూసి క్రిందపడబోయాడు. సంబాళించుకొని తిరిగి చూశాడు 'పిడుగు' వార పత్రిక. విమర్శక పత్రికలలో పేరొందిన వారపత్రిక.

పెద్దపెద్ద అక్షరాలతో 'ఆనందంకోసం తహతహలాడే అందాల విలాసిని' అని ఫోటో ఉంది. వసంత.

"వయసు ఉంది. ధనముంది. అందులో అందరినీ మించింది. గౌరవం, హోదాలకు లోటులేదు. కానీ కావలసింది అది కాదంటూ భర్తనూ, కన్నతండ్రినీ మోసంచేసి అర్థంలేని ఆనందాలకు పోయి మోస గింపబడుతూంది...."

ఇక చదువలేక ఆ పత్రికను విసిరికొట్టినాడు రాజ్.

దానిలోని నిజానిజాలకన్నా జరిగిపోయిన అవమానం బాధపెడు తూంది. నలుగురిలో తలవంపులు. సమాజంలో వేలెత్తి చూపబడ్డ ఈ వార్త వినే కాబోలు ఆ ముసలిప్రాణానికి అపాయం.

అల్లుడిని చూసిన ఆనందరావుగారు ఆఖరుక్షణాల్లోకూడా సంతృ దంగా నవ్వారు.

"నే వచ్చాగా మామయ్యా? మరేం భయంలేదులే." ఓదార్చ ప్రయత్నించాడు రాజ్.

"ఇంకా ఎందుకోయ్ భయం? అది తీరిపోయింది."

"రాజ్ ఏమీ మాట్లాడలేకపోయాడు.

"శేఖరం, నేను నీకు అన్యాయంచేశాను. పండువంటి నీ బ్రతుకు నాశనం చేశాను. అందుకు ఇప్పుడు బాధపడుతున్నాను. నీకన్యాయం చేసినందుకుగాను నాకు భగవంతుడు తగిన శిక్ష విధించాడు."

"మామయ్యా! ఇప్పుడా గొడవంతా ఎందుకు? మాట్లాడకుండా పడుకోండి."

"కాదు, నన్ను మాట్లాడనివ్వు. వంశగౌరవం, పరువు ప్రతిష్టలూ అన్నీ మట్టిలో కలిసిపోయాయి. అందుకు చింతలేదు. నిన్నూ, నీపై ఆధారపడ్డ మరొకరినీ గొంతు కోశానే అనేబాధ అంతిమ ఘడియల్లో నన్ను పీడిస్తోంది. దైవస్వరూపుడవైన నీకు బలవంతంగా ఒక రాక్షసిని అంటగట్టాను."

"మామయ్యా!"

"ఉష్. నువ్వు మాట్లాడకు. నాకు అంతా తెలుసు. నువ్వు వసంతను ద్వేషిస్తూ ఉండేవాడివని నాకు తెలుసు. కానీ స్వార్థం దాన్ని ఆలోచించనియ్యలేదు. ఆనందమయం కావలసిన నీ జీవితం నా స్వార్థానికి బలిపెట్టాను. మీ ఇద్దరినీ విడదీశాను. ఆ పాపానికి నాకు ప్రాయశ్చిత్తం లేదు. పువ్వులపొదలోవున్న నిన్ను ముళ్ళకంచెలోకి విసిరేశాను. ఎందుకు? నా కూతురు సుఖంకోసం. దాని భవిష్యత్తుకోసం. కానీ కొన్ని జీవితాలను మార్చేశక్తి మనకు లేదనే సత్యం తెలుసుకొన్నాను. కానీ, శేఖరం...."

"మీరు విశ్రాంతి తీసుకోండి, మామయ్యా, తర్వాతమాట్లాడుదురు గానీ."

"విశ్రాంతి త్వరలోనే లభిస్తుందిలే. నువ్వు నాకొక మాటివ్వాలి?"

"చెప్పండి, మామయ్యా!"

"దానికి మంచి చెడులూ ఇంకా తెలియవు. నువ్వు ఎప్పటికీ దానికి అన్యాయం చెయ్యకూడదు."

ఆ కోరికవిని ఏమి జవాబుచెప్పాలో తోచలేదు.

తనపై ఎంత జాలి చూపించినా తిరిగి అదే స్వార్థం. అదే మమత. విచిత్రమైన స్వార్థం. అందుకేనేమో మానవుడిని మించిన స్వార్థం ఎవరిలోనూ లేదన్నారు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు? మళ్ళీ స్వార్థపూరితమైన కోరికనే కోరుతున్నాడే అని బాధపడుతున్నావా?"

"కాదు, మామయ్యా! నేనూ మనిషినే. నాలో ఓర్పుకూ, సహనానికీ హద్దువుంది. మంచితనం మితిమీరితే ఆపదలపాలు కావలసివస్తుంది. మానవసహజమైన గుణాలను అధిగమించడానికి నేను దేవతనుకాను. కానీ మామూలుకన్నా ఎక్కువగా సాధ్యమైనంతవరకూ మీరు కోరినట్లే చేస్తాను. కానీ సమయం మించిపోయినపుడు నేనుమాత్రం చేయగలిగింది ఏమీ వుండదు!"

"చాలు. నువ్వు అంతమాత్రం మాటిస్తే చాలు. నీకు సహాయం చేసినందుకుగానూ నిన్ను నా స్వార్థానికి బలిపెట్టినాను. ఎందుకో తెలుసా? నీకు నరకాన్ని స్వర్గంగా మార్చగలిగే శక్తి వుందని నాకు తెలుసు. కానీ అదృష్టహీనుల జీవితాలను ఎవ్వరూ మార్చలేరు. నేడు నా కా కోరిక లేదు. కనీసం ఈ భూమిపై నా బిడ్డ బ్రతకగలిగితే చాలు. నన్ను క్షమించు."

అంతిమఘడియల్లోకూడా తనవారనే మమకారం. మమత విచిత్రం. అన్నీ వదిలించుకుపోవాలనే తాపత్రయం కొందరికి వుండగా తనవారి సుఖజీవనానికి కట్టుదిట్టాలు చేయాలనే ఆపేక్ష మరికొందరిది. అంతలోనే స్వార్థం; అంతలోనే నిస్స్వార్థం.

"మీరు నెమ్మదిగా కళ్ళు మూసుకు పడుకోండి."

"అవును. అదిగో నాకోసం పిలుపు వస్తోంది. ఇక నాకిక్కడ పనిలేదు."

శాశ్వతంగా మూతబడ్డాయా కళ్లు.

# 30

"రాజ్, ఎందుకలా దిగులుపడిపోతావ్?"

"ఏం చెయ్యను, రజీ? ఇంట్లో ఒక్క_క్షణం శాంతీలేదు, సుఖమూ లేదు. అండగాఉన్న మామయ్యకూడా కరువైపోయాడు. భార్య స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛనూ ఒకదారికి తీసుకువచ్చే హక్కు_లేని చేతకానివాణ్ణి. నలుగురిలో ధైర్యంగా తలెత్తుకు తిరిగే అర్హత లేనివాణ్ణి. ఎందుకూ కొరగాని దౌర్భాగ్యుణ్ణి. ఏం చూసుకుని ధైర్యంగా ఉండమంటావు?"

"నే నెక్క_డికి పోయాను, రాజ్? నా హృదయంలోనే నీకు శాంతం, సుఖం వున్నాయి అన్నావు. అది జ్ఞాపకం లేదా?"

"నువ్వే లేకుంటే ఎప్పుడో ఈ జీవితంనుండి పారిపోయి ఉండేవాడిని. అప్పుడప్పుడు ఈ బాధ భరించలేక ఎక్క_డికైనా పారిపోవాలనిపిస్తోంది."

"ఛ. అంత బేలవైపోతే ఎలా, రాజ్?"

"ఏం చెయ్యను, రజీ? వసంత దృష్టిలో నేనొక యంత్రాన్ని. స్విచ్ ఆన్‌చేస్తే ఆడాలి, ఆఫ్‌చేస్తే ఆగిపోవాలి. నేను భర్తనన్నమాటే ఆమె మరిచిపోతోంది. ఆమెకోరికలు తీర్చాలి, ఆమె చెప్పినట్లు వినాలి. ఆమెకు కష్టం కలిగించే పని చేయకూడదు. ఆమె ఆనందంకోసం ఆమె చెప్పినట్లల్లా చేసినా తృప్తీ, ఆనందమూ వుండవు. ఆమె ఎప్పుడూ నన్ను అవమానించడానికీ, బాధించడానికీ ప్రయత్నిస్తూంటుంది. అర్థం కాని మొండితనం,పట్టుదల, చిన్నపిల్లలను అడుక్కు_న్నట్లు అడుక్కో_వాలనే అపేక్ష, ఏమన్నా నోరుతెరిచి ఏమీ అనడే అనే ఆకాంక్ష, ఏమైనా అంటే తిరుగుబాటు — ఇదంతా చూస్తూంటే కొరకరాని కొయ్యలా, గుండెల్లో కాపురముండే జ్వాలలా వుంది. అమాయకత్వమూ కాదు, తెలివితక్కు_వతనమూ కాదు. అర్థంలేని గర్వం, ప్రతీకార వాంఛ. ఇవే మెదులుతుంటాయి ఆమె మదిలో. ఎన్నాళ్ళని ఈ జీవితం గడపడం?"

"ఆ విషయాలన్నీ మరిచిపో." అతని బాధను చూడలేకపోయింది రజియా.

"మరిచిపోవడం అంత తేలికయితే నేను ఆపని ఎప్పుడో చేసేసే వాడిని. అన్నట్లు ఈ ఉదయం ఏం జరిగిందో తెలుసా? నన్ను ఇక్కడికే కలెక్టరుగా పోస్టుచేశారు. ముందున్న కలెక్టరుగారు రిటైరు కావడంతో ఆ సందర్భంలో విందుచేశారు. ఆ తర్వాత వారిని ఇంటివరకూ సాగనంపి ఇంటికెళ్లాను. ఎవరెవరో వచ్చి చూసి పోసాగారు. అదిచూసి ఇదేం ధర్మసత్రమా అంటూ కేకలువేస్తోంది. మర్యాదకు వచ్చిన వారికి క్రొత్త కలెక్టరుగారనే అభిమానంతో వచ్చిన వ్యక్తులకు కాఫీ యివ్వడం తప్పయింది. ఆమె నేలా అర్థంచేసుకోవాలో తెలియక చస్తున్నాను."

"నువ్వింక ఇక్కడే ఉంటావన్నమాట. మంచిది. ఇంక ఆ విషయాలన్నీ మరిచిపో. పిక్చర్‌కి వెళ్దాంపద."

కలెక్టరుగారిని చూసిన థియేటరు ప్రొప్రయిటరూ, మేనేజరూ గౌరవంగా లోపలికి తీసుకు వెళ్ళి కూర్చోబెట్టారు. లోపలికి అడుగు పెడుతూ ముందువరుసలోవున్న వసంతనూ, సురేష్‌నూ చూశాడు రాజ్. వీరినిచూసిన సురేష్ కంగారుపడ్డాడు. వసంత నిర్లక్ష్యంగా తల త్రిప్పేసుకుంది.

"మన క్రొత్త కలెక్టరుగా రనుకొంటాను" వెనుకనుండి ఒక గొంతు వినిపించింది.

రాజ్ ఓరగా వెనక్కు చూశాడు. నలుగురు వ్యక్తులు.

"ఔను. వారిప్రక్కనున్న ఆవిడెవరో అర్థంకావడం లేదు"అంది మరో గొంతు.

"వారి శ్రీమతి కాబోలు." మూడవ గొంతు మెల్లిగా పలికింది.

"ఏడిశావు! వీరి శ్రీమతి అదిగో అక్కడ మొదటి వరుసలో ఆ మునసబుగాడితో కూర్చొని కులుకుతోంది చూడు."

"అయితే భార్యను విడిచి తాను ఖులాసాగా వేరే స్త్రీలతో గడుపుతున్నాడన్నమాట."

"నోరు ముయ్యండి. వాళ్ళిద్దరినీ అనవసరంగా అంటే పాపం చుట్టుకొంటుంది. వారు ఎప్పటినుండో ఇలాగే ఉన్నారు. చెక్కుచెదరని స్నేహం, పవిత్రప్రేమ, అర్థంచేసుకోలేకపోయినా విమర్శలకు తక్కువ లేదు. తెలియనప్పుడు నోరుమూసుకొని పడివుండండి. అంతే కానీ ఇలా

పిచ్చిపిచ్చిగా వాగవద్దు" అంది అంతవరకూ మౌనంగా ఉన్న నాలుగో గొంతు.

"సరేలేవోయ్ మహా చెప్పొచ్చావు! మొన్ననగా ఆ 'పిడుగు పత్రికలో పడ్డది ఈ మహాశయుడి భార్య విషయమేగదూ? రేపు పీ( విషయంకూడా పడుతుంది. అంతే."

"ఛీ. మీరు మనుషులుకాదు" అంది అదేకంఠం. వారిమాటలు విన లేక పోతున్నారు రాజ్, రజియాలు.

"ఇంతకూ అంత అందాలరాశిని లోబరుచుకొన్న ఆ సురేష్ అదృష్టవంతుడు."

"ఎంత అందముంటే ఏం ప్రయోజనం? బుద్ధి నీచపు బుద్ధి."

"ఏమిటి భగవంతుడా నాకీ పరీక్ష! నన్ను పరీక్షిస్తున్నావా ఎందుకు నాకీ శిక్ష!" మూగగా వాపోయింది రాజ్ హృదయం. రజియాకు లేచి వారిని ఆ చెంపా ఈ చెంపా వాయించాలనిపించింది. కానీ కారణం తెలిస్తే అందరూ అల్లరిపాలుకాకతప్పదు. కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుంది. ఇక అక్కడ ఒక్కక్షణంకూడా ఉండకూడదనుకొంది.

"లే, రాజ్. వెళ్ళిపోదాం" అంది. మౌనంగా అనుసరించాడు.

"చదువుకొన్నా సంస్కారంలేని మృగాలు!" కసిగా తిట్టింది రజియా కారులో కూర్చుంటూ.

విరక్తిగా నవ్వాడు రాజ్.

ఎవరిమీద తను కోపం చూపాలి? అవమానం కలిగించే వసంతపై కోపగించుకోవాలా? వసంతను లోబరుచుకొన్న సురేష్‌ను అసహ్యించుకోవాలా? అందుకు వేలెత్తి చూపెట్టే సంఘాన్ని చీదరించుకోవాలా? ఇలాంటి పరిస్థితులు కలిగించిన ఆ దేవుడిని తిట్టాలా? ఇటువంటి బ్రతుకు బ్రతుకుతున్న తననే నిందించుకోవాలా? ఏది చెయ్యగలడు? ఏది చెయ్య కూడదు?

"అది వారి తప్పుకాదు, రజీ! అనాదినుండీ వస్తున్న ఆచారం. ఎదుటివ్యక్తుల బలహీనతను ఎగతాళిచేయడం మానవ నైజం. అది వారి కలవాటు. అదే వారికి ఆనందం; కాలక్షేపం కూడా. ఇది ఎప్పటికీ మారదు."

"సారీ రాజ్. మనశ్శాంతికోసం ఇక్కడికొస్తే యిక్కడా ఎదురు దెబ్బే తగిలింది."

"మరేం ఫరవాలేదులే. యింతమాత్రానికే భయపడితే ఎలా? ఇంకా ముందు ముందు చూడాలి. ఏం చూడవలసి వస్తుందో? ఏం వినవలసి వస్తుందో?"

మొండిగా నవ్వాడు రాజ్.

"అబ్బ! ఊహించలేని ఓర్పు. తలుచుకోలేని మొండితనం. అన్నింటినీ ఎదురించి నిలువగలిగే ధైర్యం. ఆత్మాభిమానంపై దెబ్బ తీసే జీవితభాగస్వామి నీచపుచరిత్ర. వీటిని భరించగలిగే మొండిశక్తి. ఏనాడైనా ఇవన్నీ కలిసి ఎదురు తిరిగితే? అప్పుడు రాజ్‌జీవితం ఏమవుతుంది?" ఊహించలేకపోయి కారును నెమ్మదిగా నడుపసాగింది రజియా.

"శారద జీవితం తలుచుకుంటే భయంవేస్తోంది, వదినా!"

"అవును, రాజూ. ఇంత త్వరలో ఆమెపై విధి వక్రించడం శోచనీయం."

"నాన్నతో కొట్లాడి బావను కాదని తానుకోరిన వ్యక్తిని పెళ్ళాడింది. అదృష్టవంతురాలనే అనుకొన్నాం. ఆమె మురిపెం కొన్నాళ్ళయినా నిలువలేదు. ఆమె కోరికలు తీరలేదు. ఆమె సంసారపు క్రొత్త ఆశలపైన మెరుగు యింకా మాయలేదు. అత్యంత రసభరితం కావలసిన జీవితం ఎడతెగని దుఃఖమయం కావడంతో ఆమె లేతహృదయం ఎంతగా పరితపిస్తుందో?"

"ఆనాడు బావను కాదని పెళ్లిచేసుకొన్న ఆమెకు ఇంతలో ఈ వైధవ్యం ప్రాప్తంకావడం చాలా విచిత్రంగా ఉంది బావా!"

"విచిత్రం కాదు, లతా! త్వరపడి తమ నిర్ణయాలకై ప్రాకులాడి పెద్దలమాటలు వినకుంటే ఇంతే అవుతుంది అని దేవుడు ఒక అనుభవాన్ని చూపించాడు. కానీ ఇంత త్వరలో ఆమే ఆ భగవంతుడి పాలనకు బలి అయిందంటే బాధపడకుండా ఉండలేం."

అర్థంకాని నిగూడార్థం. జీవితాన్ని అర్థం చేసుకోమని చెప్పే సందేశం. దాగివున్న నిజం. నమ్మవలసిన సత్యం. ఉదాహరణ చూపించే ప్రయోగం. లోకానికి దిష్టిబొమ్మలా ఉండే జీవిత సత్యం.

"అందువలన ఏమైనా ప్రయోజనముంటుందంటావా, బావా!"

"ఉండాలనే ఆశతోనే అది జరిగింది. ఆమెకు ఆ దౌర్భాగ్యం జరగడం వలన ఆమేకాదు, ఆమె ఆప్తులంతా బాధపడాలి. ఆ బాధను అందరూ అనుభవించాలి. ఒకరితప్పుకు ఒకరే కాదు వారిపై ఆధారపడ్డ వారు కానీ, వారికి సంబంధించినవారు కానీ శిక్షఅనుభవించక తప్పదు."

"ఇప్పుడు ఆమె జీవితం అలా మోడుపోవలసిందేనా, రాజూ?"

"గత్యంతరంలేదు. కానీ ఒకటే ఉపాయం. ఆమె సుఖంకోసం మరొకరు తమ సుఖాన్ని త్యాగం చేయవలసి వస్తుంది. గోపీ ఏమన్నాడో తెలుసా? లతే గనుక నా జీవితంలోకి ప్రవేశించకుంటే నేను శారదను నాదాన్నిగా చేసుకొని ఉండేవాడిని. కానీ ప్రస్తుతం...."అని ఆగిపోయాడు.

అదిరిపడి బావ మొహంలోకి చూచింది లత. పరోక్షంగా ఎవరినో త్యాగం చెయ్యమనే ఉద్బోధ. ఎవరిపట్లనో జాలి. ఎవరిమీదనో విశ్వాసం. అంతలోనే విధిపై అవిశ్వాసం. సందిగ్ధావస్థలో మనసును పీడించే కోరిక.

"శారద అభాగ్యురాలు. ప్రస్తుతం నిస్సహాయ స్థితిలో ఉంది. దేనికీ నోచుకోని దురదృష్టవంతురాలు. ఆమె జీవితానికి ఒకదారీ, ఒక వెలుగూ చూపించి ఆమెకు తిరిగి సంఘంలో, ఈ ప్రపంచంలో పోగొట్టుకొన్న హక్కులను ఇవ్వాలి. అలా చేయగలిగిన వారిజీవితం సార్థకమవుతుంది."

మాటలలోని భావం, మనసులోని కోరికను కొంచెం కొంచెంగా బయటికి చూపిస్తూంది. ఆలోచన అనేది ఉంటే చాలు పూర్తిగా అర్థం చేసుకొని కీర్తి పొందగల మహత్తర సందేశం. అవగతం చేసుకొంటే ఫలితం తప్పక లభిస్తుంది.

"నువ్వుచెప్పింది నిజమే, రాజూ! నిస్సహాయులకూ, అభాగ్య

లకూ విధి క్రూర కోరలపాలిటబడ్డ అసహాయులకూ నిస్వార్థంతో సహాయం చేసినాడు ఈ మానవజన్మే చరితార్థం అవుతుంది.

"శారద ఆధారంలేనిది. ఒకవేళ ఉందనుకొన్నా అది పరాయివారిదిగా కాబోతుంది. ఆ ఆధారాన్ని మనం గ్రుడ్డిగా స్వంతం చేసుకొని అన్యాయం చెయ్యడంకంటె ఆలోచించి ఆమెకే దాన్ని వదిలి పెట్టడం భావ్యం. ప్రయత్నిస్తే మనకు సంఘంలో బ్రతకడానికి మరి కొన్ని హక్కులు, ఆధారాలు ఉన్నాయి. వాటివలన మనం జీవితాన్ని అత్యంత సుఖంగా గడుపుకోలేకున్నా కనీసపు బ్రతుకును బ్రతగ్గలం. అందుకుగూడా నోచుకోని ఆమెకు అన్యాయం చేసే ఆ సుఖం ఉండీ ఒక్కటే, లేకా ఒక్కటే. మన కర్తవ్యం మనం చేయగలిగిననాడే నిజమైన ఆత్మసంతృప్తి, ఆనందం లభిస్తాయి."

స్వరూపంలేని బావమాటలకు ఒకరూపాన్ని ఏర్పరుచుకొంది లత. విధిని చూపుతున్నారు కానీ, చెయ్యమని నిర్బంధించడంలేదు. ఒకరి సుఖంకోసం తహ తహ. మరొకరి త్యాగంకోసం దుఃఖం.

బావను చూసింది. చూపు మరల్చుకొన్నా దప్పుడే. సూటిగా చెప్ప లేని ఆజ్ఞ. ఎదురుగా అడగలేని అభ్యర్థన. నలిగిపోయింది. మనసు, విరిగిపోయింది ఉత్సాహం. నిశ్చయించుకొంది హృదయం.

"వస్తాను, వదినా. వస్తా, లతా!" అని రాజ్ వెళ్ళిపోయాడు. ఆ కడసారిచూపులో సందేశం. అవకాశమిచ్చే భావం.

"బావ చెప్పింది అర్థంచేసుకొన్నావా, లతా?" తల ఊపింది లత. ఎందుకు బావ తనకే ఈ కఠినశిక్ష విధించాడు? తమకన్నా ఆప్తులు లేరు. అటువంటి తనకే సుఖాన్ని వద్దని దుఃఖాన్ని జీవితపు బాటగా స్వీకరించమని నోధిస్తున్నాడు. తనేం తప్పుచేసింది? సుఖంగా జీవించడానికి తనకు కర్హతలేదా? ఎవరికోసమో తన బ్రతుకును పాడుచేసుకోవాలా?

"ఏం నిశ్చయించుకొన్నావు?"

"బావ ఉద్దేశ్యం అక్షరాలా పాటించదలుచుకున్నాను."

"ఆలోచించే అంటున్నావా లేక బావ ప్రీతికోసం ఈ నిర్ణయం చేసుకొన్నావా?"

"లేదక్కయ్యా! ఆలోచించే బావ ఈ మాట చెప్పాడు. మనం ఎంత ఆలోచించినా అంతకన్నా ఎక్కువ తెలుసుకోలేం. విశదంగా వివరించి చెప్పిన నిజాన్నిగురించి బావలాంటివ్యక్తి చెప్పినప్పుడు దాన్ని గురించి ఆలోచించడం బుద్ధితక్కువే అవుతుంది."

"లతా!" దుఃఖంతోకూడిన ఆనందంతో చెల్లిని ఆహ్వానించింది ఇందిర.

ఆ చేతులలో వాలిపోయింది లత.

"లతా! ఈ విధి ప్రహారానికి నువ్వు నిలబడగవా?"

"పొరపడ్డావక్కయ్యా! బావ ఆశీర్వాదమూ, నీ ప్రేమా ఉన్నప్పుడు నేను చిరునవ్వుతో దేన్నయినా ఎదిరించగలను."

"లతా!" ఆనందంతో అరిచింది ఇందిర.

"ఎందుకక్కయ్యా అంత ఆనందం? మనం కీడుచేసినా మనకు మేలు చేసిన బావమాట పాటించకుండా కృతజ్ఞత తెలుపలేని ఈ బ్రతుకులెందుకు? అవీ కాక మనం చెయ్యబోయేదేం నీచమైన పనికాదు. ఒకరి జీవితాన్ని వెలిగించేది. అందుకు గర్వపడాలి. మన కాదారి చూపించాడు. అందుకు అతడికి మనం కృతజ్ఞులం. సరియైన పని చేయడానికి మనం ఎందుకు సిగ్గుపడాలి అని ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్నాను."

* * *

క్రొత్తసంవత్సరం, క్రొత్తకోరికలు, క్రొత్త అనుభవాలు కావాలనే ఆపేక్ష. మిత్రులకు క్రొత్త సంవత్సరపు శుభాకాంక్షలు. అధికారులను దర్శించుకోవడం, చిరునవ్వుతో పరస్పర కరచాలనం, శుభాకాంక్షలు అందజేసి తిరిగి పుచ్చుకోవడం—చాలా హుషారుగా, ఆనందంగా వుంది.

వసంత ఉదయమే లేచి సురేష్‌దగ్గరికి బయలుదేరింది. క్రొత్త సంవత్సరపు శుభాకాంక్షలు తెలియజేసుకున్నారు పరస్పరం.

"క్షమించు, వసంతా! ఇవ్వాళ కాస్త పనుంది."

"ఏమిటది?"

"క్రొత్త సంవత్సరంగా? అధికారులను దర్శించుకోవాలి. మొదట

జిల్లా జడ్జిగారిని, ఆ తరువాత జిల్లా కలెక్టరుగారిని" అని—అదోలా చూశాడు సురేష్.

ఆమె ఉత్సాహమంతా చచ్చిపోయింది. ఛ. ఈ మగవారు ఎప్పుడూ ఇంతే. వెతుక్కుంటూవస్తే నిరాశ పరచడమే నేర్చుకున్నారు. అని కోపంగా వెనుదిరిగి ఇంటికి వచ్చేసింది.

హాల్లో భర్తతో ఎవరో ఆఫీసర్లు మాట్లాడుతున్నారు. బహుమతులకు, పూలమాలలకు తక్కువలేదు అనుకుని విసురుగా పైకివెళ్ళిపోయింది. గదిలో కూర్చుంది. ఇంటిముందు రంగు రంగుల కార్లు ఆగుతున్నాయి. ఎంతమందో వస్తున్నారు. వ్యాపారస్తులు, క్రింది అధికారులు అంతా తనభర్త కోసం వస్తున్నారు. గర్వంతో ఒకసారి విర్రవీగింది ఆమె మనసు. కిటికీ దగ్గరికివచ్చి క్రిందికిచూసింది. హాలునిండా వ్యక్తులే. వినయంగా చేతులు కట్టుకొని నిలబడివున్నారు తహశీల్దారు, జిల్లా ఆఫీసర్లు వారితో నవ్వుతూ కబుర్లు చెప్తున్నారు. హోదా పెరిగింది ఆమె హృదయంలో. ఒక్కసారి భర్తతో అందరినీ పోల్చింది. ఎందులోకానీ ఎవ్వరూ గొప్పగా కనిపించలేదు. కానీ ఎందుకతన్ని తను ప్రేమించలేకపోతూంది?

ఎవరో ఆడవారు వచ్చారు. ఏమిటది, వాళ్ళు వారినలా చూస్తున్నారు? వారి అందాన్ని త్రాగేసే కళ్ళతో చూస్తున్నారేమిటి? అయ్యయో! వారికి దిష్టి తగులదూ? అయినా వారికి సిగ్గు లేదూ? తన భర్తను అలా చూస్తారేమిటి? చిరునవ్వులు ఒలకబోస్తున్నారు. ఆకర్షించుకొని లోబరుచుకోవాలనా? ఛ. ఛ. వారలాంటి వారేమీకాదు. ఎప్పటికీ అటువంటి జాణలకు లొంగరు. మరీ అంత దగ్గరగా వచ్చి నిలువబడిందేమిటి ఆ జపాన్ సిల్కుచీరె కట్టుకున్నావిడ? మెడలో పూలదండ వేస్తూందేమిటి ఆ మైసూర్ సిల్కుచీరె కట్టుకున్న ఆ మహారాణి? తనెలా భరించడం? వెళ్ళి ఆ చెంపా ఈ చెంపా వాయించేస్తే? తన భర్తపై అంత అధికారం వారి కెవరిచ్చారు?

అమ్మయ్య! ఇప్పటికైనా వెళ్ళిపోయారు. ఒకొక్కరే లేచి పోతున్నారు. అంతా వెళ్ళిపోయారు. వారు ఒక్కరే కూర్చుని ఆలో

చిస్తున్నారు. ఏమిటి? ఏమాలోచిస్తుంటారు? బహుశా తనవిషయమే నేమో? అయినా తనను మనసులోనైనా తలుచుకుంటారా?

ఎవరా వచ్చింది? రజియా. ఆమెను చూసి వికసించింది వారి మొహం. ఎందుకంత ప్రేమ? ఛ ఛ, వారినిగురించి అనుకోవడం తనదే పొరపాటు. ఆమెవెంట ఎవరు? సుగుణ. సుగుణమెడలో తాళి. అప్పుడే పెళ్ళయిపోయిందా?ఆమెచేతిలో కేకు.చిన్నపిల్లలా వారిదగ్గరకు పరుగెత్తుకొచ్చిందే! ఆమెను తనప్రక్కనే కూర్చోబెట్టుకొన్నారేమిటి? అంత ఆప్యాయతా, ఆదరణా ఎందుకు? కేకును వారికి తినిపిస్తూంది. ఎంత సంతోషంగా తింటున్నారు వారు? గట్టిగా నవ్వుతున్నారు. వారి మాటలు తనకు వినబడడంలేదు. రహస్యాలేమో?

ఆ వచ్చేదెవరు? ఆనంద్, గోపీ! ఆనంద్ ఏదో అంటున్నాడు. అందరూ నవ్వేశారు. తనకు లేదా అందులో పాలుపంచుకొనే అదృష్టం? కానీ అక్కడికి వెళితే అందరి ఎదుటా తను చిన్నదైపోతుంది.

ఓ! ఇంకేం? లతా, ఇందిరాకూడా వచ్చేశారు. బంధువులు. తనంటే వారి కెవరికీ పడదా? ఎందుకుసరిపోదు? అంతా ఆప్యాయంగానే మాట్లాడతారు. కానీ, తనే ఏదో పాపభీతివలన వారి దరి జేరలేక పోతూంది.

లత ఏమిటో అంటూ ఇల్లంతా చుట్టూ చూస్తూంది. ఎవరికోసం? వారేదో చెపుతున్నారు. మొండిగా ఏదో పట్టుబట్టి నట్లయింది.

"అమ్మగారూ, అయ్యగారు పిలుస్తున్నారు."

"ఊ!" ఉలిక్కిపడింది వసంత.

పోవాలా, వద్దా? పోకుంటే బాగుండదు.

"మా అక్కయ్యకు క్రొత్త సంవత్సరపు శుభాకాంక్షలతో మా ఈ చిన్నికానుక." హఠాత్తుగా లత వసంతకు పూలమాలతో అలంకరించింది.

అంతా చప్పట్లు చరిచారు.

వసంత ఆనందంతో పొంగిపోయింది. తను ఎంత చెడ్డదయినా తనను గౌరవిస్తున్నారు. ఎందుకు? వారిలాంటి భర్త ఉన్నందుకే! మరి తను ఈ ఆనందాన్ని పోగొట్టుకొని ఎందుకో ప్రాకులాడుతూంది.

కబుర్లతో, కాఫీలతో కాలం గడిచిపోయింది. భోజనానికి వారిని అక్కడే ఉండిపొమ్మన్నాడు రాజ్. ఆ దినమంతా తమాషాగా ఆటలతో, నవ్వులతో గడిచిపోయింది.

సాయంకాలం అందంగా అలంకరించుకొని ఎదురుగా నిలబడి ఉన్న వసంతను చూసి "ఏమిటి, వసూ, ఏం కావాలి?" అనడిగాడు రాజ్.

"మరి అలా షికారుకు వస్తారా?" తలవంచుకొని అడిగింది.

ఆశ్చర్యపడకుండా ఉండలేకపోయాడు. ఎన్నడూ లేనిది ఈనాడు ఈవిడకు తన అవసరం వచ్చిందా? కొంపతీసి ఎగతాళి పట్టించడానికి ఇదో ఎత్తు కాదు గదా?

"ఏమంటారు?"

"తప్పకుండా పద" అన్నాడు.

పొంగిపోయింది వసంత. అతను తనప్రక్కనుంటే గర్వంగా వుంది. అందరిచూపులూ తమపైనే. ఎందుకో వారికా అసూయ? అప్పుడే పిచ్చాసుపత్రినుండి వచ్చినవాళ్ళవలె కళ్ళప్పగించి చూస్తున్నారు. తొలి సారిగా సిగ్గు ఆవహిస్తూందే—యిదేమిటి? వారిదేం పట్టించుకున్నట్లే లేదే?

కబుర్లు చెబుతున్నాడు రాజు. తను గుంటూరులో ఉండగా ఎలా గడిపిందీ, ఎవరెవరితో పరిచయం జరిగిందీ అంతా వివరంగా చెప్తూ అప్పుడప్పుడు నవ్విస్తున్నాడు వసంతను.

"మరి, వసూ, అక్కడొక తమాషా జరిగింది తెలుసా?"

"ఏమిటండీ?" ముద్దుగా అడిగింది వసంత.

"ఎవరో ఒక పొగాకు వ్యాపారస్థుడితో తహశీల్దారు పరిచయం చేశాడు. అతడు కోటీశ్వరుడట. నన్నుచూడగానే విడిచిపెట్టకుండా వెంటపడ్డాడు. ఆ మహానుభావుడికి ఒక కూతురుందట. నన్ను పెళ్ళ యిందా అని అడిగాడు. అయింది అన్నాను నేను. అయితే మరి మీ శ్రీమతి రాలేదేం అని అడిగాడు. నేనేం జవాబు చెప్పకపోయేంతలో నాకు పెళ్ళి కాలేదనుకొని ఒకరోజు మాయింటికి రండి అని కోరు

పెట్టాడు. ఆ పోరు పడలేక ఒకసారి వెళ్ళాను. అప్పుడు. వాళ్ళమ్మాయి చేత కాఫీ తెప్పించాడు. నేను పెళ్ళిచూపులకు వచ్చానని చెప్పాడట. అమ్మాయి బాగుందండీ అనడిగాడు. నేను తల ఊపాను. ఒకసారి ఎవరోవచ్చి అదృష్టవంతులుసార్ అన్నారు. అర్థంకాక అదేమిటి అన్నాను. ఆ కోటీశ్వరుడికి అల్లుడు కాబోతున్నారటగా అన్నాడు. హతోస్మి, ఇదెక్కడి దౌర్జన్యం అనుకొన్నాను. ఇదేమిటండీ అని అడిగితే మీరేం చింతపడకండి, నా ఆస్తంతా అమ్మాయిపేర వ్రాసేస్తాను అన్నాడు. ఆ మర్నాడే పెలిగ్రాంరావడంతో వచ్చేశాను. లేకుంటే ఇంకా ఏం జరిగి ఉండేదో! అక్కడేమో ఆయన నేను మోసంచేశానని ప్రచారం చేశాడు.

"పోనీ, ఆ అమ్మాయిని పెళ్లి చేసుకోలేకపోయ్యారా?"

"నువ్వు నాకు విడాకులిచ్చినపుడు అలాగే చేసుకొంటాలే." కొంటెగా జవాబిచ్చాడు రాజ్.

"పొండి" అంది వసంత సిగ్గుతో.

ఇంతలో ఎవరో అహ్హ హ్హ హ్హ అని గట్టిగా నవ్వుతున్నట్లనిపించి అటు చూశారు. ఎవరో ఒక యువకుడు ఇసుకను చేతితో పట్టుకొని నవ్వుతున్నాడు.

అక్కడున్నవారంతా అతన్ని తెల్లబోయిచూస్తున్నారు. ఆ యువకుడు గట్టిగా "ఆడదాన్ని నమ్మకండి. అది రాక్షసి. మిమ్మల్ని చంపేస్తుంది" అని అరుస్తున్నాడు. అది చూసి ఆడవారు జడుసుకున్నారు.

అతడలాగే ఒకజంట దగ్గరికిపోయి "నా మాటవిను. నీ భార్యను సముద్రంలోకి పారెయ్యి. లేకుంటే ఒకనాడు నువ్వే దాంట్లో పడిపోవసి వస్తుంది" అన్నాడు. ఆ మాటలు వింటున్న యువతి తనభర్తను గట్టిగా పట్టుకొంది. అదిచూసి మరింతగా నవ్వాడా పిచ్చివాడు. "ఊ. నామాట ఎవ్వరూ నమ్మరుకదూ? ఆఖరుకు మీరంతా చచ్చిపోతారు. పిచ్చివాళ్ళయిపోతారు. మీరు మనుషులుకారు. యంత్రాలు. ఆడవాళ్ళు నడిచించే మరయంత్రాలు. నేనొక్కణ్ణే స్వతంత్రుణ్ణి" అని అక్కడినుండి పరుగెత్తుకు వచ్చాడు.

వసంతను చూసి ఆగిపోయాడు.

"ఊ! నువ్వు అసలు రాక్షసివి. మనుషుల్ని హింసించి చంపుకు తినే అసలు భూతానివి. నిన్ను బ్రతుకనియ్యకూడదు. చంపేస్తాను" అని చేతులు ముందుకు చాచాడు.

వసంత గడగడ వణికిపోయింది.

రాజ్ అతని మొహంలోకి చూశాడు. ఏదో గుర్తుకు వచ్చింది. మౌనంగా అతని రెండుచేతులకు తన చేతిని అడ్డంపెట్టాడు. ఆ పిచ్చివాడు రాజ్‌ను చూసి మరోసారి గట్టిగా నవ్వి "నువ్వు—నువ్వు దీనికి ప్రియుడివి కదూ! నామాట విని దీన్ని చంపెయ్యి. లేకుంటే నువ్వు పిచ్చివాడివై పోతావు. వాళ్ళంతా నీపైన రాళ్ళువేస్తారు. నువ్వు పిచ్చివాడివై పోతావు. పిచ్చివాడివై పోతావ్" అని అక్కడినుండి ముందుకు పరుగెత్తి పోయాడు.

అలా పరుగెత్తిపోతున్న అతన్ని భయంగా చూసింది వసంత. జాలిగా చూశాడు రాజ్.

ప్రేమకు నిర్వచనమే పిచ్చి. ప్రేమకు మొదటిదశా పిచ్చే. అంత్యదశకూడా పిచ్చే. భగ్నప్రేమికులకు మిగిలేది అదే. ఆశించినది పొందలేనప్పుడు కలిగే మతిభ్రమణం. ఒకవేళ అది పొందవలెనన్నా దానిపైన పిచ్చే ఆ కోరిక రేకెత్తిస్తుంది. ప్రేమకు యువజీవితమే నాంది. అదొక పిచ్చిలోకం కాబట్టే యౌవనమంతా పిచ్చి జీవితం. అసలు జీవితమే ఒకపిచ్చిగా సాగిపోతుంది. శరీరానికి బలాన్నిచ్చేవి పాలే అయినా వాటిలో నీళ్లు కలపందే పనికిరావు అన్నట్లు విజ్ఞానాన్ని అలవరచుకొంటున్నామంటూ చదువుకొంటూనే, జీవితంలోకి అప్పుడప్పుడే అడుగు పెడుతున్న యౌవనప్రాంగణానికి ఈ ప్రేమేలేకుంటేరాణించదని ప్రతివారి జీవితంలోకి ఏదో ఒకవిధంగా ప్రవేశించే ఈ ప్రేమమహాత్యం చాల గొప్పది. చిన్నప్పుడు చదువుకొంటూ ఇంగ్లీషుపదాల కర్థం వ్రాసుకొని తెలుసుకొంటేనేగాని పాఠాలు అర్థం కావన్నట్లు యౌవనజీవితంలో జీవితాన్ని అర్థంచేసుకోబోయేముందు తమ హృదయాలపై ఈ ప్రేమను వ్రాసుకుంటేనే కానీ ముందు ముందు సుఖంలేదనే తత్వంగలవాళ్ళు చాలా

మంది ఉన్నారు. కానీ దానికి అర్థం తెలుసుకొని నేర్చుకోగలిగినప్పుడు దానినే చులకన చేయడం సహజం.

"అతనెవరో గుర్తుందా, వసూ?"

ఆ ప్రశ్న వేయడంలోగల ఉద్దేశ్యం గ్రహించాలని చూసింది. కానీ అర్థంకాలేదు. నిశ్చలత ప్రతిబింబిస్తూంది.

అతణ్ణి గుర్తుపట్టకపోవడమేమిటి? అతడు భాస్కర్. తనను పెళ్ళి చేసుకుంటానని ఏమేమో అన్నాడు. తను నిరాకరించింది. ఆఖరిరోజు తనను మళ్ళీ అడిగాడు. తను చీదరించుకొంది. కోపంతో నోటికి వచ్చి నట్లు అని, ఇందరిసుఖం హరించిన నీకు ఎక్కడా సుఖం ఉండదు అని శపించి మరీ పొయ్యాడు.

వారి శాపాలేనేమో ఇప్పుడు ఇలా చుట్టుముట్టి హింసిస్తున్నాయి నిట్టూర్చింది వసంత.

# 31

"ఒరేయ్, నీకిదేం న్యాయం కాదురా!"

"ఏమిట్రా అది?

"శారద సుఖంకోసం లతను త్యాగంచెయ్యమని చెప్పావట. ఆఖరుకు మమ్మల్నికూడా సుఖంగా బ్రతకనియ్యవా?"

రాజ్ మౌనం వహించాడు.

"ఈ అర్థంలేని త్యాగాలతోనూ మా జీవితాలను నాశనం చేసుకో మంటావు? మేమేం తప్పుచేశామని మాకీ శిక్ష?"

"గోపీ, ఇప్పుడు మించిపోయిందేముంది?"

"అలా అడిగేకన్నా ఇక యిప్పుడు మిగిలిందేముంది అని అడుగు. నీ జీవితం నీ యిష్టం. కానీ మా జీవితాలతో చెలగాటలాడడం నీకు న్యాయంకాదు. అసలు నీకేం అధికారముంది అలా ఆజ్ఞాపించడానికి?"

"గోపీ, నేను ఎవ్వరినీ ఏం చెయ్యమని ఆజ్ఞాపించలేదు."

"ఆజ్ఞాపించలేదు కానీ సూచించావు."

"గోపీ, ఎందుకలా ఆవేశపడతావ్? ఆ వేళ నువ్వు ఏమన్నావు?"

"అంటే అదే పట్టుకొని మా సుఖాన్ని నాశనం చేయడానికి పూను కున్నావన్నమాట."

"నేను మీ సుఖాన్ని నాశనం చేసేంత నీచుడి ననుకున్నావా?"

"కానీ ఇప్పుడు చేసిందేమిటి? శారదకోసం లతకు అన్యాయం చేయమంటావు. ఆమె గతేమిటి?"

"ఏమీకాదు. నువ్వు భ్రమపడుతున్నావు. శారదను పెళ్ళిచేసుకొని చూడు. నీకెంత సుఖముంటుందో! లతకేం? ఈనాడు కాకున్నా రేపు ఈ విషయాలు మరిచిపోయి మరొకరిని వివాహమాడి జీవితం సుఖంగా గడపగలదు. కానీ శారదకు ఆ అవకాశం అంతగా లేదు. అందుకే ఆ బాధ్యత నువ్వు వహిస్తావని ఆశపడ్డాను. తన ఒక్కగానొక్క కూతురు సుఖపడుతోందన్న మీ మామయ్య ఆత్మకూడా శాంతిస్తుంది. తర్వాత మీ యిష్టం."

"అది నావల్లకాదు. లత తిరుపతిలో అసిస్టెంట్ లెక్చరర్‌గా పని చేస్తోందట. ఈ దినమే వెళుతున్నాను. నా కోరిక అంగీకరిస్తుందనే నమ్మకంతోనే పోతున్నాను. వెంటబెట్టుకొస్తాను."

* * *

"ఇందూ, లతకు ఉద్యోగం చెయ్యవలసిన ఖర్మేం పట్టింది? సంపాదించింది చాలకనా లేక దండించేవారు లేకనా?" కోపంగా అడిగాడు రావు.

"పోనీలెండి, ఏదో సరదాపడింది."

"సరదా ఏమిటి? ఊరుగాని ఊళ్ళో ఒంటరిగా ఉద్యోగం చెయ్యడం సరదానా? అంతకయితే ఈ ఊళ్ళో వేయించలేకపోదుమా?"

"దాని మనశ్శాంతికోసం ఈ ఊరువిడిచివెళ్ళి కొద్దిరోజులు అక్కడ ఉండి రావడమే మంచిదిలెండి."

"ఏం మంచిదో, ఏమో! బుద్ధి గడ్డితిని ఎవరినో ప్రేమించడం, పెళ్ళిచేసుకోలేక త్యాగాలనే పేరుతో విరమించుకోవడం, దానికి మన

శ్శాంతికోసం దూరంగా పారిపోవడం, చేతకాకపోతే చచ్చిపోవడం—ఛ! ఛ. మనుషు లెంతగా దిగజారిపోతున్నారు!" విసుగుతో అక్కడి నుండి వెళ్ళిపోయాడు రావు.

*            *            *

టెన్నిస్ రాకెట్ ఊపుకొంటూ హుషారుగా వస్తూంది వసంత.

"ఓ, మిసెస్ రాజశేఖరంగారా! నమస్తే! చాలారోజులకు కనిపించారు."

సురేష్ వ్యంగ్యపూరితమైన పలుకులు విని "సురేష్" అంది అర్థంకాక.

"ఆశ్చర్యపోతున్నారా! తిరిగి ఎందుకు కనిపించానా అని బాధ పడుతున్నారా? ఎలాగైనా కలెక్టరుగారి శ్రీమతివారు. ఆఫ్టరాల్ ఒక మున సబుగాడిని లెక్కపెడతారా! అదంతా పెద్దవారైన మీకే చెల్లుతుంది."

అర్థంకాని బాధ. వివరించి చెప్పలేని ఎత్తిపొడుపు పలుకులు. విశేషం కనిపించని విషయం. ఆశ్చర్యపోయింది.

"ఏమిటి, సురేష్, ఆ మాటలు?"

"ఎందుకైనా సమర్థులు. ఉద్యోగం ఊడగొట్టించి తెలియనట్లు మాట్లాడతారు?"

"సురేష్, ఏమిటి నువ్వనేది? నీ ఉద్యోగం నేను ఊడగొట్టించానా?"

"మీరుకాకపోతే మీ వారు. నీతో స్నేహం చేసినందుకుగాను మంచి ఫలితమే దక్కింది."

"సురేష్, వివరంగా చెప్పు, ఏం జరిగింది?"

"నీకు నిజంగానే తెలియదా?"

"నిజం. నా మాట నమ్ము."

"నామీద అనుమానంతో ఎంక్వయిర్ చేసి రిపోర్టు పంపమని ప్రభుత్వం మీ వారిని కోరింది. వారు జడ్జీగారితో సంప్రదించి ఈ పని చేశారు. నీకు స్నేహితుడినని ఇంతటితో వదిలిపెట్టారు. లేకుంటే చేతులకు అరదండాలుకూడా పడేవి."

"అంత అన్యాయం జరిగిందా?"

"ఏం జరిగితే ఏమిటి? మీరు మీరు ఒక్కటి."

"సురేష్!"

"నా కవమానం, అన్యాయం జరిగితే మధ్యన నీకు ఎందుకు ఈ బాధ?"

"సురేష్!"

"ఎందుకలా అన్నీ తెలియనట్లు ఆశ్చర్యపోతావు?"

"నన్నిలా నిందించడం నీకు న్యాయంకాదు."

"ఒకరిని నిందించడానికి నాకేం హక్కుంది?"

"ఇలా ఎత్తిపొడుపు మాటలనడం నీకు ధర్మమా! ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు?"

"చెయ్యమన్న పని తప్పకుండా చేస్తావా?"

"ఆ."

"అయితే మీ వారికి విడాకులిచ్చేయ్!"

"సురేష్!"

"ఏం? చేతకాదంటావు కదూ?"

"ఆలోచించే ఈ మాటంటున్నావా? నా గతి ఏం కాను?"

"నేను ఉన్నాగా? నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను."

"సురేష్!"

"నమ్మలేవు కదూ?"

"ఇన్నాళ్ళా స్నేహం చేసింది నమ్మకపోవడానికి కాదు, సురేష్. ప్రయత్నిస్తాను."

సురేష్ తృప్తిగా నిట్టూర్చాడు.

తను వారికి విడాకులు ఇవ్వాలా? ఇచ్చి ఈ సురేష్‌ను పెళ్ళిచేసుకోవాలా? ఊహూఁ. అది సాధ్యంకాదు. కానీ ఎలా? మాటిచ్చానే? ఈ కాలంలో మాటకు విలువలేదు. కానీ ఈ దెబ్బతో వారిని ఒకఆట ఆడించవచ్చు. దానితో తానాశించిన పగ, ప్రతీకారంకూడా తీరుతాయి. విడాకు

లిస్తానని బెదిరిస్తే తప్పక లొంగుతాడు. అప్పుడు ఈ సురేష్ కథే వది లేస్తే సరిపోతుంది. అలాగే చేయాలని నిశ్చయించుకొంది.

*  *  *

"ప్రియమైనబావగారి పాదపద్మములకు నమస్కరించి లత.

బావా,

ఇప్పుడు ప్రత్యక్షంగా ఆపని చేయలేకపోతున్నానే అని కొర తగా వుంది. నీకు కోపమొస్తుంది కదూ — వచ్చినా సరే చేయక తప్పదు.

మొన్ననగా గోపీ వచ్చాడు. చాలా ఆశతో, కోపంతో వచ్చాడు. పాపం అతని పరిస్థితిచూస్తే జాలివేస్తుంది, బావా! నేను నిర్దాక్షిణ్యంగా నా నిర్ణయాన్ని చెప్పేశాను. ఎంతగా బాధ పడ్డాడో! ఒక మంచిపని చేయడానికి కొందరిమనసులు నొప్పించాలిగా? కోపంతో ఏమేమో అన్నాడు. అనడం అతనివిధి. పడడం మనబాధ్యత. ఆఖరుకు నిందంతా నీకొచ్చిందే అని బాధపడుతున్నాను. ఏం చెప్పినా వినిపించుకోకుండా ఆదినమే వచ్చేశాడు. అతనికి నచ్చచెప్పి ఒప్పించే బాధ్యత నీకే వదిలి పెడుతున్నాను.

నీకు చెప్పకుండా ఇక్కడికి వచ్చేసినందుకు క్షమిస్తావు కదూ?

ఇక ఇక్కడిజీవితం ఒకవిధంగా బాగుంది. హాస్టల్‌లో ఉండా లంటే మనసొప్పలేదు. అందుకని వేరేగది అద్దెకు తీసుకొని ఉంటున్నాను. ఇప్పుడిప్పుడే చెయ్యి కాల్చుకోవడంకూడా నేర్చుకుంటు న్నాను. అందువల్ల పని ఎక్కువగా ఉంటుంది. మనసు మళ్ళకుండా ఉండడానికి ఇవన్నీ సాధనాలు. అనుకొన్నదానికంటే ఎక్కువ ప్రశాం తంగానే ఉంటుంది మనసు. కానీ అప్పుడప్పుడు మీరంతా జ్ఞాపకానికి వస్తే ఇక్కడినుండి పరుగెత్తి రావాలనిపిస్తుంది.

బావ ఒకఉత్తరం వ్రాశాడు. చాలా నిష్ఠూరంగా వ్రాశాడు. అక్క య్యలోమాత్రం ఏ భావం కనిపించకుండా వుంది. కానీ ఆమె మనసులో ఎక్కువగా బాధపడుతుంటుందని అనుకొంటున్నాను.

చిత్రవిచిత్ర మనస్తత్వాలు కలిగిన విద్యార్థులతో మెలగడం

ఆమెను లేవనెత్తి చేతిలో ఉన్నపాకెట్టు యిచ్చింది. సుగుణ ప్రేమతో దాన్ని అందుకొని ప్రక్కనపెట్టి వెనుక యింకా ఎవరైనా వస్తారేమోనని చూసింది.

"ఎవరు? మీ అన్నయ్యేనా?" అడిగింది రజియా నవ్వుతూ.

"అవును, రాలేదా?"

"ఆఫీసులో పని ఉందట. తర్వాత వస్తానన్నాడు."

"అవునులే. ఆయనగారికి నాకన్నా ఆఫీసుపనే ఎక్కువ."

"నువ్వుకూడా అలా అంటే ఎలా, సుగుణా? ఎంతో ముఖ్యమైన పని లేకుంటే తన చెల్లాయిదగ్గరికి రాకుండా ఉంటాడా? ఇంకాసేపటిలో వస్తాడులే."

"ఏమో, వదినా! అన్నయ్య రాకుంటే అసలీ తతంగమంతా వ్యర్థమే. అన్నయ్యపాదాలకు నమస్కరించి ఆశీర్వాదం అందుకోవాలి. అదే ఆశ."

"ఫరవాలేదులే. నీ కోరిక తప్పకతీరుతుంది.త్వరగా నీఅలంకరణ కానీ."

ముస్తాబుచేసి ముచ్చటగా కుర్చీలో కూర్చోబెట్టి మచ్చుకు రెండు పాటలు పాడారు ముత్తయిదువలు. అందమైన అలంకరణలో అలరారుతున్న సుగుణను అత్యంత ఆనందంతో చూచాడు సుగుణ భర్త. చిలిపి చూపులమధ్య సిగ్గు ముంచుకురాగా నేలచూపులు చేసింది. ఆ సీమంతపు శుభసూచక ఘడియల్లో రాబోవు నూతనవ్యక్తిగురించి భావాలు చెలరేగుతున్నాయి. వానాకాలపు మబ్బులాంటి ఆ సౌందర్యాన్ని కన్నులపండువుగా చూస్తున్నారు. వరుణదేవుణ్ణి మించిన గర్వంతో కూర్చొని ఉన్నాడు సుగుణభర్త. కూతురని ఆ పరిస్థితులలో చూసి మురిసిపోతున్నారు దంపతులు. కలుగబోయే మనమడిని ముద్దాడాలనే ఆపేక్ష. ఏ కష్టాలూ లేకుండా సుఖంగా జరిగిపోతున్న కుమార్తె సంసారం కావలసిన దానికన్నా ఎక్కువ తృప్తినే యిస్తూంది.

సుగుణ—చిన్నమొక్కగా ఉండి ఎదిగి వృక్షమై చిగురించి ఫలదాయకంకూడా కాబోతూంది. తనకు ఏమీలేదు. తుఫాను పాలిట

బడి ఎందుకూ కొరగాని మోడులా నిలిచిపోయింది. చిగురించ నోచుకోని చెట్టు—నవ్వుకొంది రజియా. ఏమీ లేదనుకొన్న ఆమెకు అన్నీ లభించాయి. అన్నీ ఉన్నాయనుకొన్న తనకు ఒక్కటీ లభించలేదు. ఏ కోరికలూ పెంచుకోని జీవితం సుఖప్రదం, ఫలదాయకం. అన్నికోరికలూ పెంచుకొని జీవితాన్ని కోరుకున్నందుకు దుఃఖమయమైన నికృష్టజీవితం. ఎదురులేని దేవుడి న్యాయపరిపాలన. అన్యాయాలకు తావులేని భగవంతుడి రాజ్యం. ఇదే శాసనమైతే మానవుడిలో కోరికలు కలిగించడం కూడా తప్పే. అప్పుడు సుఖమనే మాటను ప్రతిఒక్కరూ మరిచిపోవలసి ఉంటుంది.

కార్యక్రమం అయిపోయింది. దిష్టి తగులగలదని లోపలికి తీసుకుపోయారు. సుగుణమనసు ఆరాటపడుతూంది. పెట్టుకొన్న నగలుతీసి విసురుగా ప్రక్కన పారేసింది.

"ఏమిటి, సుగుణా, అంత విసుగుకు కారణం?"

సుగుణ జవాబు చెప్పలేదు.

"మీ అన్నయ్య రాలేదనేనా, వస్తుంటాడు లే." ధైర్యాన్ని యిచ్చింది రజియా.

"ఆ. భలే వచ్చేవాడే! అయినా ఒక జిల్లాకలెక్టరుగారు ఒక సామాన్యురాలైన చెల్లెలిని చూడటానికి ఎందుకొస్తాడు?"

"నువ్వామాట అంటావని తెలిసివుంటే అసలు నేను వచ్చేవాడినే కాదు."

"అన్నయ్యా!" ఎగిరి గంతేసి వెనుదిరిగింది సుగుణ. గుమ్మంలో నిలబడి చిరునవ్వుతో చూస్తున్నాడు రాజ్.

"రాజ్, నువ్వురాకుంటే సరాసరి మీ ఆఫీసుకే వచ్చేసి ఉండేది మీ చెల్లెలు. చూడు, ఆ నగలెలా క్రింద పారేసిందో?"

సుగుణ రాజ్ పాదాలకు నమస్కరించడానికి ముందుకు వచ్చింది.

"ఊఁ. అలా కాదు. నగలన్నీ పెట్టుకొని."

క్షణంలో తిరిగి అలంకరించుకుంది సుగుణ.

చంద్రుణ్ణి దాచుకొన్న మేఘంలా నడిచివస్తూన్న సుగుణను

చూసి తనకో చెల్లాయి లేదన్నబాధ మరిచిపోయాడు. ఎంతో ఉత్సాహంతో దగ్గరికివచ్చిన సుగుణ, తీరా దగ్గరికివచ్చాక సిగ్గుతో కుంచించుకుపోయి పైటచెరగు నిండుగా కప్పేస్కుని నమస్కరించింది.

"నీకు నీ భర్త ఆదరానురాగాలు ఎప్పటికీ ఉండాలని ఆ భగవంతుని ప్రార్థిస్తుంటానమ్మా."

కృతజ్ఞతతో చూసింది సుగుణ.

"సుగుణా, ఆనాడు నీతో ఒకవిషయం చెప్పాను. జ్ఞాపకముందా! నీ కడుపునపుట్టి నీ ఋణాన్ని తీర్చుకోలేకపోతున్నానే అని కొరతగా ఉంది."

"పో అన్నయ్యా!" సిగ్గుతో కళ్ళు చేతులతో కప్పేసుకొంది. రజియా నవ్వింది.

సుగుణ ప్రక్కన రజియాను పోల్చిచూశాడు. సుగుణలో నిండైన సంతోషం. చిరునవ్వు, ఆనందం. రజియాలో అన్నీ కొరతగానే ఉన్నాయి. కారణం అదే.

అతనిమనస్సులో తనగురించే ఆలోచనలు రేగుతున్నాయని పసిగట్టింది రజియా. వలదని కళ్ళతోనే సైగచేసింది.

"వసంత వదినను తీసుకురాలేదేం, అన్నయ్యా?"

"ఆవిడగారు కనిపించలేదు. అంతే. ఈ మధ్య చాలా బిజీగా ఉందిలే." నవ్వాడు రాజ్.

ఏడవలేక నవ్విన నవ్వు.

"అయితే మమ్మల్ని మరిచిపోయినట్లేనా?"

"ఆనంద్ అన్నయ్యా! గోపీ అన్నయ్యా! మీరు ఎలాగూ తప్పకుండా వస్తారని నాకు తెలుసు."

"ఊఁ. ఈ మధ్య మాటలుకూడా పట్టుబడ్డాయిలే."

"పోనీలే. పొరపాటయింది క్షమించలేరా, అన్నయ్యా!"

"క్షమించాం పో!" గర్వంగా అన్నాడు ఆనంద్. అందరూ గట్టిగా నవ్వేశారు.

యింతలో ఒక నౌకరు ఒక వెండి ఉయ్యాలను పట్టుకువచ్చాడు. అది చూసి ఆశ్చర్యపోయింది సుగుణ.

"యిది ఎవరు తీసుకొచ్చారు?"

"నేనేనమ్మా, చెల్లెమ్మా!" చిలిపిగా చూశాడు రాజ్.

"నువ్వా! యిప్పుడది ఎవరు తీసుకురమ్మన్నారు?" కోపం చూపిస్తూ అంది సుగుణ.

"ఎవరు తీసుకురమ్మన్నారో చెప్పనా! నీ కడుపులోఉన్న మా మేనల్లుడు."

కోపమంతా ఎగిరిపోయింది.

ఆనంద్, గోపి తమ చేతుల్లోఉన్న పాకెట్లు సుగుణ కిచ్చారు. భక్తిగా వాటి నందుకొంది సుగుణ.

## 32

బల్లపైఉన్న సమనుచూసి ఆశ్చర్యపోయాడు రాజ్. వసంత విడాకులు కోరే విషయంలో తనను కోర్టుకు హాజరు కమ్మని కోర్టువారి పిలుపు. వణికిపోయాడు రాజ్. నమ్మనూ లేకపోయాడు. ఫోన్‌లో తమ లాయరుతో మాట్లాడి అది నిజమని తెలుసుకొని తల చేతులతో పట్టుకొని సోఫాలో కూలబడ్డాడు.

అవకాశమిస్తే కబళించే భయం ఆవహించింది. ఆత్మాభిమానాన్ని చంపి అవమానాన్నిచ్చే విడాకులు. అవేకావాలని కోరుకుంటూంది సహధర్మచారిణి అని అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్య. భయంకరరూపంతో విడాకుల కోరలతో నాలుక చాచుకొని కాటువేయడానికి సిద్ధంగా ఉంది. చనిపోయేది ఆత్మకాదు. ఆత్మకున్న అభిమానం, ఆదరం, ఆప్యాయత, కరుణ, ప్రేమ, దౌర్బల్యం అన్నీ చచ్చిపోతాయి. లోకంలో పరువును పోగొట్టి మర్యాదను మంటగలిపి, గౌరవాన్ని గర్హనీయంగా మార్చి వేస్తాయి. ఆదరణ, ఆప్యాయతల బదులు క్రోధ కాఠిన్యాలు అలుముకొని, ప్రేమను పోగొట్టి ద్వేషాన్నిచ్చి, దుర్బలత్వాన్ని పోగొట్టి దౌర్జన్యాన్ని.

అభిమానాన్ని చంపి జీవితంపై నిరాశను, లోకంపై అసహ్యాన్ని కలిగించే పరిస్థితి ప్రాప్తమయింది. ఎదుర్కొని బ్రతుకవచ్చు. కానీ ఆ బ్రతుకు బ్రతికేకన్నా దూరంగా ఎవ్వరూలేనిచోట ఒంటరిగా గడపడం మేలు. ఆ అవమానాన్ని ఎదుర్కోవడంకన్నా చావడం మేలు.

అడుగుల చప్పుడైంది. ఆలోచనలు కట్టిపెట్టి తలెత్తి చూశాడు. వసంత. కోపం పెచ్చుపెరిగింది. అధికారం గుర్తుకు వచ్చింది. సహనం నశించిపోయింది.

"వసూ!" గర్జించాడు.

ఆ గర్జనకు దద్దరిల్లిన హాలులో భయపడి వెనుదిరిగింది వసంత. రౌద్రాకారంతో నిలబడివున్న భర్తనుచూసి నిజంగానే వణికిపోయింది.

"ఏమిటిది?"

చూచింది. కోర్టువారి సమను వణుకు మరింత ఎక్కువైపోగా గుండె దిటవు పరచుకొంది.

కోపంతో రాజ్ చెయ్యి పైకెత్తాడు. మరుక్షణంలో వసంత చెంప ప్రేలిపోయేదే. కానీ ఎదురుగావున్న ఫోటో చూసి ఎత్తిన చెయ్యి దించేశాడు.

"వసూ, నేను నీకేం అపకారం చేశాను? నన్ను ఆఖరుకు కోర్టుకు కూడా ఎక్కించి పరువు తీస్తున్నావు?"

వసంత పలుకలేదు.

"సరే. నీ యిష్టంవచ్చినట్లు చేసుకో" అని అక్కడినుండి బయటికి వచ్చేశాడు.

వసంత "ఏమండీ" అని అతని వెంటపడింది. కానీ అప్పటికే దాటిపోయాడు.

వసంత దిక్కుతోచక అక్కడే కూలబడింది.

ఫోను తీసింది.

"హల్లో, లాయరుగారా! నేను వసంతను మాట్లాడుతూంట. మనం కోర్టులో పెట్టినకేసు వుపసంహరించుకునేటట్లు చూడండి."

"అది కాదమ్మాయీ. తీరా ఇప్పుడు........" ఆ మాటలు ఆ వైపు

నుండి వినిపించేంతలో వసంత విసుగ్గా "అవేం నేను వినదలుచుకో లేదు. ఎలాగైనాసరే అది ఉపసంహరించుకుంటామని కోర్టువారికి తెలియ జేయండి" అంది.

"మరి ఆస్తి నీకు రాదు."

"ఆచింత మీకేం అక్కరలేదు" అని విసురుగా ఫోను క్రింద పెట్టేసింది.

ఆలోచించేకొద్దీ తల తిరిగిపోతూంది. తానుచేసిన ఒక్కొక్కపనీ ఆమెను కలత బెడుతున్నాయి. ఎలాగైనా వారు ఇంటికివస్తారు. అప్పుడు ఎలాగైనా వారి కాళ్ళపైబడి తన తప్పులకు క్షమాపణ వేడుకోవాలి. అది లేకుంటే తను చచ్చైనాపోవాలి.

"వసంతా!"

ఉలిక్కిపడి చూచింది.

"నువ్వా! ఎందుకొచ్చా విక్కడికి?" కోపంతో అంది.

"కోపపడకు. వసంతా! జరిగినదానికి క్షమాపణ చెప్పిపోవ డానికే వచ్చాను."

"సురేష్! నువ్వేం చెప్పక్కరలేదు. ఇక్కడినుండి వెళ్ళిపో."

"వెళ్ళిపోవడానికే వచ్చాను. కానీ, పొయ్యేముందు రెండు మాటలు చెప్పిపోదామనుకొని వచ్చాను?"

"ఏమిటది?"

"నే చేసిన తప్పులకు నా ఉద్యోగం ఊడింది. ఆ కోపంతో ప్రతీ కారం చెయ్యాలని నీతో ఆమాట చెప్పాను. అందుకు ఇప్పుడు చింతిస్తు న్నాను."

వసంత పలుకలేదు.

"చేసినతప్పులకు ఫలితాలు కనిపించేవరకూ తప్పులు మనకళ్ళ కగుపించవు. నువ్వు అబలవు. అబలకు స్వతంత్రంగా ఆలోచించే అల వాటులేదు. నేనేదో బుద్ధి తక్కువగా చేస్తే ఆలోచించకుండా నువ్వు ఇంత పని చేస్తావనుకోలేదు. మీవారు దైవస్వరూపులు. వారిని నీ ప్రవర్తనతో ఇలా బాధించడం న్యాయంకాదు. నీకు మొదటే ఈమాట చెప్పాలను

కున్నాను. కానీ నీ అందం అనుభవించాలనేకోరిక అడ్డుపడి చెప్పలేదు. నేడు నావలన ఒక సంసారం నాశనం కావడం నే చూడలేను. నాకూ ఒకభార్య ఉంది."

"ఆ!"

"అవును. నాకు పెళ్ళయింది కానీ నాకు సరిపడే అందంలేదని ఆమెను పుట్టింట్లో వదిలేశాను. నేడు వారు విడాకులివ్వడానికి సిద్ధపడ్డారు. నేను నిరాదరించిన నా భార్యే నాకు విడాకులిస్తున్నదంటే నా గుండెలు పిండయిపోతున్నాయి. మీవారు నిన్నెప్పుడూ నిరాదరించలేదు. పైపెచ్చు నీ ప్రవర్తనను క్షమించి కోపాన్ని దిగమ్రింగుకొని ఉన్నారు. నువ్విప్పుడు చెయ్యబోయేపని వారు ఏనాడో చేసి ఉండవచ్చు. నేనెందుకు చెబుతున్నానో అర్థంచేసుకో. మనం బాధపడప్పుడుగానీ ఇతరుల బాధ అర్థం చేసుకోలేకపోతాం. నేను నీకు చేయబోయిన పాపానికి ఫలితంగా నాకక్కడ కీడు జరుగబోతూంది. అంతేకాదు. నా తమ్ముడు ఒకడు ఉన్నాడు. వాడికి అపాయంగా ఉంది రమ్మని టెలిగ్రాం వచ్చింది. అది కూడా నా పాపఫలితమే ననుకొంటాను. నేనుపోయి నా వారిని రక్షించుకోగలననే ధైర్యం ఉంది. నా భార్య నామాట వింటుందనే నమ్మకమూ ఉంది. నేను అనుకుంటే అటు అక్కడ విడాకులు తీసుకొని ఇక్కడ నిన్ను పెళ్ళిచేసుకోగలను. జీవితంలో ఒకసారి తప్పుచేసి తిరిగి అదే చేసేంత నీచం మరొకటి లేదు. నిన్ను ప్రార్థిస్తున్నాను. నామాట విని మీవారిని క్షమాపణగోరి నీ జీవితాన్ని సుఖంగా మార్చుకో. అందులో గల ఆనందం నీకెక్కడా లభించదు."

వసంత అతన్ని చూసి ఆశ్చర్యపోయింది. ఇంత దీనంగా ప్రార్థిస్తున్నాడేమిటా అనుకొంది.

"నీకర్థం కాదు, వసంతా! నా గుండెలలో మండే జ్వాలకన్నా నూరురెట్లు ఎక్కువగా మీవారి హృదయం ఆహుతైపోయి ఉంటుంది. ఇప్పటికే అతనిమనస్సు కఠిన పాషాణమైపోయి ఉంటుంది. వారు నీకోసం తనబాధను దిగమ్రింగి చిరునవ్వుతో గడుపుతున్నారు. ప్రేమించినవారిని పెళ్ళిచేసుకోలేక అగ్నిజ్వాలలు మండేహృదయంతో వున్న

వారిని నువ్వు ఆ మంటల నార్పవలసినదిపోయి అగ్ని పర్వతాలనే పగులకొట్టించావు. నేనే అతని స్థానంలో ఉంటే ఏనాడో చచ్చిపోయి ఉండేవాణ్ణి. అతనిబాధలో కనీసం వెయ్యోవంతు అర్థంచేసుకోగలిగివుంటే నీ హృదయం పశ్చాత్తాపంతో వ్రక్కలైపోయి ఉండేది. నీ ప్రవర్తనతో నలుగురిలో తలెత్తుకు తిరగలేక కుమిలిపోతున్న వారి దుఃఖాన్ని ఊహించ గలిగివుంటే నీవు ఇక్కడే శిలవైపోయి ఉండేదానివి. నీ కన్నీరు కాలు వలు కట్టి ప్రవహించి నిన్ను ఎక్కడికో దూర తీరాలకు తీసుకుపోయి ఉండేవి. భర్తను ప్రేమించలేని నీ ఆనందం, సౌఖ్యం, స్వేచ్ఛ ఎందుకూ కొరగావు. వీటిని ఆశించే బదులు చావే మేలు."

"సురేష్!" బాధగా అరిచింది వసంత.

"క్షమించు, వసంతా! ఆవేశంలో అన్నీ అనక తప్పలేదు. కానీ ఇప్పటికైనా కళ్ళుతెరు. నేనెందుకు చెపుతున్నానో, నా ఆవేదన ఏమిటో అర్థం చేసుకో. వస్తాను." తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు సురేష్.

సురేష్‌మాటలు చెవుల్లో గింగురుమంటుండగా అక్కడే కూల బడింది. అశాంతితో ఇల్లంతా తిరిగింది. ప్రతివస్తువూ తనను వెక్కి స్తున్నాయి. ప్రతిఅణువూ తనను అసహ్యంగా చూస్తున్నాయి.

ఇక అక్కడ వుండలేక కారేసుకొని భర్తకోసం అన్నిచోట్లా వెతి కింది. ఎక్కడా కనిపించలేదు. చీకటిపడింది. భర్త ఇంటికి రాకపోవ డంతో ఇంట్లోకిపోవడానికి భయపడి బయటగేట్లో నిలబడింది. వీధి చివరి వరకూ దృష్టి సారించి వస్తాడేమోనని ఎదురు చూస్తూంది.

"అమ్మా, రెండు రోజులనుండీ అన్నంలేదు. ఆకలిగా ఉంది. కాస్త అన్నం పెట్టండమ్మా. ఒకప్పుడు బాగా బ్రతికినదాన్ని. ఇప్పుడు చేసిన పాపాలకు ఈగతి పట్టింది."

వసంత ప్రక్కకు చూసింది.

ఒక బిచ్చగత్తె, ఒక రోగిష్టిభర్తను లాగుడుబండిలో కూర్చో బెట్టి దీనంగా అడుగుతూంది. ఆ బిచ్చగత్తె భర్తనుచూస్తే ఒళ్ళు జలద రించిపోయింది.

"లోపలికి రా" అని వసంత లోపలికి వెళ్ళి ఒక పదిరూపాయల నోటు ఆ బిచ్చగత్తెకిచ్చింది.

ఆ బిచ్చగత్తె అనుమానంగా చూసి అది చేతిలో పడడంతో ఆనందంతో పొంగిపోయింది.

"ఈ డబ్బుతో ఏం చేస్తావు?" అంది వసంత.

"ముందు మావారి రోగం బాగుచేయిస్తాను."

"ఏమిటీ? ఇచ్చినడబ్బు ఆ రోగిష్టి వాడికి ఖర్చుపెడితే నీ కడుపుకు? అదీకాక నీ ఒంటిమీద బట్టలుకూడా సరిగ్గా లేవు."

"నా కెందుకమ్మా, ఆ సుఖాలన్నీ! వారు బాగుంటే అంతే చాలు. వారి కడుపు నిండితే నేనూ సంతృప్తిగా తిన్నట్లే."

"ఆ రోగిష్టివాడిని వెంటబెట్టుకు తిరగడంకంటే, వాడికోసం నువ్వు బాధపడేకంటే నీదారి నువ్వు చూసుకోకూడదూ?"

"ఎంతమాటన్నావమ్మా! భర్తను వదిలెయ్యమంటావా? భర్తను ప్రేమించలేని బ్రతుకులెందుకమ్మా? భర్త విలువ తెలుసుకోలేని భార్య మనుగడే నిష్ఫలం. భర్తే దైవం. అతని పాదసేవలో అనిర్వచనీయమైన ఆనందముంది. అది అందరికీ లభ్యంకానిది. ఈధర్మాన్ని మానవులమైఉండి మనం నిర్వర్తించలేకుంటే మన ఘనత ఏమిటి? భర్త ఎటువంటివాడైనా భర్తే. సతీపతుల సంబంధం అంత సులభంగా తెగేది కాదు. అది పవిత్రం. స్వయంగా అనుభవిస్తేనేగాని దాని ప్రయోజనాలు తెలియవు. నీకింకా పెళ్ళికానట్లుంది. అనుభవించి చూడమ్మా, నా మాటల్లో ఎంత సత్యముందో తెలుస్తుంది. నువ్వు దానం చెయ్యకున్నా సంతోషిస్తాను కానీ ఇలాంటి ఉపదేశాలు చెయ్యకు, తల్లీ" అని అక్కడినుండి గబగబా వెళ్ళిపోయింది ఆ బిచ్చగత్తె.

అలాగే లోపలికిపోయి కూర్చుంది. బిచ్చగత్తెమాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి.

* * *

వసంత భర్తకోసం ఊరంతా వెదికింది. ఎక్కడా అగుపించలేదు. విసుగుతో వేసారి ఇంటికివచ్చింది. ఆశ్చర్యం. ఇంట్లోనుండి సూట్‌కేస్‌తో బయటికి వస్తున్నాడు. ఆనందంలో అడ్డుపడి ఏడిచింది. కానీ రాజ్ హృదయం కరగలేదు. కఠినంగా శపించి వెళ్ళిపోయాడు. బ్రతుకు నిరర్థకం, దుర్భరం అనిపించి ఆత్మహత్య చేసుకొంది వసంత.

ఆఖరిఘడియల్లో వచ్చాడు. కన్నీటితో కనిపించి "ఇదేమిటి, వసూ" అన్నాడు.

చిరునవ్వు నవ్వింది వసంత.

ఆఖరిసారిగానైనా అతణ్ణి చూచానన్న ఆనందంతో శక్తినంతా కూడగట్టుకొని లేచి "ఇప్పటికైనా నన్ను క్షమించరా" అని భర్త పాదాలపై పడింది.

"వసూ" అని రాజ్ ఆమెను అక్కున జేర్చుకొన్నాడు. మనసు ఏమేమో చెప్పాలని వాపోతూండగా చెప్పేశక్తిలేక తన నిస్సహాయస్థితికి కుమిలిపోయింది.

"వసూ, ఇంత అన్యాయం చేయడం నీకు న్యాయమా?"

పేలవంగా నవ్వింది వసంత.

"ఉన్నన్నినాళ్ళూ మిమ్మల్ని వేధించాను. ఇప్పుడు అందుకు తగిన శిక్షే విధించుకొన్నాను. మీరు బాధపడకండి."

"వసూ!"

"ఒక్కసారి ఆప్యాయంగా ఆఖరికోరిక కోరుతున్నాను. ప్రేమగా ఒక్కసారి ముద్దుపెట్టుకోండి."

"వసూ" అని తనపెదవులను ఆప్యాయంగా ముద్దిడుకొన్నాడు.

చాలు. జీవితాని కా సంతృప్తి, వరమూ చాలు. తన ఆఖరికోరికకు తనే నవ్వుకొంది. అంతకుమునుపు జీవితంపై ఆశపోయింది. కానీ ఇప్పుడు తిరిగి ఆశ కలుగుతూంది. అర్హతలేని ఆశ. వారి కౌగిట్లోనే ప్రాణాలు విడవాలని కోరుకొని అలాగే చేసింది. తన పాపాలకు పరిహారం అదే.

*  *  *

ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. చుట్టూ చీకటిగా ఉంది. రాజ్ వచ్చాడేమోనని పైకి పరుగెత్తి లైటువేసింది. కానీ ఖాళీ పడక పక్కన నవ్వింది. దీపం వెకిలిగా నవ్వుతూంది. గాలి గబుక్కున గదిలోకి వచ్చి భయపెట్టింది. నిశ్శబ్దం, ఒంటరితనం గేలిచేస్తుండగా కళ్ళు మూసుకొని ప్రక్కపై పడుకొంది.

మగత నిద్ర. ఆ నిద్రలో భయంకరమైన కలలు. కలలు కరిగి పోతే కళ్ళు తెరిస్తే తిరిగి భయం. కళ్ళుమూసుకొంటే ఆవేదన. చీకటిని చూస్తే భయం. వెలుగులో ఉండాలంటే ఏవగింపు. ఆలోచనలు మదిలో మెదిలితే జలదరింపు. మెదలకుంటే కాలం నిలిచిపోతుందనే భయం.

ఉదయం లేచి వచ్చేటప్పటికి నౌకరు ఒకకవరుచేతికిస్తూ "అమ్మా, అయ్యగారు ఇచ్చిపోయారు" అన్నాడు.

"అయ్యగారొచ్చి వెళ్ళిపోయారా! నన్నెందుకు లేపలేదు? నీకు బుద్ధి ఉందా! ఫో. అవతలికి" అంది పట్టరాని కోపంతో వసంత.

వాడలా వెళ్ళిపోగానే వణికే చేతులతో కవరు విప్పింది. లోపల ఉన్న ఉత్తరం క్రింద పడిపోయింది. వారి దస్తూరి కనబడుతూంది. మనసు కీడు శంకిస్తూండగా దాన్ని తీసింది.

"వసూ,

నీకు ఏం చెప్పాలో, ఎలా చెప్తే నీ కర్థమవుతుందో నాకు తెలియడం లేదు. నువ్వు విడాకులనే కోరావు. అంటే నేను నీకు భరగా ఉండతగననికదూ? దానిబదులు నేను యీ ప్రపంచంలో వుండ తగనని అని ఉంటే సంతోషించేవాడిని. కుటుంబ గౌరవం ఫణంగా పెట్టి నాకు దూరం కావాలని కోర్టు కెక్కడానికి సిద్ధపడ్డావు. నేను దాని కోసం నీకు దూరం కాకతప్పదు. నేను నీకు అంతటి అపకారం ఏం చేశాను? ఈనాడు నా మనస్సు నిన్ను ఏవో ప్రశ్నించాలని, ఏమేమో చెప్పాలని పీడిస్తూంది. అందుకు ముఖాముఖికంటే ఈ విధంగానే తెలియజేయడం మేలనుకొన్నాను.

నువ్వు మొదటిరాత్రి నన్ను పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదా అని ప్రశ్నించావు. అన్నీ తెలిసే అడిగావు. నిజమే అని ఆనాడు ధైర్యంగా చెప్పలేకపోయినా ఇప్పుడు చెపుతున్నాను. నాకిష్టంలేకపోయినా ఆరాధించిన దేవతను వదిలి నిన్ను పెళ్ళిచేసుకొన్నాను. అందుకు కారణం నువ్వు ఊహించుకోగలిగింది తప్పు. నీ అందంకోసం, నీ ఆస్తికోసం భ్రమపడి రజియాను వదులుకొని నీ పాలిటి భర్తగా దాపురించానను కొన్నావు కదూ? చాలా పొరబడ్డావు, వసూ?

బహుశా నీకు జ్ఞాపకముందనుకొంటాను. ఒకనాడు ప్రేమభిక్ష పెట్టమని అర్థించావు. అప్పట్లో నిరాకరించినా ఆ మరునాడే నా అంతరాత్మ అంగీకరించమని ప్రబోధించింది. నీ అహంభావంతో ఆనాడే నాదానివి కావలసిన దానివి తప్పించుకొని, ఊహించుకోకుండా నా భార్యవయ్యావు. రజియాను పోగొట్టుకొన్నానన్న బాధలోకూడా నిన్ను ప్రేమించడం నేర్చుకొన్నాను. కానీ నువ్వు ఎదుటివారి హృదయాలను అర్థంచేసుకొని ప్రవర్తించడానికి ఎన్నడూ ప్రయత్నించలేదు. అది నీతప్పు కాదేమో? మనకు మానవజన్మ నిచ్చింది జంతువులలా ప్రవర్తించడానికి కాదు. నాకు తెలుసు—నీతో ఏదో ప్రతీకారవాంఛ రేగుతూందని. ఏనాటికైనా నీ మనసు మారుతుందని ఆశించాను.

కానీ నా ఆశ నిరాశ అయింది. తిన్నవాంట్లో కారం ఎక్కువగా ఉండి నీళ్లు త్రాగితే అవి కాస్తా ఉప్పునీరు అయితే ఆ పరిస్థితి ఊహించుకో. మొదటిరాత్రి, ఉద్యోగంలో చేరే ఉద్యోగివలె నిబంధనలు అనుసరించవలెననే ఆజ్ఞ నీనుండి వచ్చింది. అప్పటి నా పరిస్థితి తలుచుకొంటే నవ్వు వస్తుంది. ఆజ్ఞాపించే అధికారం ఉండీ అధికారాలకు లోబడే భర్తలు ఎవ్వరూ వుండకూడదని దేవుణ్ణి ప్రార్థిస్తుంటాను.

నువ్వు నా మనస్సును రాయిగా మార్చేశావు. కఠిన మెరుగని నాకు కాఠిన్యాన్ని అలవరుచుకొమ్మని చెప్పావు. నా సహనాన్ని నశింపచేశావు. నలుగురిలో నగుబాట్లయి గౌరవంపోయేవిధంగా ప్రవర్తించావు. అప్పటికీ ఏమూలో నాలో శక్తివుండి నిలబడగలిగాను. అప్పుడే నాలో శక్తి నశించి ఉంటే ఈనాడు మనం ఈ పరిస్థితుల్లో ఉండేవారం కాము. ఇన్నాళ్ళూ నువ్వు నన్ను ఒక భర్తగా ఎంచుకున్నావో లేక ఒక సేవకుడిగా చూశావో అనే సందేహం కలుగుతూంది. కానీ నీనుండి నేను సేవలను అందుకోలేదు. ఆశించలేదు కూడా! కనీసం భర్తపట్ల భార్య చూపే అనురాగం కాకపోయినా విధినైనా నిర్వర్తించలేదు. అందుకు చింతపడలేదు.

నేను విచిత్ర పరిస్థితులలో నిన్ను పెళ్ళిచేసుకొని అత్యంత క్లిష్ట పరిస్థితులలో ఇరుక్కున్నాను. ఒక అమాయకురాలికి అన్యాయం చేసినందుకు అది శాస్తి అని తృప్తి పడుతున్నాను. కానీ లోకనిందకూ, మానవత్వానికీ కట్టుబడినవారు ఎన్నటికీ సుఖపడలేరు అన్నమాటలకు నిదర్శనంగా నా జీవితం నిలిచిపోతుంది. స్వసుఖానికి ఆశించక పరుల తృప్తికి ఆశించిననాడు కలిగే ఫలితమిదేనని బుద్ధిచెప్పావు. ఆనాడు నా స్వార్థానికి కట్టుబడి ఉంటే ఈనాడీ దుస్థితి సంభవించి ఉండేదికాదు. పరులసొమ్ము తిని వారికే ద్రోహం తలపెట్టివుంటే నా జీవితంకూడా సౌఖ్యవంతంగా గడిచిపోయి ఉండేది. అది చేతకాక నేడు ఈ విపత్కర పరిస్థితులకు లోనై భార్యను వదిలిపెట్టి పారిపోయిన అసమర్థుణ్ణి అనిపించుకొంటాను. అందుకు ఇప్పుడు భయపడటంలేదు. బాధ పడను. అంతకన్నా గత్యంతరం లేదు. ఏదైనా ఉందీ అంటే అది ఆత్మహత్యే.

కానీ అది చేసుకోదలుచుకోలేదు. నీ నుదుటి కుంకుమ చెరపడానికి నా కధికారం లేదుకదూ? అది చెరిగిపోతే నీకు లోకంలో ఇప్పుడున్న స్థానం ఉండదు. నీ ఆనందం నశిస్తుంది. నీ స్వేచ్ఛ అరికట్టబడుతుంది. అందుకే ఆపని చెయ్యదలుచుకోలేదు.

మీ నాన్నగారి ఆస్తి మోసంతో గ్రహించానని, అటువంటిభర్త వద్దని కోర్టుకు పోయావుకదూ? మీ నాన్నగారు ఆ ఆస్తి నా పేర వ్రాశాడని నాకన్నా ముందు నువ్వు తెలుసుకున్నావు. వసూ, నీ ఆస్తిలో చిల్లిగవ్వ కూడా నాకక్కరలేదు. అంతా నీ పేరే వ్రాసేశాను. ఇక ఇప్పుడు నాపై పూర్తిగా కోపం పోయిందనుకుంటాను. ఇకనైనా నీ మానం మర్యాద కోసం ఆ కేసు ఉపసంహరించుకొంటావనుకుంటాను. లేక నీకు విడాకులు కావలసివుంటే అందుకు ఏర్పాటు చేశాను. మీ లాయరుగారితో సంప్రతిస్తే ఆ చిక్కు తీరిపోతుంది.

ఇక నీ స్వేచ్ఛనూ, స్వాతంత్ర్యాన్నీ అరికట్టే హక్కు ఎవ్వరికీ లేదు. ఉందీ అంటే అది నీ మనస్సు. దాన్ని ఏనాడో చంపుకొన్నావు. నీ భోగభాగ్యాలతో నీ యిష్టం వచ్చినట్లు ఉండవచ్చు. నీవు ఆనందంగా నువ్వు ఎన్నుకొన్న రెండవభర్తతో ఉండవచ్చు. ఎవరి అభ్యంతరమూ

ఉండదు. మీ క్రొత్త కాపురానికి నేను నా శుభాకాంక్షలు అందజేయగల అర్హుడినని తోస్తే అంగీకరించు.

ఇంత కఠినంగా ఎలా మారిపొయ్యానా అని ఆలోచిస్తున్నావు కదూ? పరిస్థితులు మానవుడిని రాక్షసుడుగా మారుస్తాయి. అసలు నాతో పెళ్ళి ఒక పీడకల అనుకో. భానుమూర్తి, ప్రకాశం మొదలగు వారిలా నేనూ నీ జీవితంలో ప్రవేశించి మరలిపోయానని అనుకో. అది సులభమే నీకు. నువ్వు ఎక్కడికి పోతున్నావు అని అడుగుతావేమో? చెప్పడం మరిచాను. ఎక్కడైతే అన్ని సుఖాలూ లేవనుకొన్నా. అదృష్టవశాత్తూ పొందగలిగి వాటిని దక్కించుకోలేక అవమానాలపాలయి బాధలలో మరిగి, ఏడుపుతో కృశించిపోయి, మంచితనం, సహనం కోల్పోయానో, ఆచోటునుండి దూరమైపోయి వాటిని తిరిగి సంపాదించుకోగల ననే ఆశతో దూరదేశాలకు వెళ్ళిపోతున్నాను. తిరిగి కనిపిస్తానని భయ పడకు. జీవితంలో ఇక నీకు కనిపించదలుచుకోలేదు. మూసుకుపోయిన ఈ హృదయపు కవాటాలు ఇక ఎవ్వరికోసం తెరచుకోవు.

ఇట్లు,
నీ అని చెప్పుకో కూడని
రాజ్."

కుప్పగా కూలిపోయింది వసంత. అంతా అయిపోయింది. ఉన్న ఒక్క ఆశకూడా ఎగిరిపోయింది. భరించలేని బాధ, పుట్టెడు దుఃఖం. దహించివేసే పాపం—ప్రాయశ్చిత్తంలేక విలవిలలాడుతూంది. కాపాడే దిక్కులేక అలమటించిపోతూంది హృదయం. ఓదార్చే ఆప్తులకోసం అర్రులు చాచింది మనసు. ఎక్కడా ఎవరూ సంప్రాప్తంకాక ఒంటరిగా కుమిలిపోయింది. అబల ఆవేదనను అర్థంచేసుకొని ఆదరించలేని లోకం. నీ గర్వానికీ, అహంభావానికీ తగినశాస్తి జరిగిందిలెమ్మని పరిహసించే పరిస్థితులు. కాలం నిస్సహాయతని చాటి చెపుతూంది.

ఒక్కఆశ స్ఫురించగా టైం చూసుకొంది. ఆశాకిరణం కను చూపుమేర దూరంలో కనబడింది. అంతే. ఒక్కపరుగున బయట పడింది.

ఆశాకిరణం అందుకోవడం తనకు చేతకాదని, అందుకు సరి పోయిన వ్యక్తి వేరే ఉన్నారని తెలిసినా తొందరపాటు ఆ విషయాన్ని విస్మరింపజేసింది.

రెస్టారెంటు గదిలోపల కూర్చొనిఉన్న రాజ్ మస్తిష్కంలో ఆలోచనలు పరుగెడుతున్నాయి. మాతృదేశం వదిలి పర దేశాలకు వెళ్ళిపోతున్నాడు. అక్కడ తను ఏకాకి. ఇక్కడ అందరినీ వదులుకొని ఆ నిస్సహాయజీవితాన్ని కోరుకొని వెళ్ళిపోదలుచుకున్నాడు. లోకం తనను అపార్థం చేసుకొంటుంది. కానీ తనవారు—అందులో తన రజియా తనను అర్థంచేసుకొంటుందో, లేదో? తన హృదయానికి మారు రూపమైన ఆమే సరిగా అర్థంచేసుకోలేనినాడు తనపై తనకే నమ్మకం వుండదు. ఆనంద్, గోపీ తను లేకుంటే బాధపడతారు. అత ఏడుస్తుంది. అన్నయ్య, వదిన ఏడుస్తారు. సుగుణ—పండంటి బిడ్డను కనబోతూ, తనకు మేనల్లుడిని చూపించాలని ఆశపడి ఈ వార్తవింటే తల్లడిల్లి పోతుంది. రజియా ఈ అఘాతానికి తట్టుకోలేదు. పిచ్చిదై పోతుంది. ఏ అఘాయిత్యానికీ పాలుపడకుండా చూడు భగవాన్! అని వాపోయింది అతని హృదయం.

"విమానం బయలుదేరడానికి పదిహేను నిమిషాలుంది." ఎవరో మైక్‌లో చెప్పారు.

గుండె దడదడలాడుతుండగా దిటవుపరుచుకొని లేచాడు. ఎదురుగావున్న వసంతను చూసి అవ్యక్తంగా మూలిగిందా ఆవేదనాపూరిత హృదయం.

ఇరువురిలో ఆవేదన—పైకి చెప్పలేని బాధ మసలుతూంది. ఒకరి హృదయం బాధతో గూడుకట్టుకుపోయింది. మరొకరిది పశ్చాత్తాపపూరిత మైన కన్నీటితో గూడుకట్టుకొని ఉంది.

కళ్ళలో మెదిలే కన్నీటితో ఆశ పొడసూపిన చూపులతో నిలబడి ఉంది వసంత.

చిరునవ్వు పెదాలపైకి తెచ్చుకొన్నాడు రాజ్.

"నాకు వీడ్కోలు ఇవ్వడానికి ఎవ్వరూ లేరే అని బాధపడుతున్నాను. ఆ కొరత నువ్వు తీరుస్తున్నావు. కృతజ్ఞుణ్ణి, వసూ!"

క్రుంగిపోయి ఉన్న మనసును మరింత క్రుంగదీశాయి. భరించ లేక భర్త పాదాలకు చుట్టుకుపోయి "నన్ను ఈ ఒక్కసారి క్షమించండి" అంది.

"నిన్ను క్షమించడానికి నాకేం హక్కువుంది? అదీగాక నువ్వు ఇప్పుడేం తప్పు చేశావు?"

"చచ్చినపామును ఇంకా చావగొట్టకండి. నా తప్పు తెలుసుకున్నాను. ఇంకెప్పుడూ ఇలా ప్రవర్తించను."

"వసూ, ఇంతవరకూ అయినది చాలు. ఇంకా నన్ను మోసగించడానికి ప్రయత్నించవద్దు."

"అయ్యో! మీకెలా నచ్చచెప్పగలను? నా మాట నమ్మండి. దగ్గరున్న జ్యోతిని తెలుసుకోలేక గ్రుడ్డిగా వెలుగును వెతుక్కుంటూ పోయాను. నా తప్పు తెలుసుకొన్నాను. నన్ను మన్నించండి."

"ఆ నమ్మకం ఎప్పుడో పోయింది. రాలిపోయిన మొగ్గ వికసించదు. శిథిలమైపోయిన ఆలయంలో దేవుడు ఉండడు."

"ఈ ఒక్కసారికి క్షమించండి. స్త్రీకి భర్తే దైవం అని తెలుసుకొన్నాను. నన్ను అన్యాయం చెయ్యకండి."

"నేను నీకేం అన్యాయం చెయ్యడంలేదు. నీ ఆస్తి నీ పేరనే వ్రాసేశాను. నీకు కావలసిన ఏర్పాట్లన్నీ చేశాను."

వసంత బాధగా తల అడ్డం తిప్పింది.

"నాకవేమీ అక్కరలేదు. మీరు కావాలి."

"ఆ విషయం ఇప్పుడు తెలుసుకొన్నావా! నీ ఆటలకు అడ్డుగా పెట్టుకొనేందుకు నే నింకా అవసరమా?"

"నన్ను మన్నించండి. ఇంకెప్పుడూ ఇలా చేయను. నా బ్రతుకు బండలు చేయకండి. నా యీ ఒక్కకోరికా మన్నించండి."

"అసంభవం. వసూ! ఇక నేను నీకు భర్తగా సంఘంలో జీవించలేను."

"నన్ను మీరు భార్యగా స్వీకరించవద్దు. ఒక్కదాసిగా ఉండనివ్వండి. మీ పాదసేవ చేసే భాగ్యం కలుగజేయండి. నా పాపాల్ని కడిగి వేసుకొంటాను. ఈ జీవితాని కదిమాత్రం ప్రసాదించండి. చాలు."

"వసూ, ఇదంతామాని ఇంటికెళ్ళి హాయిగా ఉండు" అన్నాడు రాజ్.

"నాకా హాయి వద్దు. మీరెక్కడుంటే నేనూ అక్కడే. నన్నూ మీతో తీసికెళ్ళండి."

"ఎందుకూ? నన్ను అక్కడకూడా మనశ్శాంతికి దూరంచెయ్యాలనా? అనుకొన్నవాటికి దూరమై జీవితంలో అవమానాలతో, బాధతో కుళ్ళికుళ్ళి చచ్చిన నాకు అక్కడగూడా ప్రశాంతిని కలుగజేయకూడదనా? నేను నీకేం అపకారం చేశానని పీడిస్తున్నావు?"

చెవులను మూసుకొంది వసంత.

"క్షమించండి. నేను మీవద్ద ఉంటే మీకు సుఖమూ, శాంతీ లేనప్పుడు నేను మీకు కనపడను. ఎక్కడైనా మీరు సుఖంగా ఉంటే అంతే చాలు."

ఆ మాటలు విని ఆమె మొహంలోకి చూశాడు. మూర్తీభవించిన శోకమూర్తిలా ఉంది వసంత. ఇంత త్వరగా ఇంత మంచి నిర్ణయం చేసుకోగలిగింది. అలాగే దాన్ని తిరిగికూడా మార్చుకోగలదు. ఎలాగైనా కొన్నాళ్ళయినా దూరంగా ఉండిపోవాలి. ఆ తర్వాత చూసుకోవచ్చును. అని నిశ్చయించుకొని ఎయిర్‌బాగ్ చేతికితీసుకొని ముందుకు సాగిపోయాడు రాజ్. కదిలిపోతున్న అతన్ని చూస్తూ అలాగే నిలబడిపోయింది వసంత.

## 33

సాయంకాలానికి సుగుణ కాన్పు విజయవంతంగా పూర్తిచేసి ఇంటికి వచ్చింది రజియా. వస్తూనే బల్లపైనున్న కవరు ఆమె దృష్టిలో పడింది. రాత్రినుండి తను సుగుణదగ్గరే ఉంది. ఇది ఎక్కడినుండి వచ్చిందా అని చూసింది. నాన్నగారు మన్నాడు వస్తున్నారే అని సంతోషపడింది. సోఫాలో చేరగిలబడిన ఆమె అక్కడే ఇంకొక కవరు ఉండడం చూసి విప్పి చదువుకొని నెత్తిన పిడుగు పడినట్లు అదిరిపడి మళ్ళీ చదువుకొంది.

మానవుని పాపాలకు ఒకహద్దంటూ ఉన్నట్లు నా సహనానికికూడా ఒక హద్దు ఉంది. మానవుని పాపాలు పండినప్పుడు అనుకోని అనర్థమే సంభవిస్తుంది. అలాగే నాలో ఓర్చుకొనే శక్తి నశించిపోయింది. విసిగి పోయాను. జీవితం అంటే విరక్తి పుట్టింది. కాని చనిపోయేంత దుర్బ లుణ్ణి కాదులే. ఇక ఇక్కడ ఈ బ్రతుకు గడపడం దుర్భరం అనిపిం చింది. అందుకే ఇక్కడ లోపించిన మనశ్శాంతి అక్కడైనా దొరుకు తుందేమోననే ఆశతో దూరదేశాలకు వెళ్ళిపోతున్నాను. అపార్థంచేసు కోక అర్థం చేసుకొని జాలిపడతావనే ఆశిస్తున్నాను. మనశ్శాంతి దొర కకపోయినా ఇక్కడ పోగొట్టుకున్న గుణాలను తిరిగి సంపాదించాలనే ఆశతో పోతున్నాను. తిరిగి రాగలననే ఆశ ఇప్పట్లో లేదు. మూయబడిన నా హృదయకవాటాలు తిరిగి అక్కడైనా తెరుచుకుంటాయనే ఆశ మిగిలింది. అవి ఫలించిననాడు తిరిగి వస్తాను. లేకుంటే లేదు. జీవించి ఉండి తిరిగివస్తే తప్పక కలుసుకొంటాను. నీకు చెప్పే నా ప్రయత్నాన్ని కొనసాగనివ్వవనే నీకు చెప్పలేదు. క్షమించగలిగితే క్షమించు.

ఇట్లు,
నీ అని చెప్పుకోలేని
రాజ్."

గాలి తాకిడికి ఆగలేని వృక్షంలా ఊగిపోయింది ఆమె హృదయం. కానీ అతడి పరిస్థితిని అర్థంచేసుకొని నెమ్మది పొందగలిగినా రాజ్ కని పించడనే బాధ ఆమెను అణువణువునా కోతపెట్టసాగింది.

"అమ్మా, మీకోసం ఎవరో వచ్చి ఆ ప్రక్కగదిలో కూర్చొని ఉన్నారు. చాలాసేపైంది."

వంటలక్కమాటవిని ఆ ఆలోచనలు అప్పటికి కట్టిపెట్టి ప్రక్క గదిలోకి పోయింది.

ఆశ్చర్యం! వసంత! సోఫాకు ఆనుకొని కూర్చొనివుంది. తన రాజ్‌ను దూరంగా తరిమివేసిన పిశాచి. భర్తకు మనశ్శాంతి లేకుండా చేసి జీవితంనుండి పారిపోయేలాగా చేసిన రాక్షసి.

మితిలేనికోపం. ఏం చెయ్యలేని నిస్సహాయత. మరిగిపోయింది ఆమె మనసు.

వసంత కనురెప్పలు మూతపడుతుండగా మెల్లిగా "అక్కయ్యా!" అంది.

ఆ పిలుపుకు ఆశ్చర్యాపోయి లొంగిపోయింది రజియా. ఆ కంఠం లోని దీనత్వానికి కరిగిపోయింది రజియా.

గబగబా ఆమెదగ్గరికి పోయింది. మత్తుగా జోగుతూంది, వసంత.

"వసంతా! ఏమైంది నీకు?" అని ఆమెను కదిపింది.

అంతవరకూ వసంత చేతిలో ఉన్న ఒకచిన్న సీసా క్రింద పడింది. విషం. అదిరిపడింది రజియా. ఆత్రుత హెచ్చి లేప బోయింది.

"వద్దక్కయ్యా: ఏం చెయ్యద్దు" అంటున్న వసంతమాటలు విని పించుకోకుండా రజియా అక్కడేవున్న సిరింజికి మందెక్కించి ఇంజెక్ష నిచ్చింది.

"మరేం ప్రయోజనం లేదక్కయ్యా! చాలాసేపయింది. మృత్యు వాతబడే నన్ను రక్షించుకోవాలనే నీ ఆత్రుతకు కృతజ్ఞురాలిని."

"వసంతా, నువ్వు మాట్లాడకుండా కాసేపు పడుకో."

"అక్కా అని పిలిచే అదృష్టంలేకున్నా ఆఖరిసారిగానైనా చెల్లీ అని పిలువవా, అక్కయ్యా!"

ఆమె దీనపు పలుకులు వింటున్న రజియాకు దుఃఖమాగడం లేదు.

అనుకొన్న ఆనందాన్ని పూర్తిగా పొందలేక అనుకోని అఘా తాలకు బలై, కుమిలి కృశించి మట్టిలో కలవడానికి సిద్ధమైఉన్న జీవి. యుక్తాయుక్త విచక్షణలు తెలియక కళ్లు మూసుకొని తిరిగి తప్పు తెలుసుకొనే లోపల గమ్యస్థానం మాయమైపోగా అలమటించి జీవితాన్నే చాలించుకొనదలుచుకొన్న నిర్భాగ్యపు బ్రతుకు. ఐశ్వర్యగర్వం. అంద మనే అహంకారం, ఆకర్షణా గర్వానికితోడై విజయదుందుభి మ్రోగి స్తుండగా అర్థంలేని పంతాలకు, ప్రతీకారవాంఛకు పోయి చెంతనున్న

జీవితసౌఖ్యాన్ని కాలదన్ని తిరిగి అందుకొనే శక్తిలేక జీవితానికే పరిసమాప్తి నిస్తున్న దౌర్భాగ్యపు జీవితం.

"చెల్లీ!"

"ఒక్కసారి నన్ను ఆలింగనం చేసుకోవూ?"

రజియా ఆపుకోలేని దుఃఖంతో వసంతను ఆలింగనం చేసుకొని బుజ్జగించింది.

"అక్కయ్యా, ఆయనవెళ్ళిపోయారు. నన్ను క్షమించలేదు. నువ్వయినా నన్ను క్షమిస్తావా?"

మాట్లాడలేక తల ఊపింది రజియా.

"చాలు. ఇక నిశ్చింతగా చచ్చిపోతాను. ఒక్కకోరిక.వారు ఎప్పటికైనా తిరిగివస్తారు. అప్పుడు వారికి నేనివ్వలేని సుఖాల్ని నువ్విస్తావు కదూ?"

"వసంతా!"

"బాధపడకక్కయ్యా! నీ దైవాన్ని నేను లాక్కొన్నాను. కానీ ఆ దైవాన్ని ఆరాధించే విధం తెలియని మూర్ఖురాలిని. నీ కొక్కదానికే ఆ శక్తి ఉంది. వారు ఎప్పటికీ నీ వారే!"

"వసంతా!"

"పోనీలే, అక్కయ్యా! అదంతా ఎందుకు? నా కోరిక తీరుస్తావు కదూ?"

"అలాగే."

చిరునవ్వు నవ్వింది వసంత. ఆ నవ్వులో ప్రాణంలేదు. కాంతి లేదు. అది నవ్వుకాదు. జీవితాన్ని అపహసించడం.

"అక్కయ్యా, నేను కలలో చనిపోయేప్పుడు వారు కనిపించారు. కానీ ఇప్పుడు రాలేదు కదూ? వారు రారు. నాకు తెలుసు. అందుకై నేనే పోతున్నాను." కళ్లు మూసుకొంది.

క్షణంసేపు మూతబడ్డాయా కళ్ళు.

"రజియా, ఈ ఘోరం విన్నావా?"

"ఇప్పట్లో ఏ ఘోరాలూ వినలేనన్నయ్యా!"

"అయ్యో! నేచెప్పేది వినిపించుకోవే! విమానం కూలిపోయింది."

"మా బ్రతుకులే కూలిపోయినప్పుడు ఏ విమానం కూలిపోతే మనం ఏం చేయగలం?"

"అదికాదమ్మా! రాజా మనకిక లేడు."

నెత్తిన పిడుగు పడింది.

"ఏమిటీ? ఏమిటన్నయ్యా నువ్వనేది?"

"అదేనమ్మా! నిన్న రాజా బయలుదేరిన విమానం నిన్న మధ్యాహ్నమే కూలిపోయింది."

"ఆ!" అవాక్కయి అచేతనంగా కూలబడింది. ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లయింది. తాను భూమిలోకి క్రుంగిపోతున్నట్లని పించి కేకవేయబోయి చేతకాక అలాగే సోఫాలో స్పృహతప్పి పడి పోయింది.

అప్పుడే స్పృహలోకి వచ్చిన సుగుణ తన పాపాయిని చూసింది మొదట. పండువంటి బాబును చూచి మురిసిపోయింది ఆ హృదయం. బాబును అప్పుడే ఎత్తుకోవాలనిపించింది. కానీ నర్సు వారించడంతో ఆ ప్రయత్నం మానుకొంది. ప్రక్కనే ఉన్న అమ్మను చిరునవ్వుతో చూసింది.

ఎవరికోసమో గదంతా కలయజూసింది. కానీ కావలసిన వ్యక్తి కనిపించలేదు.

నేనిక్కడున్నాను అని కేర్‌మని ఊరుకున్నాడు పాపాయి. గదికి ఒకమూల కిటికీనుండి బయటికి చూస్తున్న తండ్రి కనిపించాడు.

"నాన్నా!"

పలుకలేదు. అతనికి తెలుసు ఆమె ఎందుకు పిలుస్తూందో.

"నాన్నా!"

వెనుతిరగక తప్పలేదు.

"అన్నయ్య ఏడీ?"

మౌనమే మేలనిపించి ఆపనే చేశాడాయన.

"నాన్నా! నిన్నే. నాన్నా! అన్నయ్యకు కబురంపు. వచ్చి తన మేనల్లుడికి ముద్దులు ప్రసాదిస్తాడు."

"సుగుణా! ఇంకెక్కడి అన్నయ్య! అంతా అయిపోయిందమ్మా! మీ అన్నయ్య పరలోకం చేరుకొన్నాడు."

"నాన్నా!" గట్టిగా అరిచింది సుగుణ కోపంతో.

"నిజమేనమ్మా! ఇప్పుడే ఈవార్త తెలిసింది."

తల్లిమాటలు విని "ఏమిటి? అన్నయ్య చచ్చిపోయ్యాడా? నేను నమ్మను. నేను పోయి అన్నయ్యను పిలుచుకొస్తాను" అని గబుక్కున లేచి శక్తిలేక నర్సు పట్టుకొనేంతలో క్రిందపడిపోయింది.

కూర్చొని రేడియోవార్తలు వింటున్న ఆనంద్ ఉలిక్కిపడి గాభరాగా ఆ వార్తలోని నిజానిజాలు తెలుసుకోవాలని మేడపైనుండి పరుగెత్తుతూ మెట్లపై పడిపోయాడు.

వంట చేసుకొంటున్న ఇందిర నిశ్చేష్టితయైపోయింది. గరిఫె చేయి పొయ్యిలోపడి కాలింది.

టెలిగ్రాం చదువుకొన్న లత తెలివి తప్పిపోతూ షాక్ తిన్న దానిలా క్రింద పడిపోయింది.

రాజ్ ఫోటోముందు నిలబడి మెడలోని మంగళసూత్రం కళ్ళకద్దు కొని భక్తితో పూజిస్తున్న శారదఫోటో గాలి తాకిడికి క్రిందపడి వ్రక్కలైపోవడంచూసి వెంటనే అర్థంచేసుకోలేకపోయింది.

అల్లుని చావుకు ఏడ్వగలిగిన స్థితిలో ఉన్నది ఒక్క మేనత్త మాత్రమే.

* * *

పెనుతుఫానులో చిక్కుకున్న ఓడలా ఊగిపోతుంది రజియా. నా రాజ్ చనిపోలేదు — ఘోషిస్తూంది ఆమె హృదయం. నన్ను వదిలి పోడు. నేను నమ్మను. నా రాజ్ బ్రతికేఉన్నాడు. తప్పక తిరిగివస్తాడు. అదే ఆశ. అంతలోనే నిరాశ.

ఆశచేత దడదడలాడే హృదయం. నిరాశతో గుండెలు పిండే బాధ. అగ్నిపర్వతాలు పగిలిపోయే వేడి. లోకాన్ని కప్పేసే చీకటి. దాన్ని పారద్రోలలేని ఆశ అనే వెలుగు కిరణం నిస్సహాయస్థితిలో కను మరుగైంది. అంతా చీకటి. కటిక కాళరాత్రి భయం కలిగించే సందర్భం. అసహ్యం కలిగించే బ్రతుకును ఏం చేయలేకపోతూంది. వెలుగు అస్త మించింది. చీకటి విజృంభించింది. ఎన్నటికీ ఎడతెగని చీకటి. సమసి పోని కారుచీకటి కబళించేందుకు ముందుకు వసూంది.

ఆ పిలుపు విని ఉలిక్కిపడింది. ఆ పిలుపు వేయి ఏనుగుల శక్తి నిచ్చింది. ఆశలు చిగురించాయి. అంతలోనే పండిపోయాయి. చూచింది. రాజ్. కానీ అస్పష్ట ఆకారం. దూరంగా ఉండి పిలుస్తూంది. ఆ పెదవులపై అదే చిరునవ్వు. రమ్మని ఆహ్వానిస్తున్నాడు. పరు గెత్తింది.

హఠాత్తుగా మాయమయ్యాడు.

పిచ్చిదానిలా చుట్టూ కలియజూసింది.

అదిగో అక్కడ. అదే నవ్వు. అవే కళ్లు. కానీ చూపులేమిటి? చేరరమ్మని పిలిచీ పరితాపం కురిపిస్తున్నాయి.

వెంటబడింది. ఎక్కడికో పోతూంది.

తిరిగి అదృశ్యమయ్యాడు రాజ్. భయంగా చుట్టూ చూసింది.

ఎదురుగా సముద్రుడు వెక్కిరిస్తున్నాడు. భయంకరమైన వాతావరణంలో భయం మరిచిపోయి కళ్ళు చిట్లించుకొని చూసింది.

ఇసుకలో కూర్చొని చిరునవ్వులు ఒలకబోస్తున్నాడు. ఆనందంతో అతనిపై పడిపోయింది.

శరీరానికి చల్లటి ఇసుక తగిలి ఎగతాళిచేసింది. పిచ్చిగా ఎలుగెత్తి అరిచింది. ఏడిచింది. మొరవినే దిక్కులేరు. శబ్దంచేస్తే ఎక్కడ పలుక వలసివస్తుందోనని సముద్రుడు మౌనవ్రతం పట్టాడు.

"రజీ!"

తలఎత్తి పైకి చూసింది. ఎత్తున నిలబడి చేయెత్తి పిలుస్తున్నాడు.

"రాజ్, వచ్చెయి." అరిచింది గట్టిగా.

"నే రాలేను. రజీ!" అలాగే సముద్ర మధ్యంలోకి వెళ్ళిపోయాడు రాజ్.

"నేనే నీ దగ్గరికి వస్తాను, రాజ్."

అందుకోవాలని పరుగెత్తింది. అల ఆమెను కప్పేసింది. తిరిగి కనిపించలేదు. ఏమీ ఎరుగనట్లు సముద్రుడు హోరుమంటున్నాడు. కునుకుతీస్తున్న పక్షులు ఆ శబ్దానికి ఉలిక్కిపడి లేచి తిట్టుకొంటూ తిరిగి నిద్రకు ఉపక్రమించాయి. చంద్రుడు కారు మబ్బులలోనుంచి మెల్లగా బయటికి వస్తున్నాడు. చల్లని గాలిలోకి మేఘాలు వర్షపుజల్లును కురిపిం

చాయి. ఎవ్వరూ కన్నీరు కార్చలేదని దయతలచి మేఘరాజు జల జల కన్నీరు కురవగా విడిచాడు.

"ఛీ, అకాల వర్షమేమిటి?" అని నిద్రాభంగమొందిన మానవులు తిట్టుకొన్నారు. అదిచూసి భయపడి మేఘరాజు ఊరకుండిపోయాడు.

రైలుదిగి ఇంటికి వచ్చారు ఖాన్‌గారు. గడపలో తలకొట్టుకొంది.

"రజియా!" పిలిచారు. జవాబులేదు.

నౌకరును లేపి అడిగాడు. వాడు బిక్కచూపులు చూశాడు.

ఇల్లంతా వెదికాడు. కనిపించలేదు. తనకోసం స్టేషన్‌కు వచ్చిందేమో తిరిగివస్తుందని ఎదురుచూశాడు.

తెల్లవారేవరకూ నిరీక్షించాడు. అంతులేని, ఎడతెగని నిరీక్షణ. కన్నకూతురికొరకు ఇంకా వెతుకుతూనే ఉన్నాడు. ఎదురుచూస్తూనే ఉన్నాడు. ఎక్కడైనా కనిపిస్తేనా? ఎప్పుడైనా తిరిగివస్తేనా?

ఆ నిరీక్షణకు అంతులేదు. అతనిఆశకు చావులేదు.

ఎవ్వరూ పట్టించుకోని ఆ పిచ్చివాడి ఆవేదన ఎవరు వినాలి? అర్థంకాని ఆ గాథ విని ఏం చేయాలి?

అందుకే ఏదీ చేతకాని ఈ లోకానికి ఏమీ చెప్పకూడదు. దేన్నీ చూపించకూడదు. పరిసమాప్తంలేని జీవితాలు. ఆనందం, సుఖం ఎరుగని బ్రతుకులు. అదృష్టానికి నోచుకోని దౌర్భాగ్యపు జీవులు. వారికథ ఎన్నటికీ అంతంకాదు. కాలచక్రంలా సాగిపోతూండవలసిందే. ఆగడానికి అవకాశమూలేదు, తీరికా లేదు. మార్చడానికి శక్తిలేదు, అధికారం అంతకన్నా లేదు.

# సుఖాంతం

"నాకోరిక తీరుస్తావుకదూ" జీరపోయిన గొంతుతో అడిగింది వసంత.

"చెల్లీ" అంది అశ్రుపూరిత నయనాలతో రజియా. ఎంతగా అసహ్యించుకుందో అంత జాలి పడుతోంది. పరిపూర్ణమైన వయసు వచ్చినా పరిపక్వంచెందని మనసుతో, పరిశుద్ధంకాని ఆత్మతో ప్రవర్తించి, పండులాంటి బ్రతుకును కత్తితో గ్రుచ్చుకుంది. అసహ్యించుకోవాలా? జాలి పడాలా?

"అక్కా! చెప్పు ఈ నా చివరికోరిక తీర్చవూ! వారు తిరిగివస్తారు, నా కోసం ఏడుస్తారు, నా స్థానాన్ని భర్తీచేసి ఈ ఆత్మకు శాంతి కలిగించు" మూతపడుతున్న కళ్ళతో లేవని చేతితో విడివడని వేళ్ళను విప్పింది.

"చెల్లీ" అంటూనే చేయి కలిపింది.

కళ్ళు మూతలుపడ్డాయి. "వసంతా" అంటూ బీరువావైపు పరుగెత్తింది రజియా.

*　　*　　*

గాలిలో ఎగురుతున్న విమానంలో కూర్చునున్న రాజ్‌కు తను చేస్తున్నపని అన్యాయమేమో అన్న తర్కం కలిగింది.

"నా బిడ్డకు అన్యాయం చేస్తావా శేఖర్" అంటున్న ఆనందరావుగారి ఆత్మకు బదులు చెప్పలేకపోయాడు.

వసంత తన మనోమాలిన్యాన్ని కడిగేసుకుంది. జీవితంలో ఎన్నో సార్లు ఆమెకు అవకాశమిచ్చాడు. ఈ ఒక్కసారి ఎందుకు ఇవ్వకూడదు?

కడసారి వసంత కన్నీరు, దీనత్వం కళ్ళముందు నిలిచాయి. రజియా "రాజ్, అంత్యదశలో తప్పటడుగు వేస్తున్నావు" హెచ్చరించింది.

"బావా! ఇందరికి ఎన్నో ఉపకారాలు చేశావు, ఒక్కసారి అక్కయ్యను క్షమించలేవా?" ఎక్కడో ఉన్న లత ప్రశ్నించింది.

"రాజూ! మానవాతీతుడుగా నిలిచి నువ్వుకూడా ఆ బలహీనతకే లొంగిపోయావా?" అంది ఇందిర.

"అన్నయ్యా! నీ మేనల్లుడిని చూడవా?" పిలిచింది సుగుణ.

"రాజ్! మమ్మలనందరినీ వదలి ఎక్కడికో పోయి ఏం బావుకుంటావ్? మిత్రులిద్దరూ ప్రశ్నించారు.

భరించలేకపోయాడు. విమానంనుండి క్రిందికి ఉరికి తనవారి దగ్గరికి పారిపోవాలనుకున్నాడు. విమానం భువనేశ్వర్‌లో ఆగగానే వెనక్కు వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు.

విమానం అటూ ఇటూ ఊగింది. ప్రయాణీకులంతా కలవరపడ్డారు! పలువురి నోటినుండి 'ఏమైంది' అన్న ప్రశ్న వెలువడింది.

"విమానం ఇంజన్ ట్రబుల్ వల్ల ముందుకు సాగలేదు. వచ్చినచోటికే వెళ్ళబోతుంది. అక్కడినుండి వేరేవిమానం అమర్చబడుతుంది. కంగారు పడకండి, ప్లీజ్" ఎయిర్ హోస్టెస్ మైక్‌లో చెప్పింది.

ప్రయాణీకులంతా ప్రాణాలు అరచేతుల్లో పట్టుకున్నారు. విమానం అప్పుడప్పుడు ఊగుతూ వింతశబ్దాలు చేస్తోంది. ఎవరిమటుకు వారు ప్రాణాలపై ఆశ వదలుకున్నారు. ఎయిర్ హోస్టెస్ నిముషనిముషానికీ ధైర్యం చెబుతోంది.

రాజ్ ఆ పరిస్థితిచూసి కంగారు పడ్డాడు. తనవారిని చూడకుండానే తను మరణిస్తాడేమో

ఒక్కసారిగా ఎన్నడూలేని భీతి పట్టుకుంది. తనవారంతా గుర్తు కొచ్చారు.

"వసూ, నీకు అన్యాయం చేయకూడదనుకున్నాను. కానీ నిస్సహాయుణ్ణి." మూలిగిందా హృదయం.

గూటిని చేరబోయిన పక్షికి చీకటి ఆటంకమయింది. ప్రకృతి స్త్రీని చూచి ఆనందిస్తున్న చంద్రుడిని కారుమేఘాలు కబళించవచ్చాయి.

విశాఖపట్టణం ఎయిర్‌పోర్ట్‌లో విమానం ఆపదలో ఉందని తెలుసుకున్న ఉద్యోగులంతా ఆత్రుతతో దాని రక్షణకోసం సర్వప్రయత్నాలు చేశారు. విమానం జాగ్రత్తగా భూమిపై వాలడానికి అన్ని ఆటంకాలు తొలగించారు. ప్రమాదం జరిగితే ప్రయాణీకులను రక్షించడానికి వాహనాలు, ఉద్యోగులు సిద్ధంగా నిలబడ్డారు.

విమానపు ఒకవైపు ఇంజనుయొక్క ప్రొపెల్లర్లు ఉండుండి ఆగి మెల్లగా తిరుగుతున్నాయి. బరువును భరించలేనన్న రెండవ ఇంజను శబ్దంచేస్తూ విమానాన్ని ఊపుతోంది. పైలట్ సర్వవిధాలా ప్రయత్నిస్తున్నాడు.

విమానం వింతశబ్దంచేస్తూ భూమిపై వాలుతుండగా ప్రయాణీకులు, బాధ్యతాయుతపు అధికారులు, ఉద్యోగులు కళ్ళప్పగించి ఆత్రుతగా చూస్తున్నారు. రక్షణవాహనాలు తమ స్థానాలనుండి కదిలాయి ముందు జాగ్రత్తగా.

ఎవరి అదృష్టమో అన్నట్లుగా విమానం బరబరశబ్దంచేస్తూ భూమిపై వాలి, అలసటకుగానూ కాస్తదూరం పరిగెత్తి ఆగిపోయింది.

రాజ్ ఆనందంతో సీటునుండి లేచాడు. అక్కడ జరిగే హంగామా నుండి తప్పించుకుని బైటపడ్డాడు. టాక్సీలో కురికాడు.

మనసు తెలియని అవ్యక్తానందంతో పరిగెత్తుతోంది. అనిర్వచనీయమైన తృప్తితో మెరిసిపోతోంది.

"వసూ" ఆ పిలుపులో కొత్తదనం పలికించాడు. జవాబు లేదు. మేడపైకి పరిగెత్తాడు. వసంతగది శూన్యం.

"వసూ" పిలిచాడు మరోసారి. ఆ పిలుపుకు ప్రతిధ్వనే బదులయింది. నౌకరు పరుగెత్తుకొచ్చాడు.

"అమ్మగారేరీ?" అడిగాడు వాడిని.

"తెలియదు సార్. ఉదయమనగా వెళ్ళిపోయారు మీ కోసం. అంతే, తిరిగి రాలేదు." భయంగా చెప్పాడు.

వాడిలో ఏదో ఆపద జరిగిందన్న భయంపోయి అయ్యగారొచ్చారు అన్న సంతోషంకూడా మెదిలింది.

కలవరపడ్డాడు రాజ్. "వసూ! నీకోసం వచ్చాను." అంది మనసు.

ఎటూ తోచలేదు. ఎక్కడికెళ్ళిందన్న ప్రశ్నతోటే వసంత ఏదైనా అఘాయిత్యం తలపెట్టిందా అన్న సందేహం కలిగి కంపించిపోయాడు.

"అలాజరిగితే ఈ బ్రతుక్కి నిష్కృతిలేదు" నిలకడలేని ఆలోచనలతో నిశ్చలత సంపాదించుకోలేకపోయాడు, 'వసంత అంత పిరికిదికాదు.' ధైర్యమిచ్చింది మనసు.

ఆఫీసుజీప్ వచ్చినచప్పుడు కావడంతో పోర్టికోలో కొచ్చాడు. డ్రైవర్ దిగి సెల్యూట్ చేసి నిలబడ్డాడు.

మాటాడకుండా జీప్ ఎక్కి డ్రైవ్ చేసుకుని బైలుదేరాడు.

ఎక్కడికి వెళ్ళింది? తనబాధ చెప్పుకోవడానికి ఆప్తులదగ్గరి కెళ్ళిందా? ఎవరినీ ఆప్తులుగా ఎంచలేదు. బంధువులు? అత్తయ్యవాళ్ళు తప్ప ఈ ఊళ్ళో ఎవరూ లేరు. జీప్‌ను అటుత్రిప్పాడు.

"రా రాజూ" అంది ఆ తుఫానుగురించి ఏమీ తెలియని ఇందిర చిరునవ్వుతో.

"వదినా! వసంత ఇక్కడికొచ్చిందా?"

"లేదే! ఎక్కడికెళ్ళింది?" అతని పరిస్థితి చూసి అనుమానంగా అడిగింది ఇందిర.

అదంతా అప్పట్లో చెప్పే ఓపికలేక నిట్టూరుస్తూ సోఫాలో కూలబడ్డాడు రాజ్.

అతన్ని అడిగే ధైర్యంలేక అయోమయంగా ఉండిపోయింది ఇందిర.

"ఇందిరగారంటే మీరేనా?" అంటూ ఓ వ్యక్తి హడావుడిగా లోపలి కొచ్చాడు.

"ఔను........" ఏదో అడుగబోయేంతలో "నేను డాక్టర్ రజియా గారిదగ్గర కాంపౌండరుని. వారు మిమ్మల్ని ఉన్నఫళంగా రమ్మన్నారు! మీరువెళ్ళండి. నేను వేరేచోటికి వెళుతున్నాను. వెంటనే వెళ్ళండి." దూకుడుగానే వెళ్ళిపోయా డా వ్యక్తి.

అర్థంకాక రాజ్‌ను చూసింది ఇందిర. రాజ్‌కు క్రొత్తభయం పట్టుకుంది. తన ఉత్తరంచూసి రజియా....అటుపైన ఊహించుకోలేక "వదినా, వెళదాం పద" లేచాడు వెంటనే.

అటు రజియా, ఇటు వసంత — భగవాన్, ఏమిటీసమస్య! నిలకడ లేకుండా అతిజోరుగా జీప్‌లో రజియాయింటిముందు దిగాడు. లోపలి కురికాడు.

మృత్యువుతో పోరాడుతున్న వసంత అతివేగంగా వచ్చి ఆగిన జీప్ చప్పుడు విని కిటికీనుండి బైటికి చూసింది.

"రాజ్___" నమ్మలేకపోయింది. కళ్ళు చిట్లించి చూసి ఆనందోద్వేగంతో చూపులు నిలిపింది.

రజియా చికిత్సతో కొన ఊపిరితో మూలిగింది వసంత.

ఆమె మ్రింగిన విషాన్ని తీసివెయ్యడానికి అమృతం వచ్చింది. ఇక ఫర్వాలేదు. మొండిగా ధైర్యం తెచ్చుకొంది రజియా తనకు తానే.

"వసంతా! వారు వచ్చారు. మీవారు వచ్చేశారు. మీవారు ఎక్కడికీ వెళ్ళలేదు. చూడు. ఒక్కసారి కళ్ళుతెరిచి చూడు" వసంత చెవిలో చెప్పింది.

వసంత కనురెప్పలు విడివడనన్నాయి.

"చెల్లీ! రాజ్ వచ్చేశాడు. నీకోసం వచ్చాడు. కళ్లుతెరిచిచూడు" గట్టిగా చెవిలో అరిచి వాకిట్లో అడుగు పెడుతున్న రాజ్‌ను చూసింది.

నిర్నిమేష దృక్కులతో రజియాను చూసిన రాజ్ తేలికపడిన మనసు ఆమె పరిసరాలను చూడలేకపోయింది.

"రాజ్, వ....స....ం....త". చెప్పలేక నోరు నొక్కుకుని తల అటువైపు త్రిప్పుకొంది రజియా కన్నీటితో.

గ్రద్దవచ్చి తన్నుకుపోయింది కలిగిన సంతృప్తిని. రాజ్‌కళ్ళు వసంత నిశ్చలతరూపాన్ని చూసి కాళ్ళను బందీ చేశాయి. నమ్మలేకపోయాడు.

కన్నీరు క్రుమ్మరించిందా విషమ పరిస్థితి. తడబడే అడుగులతో వసంతను చేరాడు.

కాంతులు జిమ్మే ఆ మోహంలో అస్తమయ భాస్కరకాంతి కిరణాల్లా కాంతి నశించిపోతోంది. మత్తులు కల్గించి మైమరపించే పుష్పం

విషగాలుఋసోకి రంగులు మారి సువాసనలు కోల్పోయి నేలపైరాలి నశించనున్నది.

"వసూ" గద్గదికస్వరంతో పిలిచాడు. ఆ పిలుపు నరాలలో విద్యుచ్ఛక్తిని రేపుతుంది.

అవాక్కయి నిలబడిపోయింది ఇందిర అల్లంతదూరంలో. రజియా నిస్సహాయత్వంతో తల అటువైపుకు త్రిప్పుకొంది.

ఎక్కడికో పయనమైపోతున్న, తనను ఆదరించేవారు లేరు, ఈ బ్రతుకు అక్కరలేదు అని వెళ్ళిపోతున్న వసంత ఆంతరాత్మ ఆగి పోయింది.

"వసూ! నే వచ్చేశాను. నిన్ను వదిలివెళ్ళను. ఇంతపెద్ద శిక్షవద్దు. ఒక్కసారి కళ్ళుతెరిచిచూడు" ఆవేదనతో, పిచ్చిగా ఆమె బుగ్గలు నిమిరాడు.

బంధింపబడ్డ పాశంనుండి తప్పించుకొని ఆ పిలుపుకు ఆ స్పర్శకు పరుగున వచ్చింది అంతరాత్మ.

"వసూ! నన్ను క్షమించు వసూ! ఇక ఎక్కడికీ పోను. నీ పారిశుద్ధ మనసును కనుక్కోలేని నిర్భాగ్యుణ్ణి. నిర్మలత్వం, నిశ్చలత్వంలేని నీలో ఇంతత్యాగం ఇమిడి ఉందని తెలుసుకోలేని దౌర్భాగ్యుణ్ణి, నీ కన్నుల్లోని కన్నీటిబాధను, నీ దీనత్వంలోని పరితప్తాన్ని గ్రహించలేని అభాగ్యుణ్ణి. నీకోసం వచ్చాను, చూడవా వసూ!"

కనురెప్పలు బలంగా తెరుచుకొన్నాయి. అర్ధనిమీలితనేత్రాల నుండి భర్తను చూసింది వసంత. తనభర్త, తనదైవం, తనను శపించి వెళ్ళిపోయిన తన పతి—వెళ్ళిపోలేదు....ఆనందంతో శక్తిలేక రెప్పలు టపటప లాడించింది.

"వసూ!" పిచ్చి ఆనందంతో అరిచాడు.

"ఏ__మ__ం__డీ" విడివడని పలుకులు. రజియా గిరుక్కున తిరిగింది. వసంత చనిపోలేదు....చనిపోలేదు. బ్రతికేవుంది. బ్రతికించు కోవాలి.పరుగున వచ్చింది. ఇందిర ఆనందంతో గబగబా వచ్చి ప్రక్కన నిలబడింది.

"వసూ! నిన్ను వదలి వెళ్ళలేదు వసూ! నాలో కర్కశత్వం పోయింది. నిన్ను వదిలిపోను వసూ! నువ్వు నాకు కావాలి. నీ నిర్మల హృదయాన్ని నాకు అర్పించకుండా ఎక్కడికీ వెళ్ళద్దు." దీనంగా పలికాడు.

వసంత నోరు విడివడలేదు. రజియా ఇంజక్షన్ ఇవ్వబోయింది. వసంత చేయిజాచ్చి వద్దంది. రజియా చేతకాలేదు ఆ శరీరంలోకి ఇంజక్షన్ ఎక్కించడానికి.

"ఏమండీ! మీ__రు. కలలో__కనిపించినట్లు__గా వచ్చారు. మీ__రే__నా" తడిమింది అనుమానంగా.

తనపాశంనుండి తప్పించుకుపోయి వచ్చిన ప్రాణాలకోసం తిరిగి పాశం విసిరాడు యముడు.

"నేనే వసూ! నీకోసం తిరిగివచ్చాను." కన్నీటితో ఆమె మొహంపైకి వంగాడు.

"ఆ....ఆ....ఆ....వచ్చారా! నా__కోసం.__న__న__నన్ను క్ష....మి" ఆ పాశం బిగిసిలాగింది. కళ్ళు మూసుకున్నాయి.

"వసూ! వసూ!" ఆమె తల కదిలించాడు కలవరపాటుతో. ఆ ప్రేమ ఆ పాశపుశక్తిని వదులుచేసింది కాస్త.

తిరిగి కళ్ళు తెరిచింది వసంత. రజియా చేతకాక వారిని చూస్తోంది.

"మీ....రు....అ....అ....అక్కయ్య" శక్తిలేక రజియావైపు చూపులు మరల్చింది వసంత.

ఆమెభావం అర్థమైంది. రజియా కూడదన్నట్లు చూస్తూండి పోయింది వసంతను.

"మిమ్మల్ని పొ....పొందే అదృ....ం....నా....లే....దు" గొణిగింది అశక్తిపూర్వకంగానే.

"వసూ! ఇది నీకు న్యాయంకాదు. వెళ్ళవద్దు. నీకోసం వచ్చిన నన్ను విడిచిపోతావా?"

కొరడాతో ఛెళ్ళున వాయించి చుట్టుకుని దగ్గరకు లాక్కున్నట్లయింది.

ఆఖరుసారిగ అన్నట్లు లేవబోయింది. పాశం పడనివ్వలేదు. ఆమెను అక్కున జేర్చుకున్నాడు రాజ్.

కల ఫలించింది. ఆ ఆఖరుకౌగిలి లభించింది. కానీ కల నిజం కాగానే బ్రతుకే కలఅయి అంతమయిపోతోంది. అప్పుడు వాస్తవపు మాటేమిటి?

తీరని తృప్తితో అతని హృదయానికి హత్తుకుపోయింది. బ్రతకాలి, ఆ కౌగలికోసం, ఆ హృదయంలో నివసించడంకోసం, ఆ అమృతం ఆస్వాదించడంకోసం—బ్రతకాలి.

"వీల్లేదు" అరిచి లాగారెవరో.

తనప్రయత్నం ఫలించదు అని తెలుసుకుని ఆఖరుసారిగా అతని మొహంలోకి చూసి ఆ మొహాన్ని ముద్దెట్టుకోబోయి శక్తిలేక నిస్సహాయంగా, భారంగా, కన్నీరు కారుస్తూ 'మీరు....అ....క్కయ్య" అంటూనే తల వాల్చేసింది.

"వసూ" పిచ్చిగా అరిచాడు రాజ్. భరించలేక ఇందిర భుజంపై వాలిపోయింది రజియా.

మూసుకుపోయిన ఆ హృదయపు తలుపులపై ఆవేశంతో బాదాడు రాజ్. అవి తెరచుకోలేదు. తెరపింపజేయడం చేతకాని పని.

కాంతి ప్రసరింపజేసే దీపంపై ఆశచేతనో, స్వార్థం చేతనో, ఆ కాంతి ప్రసరింపబడే భూమిపై, పరిసరాలపై అక్కసు చేతనో ఆ కాంతిని అడ్డగించ ప్రయత్నిస్తుంది పురుగు. కానీ దానికి అర్హతలేదు, శక్తిలేదు. అంతకుమించి అదృష్టంలేదు. విలకడలేక ఎగిరి ఎగిరి ఆఖరుకు నేల కూలుతుంది.

కానీ కాంతి యథావిధిగానే పడుతూంటుంది. కాకపోతే ఆ పురుగు కోసం దీపం భూమి కలిసి రెండు కన్నీటిబొట్లు వదలగలవు. శక్తికి మించిన దాన్ని ఎవరేం చేయగలరు? అందుకు ఎవరు బాధ్యులు? ఆ పురుగులో ఆశ కల్పించిన వారిదా? కాంతి, వేడి ప్రసరిస్తున్న దీపానిదా? అనుభవిస్తున్న పరిసర ప్రాంతాలదా? భూమిదా? ఎవరిది?

జవాబులు లభించవు. అంతం కనిపించదు.

కదిలే కాలచక్రపు ఆకులలో మరో జీర. ఆకాశంనుండి రాలిపోయిన మరో తార.

సమాప్తం

ముద్రణ : విక్టరీ ప్రెస్, పాతపోలీస్‌లైన్, ఇస్లాంపేట, విజయవాడ-1.